# విషయసూచిక

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము

విషయము. పుట.



## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము



## విరాటపర్వము, తృతీయాశ్వాసము

| విషయము. | | పుట. |
|---|---|---|

పటలపరికలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవుండు. 13

క. అనుకంపాతిశయంబునఁ, దనదక్షిణనేత్రమును సుధారోచియు గా
నను [1]వింత లేక చూచి వ,దనమున దరహాసరసము దళుకొత్తంగన్. 14

ఉ. వైదిక[2]మార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచుం
ఖేదము [3]లేనిభక్తి మతి నిర్మలవృత్తిఁ జేయుచుండుమ
త్పాదనిరంతరస్మరణతత్పరభావముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడున్. 15

వ. అందును. 16

క. పారాశర్యునికృతి యయి, భారత మనుపేరఁ బరఁగుపంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద,ద్గౌరవ మూహించి నీ వఖండిత[4]భక్తిన్. 17

తే. తెనుఁగు[5]బాస వినిర్మింపఁ దివురు టరయ, భవ్యపురుషార్థతరుపక్వఫలముగాదె
దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ.

వ. అనిన నద్దివ్యవచనామృతం[6]బు నాయుల్లంబున వెల్లిగొనినఁ బునఃపునఃప్రణామంబు లాచరించి యప్రమేయప్రభావభావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన విని యునికిం జేసి ననుఁబోటి బాలస్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కాక యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు చేయువాఁడ నయి కొమ్మనామాత్యు నాననం బాలోకించి తదనుమతి వడసి యి ట్లంటి. 19

క. భూరిభవత్కారుణ్య, క్షీరాంబుధి[7] నాదుతుచ్ఛచిత్తంబున వి
స్తార మహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ. 20

ఉ. ఇంతకు నేర్చునీకు నొకయింతటికిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగునట్టినినుం గొనియాడఁ జేత తా
[8]నెంతటిపెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ [9]తొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 21

వ. అని యుపలాలితుం డగుడింభకుండు తన కొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగునమస్కారంబు చేసిన నజ్జగన్నాథుండు. 22

తే. జననమరణాదులైనసంసార[10]దురిత,ములకు నగపడ కుండంగఁ దొలఁగుతెరువు

---

1. చిం.శ. 2. ధర్మమార్గ...గని నిర్వ. 3. లేక భక్తిమతి; భక్తి నతి...చుందు ను, త్పా...బొంది కావ్య. 4. బుద్ధిన్. 5. బాసను నిర్మింపఁ దివురుటయును...కేనియ్య; కెడ నియ్య. 6. బున నాయుల్లంబు పల్లవితంబుగాఁ...బునః ప్రణామంబు చేసి...భావ భావాతీతుం. 7. లోన నాదు...మహిమముగ. 8. నెంతయుఁ బెద్ద. 9. దలఁగునట్లుగఁ జేసి కృతార్థుఁ. 10. దుఃఖ...కుండు నిమ్మునకుఁ దెరువు; కుండ నిమ్మునకుఁ దెరువు.

గను వెలుంగు నీ కిచ్చితి [1]ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ.

వ. [2]మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును [3]సరి, నెలసి పొదలుమానసమున నెంతయుఁ బ్రొద్దేఁ
గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తితాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ఉ. ఇట్టిపదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి [4]యగుభారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమకారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం [5]దగుఁ జనా
భ్యర్చిత మైనభారత మపారకృపాపరతంత్రవృత్తిమైఁ
జేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామా[6]న్యకరణం బగు పరమధర్మప్రకారంబు. 29

ఉ. కావున భారతామృతముఁ గర్ణపుటంబుల[7]నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయినచిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్. 30

వ. అని పూని యీదృశంబు లగు[8]పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించు
టయు నొక్క యారాధనవిశేషం బగుటం జేసి. 31

షష్ఠ్యంతములు

క. ఓంకారవాచ్యునకు నన,హంకారవిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్. 32

క. త్రిభువనశుకదృఢపంజర, విభవమహితునకు సమస్తవిష్టపనిర్మో
కభుజంగపతి కఖిలజగ, దభిన్నరూపునకు భావనాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా, శ్రితవాంఛాపూర్తికరణచింతామణి కా
నతదురితతమోద్యుమణికిఁ, గ్రతు[9]భూషణమణికి లోకరక్షామణికిన్. 34

క. పరమశమ[10]నిరతసంయమి, వరమానసకుముదహాసవర్ధనచంచ

---

1. ననఁగ...నిండు. 2. ఇట్లు మేలుకాంచి. 3. మది, నెలసి; సరి, యొలసి పొదవు; పొదల...సభక్తి. 4. నయి భార...నేన యవ్విభుం...ప్రతిమకావ్యకవిత్వమహా. 5. దగన్ ...రమణీయుండ నయ్యెద. 6. న్యాకారం; న్యకారణం. 7. నానఁ గ్రోలి యాంధ్రా; గ్రోలి సక్తవీం, ద్రావళి...సంస్కృత, శ్రీవిభవాశ్రితం. 8. పుణ్యప్రస్తావం. 9. భూషామణికి. 10. నియత...కమలహంసవర్తన.

చ్ఛరణనఖచంద్రికా[1]వి, స్ఫురణాచిత్ర ప్రకారశోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞ చరణశిరస్సుం
దరమూర్తికి భావనత,త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్. 36

కథాప్రారంభము

వ. ఏను విన్నపంబు చేయు తెలుంగునా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహా[2]కావ్యంబునర్థంబు సంగతంబు చేసెద. 37

క. శరణాగతసంశ్రితభయ, హరణా సురనికరశేఖరానర్ఘమణి
స్ఫురణా పరిచయరంజిత, చరణా వనమాలికాభుజంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వనిరస్తదైత్య[3]భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా, భుజగసమాచరితశయనభూషణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూధర, కలితజననకేళికౌతుకవ్యక్తావ్య
క్తలలితసౌందర్యస్ఫుర, దలసుతను [4]స్త్రీసనాథ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. 41

ఆ. కథ జగత్ప్రసిద్ధి కావునఁ బూర్వప,ర్వార్థయుక్తి చేయునట్టియెడల
యత్న మించుకంత యయినను వలవదు, వలసినట్లు చెప్ప [5]వచ్చియుండు. 42

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతశుభావహంబునుం గావున నొక్కమహాఫలంబు గోరి జనమేజయుండు కృష్ణద్వైపాయనమహామునికారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుం డయినవైశంపాయనువలన వినినకథ యుగుటం జేసి తత్ప్రకారంబు నడపెద నది యె ట్లనినం బరమపవిత్రులగు పాండుపుత్త్రుల చరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబుచేయు చుండ వారలవనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయ[6]నిరూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడగు నేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. 44

క. అని యడిగిన వైశంపా,యనుఁ డమ్మనుజేంద్రచంద్రునధికౌత్సుక్యం
బునకలిమికిఁ దనహృదయం,బున గాఢాదరము భరితముగ ని ట్లనియెన్. 45

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగా [7]సలిపి పండ్రెం డగు నేఁటకడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాససమయంబునకు భంగంబు కాకుండ వరంబు వడసి యంతకు మున్ను తమవెనుక

1. వి, స్ఫురణవిచిత్ర. 2. వాక్యంబు. 3. భువన. 4. శ్రీ. 5. వలసి. 6. నిరూఢ...మగు నా...మూఁడవ యేఁడు. 7. జరపి.

నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడన కొని వర్తిల్లుభూసురోత్త
ములు తమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం బూనినపని వారల కెఱిం
గింపం దలంచి కర(కమల)ంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46

సీ. తెల్లంబు గాదె మీ కెల్ల సుయోధను,చేసినకుటిలవిచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల నిడుమలఁ, బొందితి [1]రొకభంగిఁ బోనొఁ గాల
మిది పదమూఁ డగు నేఁడు మా కజ్ఞాత,వాసంబు సలుపంగ వలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయసౌబలులును, జెఱుపన వేతురు చిన్న సన్న
ఆ. యెఱిఁగి రేని చాల నెగ్గు పాటిల్లు న, ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నుల రై చరి,యింపుఁ డని యనుగ్రహింపవలయు. 47

వ. అని చెప్పి రట్టిసమయంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుం డై. 48

క. ఒకనాఁ డేమును నాపద, లకు నిడుమఁరఁ గాంచి విప్రులం జుట్టలఁ బె
ట్టుకొని సుఖ[2]ముండఁబడయుదు,మొకొ యిప్పాటొందఁగలదెయొరు లెవ్వరికిన్.

వ. అని డగ్గుత్తిక పెట్టి దుఃఖపరవశుం డగుటయు నమ్మహీసురవరులుం దమ్ములు
నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు తదీయవిషా
దాపనోదంబు చేయం దలంచి యి ట్లనియె. 50

## ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట

ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయ[3]వృత్తిస
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నీడె దుర్దశలపెల్లునకున్ దురపిల్లు టారయన్. 51

వ. అట్లుం గాక. 52

క. దేవతల కైన నొక్కొ,కచో వలయున కాదె శత్రుసూదనవిధికా
[4]లావాప్తికి మును తమస,ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్. 53

సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న,సంచరణమున వర్తించుటయును
నదితిగర్భంబున నవతార మై వామ,నాకారమున హరి యడఁగుటయును
జననియూరుప్రదేశంబున నతినిగూ,ఢంబుగా నౌర్వుండు డాఁగుటయును
ధేనుశరీరవిలీనుఁ డై యజ్ఞాత,చర్య మార్తాండుండు సలుపుటయును
ఆ. వినమె యిట్లు పడిన [5]వీరలు పదపడి, తమకు నగ్గ మైన తఱి జయింప
రెట్లు ప్రబలిరిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దీర్చుకొనుము. 54

క. అనవుడు నప్పలుకులు విని, తనచిత్తము కలఁక[6]దేఱి ధర్మతనూజుం

1. రిభ్భంగిఁ... జెఱుపను జాతురు చిన్ని...ట్లగుటఁ జేసి మమ్ము. 2. మందఁ. 3. బుద్ధి... సాటిగా రనఁగ......పిల్లు టొప్పునే; పిల్ల నేటికిన్. 4. లావధికిని...ద్భావము దలఁచికొని; లడఁచి కొని యొదిగి పడి. 5. వీరలు...ప్రబల రిపుల. 6. దేఱి.

డనుజన్ములదెసఁ జూచిన, ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్ 55

మ. భవదాజ్ఞాదృఢబంధ[1]సంయమితశుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మనయర్జునద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నేపడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్కప్రేల్మిడిన నీకున్ వేడ్కసంధిల్లఁగన్. 56

వ. అనిన విని ధర్మనందనుండు తెలివొందిన మొగంబుతోడ శిరఃకంపంబు చేసె నట్టిసమయంబున నవ్విప్రు లందఱు నొక్క మొగిన మీతలంపునకు దైవం బనుకూలంబు కావుత మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని [2]నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచితప్రకారంబున వీడుకోలు పడపి తమ తమ పొందుపట్లకుం బోయిన. 57

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశమా
త్రమ్మొక చోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే
యిమ్ముల [3]సల్పి వేగుటయు నీప్సితకార్యము చేయఁగా విచా
రమ్మున నున్నచో నమరరాజతనూభవుఁ జూచి యిట్లనున్. 58

క. మన [4]మొక యేపుర మీయం,గనయుం దో నరుగుదేరఁగా నెయ్యెడఁ బో
యిన నెఱుఁగ కుండుదు రె యి, ద్దినములు కడపంగ నెద్ది తెఱఁ గయ్యెడినో. 59

వ. అనిన [5]నతం డిట్లనియె. 60

తే. ధర్మదేవత నీదుసత్కర్మమునకు, మెచ్చి యెంతయుఁ [6]బ్రీతిమై నిచ్చినట్టి
వరము కలుగంగ మన మేమివర్తనమున, నెచట నున్నను నొరులకు నెఱుఁగనగునె?

వ. కురుజనపదంబుచుట్లం బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లిక దశార్ణ శూరసేన కళింగ మగధదేశంబులు సుభిక్షంబులు [7]జనాకీర్ణంబులు నతిస్థిరంబులు నై నివాసయోగ్యత కలిగి యున్నయవి యని విందుము వానియందు మీకుం జూడం బోలినయెడఁ దగిన చందంబున నిలుచువారముగాక యనినం బ్రియం బంది ధర్మనందనుం డిట్లనియె. 62

క. అగు నది యట్టిద దైవము, తగ నిచ్చిన [8]యవ్వరంబు తప్పునె మనకున్
విగతభయవాసయోగ్యం,బుగ నొక్కెడ చెప్పు మిపుడ పోవఁగ వలయున్. 63

ఆ. నాకుఁ జూడ మత్స్యనరపతి [9]సద్ధర్మ,వర్తి సుజనహితుఁ డవార్యబాహు
బలుఁడు గాన నతనిపాల నందఱుఁ దగ, వైనపనుల నిలుచు టభిమతంబు. 64

### పాంచాలీపాండవులు తమ మెఱంగవలయు పనుల నిశ్చయించుకొనుట

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటుమనము పడయుద మది యె

---

1. సంశమిత. 2. నిజనివాసం; నిజాస్థానం. 3. నిల్పి. 4. మేపురమును నీయం. 5. నాఖండల నందనుం డి. 6. ప్రీతితో...నుండిన నొరుల. 7. నానాజనా. 8. యట్టివరము...సెప్పఁ డిపుడ. 9. సత్పథ...నడచు టభి.

ల్లను నేర్పరించి యందఱుఁ, దనతనమని యున్న తెఱఁగు [1]తథ్యము చెప్పుఁడా. 65

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుం గా [2]నతని నుపలక్షించుచు ని ట్లనియె. 66

సీ. మహనీయ[3]మూర్తియు మానవైభవమును, సౌకుమార్యంబును సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వమహిమయు నపగత,కల్మషత్వంబును గౌరవంబు
శాంతియు దాంతియుఁ జాగంబు భోగంబుఁ, గారుణ్యమును సత్యసారతయును
ధర్మనయక్రియాతత్పరత్వంబును, గీర్తిధనార్జనక్రీడనంబుఁ

ఆ. గలిగి జనుల నేలఁ గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ నెరవు లేని
యట్టిసీవు విరటు నెట్టిచందంబున, ననుసరింపువాఁడ వధిప చెపుమ 67

క. అనినం దమ్ముని నెమ్మన,మునఁ బుట్టిన వగపు భావమున నెఱిఁగియు గీ
టునఁ బుచ్చుచుఁ బ్రస్తుతకా,ర్యనిరూపణదశ[4]యు మెఱయ నతఁ డి ట్లనియెన్.

క. సన్న్యాసివేషమున రా, జన్యుని గని యెపుడుఁ గొలిచి [5]సభ్యత్వమునన్
మాన్యుఁడనై పుణ్యకథా, విన్యాస మొనర్తు నతనివేడుకకుఁ దగన్. 69

క. శ్రౌతస్మార్తనిమిత్త, జ్యోతిర్విద్యలు [6]వహించి యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుఁడ నై, చాతుర్యము మెఱసి మానసం బలరింతున్. 70

క. ఆతనితో నొక్కొకమఱి, కౌతూహలవృత్తిఁ గిందగం [7]దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ[8]నక్షశిల్పప్రౌఢిన్. 71

తే. మణిమయమ్ములుఁ గల ధౌతమయములును, వర్ణమయములు నాదిగా వలయునట్టి
యడ్డ[9]సాళులు కలవు నాకభిమతముగ, వాని గొనిపోయి చూపుదు వసుసతోడ.

వ. మఱియు [10]నవసరోచితంబు లగు వినోదంబులం బ్రమోదంబు పుట్టించుచుఁ బ్రసాదంబునకుఁ బాత్రుండ నై కంకుం డను నామధేయంబు ధరియించి చరియింతు నయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మపుత్త్రుతోడి మైత్రిం దగిలి యతనిపాల వసియింతు ననంగలవాఁడ నని చెప్పి యనిలతనయుని నిరీక్షించి తత్కాలజనితం బయి నఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె. 73

సీ. కడిమిమై సౌగంధికమున యక్షులమును, మడఁచి కృష్ణకుఁ బువ్వు లట్లు తెచ్చెఁ
గిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి, విగతకంటకముఁ గావించె వనము
బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁ జేసి, రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలుజటాసురు నదరి దండితుఁ జేసి మనలఁ బెట్టించుకొనియె

---

1. తప్పక. 2. నయ్యుమతనయుం. 3. కీర్తియు...సరసతయును...దాంతియుం శాంతియుం త్యాగం...ననుసరించు...వనఘు చెపుమ. 4. మెఱయఁగ. 5. సద్వృత్త. 6. గ్రహించి. 7. గడఁగి. 8. నక్షిశిష్; నాల్పశిల్ప. 9. సారెలు, 10. నాతని చిత్తంబునకుం దగిన తెఱంగున నవస... బాత్రంబు; బాత్రభూతుండ...బాష్పంబులు నిగుడనీక.

తే. నీతఁడు పుట్టినకోలె నెనసక [1]మెసఁగు, దర్పమునన వర్తిల్లు నుదగ్రహృదయుఁ
డకట యొరుచిత్తమున కెక్కునట్లు కాఁగ, మెలఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు.

వ. అనిన విని భీమసేనుం డి ట్లనియె. 75

తే. ఏను వంటలవాఁడ నై యానరేంద్రుఁ, గొలిచి కరకరగాఁ గూడు కూర చిత్త
మునకు వచ్చినచందంబున నొనర్చి, [2]నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి. 76

ఉ. ఆఱురసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలుం
వే ఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ [3]జేసి చేసి నం
మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మేఁ
గాఱియ వెట్టి రైన నొడికంబుగ వండుదు నెల్లఁగూరలున్. 77

తే. పఱియవాపంగఁదుని యఁగావిఱువవలయు, నెడలఁ[4]గాళ్లులఁ జేతులఁ బొడలఁబట్టి
కడఁగి యనువుగఁ జేసి ప్రొయ్యిడుదుఁగాని, కత్తి గొడ్డలియడుగ నేఁగట్టియలకు.

క. సూపాధ్యక్షుఁడు కలిగిన, నాపురుషునితోడ సఖ్య మగునట్లుగ నే
నేపాట నైన నడవఁగ, నోపుదుఁ దత్తద్విధప్రయోగములమెయిన్. 79

వ. అట్లుంగాక. 80

తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి హాంత, కారి విఱిచిన [5]యట్టు లగ్గలిక విఱుతు
లాఁగు వేగంబు మెఱసి చలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. 81

క. పెక్కండ్ర నొక్కపోరను, [6]నుక్కఱ భంజింతుఁ జంపు టుడుగుదు రాజుం
దక్కటిచూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. 82

చ. అదియును గాక కోలుపులి నైనను గారెనుపోతు నైన ను
న్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బె
ట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బ
ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు కడుం బెఱగందుచుఁ బిచ్చలింపఁగన్. 83

వ. ఇట్లు నానాప్రకారంబుల నతని [7]మనంబు పడయుచు వలలుం డనుసమాఖ్య
వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడ వని యడిగె నేని పాండవాగ్రజునకు బాన
సంబు చేయుదు ననంగలవాఁడ ననిన విని ధర్మజుం [8]డమ్మెయికి సమ్మతించి బీభత్సు
వీక్షించి ఘూర్ణమానమానసుం డగుచు ని ట్లనియె. 84

ఉ. ఖాండవ మేర్చి దేవతలుఁ గాననియీశ్వరుఁ గాంచె దోర్బలో
ద్దండమహాసురప్రతతిదర్ప మడంచి ప్రియం బొనర్చి యా
ఖండలుఁ డున్న గద్దియసగంబున నుండె మహానుభావుఁ డీ
తం డొకమర్త్యుఁ జేరి యనుదాత్తత [9]నెమ్మెయిఁ గొల్చువాఁడొకో. 85

---

1. మెసఁగ...వర్తిల్లె నుదగ్రమూర్తి. 2. నిచ్చ. 3. సంఘటించిన, మీఱినబానసీ నొకరునిం. 4. గాళ్లను...ప్రొవిడుదుఁ. 5. యట్ల యగ్గ లీల నగ్గ...చలంబు. 6. నొక్కొడ...జంప నొల్లక రాజుం. 7. మన్నన...దనునామధేయంబు. 8. డమ్మాటలకు సమ్మ. 9. సెట్టులుఁ.

క. అనుమాటలు విని సంక్రందననందనుఁ డిట్లనియె దైవంబుకతం
బున నాకు నొక్కచందం, బును వై యున్నయది [1]దీని నొఁగా దనుఁడా. 86

వ. అమరనగరంబున కరిగినయెడ నూర్వసి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు నాకేశుండు కరుణించి యీ[2]శాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి తదనంతరంబ శాపమోక్షంబు పడయు మని దీవించెం గావునఁ బేడితనంబు దాల్చి బాహులదీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును మాటు సేసికొని విరాటుకడకుం జని. 87

క. ఉత్తమకన్యా[3]జనులకు, నృత్తము కఱపంగ నాకు నేర్పుఁగలదు త
ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కఁ బనులు చేసెద నందున్. 88

క. అని కొలిచి యే బృహన్నల, యనునామముతోడఁ గన్యకాంతఃపుర[4]వ
ర్తన మొనరించుచు లాసిక, తనమున నిపుణుండ నై యతని మెచ్చింతున్. 89

క. [5]మానవపతి నన్నెక్కటి, దానవు నీ వనియె నేని ద్రౌపదికడ స
న్మానంబు పడసి మెలఁగుదు, నానగళుల నృత్యగురువ ననఁ గలవాఁడన్. 90

తే. అనిన నిది వోలు నని యియ్యకొని యజాతవైరి యల్లన నకులునివలను చూచి
నెమ్మనంబున నుమ్మలికమ్ము కదుర, నెలుఁగుచందంబు వేఱుగా నిట్లు లనియె. 91

ఉ. ఒప్పెడుమేనుఁ బెంపు గలయుల్లము నాగరికంపుఁజందముం
జెప్పక చూప కీతనివిశేషముఁ దెల్పెడుఁ గొల్చు టింతయుం
జెప్పర మేమి చేయుదుఁ గడిందివిచారము పుట్టె నెట్లితం
డప్పురి సంచరించునొకొ యన్యు లెఱుంగక యుండునట్లుగన్. 92

వ. అనిన నప్పలుకులకు నకులుం డిట్లనియె. 93

ఆ. అశ్వశిక్షకుండ నై మత్స్యభూవిభుఁ గొలుచువాఁడ గుఱ్ఱములకు వలయు
తెఱఁగు లెల్లఁ [6]జాల నెఱుఁగుదు రూపుగా, నరయ నేర్తు వాని ననుదినంబు. 94

సీ. గోడిగజాతిలోఁ గొదమ పెంటుల నేర్చి, మావుల హత్తించుమార్గంబుఁ
[7]ద్రాళ్ళఁ బట్టింపంగఁ దఱి యైనకొదమల, సంచు లెఱింగి శిక్షించునేర్పుఁ
గళ్యాలఁ బదిలంబు గానిగుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవుఁ
జెనఁగుతేరాకలముల బిరుదుతనంబులఁ, జలము డింపక తీర్పఁజాలుటయును

తే. నలవరించినవాఁడ లాయమున నున్న, యపుడు తొడఁ గించుకయు లేనియట్లుగాఁగ
మాటిమాటికిఁ బరికించి మందడీల, కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. 95

క. దామగ్రంథి యనఁగ నొక, నామము పెట్టుకొనువాఁడ నాతోఁటివిధం
బామనుజేశ్వరుఁ డడిగిన, నేమీకడవాఁడ నందు నిది తెఱఁ గధిపా. 96

---

1. దాని కొఁ...డీ. 2. శాపంబు ఫలం...గుణకిణాంకంబులకుఁ. 3. జనముల. 4. న, ర్తన. 5. ఆవరపతి...నా నెలఁతకు నా నగరున వృత్త. 6. జూచి యెఱుఁ. 7. ద్రాళ్ళను; ద్రాడులఁ బట్టంగఁ...సంచంబు లెఱిఁగి...గళ్లలఁ...బిరుసుఁదనం...దొనఁ గించుక.

క. అనినఁ గడు లెస్స యని నెమ్మనమున నూఱడి విభుం డమానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుం,గొని యిట్లను వగలు మిగిలి కొందలపడుచున్. 97

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁ[1]డు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దునే
యఁకొడుకు మేను లేఁత తనయుల్లము మెత్తన యిట్టియాతఁ డె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు చేయఁగన్. 98

క. అనుఁడు నతఁడు తనచిత్తం,బునఁ దోఁచినవిధము ధర్మపుత్త్రునితో ని
ట్లని చెప్పె నాతనికిఁ బుట్టినయుత్తలపాటు కొంత డిందుపడంగన్. 99

క. కీలాలితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్యజనపాలుకడఁ గా
మే లగునడవడిఁ దంత్రీ, పాలుం డను పేరితోడఁ బరఁగుదు నధిపా. 100

సీ. వంజల నైనను వల నేర్పడఁగ నొక్క,భంగిఁ జేపఁగఁ జేసి [2]పాఁడిఁ గొనఁగ
బడుగుల నైనను బాటించి పరికించి, గోమున మైఁ గండ క్రొవ్వు దేఱఁ
దెవులుగొంటుల నైనఁ దేర్చుసంకటమున, కోపి ముంగటియట్ల రూపుసేయ
నట్టల నైనను నలువైనవెరవున, ముట్టి యంటఁగఁ బట్టి కట్టి విడువఁ

ఆ. బిడుకఁ గడుపు చేర్పు బెదరు పాపఁగ నీరు, మేపుగలుగు నెడకు మెలఁగ వెలువ
మెకము నరయ మ్రుచ్చు మెలఁగిన వెలకొట్టె, నేర్తుఁ బసికిఁ జాలఁ గూర్తు నేను.

వ. నన్ను విరాటుండు మున్ను నీ వెందుండు దని నిరూపించెనేని యుధిష్ఠిరు గోష్ఠంబుల కధిష్ఠాత నై యుండుదు ననియెద నని పలికినఁ గొంతేయాగ్రజుం డిది యుక్తం బగు నని యనుమతిచేసి పాంచాలి నాలోకించి ఖిన్నాం[3]తఃకరణుం డగుచు ని ట్లనియె. 102

చ. ఇది కడుముద్దరాలు పను[4]లేమియుఁ జేయఁగ నేర దెంతయుం
మృదు వోకకీడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వ దొకటిం దనుఁ దా నవరించుచొప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁ గా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా. 103

క. అనిన నతనిచిత్తంబున, వెనుఁబాటంతయును బాయ వెరవుకలిమి యె
ల్లను దెలియునట్లుగా ని, ట్లనియెం బాంచాలి యుచితమగుచందమునన్. 104

క సైరంధ్రీవేషంబునఁ, జేసుదు నంతఃపురంబుచెంతకు నన్నా
భూరమణుదేవి యెంతయు, గారవమునఁ బిలువ నంపఁ[5]గా వినయమునన్. 105

---

1. డనమానుఁడు దాత్తుఁడు; శాంతుఁడు...విధి యొప్పదె. 2. పాలు...దీర్చి సంక... నఱవల...నలపున వెర...; నట్టావులను నైన నలు...నెడల మెలఁగమలువ, మృగము నరయ... కేవగళులుగొట్టు; పగలు కేలరికట్టు. 3. తరంగుం. 4. లెవ్వియుఁ...జాలదు భీతచిత్త యొం, టిది దిరుగాడ నోర్వ నొకటేనియుఁ దా నవరించు; దొకటిం దను దాన వరించు...తగ నొడ్లనుం గొలువఁ గా. 5. గాఁ గలదు దగన్; గాఁ జెలు వమరన్.

క. కని కొలువు చేసికొని మా, లిని నాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తం
బునఁ బొంతఁ బోవ దెన్నఁడు, ననువ్రేఁకఁదనంబు దోఁచు నట్లు చరింతున్. 106

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు ననువు గాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి, తిలకంబు పెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడి కొక్క, భంగిగా నెత్తులు పట్టి యిత్తు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి, యందంబు వింతగా నలవరింతు

ఆ. వివిధశిల్పములఁ బ్రవీణ నై మఱియును, వలయుపనుల వెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషిమనమున మక్కువ, నెలకొనంగ నిట్లు కొలువ నేర్తు. 107

క. మును నీ వెచ్చో నిలుతే, పని సేయు వర్తిల్లు దనినఁ బాంచాలికి నే
ననుచారిణి నై తగఁ బంచిన కపుపుఁబనులు నేర్చి చేయుదు నందున్. 108

వ. అనవుడు ధర్మనందనుండు ద్రుపదనందన కిట్లనియె. 109

క. మనవంశం[1]బును వృత్తం, బును బెంపును గావఁ జాలుపుణ్యసతివి దు
ర్జను లగుతులువలతలఁపును, గనుఁగొని యెఱుక మెఱఁగఁగా వలయుఁ జుమీ.

వ. అనిన విని యాజ్ఞసేని యనాదరమందస్మితసుందరవదనారవింద యయి యతని
కిట్లనియె. 111

క. ఆరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా
చారముమై వర్తింతుఁ, సైరంధ్రిజాతి వారు సౌజన్య[2]మునన్. 112

క. కావున నుచితము లగు నా, కా వెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షావిరచనమును వ్రతస్సం, భావనమును గౌరవంబుఁ బాపభయంబున్. 113

క. అని చెప్పిన విని యగుఁ బొ, మ్మని కైకొని ధర్మతనయుఁ డందఱమును ని
ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. 114

వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు
రక్షించువారు వంటలవారును మహానసాధ్యక్షులును బాంచాలీపరిచారికలును
ద్రుపదపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదులైన సారథులు
ద్వారకానగరంబున కరుగువారు వీరెల్లను దమ్మెవ్వరైనను మనవార్త లడిగిరేని
ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట యెఱుంగ మనం గలవారని చెప్పి
యిత్తెఱంగున నభ్యంతరపరివారంబు నెల్ల[3]నియోగించి వీడుకొలిపె నయ్యవసరం
బున ధౌమ్యుండు పాండుకుమారుల కిట్లనియె. 115

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుట

ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్క రుచితప్రకారము శుభముం
గోఱలు హితు లట్లగుట నం, దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్. 116

అదియునుంగాక. 117

1. బున వృత్తం... తులువలమనములు. 2. నిధీ. 3. నిలువ నియోగించి.

తే. కౌరవాన్వయజాతు లై గారవమునఁ, బెరిఁగినట్టి మీ రొండొకనరునిఁ గొలిచి
[1]మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁకువతోడన యునికి యరిది.

క. వాలి వివిధాస్త్ర[2]విద్యా, జ్వాలల వెలుఁగొందుపాండవజ్వలనం బా
భీలత మండం దొడరినఁ, [3]గాలవిరోధంబు మఱచి కార్యముఁ దప్పున్. 119

వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశం బవశ్య కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకుజనంబులు కీడునుం [4]బొరయ కుండునట్టిసాధారణనీతి సంక్షేపరూపంబున నెఱింగించెద సావధానుల రయి వినుండు. 120

క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి రూప మవికృతవేషం
బుగ సమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభున కతఁడు సమ్మాన్యుఁ డగున్. 121

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ [5]లేమిన్
మరియాద తప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. 122

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు నే
యోజ విహారముల్ సలుప నుల్లమునం గడువేడ్క సేయు నే
యోజ విదగ్ధుఁ డై పలుకు [6]నొడ్డులకుం దగ దట్లు చేయఁగన్. 123

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు, మిత్రు లనఁ రాజు లాజ్ఞ [7]మిగిలినచోటన్
శత్రులకాఁ దమయలుకకుఁ, బాత్రము చేయుదురు నిజశుభస్థితిపొంటన్. 124

క. చనువాని చేయుకార్యం,బున కడ్డము చొచ్చి [8]నేరుపున మెలఁగుచుఁ దా
నునుబయిఁ బూసికొనుటఁ దన,మును మెలఁగిన మెలఁకువకును ముప్పగుఁ బిదపన్.

ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటము కాఁగఁ, దిరుగుపనుల కెంత తేజ మయిన
వాని బుద్ధిగలుగువా రొల్ల రది మీఁదఁ, జేటు దెచ్చు నట్లు సిద్ధ మగుట. 126

క. ఊరక యుండక పలువుర, తో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరుపక మదిం
జేరువ గలనాగరికులుఁ, దారుఁ గలసి పలుకవలయు ధరణీశుకడన్. 127

క. వేఱొకతెఱఁగున నొగలకు, మాఱాడక యునికి లెస్స మనుజేంద్రు [9]కడం
దీఱమి గలచోటులఁ దా, మీఱి కడఁగి వచ్చి పంపు మెయికొన వలయున్. 128

చ. ధరణిపుచక్కఁ గట్టెదురు తక్కి పిఱుందును గాని యట్లు గా
నియుగెలనం దగం గొలిచి యే మనునో యెటు చూచునొక్కొ యె
వ్వరిదెస నెప్పు డేతలఁపు వచ్చునొ యీతని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన [10]చేర్చుచు నుండుట నీతి కొల్వునన్. 129

క. నగళులలోపలిమాటలు, తగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం

---

1. మలసి. 2. శస్త్ర. 3. గ్రాలువిరోధంబు నుచితకార్య. 4. దొరయ 5. లేకమ్మరి. 6. నొడ్డగు నుం, 7. మీఱిన, 8. యేరుపున.., బూసికొనుటఁ; బూసికొనిన. 9. నకుం, 10. చేర్చి నుండు,

డుగడం బుట్టినఁ బతి విన, నగుపని చెప్పెడిది గాక యాతనితోడన్. 130

క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీ డంతకంటె నెగ్గు తదీయో
పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందుకలిమి భటునకున్. 131

ఆ. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనం,బులును గరుణఁ దమకు భూమిపాలుఁ
డీక తార యెక్కు టెంతటిమన్నన, గలుగువారి కైనఁ గార్య మగునె. 132

క. మన్నన కుబ్బక యవమతి, త న్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడ
ము న్నున్న యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము [1]లొదవు నాపద లడఁగున్.

క. జనపతి యెవ్వారి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి మదిఁ దెలియ నెఱిం
గినయేనిఁ దాను వెలిపు,చ్చునె మునుము న్నెట్టిపాలసుండును దానిన్. 134

ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁ జోటు నాక యా
కొండు నలంగుదుర్ నిదురకుం దఱి దప్పెడు డప్పి పుట్టె నో
క్కండన యెట్లొకో యనక కార్యము పుట్టినచోట నేలినా
తం డొక [2]చాయ చూపినను దత్పరతం బనిసేయు టొప్పగున్. 135

క. తా నెంతయాప్తుఁ డైనను,హీనాయకు సొమ్ము పాము నెమ్ములుగా లో
నూనినభయమునఁ బొరయక, మానినఁ గాకేల కలుగు మానము బ్రదుకున్.

ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ,నంబు గుప్తవర్త[3]నములు గాఁగఁ
జలుపవలయు నృపతి గొలువున్నయెడల బా,హిరము లైనఁ గెలని కెగ్గు లగుట.

క. వైరులదూతలు నెర వగు, వారు నిరాకృతులుఁ బాపవర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట, నేరమి తుదిఁ బోయి చేటు నిందయు వచ్చున్. 138

ఆ. వసుమతీశుపాల వర్తించునేనుంగు, తోడ నైన [4]దోమత్తోడ నైన
వైర మగుటెఱుంగు వలవదు తా రెంత,పూజ్యు లైన జనులపొందు లెస్స. 139

క. కలిమికి భోగముల కదా, ఫల మని [5]తను మెఱసి బయలుపడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే,డ్కలు సలుపఁగ వలయు భటుఁ డడంకువతోడన్. 140

వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మం బెఱింగించిన ధర్మజభీమార్జుననకుల
సహదేవులు ప్రసన్నచిత్తు లై యి ట్లనిరి. 141

క. తల్లియుఁ దండ్రియు దైవము, నెల్లసుహృజ్జనము మీర యట్లు గొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ, దెల్లము చేసితిరి బ్రదికితిమి మీకరుణన్. 142

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, [6]మొకఁడు నెట్టులయిన నుడిగి మడిఁగి
సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. 143

క. అనవుడు నట్టుల చేసెద, మని వారలు భక్తియుక్తి నతనికి నభివం
దన మొనరించినఁ దగుదీ,వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 144

---

1. లొలయు. 2. చోటు. 3. నంబు. 4. మైత్రి, దొడరవలయు. 5. తా. 6. మకట... నడఁగి మడఁగి.

క. భూదేవోత్తము నాశీ,ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స,న్మోదావహపుణ్యకర్మముల కుద్యతుఁ డై. 145

ఆ. అతఁడు నియతితోడ నగ్నిసముజ్జ్వలం,బుగ నొనర్చి [1]కామ్యపూజఁ దీర్చి
యానసమయమంగళార్థంబు లగుమంత్ర, సంచయములు తగ జపించుచుండె. 146

పాండవులు పాంచాలితోడ విరాటునగరంబునకుం బయలుదేఱుట

వ. తదనంతరంబ హుతవహునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు చేసి యమ్మహీసురవరేణ్యు ననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును దోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణదేశంబున కుత్తరంబునం బాంచాలజనపద యామ్యదిగ్భాగంబున సాళ్వశూరసేనవిషయంబులలోనం గాళిందీదక్షిణతీరం బొరసికొని పశ్చిమాభిముఖప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడపుచు నానామృగ[2]వివిధవిహారంబులను మనోహరకుసుమకదంబగంధమకరందబిందుసందోహసుందరతరుచ్ఛాయాసేవనంబులను గమలపరాగపరంపరాధూసరితభాసురజలాశయసవనగాహనంబులను సరిత్సంగమస్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకారపాదపగుల్మలతావలోకంబులను బక్షికులప్రకరానేకభంగివిరుతాకర్ణనంబులను వినోదించుచుఁ గాననమార్గంబుల నరిగి మత్స్యమండలంబుగడిచేరి ధౌమ్యుని వీడుకొని రవ్విప్రవరుండును నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వారు మఱియు నూళ్లుసారక యడవితెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరం బగుకాంతారంబునఁ దఱిమి పోవుసమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని యి ట్లనియె. 147

ఉ. దప్పి జనించె వ్రేళులపుటంబులు పొక్కెఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁగదుర్వశంబు గా
దప్పుర[3]మిచ్చు టచ్చు టనునాసల వచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్. 148

వ. అనవుడు. 149

క. తనమదిఁ గరుణయు ఖేదం,బును[4]బెరిగొనుచుండ ధర్మపుత్త్రుఁడు నకులుం
గనుగొని ద్రుపదనృపతినం,దన దెస యాతనికిఁ జూపి తగ ని ట్లనియెన్. 150

ఆ. అకట మనము వచ్చినది కడుదవ్వు నేఁ, డప్పురంబు చొత్త మని తలంచి
[5]తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడ, గొనియె మోచి తెమ్ము కొంతదవ్వు. 151

క. అనిన విని[6]పూని గ్రక్కునఁ, జనుదేరమి నతఁడు డస్సెఁ జాలం దని నె

1. కాల్య. 2. వివిధవధవిహారణంబు...ప్రవరానేక...మండలంబుగదిసి; కదిసితి మని. 3. మిచ్చొ టచ్చొ...మెంతదవ్వొ...నోపనెమ్మెయిన్. 4. బురికొను...(ద్రుపదాధిపసం) ద్రుపదాత్మజ నా, తని కొయ్యనఁ జూపి. 5. తడవు. 6. యతఁడు.

మ్మనమున నెఱింగి యాతని, యనుజన్మునిఁ [1]బనిచె నతఁడు నలసుం డయినన్. 152

వ. సవ్యసాచిం జూచి. 153

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన కీనడుమన్ విడియంగ నొండుచో
టిమ్మును గాదు నిక్క[2]మున కేమును డస్సితి మట్లు కాన నీ
వెమ్మెయి నైన దీని భరియించి పురంబుసమీపభూమికిం
దె మ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్. 154

క. మోచికొని వాసవాత్మజుఁ, డాచెలువం దేర నిట్టు లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మసుతుఁ డి ట్లనియెన్. 155

క. చక్కనిచిక్కని మేనులు, నిక్కోడదండము[3]లు నైన నెఱుఁగరె మన మీ
చక్కటి నిలుతమె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేషయోజనములకున్. 156

వ. అనిన నది కార్యంబని మధ్యముపాండవుం డాసుమధ్యనొక్కశీతలసికతాతలంబున డించె దక్కిన వారలు నట్లచేయుద మని నిలిచి రట్టియెడం బాండవాగ్రజుండు గాండీవిచేతివి ల్లుపలక్షించి యతని కి ట్లనియె. 157

క. మనశస్త్రాస్త్రంబులు త,క్కినయవి యొకభంగి[4]వీటికిని గాండివముం
గొనిపోయితి మేని సుయోధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. 158

వ. [5]అనవుడు. 159

చ. ఇది పెనుఁబాముచందమున నెంతయు భీషణ మై జనంబులన్
బెదరఁగఁ జేయు న ట్లగుటఁ బెట్టి చనన్ వలయుం[6]దలంచి నా
హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొర దెట్లు చెప్పినం
దుది నొకచోట వైచుటయ తోఁచినకార్యము నయ్యెడుం గటా. 160

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడుచిత్తంబునుత్తలం బుడిపికొని నిశ్చయించి యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూపణంబునకు నలుదిక్కులుఁ బరికించి ప్రేతభూమిపరిసరారణ్యంబునందు. 161

సీ. [7]నెగసినకొన లేచి నిగిడి యంతంతకు, నవులఁ ద్రోవఁగఁ దన రారుదానిఁ
జాఁగినశాఖ లాశాచక్రమునకొలం,దులు బార వెట్టంగఁ బోలుచుదానిఁ
గవట లొండొంటితోఁ గదియుచు నెడములు, మ్రింగి ప్రబ్బఁగ సొంపుమిగులుదాని
లోనిజొఁపము పవలును బెనుచీఁకటి, నొదవించి పొదలంగ నొప్పుదానిఁ

తే. గనియెఁ బవమాననివిధవర్తనకళాను,వర్తిఁ గాకఘూకారవస్ఫూర్తిజాత
భీతి పరిసరవర్తి నాభీలభుజగ, చండమూర్తి శమీతరుచక్రవర్తి. 162

వ. కని యమ్మహామహీరుహంబు ధర్మనందనునకుం జూపి యి ట్లనియె. 163

---

1. బనిచె నాతఁ డవశుం. 2. ముగ నే...చెప్పె...లన్. 3. లుఁ జూచి. 4. విచటికిని. 5. అనవ్రుడు నర్జునుం డి ట్లనియె. 6. దలంప నా; దలంచినన్...నొకచోట వైచుటయుఁ; నొకభంగి వైచుటది. 7. నిగిడిన; పెరసిన...ద్రోచుచుఁ...వివిధవర్తన.

శా. పక్షివ్యాకులముం బరేతనిలయోపాంతోత్థమున్ డాకినీ
రక్షోభూతపిశాచగోచరము [1]దుర్గంధంబు నై చూడఁ జి
త్తక్షోభం బొనరించు న ట్లగుటఁ జెంతం జేర రా దీశమీ
వృక్షం బెవ్వరి కిందుఁ బెట్టుదమె పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్. 164

క. [2]పెనుఁబొడువుఁ బలుపు జొంపమ్మును గలయది దీన నెల్ల పురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు చేరం, జనఁ జూడఁగ నరయ నెక్క సమకట్టంగన్. 165

ఉ. కావున దీనియం దిడుట కార్యము కైదువు లెల్లఁ గేశచ
ర్మావృతసంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కొరులు భూవర నెమ్మది నూఱడిల్లు మె
చ్చోఁ వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. 166

పాండవులు తమ యాయుధంబుల శమీవృక్షంబునఁ బెట్టుట

వ. అని చెప్పిన నందఱు న త్తెఱంగున కియ్యకొనుటయు నతండు గాండీవం[3]బు నవలోకించి. 167

చ. అనిమిషదానవాంబరచరాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె [4]గెల్తు సముదగ్రవిరోధిభయావహంబు దీ
నిని నొక మ్రానఁ గట్టి చను నిశ్చయముం దగఁ జేసె దైవ మే
మనఁ గల దట్లకాక యని యాత్మ నలందురి మందచేష్టుఁ డై. 168

వ. ఎక్కు డించినఁ బాండవాగ్రజుండు. 169

క. దనుజకులత్రాసకరం,బును రిపుభంజనము రత్నభూషితరూపం
బును గురు[5]దేశాహ్లాదన,మును నగునిజకార్ముకంబు మో పెడలించెన్. 170

వ. తదనంతరంబ భీమనకులసహదేవులదెసఁ గనుంగొని. 171

సీ. సైంధవయక్షపాంచాలత్రిగర్తుల, దీనన యోర్చితి మానధనుఁడ
సౌరాష్ట్రనాథాదిశత్రులు దీనిచేఁ, గాదె మర్దితు లైరి ఘనభుజుండ
కాళింగపాండ్యమాగధుల నిర్జించుచో, నిదియ కైదువు నీకు విదితయశుఁడ
యని క్రమంబున వార లందఱవిండ్లులు, పెం పెసలార వేర్వేఱ పొగడి

ఆ. గొనయములు వదల్ప ననుమతి చేయుఁడు, వారు నట్ల చేసి తేరఁ జాప
ములును దొనలు వర్మములు నసిముద్గరా, ద్యాయుధములుఁగూడ నతఁడుకట్టె.

వ. ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగంబులం బెట్టియలంబెట్టి కట్టు చందంబున బంధించి వానిం గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్తవరుం డగుటం జేసి నిశ్శంకం బైన యంతఃకరణంబుతోడ శమీవృక్షసమారోహణం బాచరించి. 173

---

1. దుర్గంధంబు. 2. కనుఁబొడువుఁ. 3. బుపలక్షించి. 4. గెల్చుట యుఁదగ్ర; గెల్చితి నుదగ్ర. 5 దేవా.

తే. బ్రహ్మవిష్ణుమహేశదిక్పాలచంద్ర
సూర్యపవనదేవతాపితృ స్తుతు లొనర్చి
దివియు భువియును జూచి ప్రార్థించి యొక్క
విపులశాఖ నాయుధములు వ్రేలఁ గట్టె. 174

వ. ఇట్లు కట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. 175

క. నరునకు నాకుం దక్కఁగ, నొరులకు మీరూపు చూప [1]కున్నది విషవి
స్ఫురితభుజగభంగి భయం,కరమూర్తులు తాల్చియుండఁగా వలయుఁ జుఁడీ. 176

ఉ. భీముఁడు ధార్త[2]రాష్ట్రకులభీషణరోషుఁడు చిత్త మెప్పు డె
ట్లై మద మెత్తునో యతనియాగ్రహవృత్తికి లోను గాక మీ
రేమెయి నైన వంచన వహించి తొలంగుట మత్సమీపహితం
బేమఱ కుండఁ గా వలయు నిర్విషమాబ్దములోన నాతనిన్. 177

వ. అని వేఁడికొని వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబు వచ్చి ప్రణమిల్లి భీమ
సేను చెస మరలి చూచి సాంత్వనవచనసమేతంబుగా నతనిం గౌఁగిటం జేర్చి యను
నయించి తమ చేసినవిధంబు తత్ప్రదేశవర్తు లయిన గోపాలాదిక్షుద్రజనంబులకు
మఱుఁగుపెట్టం దలంచి వారల కభిముఖులై పాండునందను లందఱు నిట్లనిరి. 178

చ. ఇది [3]శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు చే
యుదుము కులప్రయుక్త మగు చున్నసనాతనధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మొల్ల మది కానిది గా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్. 179

వ. అని యిట్లు పలుమఱుం దెలియఁ బలికి శస్త్రాస్త్రంబుల నిక్షేపణంబు నిగూఢం
బగుటకు నూఱడిల్లి యచ్చేరువం జచ్చిన పసరంబు పడియున్నం జూచి సహ
దేవుం బనిచి ధర్మతనయుండు దానిచర్మం బొలిపించి శీతాతపవర్ష పరిహారంబుగా
నాయుధంబులం బొదివించి మఱియును దత్సమీపంబున నొక్క శుష్కశవంబు
నవలోకించి యిది యుంఛవృత్తి యైన మానవుకళేబరంబు కావలయు ననుచు
నదియునుం గైదువులకట్టపయిం బెట్టి కట్టించె నివ్విధంబున నత్యంతగుప్తి యాచ
రించి దీనిదుర్గంధంబున వనచారు లెవ్వరుం జేర రని నవ్వుచు వార లచ్చోటు
వాసి విరాటపురాభిముఖులై చనుచుండి యజ్ఞాతవాసకాలంబునం దమ రహస్య
వ్యవహారంబునకు ననువుగా నేపుర పేళ్లును గ్రమంబున జయుండును జయం
తుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని
యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు చేసి తదీయస్నానంబునం
బథిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబు

1. 'ఉన్నది = ఉండునది.' కున్నత...భుజంగొఘభయం. 2. రాష్ట్ర సెడ. 3. యొక
వృద్ధ; శతవృద్ధ...కులప్రవృత్త.

లొనర్చిరి తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుం డయి నిర్మలచిత్తం
బున ధర్మదేవతం దలంచి యిట్లనియె. 180

ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయుతెఱఁగు
సమయసముచితముగ సమకట్టు మయ్య యీ,రాకుమారు లవిధిఁ బోక యుండ.

వ. అనుచు ననుజులదెసకు దూరవగచి డగ్గుత్తిక వెట్టి మఱియును. 182

ఉ. అంబరవర్తివై నను గని [1]యక్షుత నీ కగపడ్డవీరిప్రా
ణంబులు మున్ను నిన్నడిగి నల్వురకుం నయవిక్రమప్రభా
వంబులు వేఁడికొన్న నతివత్సలభావముఁ బొంది యాదరా
ర్ద్రం బగుచూడ్కితోఁ బ్రియహితస్థిరభాషల నూఱడింపవే. 183

వ. అని తారు మున్ను భూసురవరునరణిదేర నరిగిననాఁడు సరోవరతీరంబునం దనకు
ధర్ముండు చేసినమన్నన తోఁప నతనికి విన్నవించినవాఁడై కరకమలంబులు మొగిచి
ఫాలభాగంబునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమితమస్తకుం డగు
టయుఁ దదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్నయునికిన సన్న్యాసిరూపం
బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వారం
దఱు మహాద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబు లగునంబరా
భరణమాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి యెల్ల
వారిం గలయం గనుఁగొని క్రమంబున నొంటిమైఁ జనుదెం డని నియోగించి
యతండు నానావిధంబు లగునక్షంబులముడి కక్షంబున నిడికొని చని దైవ
యోగంబున విరాటుండు వెడలి వచ్చి బయలికొలు విచ్చుటం జేసి తదాస్థానంబు
చేరం బోవునప్పుడు. 184

### ధర్మరాజు సన్న్యాసివేషంబున విరటుఁ గొల్వ వచ్చుట

ఉ. వవ్వలఁ జూచి మత్స్యవసుధాపతి యీచను దెంచుచున్న వాఁ
డెవ్వఁడొ నాదచూడ్కులకు నెంతయు ప్రేఁగయి తోఁచె [2]నెట్లితం
డివ్విధిఁ బొందెనో జగము లెల్లను నేలఁగఁ జాలుతేజ మా
ముప్పురతోడిజోడి యగుమూర్తి యతీంద్రునియొప్పు కంటిరే. 185

సీ. కరచరణాద్యంగకంబు లేలొకో రత్న,భూషణప్రకరంబుపొందు దొఱఁగె
నుభయపార్శ్వంబుల నిభఘట లేలొకో, చనుదేవు సమదాళిసమితి మొరయఁ
బాయు తొలంగు మం చాయతవేత్రహ,స్తులమొత్త మేలొకో తోడ రాదు
ధవళాతపత్రముల్ తఱచుగా నేలొకో, పట్టరు మౌక్తికప్రభలు వెలుఁగ

తే. నితఁడు రా జగు రాజనునింతమాత్ర, కాదు మూర్ధాభిషిక్తవర్గంబుఁ దనదు
చరణయుగ్మంబు గొలిపింపఁ జాలు సార్వ, భౌమపదవికిఁ దగియెడుభంగి వాఁడు. 186

---

1. యక్షునిచే నగ...మఱివిక్రమ...వత్సలతం దగ నిచ్చి. 2. నిట్టి(ట్లి)తం, డెవ్విధిరె.
తోడ జోడయిన; జోడగును; సాటి యగు.

క. మనకడకు నేమిటికి వచ్చెనొక్కో యీ నిమ్మహాత్ము చెప్పినపను లె
ల్లను జేయువాఁడఁ గోరిన, కనకాంబరమణులు తలఁపు కడవ[1]ఁగ నిత్తున్. 187

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమ[2]కు యుక్తుండు, కాఁ దలంచెనేని గారవమున
నట్లు చేసి భక్తి ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్యయుతము గాఁగ. 188

వ. అని సమస్తజనంబులుఁ దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు చేయం దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతనియాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ [3]దోడ్కొని చనుదెంచి సముచితసమున్నతాసనంబున నునిచి వినయావనతుం డయి. 189

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూ
[4]పయ్యది నావుడున్ నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డి ట్లనున్. 190

ఆ. ఉన్నరూప పలుకునన్నరు లెక్కుడఁ, గలవు తోఁచినట్లు పలుకు పలుక
నైనపంద మయ్యె నంతియకా కంత, పట్టి చూడఁ గలరె యెట్టివారు. 191

వ. అని మందహాసంబు చేయుచు మఱియును. 192

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకుఁ జెల్లింపం, గా నగు సత్యంబు నడపుక్రమ మ ట్లుండెన్. 193

వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి. 194

క. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ, సుజనప్రియుఁడైన ధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ, మనుజవల్లభ యోగ్యబహువినోద[5]కరుండన్. 195

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున [6]నొవ్వనిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి, భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 196

చ. నృపనయవిద్యకుం దగిననే ర్పలవడ్డది కొంత కొంత ధ
ర్మపరులసంగతిం దగిలి మచ్చిక నుండుదుఁ బేరు కంకుఁ డే
వపుఁగొలు వైన నాకు నిలువన్ మది గొల్వదు కాన నిన్ను భూ
మిపతులలోన సాధుజనమిత్త్రుఁడు నా విని కొల్వవచ్చితిన్. 197

తే. వత్సరంబునఁ గడచనువ్రతము నాకు, దాని నీపాలఁ జల్పి యుత్సాహవృత్తి
[7]మెఱయ నాకుఁ గృతఘ్నత నెఱపి తొల్లి, యెగ్గు చేసినవారి జయింపఁ బోదు. 198

వ. అనిన విని సంప్రీతచేతస్కుం డై విరాటుం డతని కి ట్లనియె. 199

తే. అట్లు చేయుఁడు రుచిరోన్నతాసనములు

---

1. నొసఁగుదున్. 2. కుద్యుక్తుండు; కునీశుండ......ననుసరిం......టా(శి)ద్యయుంతము. 3. తోడుకొని సభకుఁ దెచ్చి సముచితాసనం. 4. పయ్యెడు. 5. పరుండన్. 6. నోర్వని; [illegible]...పాడమివెడ. 7. మెఱసి నీకుఁ గృతజ్ఞత.

[1]వాహనమ్ములు వస్త్రముల్ వలయుభోగ
ములును మఱి యెల్లవర్తనములును బ్రీతి
నాకు నెట్లవ్విధమ మీకు నడపువాఁడ. 200

క. నాయనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తి లేక మిగిలి మెలఁగె నే
నాయధముని దండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్రసిద్ధుం డయినన్. 201

వ. అట్లుం గాక. 202

చ. వెలయఁగ మత్స్యరాజ్యపదవీపరిపాలన చేసెఁగా మదిం
దలఁచుట యెంతయుం బ్రియము తమ్ములుఁ బుత్త్రులు బంధులుం బ్రధా
నులును బలంబు నేను సుమనోవిభుతుల్యుఁడ వైననిన్ను మి
క్కిలి యనుభక్తిఁ గొల్చి కృతకృత్యతఁ బొందుదు మట్లు చేయవే. 203

వ. అనిన నిని దరహసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె. 204

క. ఏను హవిష్యము కుడుతును, భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మేఁ
బూని వ్రతంబులు చలిపెడు, హానికి నిన్నియును నిట్లు వలయును చెప్పుమా. 205

ఆ. అనిన విరటుఁ డిట్టు లనియె నెత్తెఱంగున, నడవ నిష్ట మట్లు నడచి మీకు
మనసు వచ్చినన్నిదినములు సలుపుఁ డీచోట నదియ మాకు శోభనంబు. 206

క. [2]ద్యూతజ్ఞులదెసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లు కాక పెద్దల రగుమీ
రేతెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు తగ వసింపుఁడు నెమ్మిన్. 207

వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంతసంతుష్టాంతరంగుం జేసి. 208

చ. పొరిఁ బొరిఁ [3]బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించుఁ ద
త్పర మగుసద్వివేకములు భావనిరూపణ చేయుఁ గౌతుక
స్ఫురణఁ గరంబు తత్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్యవి
స్తరచతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితోన్. 209

వ. ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దానును దదీయ
సంభావనాతత్ప[4]రుఁ డై యుండె నంత. 210

### భీముఁడు వంటలవాఁడై విరటుఁ గొల్వ వచ్చుట

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము చంకఁ, దగిలించి సురియతో బిగియ ద్రిండు
గట్టిననుఁజేలకొ క్పెంతయును జెన్ను, చేయంగ దాపలిచేతియందు
బెడిదంపుఁగోలలు బెడఁగొంద బహువర్ణ, చిత్రితాజినము పైచీర కాఁగఁ
జూపతెల్లను దనరూపంబు చూడ్కికి, వ్రేఁగైన నత్యంతవిస్మయంబుఁ

తే. బొందుచుండ సమీరణపుత్త్రుఁ డగ్ర, జుండు పోయినదెసఁ దప్ప నొండువలన

---

1. వాహనములు భోజనములు వస్త్రములును, వలయు భోగంబులును నెల్ల వర్తనములు, నాకు నెట్లట్ల మీకును. 2. ద్యూతాదుల...వర్తించినఁ, జేతో. 3. బ్రీతికిం దగ స...ద, త్పరమతి స... జేర్చు వా. 4. రులై యుండి రంత. 5. కట్టెంత.

సమదవారణపతిగమనమున మత్స్య, ధరణివల్లభుసభ చేర నరుగుటయును. 211

వ. అంతం గనుంగొని. 212

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం
[1]డలఘుభుజవిపులవక్షః, స్థలరేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందున్. 213

వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 214

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచినప
ద్మహితుఁడో హిమకరుఁడో శచీ, గృహమేధియొ కాక యితఁడు కేవలనరుఁడే.

క. ఏమికులంబున వాఁడొకొ, నామం బెద్ది యగునొకొ నాభృత్యులలో
నీమనుజోత్తముఁ దొల్లియు, నే మెఱుఁగుదు ననఁగ నిచట నెవ్వరు గలరో.

క. అనుచుండ నతనిదూరం,బున కల్లన వచ్చి పవనపుత్త్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కి విన్న[2]వించె నిభృతుఁడై.

శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత నొందుమై నెఱుఁగ నీచిత్తంబునన్ [3]మెచ్చున
ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న
న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్భంగులం జూచినన్. 218

క. పేరు వలలుండు కూడుం, జీరయు నిడి సాకతంబు చేసినఁ జాలుం
గోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్. 219

చ. అనవుడు మత్స్యభూరమణుఁ డాతని కిట్లను నెట్లు శూద్రుఁ గా
[4]నినుఁ దలఁపంగ వచ్చు ధరణీభరణక్షమమూర్తి వీవు నీ
కనుగుణమైనయానమును నాసనమున్ రుచిరాతపత్త్రముం
జనవరికొల్వు నిచ్చెద గజవ్రజముం బరికింపు పెంపుతోన్. 220

క. అను[5]టయు మోఱకుచందం,బున మో మడ్డము గదల్చి భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁ డి, ట్లనియెం బ్రస్ఫుటనిరర్గళాలాపములన్. 221

ఉ. నా కవి యెల్ల నేల నరనాథులకుం బ్రియ మొందునట్లుగాఁ
బాకము చేయ నేర్తు జనపాలక ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండు బానసము చేయువిధంబున కిచ్చ [6]మెచ్చి పు
ణ్యాకరమూర్తి వైన నిను నాతనిఁ గొల్చినయట్ల కొల్చెదన్. 222

చ. వలసిన నేలు మేను బలవంతుఁడఁ గా రెనుఁబోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా
[7]దలమును లావు విద్య మెయి దర్పముఁ జేర్చి పెనంగు జెట్టిమ

---

1. డలఘుభుజు. 2. వించెం బ్రీతిన్. 3. వచ్చున,ట్లే; మెచ్చఁగా, నే. 4. నిను మదినమ్మ వచ్చు...జను పరిఁగొల్వు! జనవరికొల్వు. 5. టయును మొఱకు; టయుం వేఱొకచందం,బున మో మడ్డముగ వంచి. 6. మెచ్చుఁ బు,ణ్యా. 7. బలమును...బంటుతనంబునఁ జేర్చి జెట్టి.

ల్లుల విఱుతుఁ వడిఁ గడియలోనన చూడ్కికి వేడ్క చేయుదున్. 223

క. కొలువు[1]గొన నొల్ల కుండుట, కలిగినఁ బో మ్మనుట యంతకంటెను మే లే
వలసినకడ కేఁగెద నీ, తలఁ పెయ్యది యానతిమ్ము ధరణీనాథా. 224

వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా ని ట్లనియె. 225

ఉ. ఇమ్మహనీయరూప[2]మును నే త్తెఱఁ గన్గొని వేడ్క నీకు యో
గ్య మ్మగుభంగిఁ జెప్పితిమి కాని నరోత్తమ యొండు కాదు నీ
వెమ్మెయి నైన నిల్చుటయ యిష్టము వంటలమేరవాఁడ వై
యిమ్ముల నుండు సూదజన మెల్లను నీ దగుపంపు చేయఁగన్. 226

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కి మత్స్యమనుజాధీశుం
డనిలసుతు నేలె నాతఁడుఁ, దనమనమున నూఱడిల్లెఁ దదవసరమునన్. 227

అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట

సీ. కాళ్లయొప్పిద మాఁడుకట్టు నుజ్జ్వలము చే,యంగ సంకులబాహు లంద మెడలఁ
గంచుక మంగంబు కాంతికి మాటుగా, మెడ హేమపట్టిక మెఱయ కుండ
వదనంబుకొమరు భావనఁ జేసి వేఱుగా, నుదుటి[3] పెంపలకలఁ బొదువఁ బడఁగఁ
బవడంపుఁజొత్తులఁ జెవులరూ పడఁగంగఁ, బాపట తలకట్టుభంగి దప్ప

ఆ. మంచుమఱుఁగువడినమార్తాండుఁడునుబోలె,నీఱు కవిసియున్న నిప్పుఁబోలె
వేషధారి యైనవిష్ణుండుఁబోలె న, వ్విరటుకొలువు చేర నరుఁడు వచ్చె. 228

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా,జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. 229

వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు తనయొద్దివారలతో ని ట్లనియె. 230

మ. వనితావేషము కల్గియున్న యది చెల్వం బాఁడుచందంబు కా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వముఁ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁ డే నొకజగత్పూజ్యుండు క్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు కావలయు మీ రూహింపుఁ డా య ట్లగున్. 231

తే. అనినఁ బరిజనంబులు విస్మయంబు గదుర, నిశ్చయము చేసి పలుకంగ నేర్పు లేక
చూచుచుండఁగ నాసవ్యసాచి చేరఁ, జని విరాటనృపాలుతో సవినయముగ. 232

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు [4]నాట గఱపఁ గా నోపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృహన్నల యేఁ బేడి ననుడు నతఁ డి ట్లనియెన్. 233

ఉ. ఆయతబాహులుఁ వెడఁద యైనసమున్నతవక్షముం సరో
జాయతలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం
గాయజుఁ గ్రేణి సేయు ననఁ గౌశికు మీఱు ననంగ విభ్రమ

---

1. గొను మొల్ల. 2. మున కే......నిల్చుట యభీష్ట...సూపకరు లెల్లఁ. సూద జను లెల్ల. 3. సొం పలకల (ఁబొ) నొదుగఁ...భంగి గప్ప...నివుఱు. 4. నాట పాట గఱపుదు నోవి, ద్వ

శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు వేడ్కఁ జేసెనే. 234

శా. మత్తోద్దండచయంబులోన నొకసమ్మానార్హచాపంబు భా
స్వత్కాండంబులు [1]హేమచంద్రకకనద్వర్మంబు నీ కెంతయుఁ
సత్కారంబున నిచ్చి వాహనపరిష్కారాంకసంభావ్యసం
పత్కల్యాణునిఁ జేసి వైభవము దర్పంబుఁ విజృంభింపఁగన్. 235

క. ఏము నిను మత్స్యరాజ, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె నిది యెట్లొక్కో. 236

వ. అనిన విని యమ్మహీపతికి బృహన్నల యి ట్లనియె. 237

ఉ. ఆడుఁదనంబు నిక్కమున కారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి తప్పి యున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్యమై
వ్వాఁడును నేర్చునే తొలఁగ వైవఁగ నోర్వక పోవ వచ్చునే. 238

వ. కావున. 239

తే. ఒండుపనులకు నెలవు లే కునికిఁ జేసి, యభ్యసించితి శైశవ మాది గాఁగ
దండలాసకవిధమును గుండలియును, [2]ప్రేక్షణంబు తెఱంగును బేరణంబు. 240

క. వితతనాద్యంబులు మం, జుశ్రుతిసంభావ్యగీతసుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యర, సాశ్రయములు నైనయభినయంబు లెఱుఁగుదున్.

తే. ఇన్ని తెఱఁగుల శ్రమము చేయింతుఁ జతుర, తావిహీనము లైన పాత్రములు నైన
నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు, నిపుణ నైపథ్యవిధులకు నేర్తు నధిప. 242

చ. అనుడు విషణ్ణ మైనహృదయంబున గారవ మొంద నైపుణం
బున నుచితంబు మై నరసి పొచ్చెము లేమిఁ దదీయసేవఁ గై
కొనుటకు నిశ్చయించి తనకూఁతు విరాటుఁడు పిల్వఁ బుచ్చె న
ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్. 243

వ. ఇట్లు రావించిన. 244

సీ. అల్లదనంబున[3]యనువు మైకొనఁ జూచు, నడపు కాంతికి వింతతొడవు కాఁగ
వెడ వెడ నూఁగారు వింత యై యేర్పడఁ, దారనివళులలో నారు నిగుడ
నిట్టలఁ ద్రోచుచు నెలవులకలమేర, లెల్లను బిగి యెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు, తారకంబులఁ గల్కితనము తొడరఁ

ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు, జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపు చుండ నుత్తర చనుదెంచె, నలరువిలుతుపువ్వుటమ్ము వోలె. 245

ఆ. వచ్చికొలువుసొచ్చి నెచ్చెలిపిండు నం, తంత నిలువఁ బనిచి యల్లనల్ల
కదిసి ప్రౌఢవనిత కైవడి ముద్దియ, ముద్దు పుట్టఁ దనకు మ్రొక్కుటయును. 246

1. హేమచిత్రితలసద్వర్మం. 2. ప్రేంఖణంబు...ప్రేరణియుఁమ. 3. కనువు...బిగి యెక్కి.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షినె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరిం బొరి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పగుమృదుమౌళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. 247

వ. ఇవ్విధంబునం దనగాదిలికూఁతు నుపలాలించి బృహన్నలదెసం గనుంగొని సాదర
దరహాసితరుచిరాననుండై యిమ్మగువ నీకు నాటఁగఱపం దగుపాత్రం బగునేయని
యడిగి తత్ప్రీతివచనంబులయందలినాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధుర
సల్లాపంబునేసి కర్పూరసహితం బగుతాంబూలంబు పెట్టి చిత్రంబులగుచీనాంబ
రంబులిచ్చి మణిమయంబు లగునాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు.

ఆ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ, నప్పగింప నేల యైన నాదు
హృదయ[1]మతులు దీనియెడఁ గడు నార్ద్రమై, యుండుఁ గానఁ జెప్పకుండ రాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దనయిచ్చ నాడ మరిగినయది యై
విచ్చలవిడి నింతకుము, న్నిచ్చేడియ మెలఁగు శిక్ష యెఱుఁగదు సుమ్మీ. 250

ఆ. బాల కేళిమీఁదిభరము క్రమంబున, విడువఁ గళలయందు వేడ్క చొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవ కావె. 251

చ. అని యుచితంబుగాఁ బలికి యంగనహస్తముఁ బట్టి తత్కరం
బునఁ గదియించి నీగురువుఁ [2]బొల్తి తగం గొనియాడు మెట్లు చె
ప్పె నటుల భక్తిమై నడపు పెం పెసలారఁగఁ గూడుకూర చం
దనకుసుమాదులున్ నడపి తప్పక యారసి గారవింపుమీ. 252

ఆ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురువ యింక నొక్కకొఱఁతయు లేదిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున. 253

క. మనయింట నిచ్చ టచ్చో, టన కెచ్చట నైన నీబృహన్నల మెలఁగం
జనియెడుమానిసి తనమన,మున కిమ్మగునట్టి చరితమున వర్తించున్. 254

నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వ వచ్చుట

వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చినయనంత
రంబ నకులుండు. 255

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్నవిధంబునన్ వికా
సంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ నిజోజ్జ్వలాం
గంబున కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవయో
గంబున భూవిభుండు తురగంబులఁ దేరఁగఁ బంచి చూడఁగన్. 256

వ. ఆస్థానంబు చేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు
కనుంగొని పరిజనంబుల కతనిం జూపి. 257

---

1. మలరు. 2. బోటి.

క. ఇతఁ డెవ్వఁ డొకో, రూపు ని,రతిశయమై మనమునకుఁ బ్రియంబొసఁగెడుఁ జూ
చితిరే చిత్తంబు నుదా,త్తత గానఁగ నయ్యెడుఁ వదనమునభంగిన్. 258

క. తురగంబులఁ జూచువిధం, బరయఁగ నితఁ [1]డశ్వవిద్యయందు నిపుణతా
స్ఫురణము కలవాఁ డగు బం,ధురమూర్తి పరాక్రమాన్వితుఁడు గా నోపున్.

క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని,పే రెఱుఁగనియట్లు లైనఁ బెం పారంగాఁ
జేరం జని యల్లన యొకఁ, డారసి యెఱుఁగంగ వలయు ననుసమయమునన్. 260

క. చేరఁ జనుదెంచి పాండవ, వీరుఁడు మత్స్యాధిపునకు వినతుం డై దే
వా రాజవాహనము లగు, వారువముల నరయ నేర్తు వల నేర్పడఁగన్. 261

వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయం బయినవిచక్షణత్వం బెల్లనుం
గల దవధరింపు మని యి ట్లనియె. 262

సీ. అవయవలక్షణం బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితాకారములును
మాత్రాంతరము వయోమానంబు దేశకా,లోచితాహారప్రయోగభంగి
జాత్యనురూపశిక్షావిధి క్రమగతి, వ్యాయామ[2]సాత్మ్యప్రవర్తనంబు
ప్రమదవిషాదాదిబహువిధచిత్తధ,ర్మము పోషణప్రకారము చికిత్స

ఆ. పరిచితములు ధరణిపాల నీముందట, రూపురేఖ మెఱయఁ జూప నేర్తు
బవర మైన నాకుఁ బని యేమి యనఁ జేతి, బలిమికలిమి నెఱపఁ దలఁపు కలదు.

వ. అనిన విరాటుం డతని కి ట్లనియె. 264

క. నీకుఁ దగుపదవి యిచ్చెద, నాకలిమికి నెల్ల రక్షణం బొనరింపం
గాక హయశిక్ష[3]కుఁడ వగు, నాకొలఁదియె యిట్లు పలుకు టనుచిత మరయన్.

ఆ. అనుడు నకులుఁ డిట్టులను దేవ తమతమ, నేర్పుపనులవెంట నెగడి బ్రదుక
వలయుఁగాక [4]నగరఁ దలము తప్పిన మెలం,కువల కలుపు లియ్యకొనుటఁ దగునె.

ఉ. ధర్మసుతుండు పెంచె ననుఁ దాన తురంగమశాస్త్రశిక్షకుం
గర్మతఁ జేసి యాత్మతురగంబుల కెల్లను నన్న యుక్తుఁ గా
నర్మిలి నిల్పి యాగియుఁ బ్రియంబున నాయెడ నాఁటినాఁటికిం
బేర్మి వహించుచుండ నడపెం దనతమ్ములలోనివానిఁగాన్. 267

క. ఆవిభుఁడు రాజ్యసుఖలీ,లావిముఖత వెడలి బంధులం దొఱఁగి యథే
ష్టావాసత బ్రుంగుడువడి, పోవుట నెచ్చోటఁ గడుపుఁ బ్రోతునొ యనుచున్.

క. తిరిగి తిరిగి లోకోత్తర, చరితుఁడు సుజనుండు మత్స్యజనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ, గర మనురాగమునఁ గొలువఁగా నియ్యెడకున్.

క. చనుదెంచి కాంచి నానేర్చినతెఱఁగున విన్నపంబు చేసితి నన్నుం
బనిగొనఁ దలఁచిన నేలెడి, దనుమానము కలిగెనేని నరిగెద నధిపా. 270

1. దశ్వశిక్ష. 2. సత్వ; సాధ్య. 3. కుండ(న)ను. నా. 4. నగరె...కలుపు. (వ్రాఁత ప్రతులం దలుపు లనియ యున్నది.)

వ. అనవుడు. 271

ఉ. ఆనరనాథుఁ డిట్లనియె నశ్వములం బరికించి యున్కి యిం
పేని తురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడ నై తదీయనా
నానియతప్రకారకరణంబులఁ ద్రిమ్మరు చున్నవారి ము
న్నే నెటు లట్ల నీ వరసి యిచ్చమెయిం బనిగొమ్ము నెమ్మితోన్. 272

క. అని చెప్పి యధికసమ్మాననపూర్వముగాఁగ మత్స్యనరపతి మాద్రీ
తనయుఁ దగ నిల్పె నాతఁడు, తనమదిఁ బ్రియమంద నతనితమ్ముం డంతన్. 273

సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట

క. [1]భావన శాంతత్వము నిజభావంబున నూష్మలతయుఁ బ్రకటంబులు గా
నావిధుఁడు మనుజవేషం బై వచ్చెనొ శిఖి శరీరి యయ్యెనొ యనఁగన్. 274

క. [2]తలుగులపాది యొకదెసఁ బెయ్యలదామెన యొక్కవలన ననువై యుండన్
మొల మోపి పెక్కుచుట్లన్, బలు ద్రాటం జుట్టి గోపభావం బలరన్. 275

చ. నునుసెలగోల చేకొని మనోహర మై తనమేను రాజుచూ
పును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్రనిభంబు లైనలో
చనముల మూర్తి తెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్ల న
ల్లన వెడభీతి తోఁప జనులన్ వెగ డయ్యెడుదృష్టిఁ జూచుచున్. 276

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయావనతుం డగుచు ని ట్లనియె.

క. నీపసులఁ గావఁ బెట్టుము, [3]భూపాలక నన్ను నేను బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వొరు, చేపడ వెన్నఁడును దప్పిఁ జేడ్పడ వెచటన్. 278

తే. తొలఁగువో కుండ మెకములు గఱవ కుండఁ
బాఁడి తఱుఁగక యుండ నాపాటి గొల్ల
లిచ్చ [4]మెచ్చ నీదృష్టికి నెక్కఁ గదుపు
నరయ నేర్తు నన్నేలుము ధరణినాథ. 279

వ. అనిన విరాటుండు పాండవావరజున కి ట్లనియె. 280

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుక యేనియు లేదు నీదెసం
జక్కనిమేను నీగఱువచందముఁ గాంతియుఁ జూడ వచ్చినన్
నిక్కువ మీవు సూర్యశశినిర్మలవంశజు లైనరాజులం
దొక్కమహానుభావుతనయుండవు కావలయున్ నరోత్తమా. 281

ఆ. వలయుపదవియందు నిలిచి నారాజ్య మంతయును జక్కఁబెట్టి నయము విక్ర
మంబు నడపునంతమానిసి వై యుండి, కుచ్చితంపుబ్రదుకు కోరఁ దగునె. 282

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నిచ్చెద మత్స్యదేశంబున భవదభి
మతస్థలం బొసంగెద మదీయమండలసేనాపరిపాలనంబు చేసి వర్తిల్లుము. 283

---

1. పావనశాంత. 2. పలుపుల. 3. భూపతిలక ... జేడ్పడ వెందున్. 4. మెచ్చఁగ నీదృష్టి కెక్కఁ.

క. అనవుడుఁ బాండునృపాలక, తనయుఁడు మ్రొక్కుచు విరాటధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ, మును నాగరికంపుఁగార్యముల వెర వెఱుఁగన్. 284

ఆ. పసులఁ గాచి కాని బ్రదుకఁ [1]గౌరవుల ప్రాఁతలము మున్న నేను ధర్మపుత్త్రు
పశుగణంబు నెల్లఁ బాలింతు నమ్మహీ, వరునిచిత్తమునకు వచ్చువాఁడ. 285

వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురాణించుటం జేసి కొండొక
కాలంబున నీకడుపులం బెనుతు నే నగు నని కైకొనినయాఁబోతు పంచితంబు
మూర్కొనినను బైగాలివీచినను గొడ్డున కైనం జూలు నిలుచు నుంగిడి యదురుఁ
ద్రిక్క యనువానికి నాపేరు చెప్పినం జాలు మఱియును బసికి వలయు తెఱంగు
లెల్ల నెఱుంగుదు వే ఱొక్కపనికిం గాను గాని యే నీవెంట నీచునసు పడయం
జాలుదు నావలనం బ్రయోజనంబు కొనవలయు నేని నొండు మాటలు తక్కి
పసులం బరికింప నియోగింపుము. 286

చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ [2]డట్టుల కాక యంచు నా
తనివచనంబు చూచి యుచితం బగునేనిఁ బ్రియంబ యేని నె
ట్లును గురుకార్యవర్తనములున్ రుచియింపక యుండు నేని గో
ధనముల కెల్ల రక్షణముఁ దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 287

క. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని చేయన్
మన్ననమానిసి వై నీ, వున్నం గడు మేల కాక [3]యొప్పమి కలదే. 288

ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె న ట్లయ్యేవురును విరాటుం గొల్చిరి
తదనంతరంబ. 289

క. గారవమున నిజదేశా, చారము మై [4]నల్లి యున్న జడ యగుకబరీ
భారంబు విచ్చి తిరముగ, సైరంధ్రీజాతివేషసముచితభంగిన్. 290

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ [5]దుఱుము మిడి కుఱుమాపుఁ బుట్టం
బలవడఁ గట్టి జరఠవ, ల్కలమున నెవ్వేఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. 291

క. పరిచారికాత్వరేఖా, పరిణతి తనమేన నచ్చు [6]పడుభావనకుం
దిర మై తలకొనునంతగ, కరణముతోఁ బురము ద్రుపదకన్యక చొచ్చెన్. 292

వ. ఇట్లు చొచ్చిన. 293

సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱి నునుఁగాంతిఁ, గదలినయమృతాంశుకలయుఁబో లెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము తప్పి, చెలువు గుందినసరోజినివిధమున
ధూమంబు పొదివినఁ దుఱుఁగలి మెఱుఁగులు, నలఁగి మాసినదీపకళికపగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని, లావణ్య మెడలినలతికభంగి

1. ప్రాఁతలము నేము మున్న. 2. డట్టగుఁ గాక. 3. యొప్పగునదియున్. 4. నమరి...విచ్చి తుఱుముగ. 5. దుఱుముఱుకుఱుచ (లు)...జటావల్కల...నవ్వేఁగుఁజన్నుఁ; నునువిగువుఁజన్నుఁ. 6. పడ.

తే. గంధకారికావేషంబుకతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱువడి యుండఁ బాండు
తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజ,వీథిఁ బౌరజనంబు లవ్వేలఁ జూచి. 294

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్య[1]జాతియే
యీహరిణాక్షిచెల్వమున నేత్తెఱ చూడ్కులు నాఁచికోల కా
దా హితగౌరవం బగుశుభాంగముఁ దేజముఁ జూడ బుద్ధిసం
దేహముఁ బొందుచున్నది సతీజన మిట్టిదె యొజ్జగంబులన్. 295

వ. అనుచు నంతంతం జేరి. 296

క. నీ వెవ్వ రేమిపనికై, [2]యేవలనికిఁ బోవు చునికి యిది నావుడు న
ద్దేవియు సౌముఖ్యము సం,భావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్. 297

ఆ. ఏను గట్టువాలుదాన నా కెవ్వరు, కడుపుకూడు పెట్టి కట్టఁ జీర
యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకుఁ బనులు చేసి మెలఁగుబుద్ధి. 298

క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు [3]నడరెడుమదితో
నిచ్చెలువ కడుపుకూటికి, నెచ్చట నే నిలుచునట్టి యిది పలు కగునే. 299

వ. అనుచుం గనుంగొనుచు ముసరికొ(ని చ)ను చుండం బాంచాలరాజనందన రాజ
మందిరంబు చక్కటికి నరుగు నవసరంబున. 300

క. ముదమొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారా
స్పద మగునెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. 301

వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున. 302

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యెక్కకాంత రూ
పెక్కుడు పెంపుసొంపు మన కేర్పడుచున్నది తా వినీతయై
స్రుక్కుచు నీచభామినులచొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడుఁ
వెక్కస మంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. 303

క. అని పలికి పనుపఁ బ్రౌఢాంగన లిరువురు పోయి ద్రుపదకన్యకతో ని
ట్లనిరి విరాటుమహిషి నినుఁ, దనపాలికిఁ బిలువఁ బంపె దయ[4]పెం పెసఁగన్. 304

వ. అనవుడు. 305

క. [5]తనతలసీర యరసి య,వ్వనితారత్నంబు పినసువైభవము సతీ
తను వొందినచందంబునఁ, జనియెం గేకయసుతానుచారికలబడిన్. 306

---

1. మాత్రయే...గాచికోలు...సతీజను లిట్టిరె. 2. యేవలనం; యేవెటం...సద్భావంబును.
3. నందెడు; నలరెడు...నైన నిలుచునటె యిది తగ వగునే 4. చిగురొత్తన్.

5. తన పిలిచినపని యారసి 'తనతలఁపు నెరసె నని' అనియొకటిరెండు నూత్నముద్రితములు. 'తన తలసీర యరసి' అనునది మూలమున 'ఏకవాసనమ్' అని యుండుటచేతను, అందు మేలిముసుఁగు ప్రస్తావమే లేనందునను, తలసీరలోని సాదేశనిష్టముచేతను సమంజసము కాదఁట. 'అవ్యాక్షేప' న్యాయముచేఁ గూడ నిది బాగే కాని 'ఏకవాససం' అను నియతి 'వలపలిదిక్కునకు' అను పద్యముతో

వ. ఇవ్విధంబునం జని సౌధంబు నుపరిభాగం బెక్కి. 307

సీ. పదతలంబుల కెంపు పరఁగినతలము కుంకుమలిప్త మైనచందము వహింప
నంగంబు నునుఁగాంతి యడరినగోడలు, వేదులు మణిమయవిధము నొందఁ
గనుఁగవ మెఱుఁగులు [1]కదిరినముందర, పుష్పోపహారంబుపొలుపుఁ దాల్ప
వేనలికప్పు పర్వినమీఁదు నీలదుకూలంబు మేల్కట్టుకొమరు పడయఁ

తే. దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు, నింట నిమ్మెయిఁ గ్రొత్తయొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్ల నల్లఁ, బాండురాజతనూభవపత్ని యరిగె. 308

వ. కేకయరాజనందనయును. 309

చ. కనుఁగొని గౌరవంబున మొగంబునఁ గేలఁ బురఃప్రసారముం
దనువున నమ్రభావమును దంతమరీచుల సామినిర్గమం
బును దనలోఁ గడల్కొనఁగ భూరితరాదరరేఖ నిందు ర
మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ చేరి వినీతి నిల్చినన్. 310

క. ఆపాదమస్తకము తద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్
భూపాలమహిషి యిట్లను, నాపొలఁతుకతోడ నుచిత మయ్యెడుభంగిన్. 311

ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరి, దాన వేమిపనికిఁ బూని యిప్పు
[2]డెచటు బుద్ధిఁ దలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁ జెప్పుమాకు మెఱుఁగుఁబోఁడి.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను నేను సైరంధ్రీజాతిసంభూత నభిధానంబు మాలిని పురుషపంచకసనాథ నై యుండుదు నొక్క కారణంబున నుద్ధతు లగు విరోధుల చేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబున కరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిట మీఁద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు కొఱంత కలదు నీవు ధర్మవర్తిని వని వినుటం జేసి నా నేర్చుపనుల వెంట నీకడ నిలువందలంచి యిందు వచ్చితి ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

క. సురగరుడఖచరవిద్యాధరకిన్నరయక్షసిద్ధతరుణులలో నీ
వరయఁగ నొక్కత వగు దిప్పరికిం జనుదేరఁ గతము బొంకక చెప్పుమా. 314

క. అనుటయు దరహసితము మోమునకుఁ దొడవు కాఁగఁ బలుకు ముద్దియ యేఁ గృ
ష్ణనిదేవి సత్యభామకుఁ, బని సేయుదుఁ దొల్లి పిదపఁ బాంచాలికడన్. 315

తే. తగవుమైఁ బరిచారికాధర్మములకు, నెల్ల జాలి వర్తించితిఁ దల్లి వినుము
[3]నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న, కాఁగ భావించి యాదేవి గారవించు.

---

నగళితమగుటచేతను, సందర్భానుగుణ్యమునుబట్టియుఁ దలసీరలోనే యాచితి మెఱయుచున్న దని సూక్ష్మదృక్కులమతము. మఱియుఁ బంచమాశ్వాసమందలి 260 వచనములవలనను బరివస్త్రమున్నట్లు దృఢమగుచున్నది.

1. గదిరినముందల. 2. డెటకు బుద్ధిఁ; డెచట నుండఁ...నిగురుఁబోఁడి. 3. నాదు ప్రాణంబు.

వ. నీవును. 317

క. నీచము లయ్యెడుపనులకు, నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా
నీచిత్తంబునఁ గైకొని, యాచారము తప్పకుండ నరయుము నన్నున్. 318

వ. అని యిట్లు దేవజాతి యను సందియంబు పాయం బలికి మఱియును. 319

క. కలపములు కూర్ప బహువిధ,తిలకంబులు పెట్ట వింత తెఱువునఁ బలు[1]పు
వ్వులు గట్టి కట్టి ముద్దుగఁ, దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్. 320

మ. అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనుం
విను నీరూపము చూచి మాన్నృపతి యువ్విళ్లూరు నే నెమ్మెయిం
బనిగొందుం దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు భామా పల్కు లిం కేటికిన్. 321

క. దుర్భర యగునినుఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై
నిర్భరవిధ్వంసదశా,విర్భావము దెచ్చుకొనుట వెరవై యున్నే. 322

ఆ. అనిన నీతలంచినట్ల కా దేర్పడ, వినుము నాదుపతులు వెరవు లావు
నలఘువిక్రమంబుఁ గలుగుగంధర్వు లే,మఱియు నన్ను నొక్కమాత్రమైన. 323

క. నీచమతి నన్ను నెవ్వఁడు, చూచిన నారాత్రిలోనఁ జూతురు తెగఁ దా
రాచపలు హరిహరాదులు, కాచిన బలవిక్రమము లఖర్వము లైనన్. 324

క. బంధుశతంబులు శౌర్యమ,దాంధము లై శక్తిసంపదాభీలతమై
సింధురసదృశత నున్నను, సంధులసంధు లెడలించి చంపుదు రతనిన్. 325

వ. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు రదియునుం గాక. 326

క. నాచిత్తము తాదృశులకు, గోచరమే యస్మదీయకులజన[2]సంశి
క్షాచారమహిమ యట్టిది,యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్. 327

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పును భయభక్తులుం మెఱయ రూపుగఁ జేసెదఁ దజ్జ్ఞ లైనస
జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చఁ జల్పెదన్. 328

క. ననుఁ గుచ్ఛితంపుఁబనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక తగుమ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి [3]నడతు రస్మత్పతులున్. 329

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి, నూఱడిల్లఁ బలికి యునిచికొనియె
నంతిపురముచరిత కలవడ మెలఁగుచు, నుండె నవ్వధూటియును ముదమున. 330

క. ఇవ్విధమున నయ్యేవురు, నవ్వేఁడియు సకలజనుల కజ్ఞాతముగా
నవ్విరటుప్రోలఁ బ్రమదము, నివ్వటిల వసించి రుచితనిభృతత్వమునన్. 331

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపు మని యడిగిన.

---

1. పువ్వుల. 2. సంరక్షాచార. 3. కొలుతు.

ఉ. బాంధవశాత్రవాకలితభావభవా భవపాశ[1]బంధసం
బంధవిరామరామ పరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీరాత్మజ చైత్యమహాద్భుతప్రదా. 333

క. అన్నమయత్వాదివిరా,మోన్నత వాఙ్మనసదూర యోగిస్మేరా
[2]భిన్నాభిన్నాకార, చ్ఛన్నాత్మీయప్రకార జగదాధారా. 334

మాలిని.—

కమలభవకిరీట గ్రామపద్మావలీసం
గమసుభగపదాబ్జా గాఢ[3]భక్తిప్రకార
ప్రముదితమునిశశ్వద్భావనాగమ్యరమ్యా
క్రమపరిణతమూర్తీ శ్రౌతశాఖాగ్రవర్తీ. 335

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతమునందలి విరాటపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1. వల్లికా...ద్గ్రంథవిభేదనా...నిత్య, దైత్య మహాద్భుతప్రదా. 2. భిన్నాకారచ్ఛన్నా, చ్ఛన్నాత్మీయ (నిరూపించినచో రెండును తుల్యార్థకములే). 3. శక్తి.

శ్రీరస్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము—ద్వితీయాశ్వాసము

మదపాంగాలోకన
ధామసకృత్సంగరూఢతాదృశవిభవో
ద్దామాశ్రితలోకా లో
కామయనిర్హరణనిపుణ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబుల యుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధోదాత్త ప్రకారంబులఁ జలుపుచు నొక్కొక్కమాటు మధుర ప్రసంగంబుగా నాడిన నెత్తంబున గెలిచిన విత్తంబులు తమ్ముల కొసంగుచుండు వాయునందనుండు వంటకు మిగిలిన మాంసంబు లమ్మునెపంబున నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు వివ్వచ్చుండు సంగీత ప్రసంగంబున మెచ్చుపడసిన కనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు నకులుండు [1]దురంగంబుల గ్రాసంబులం గనినధనంబులు తోడంబుట్టువులకుఁ బెట్టుచుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లిన సమయంబున సముపార్జితంబు లగు పదార్థంబు లన్నియు నన్నలవశంబు చేయుచు వారలకు గోరసంబులం దుప్తి సలుపుచుండు ద్రౌపది త న్నరసికొని తిరుగుచున్న వీరలం గన్నులారం జూచుచు నుచితంపు నడవడి మెలంగుచుండు. 2

తే. ఇట్లు తమతమ వర్తిల్లునెడల సకల
జనములకు హృదయానురంజన మొనర్చి
తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు
నెఱతెఱంగు పాటింపంగ నేర్పు కలిగి. 3

క. ఉన్నతఱి వివిధ దేశోత్పన్నులు నద్భుతవిధాయి బలవిక్రమ సం
పన్నులు నగు మల్లులు విభవోన్నతుఁ డగు విరటుపాల నుద్భటవృత్తిన్. 4

1. దురంగప్రసంగంబులం.

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడువిశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన, సమమూర్తిస్ఫూర్తి యధికసంరంభమునన్. 5

వ. అన్నరపతి కట్టెదుర నిల్చి మ్రొక్కి భుజాస్ఫాలనంబు చేసి యి ట్లనియె. 6

తే. నేల నాలుగుచెఱఁగుల నృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ
[1]యగ్గలించి నాయెదుర బాహప్పళించి, [2]కడఁగఁ జాలెడుమల్లులఁ గాన నెందు. 7

చ. అనునెడ వాని యుగ్రసమదాకృతియుం బటువాక్యవృత్తియుం
గని విని మల్లు లెల్ల భయకంపితమూర్తులు తాల్చి మాఱు ప
ల్కను గను విచ్చిచూడను మొగం బెగయింపను జాల కున్న న
జ్జనపతివేడ్క మ్రోడుపడుచందము గాంచి యుధిష్ఠిరుం డనున్. 8

క. వీనికి మాఱొక్కనిఁ జాలెడు, దానికిఁ దగువాని ధర్మతనయుని పురిలో
నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి [3]నిపుణుఁ డిందుల కతఁడున్. 9

క. మన బానసీఁడు వలలుం, డను శూద్రుఁడు నాకుఁ దెల్ల మధికబలుల నో
ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు నిజ మిది యధిపా. 10

క. అనవుడు భూపతి పిలువం, బనిచె నతని నతఁడు నపుడ భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గముఁ, గని మై పెలుఁగంగ నిలిచెఁ గౌతూహలి యై. 11

వ. ఇట్లు నిలిచినపవనతనయు నవలోకించి యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూపి యితనితోడి యుద్ధంబునకు సన్నద్ధుండవు కమ్మనిన నతండును ధర్మతనయు కనుసన్న కనుంగొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో ని ట్లనియె. 12

తే. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని, వేడుకకుఁ దగఁ బెనఁగుదు వింతలైన
[4]జెట్టిమల్లులతో నిప్పు డట్టువోలె, నీదువేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు. 13

భీముఁడు మల్లునితో యుద్ధము చేయుంట

వ. అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబునం బ్రాంగణంబు చొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు చేసి మ్రొక్కి మరలునెడ నంతకు మున్న యమ్మల్లవరుండు నరపతి యనుమతి వడసి కృతపరికరబంధుం డై యరుగుదెంచి యచ్చట నునికిం జేసి యతండును ననిలసుతుండును బరస్పరమూర్తుల నవలోకించి యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదేశంబున ధరియించి శరీరంబులపైఁ జల్లుకొని రెండుచేతుల మునివ్రేళ్లను గొండొక పుచ్చికొని యొండొరుల దెసకు వైచి యున్నతంబు లగు నపసవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబుల నప్పళించుచప్పుళ్లు కలసి యొక్కరుండ మల్లసఱచిన చందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిపినయప్పుడు వృకోదరుండు. 14

---

1. యగ్గలించియుం బాహువు లప్ప; యగ్గలించి నాయెదుర చే యప్ప. 2. కడవఁ జాలెడు. 3. నిప్పు డిందుల నతఁడున్. 4. యట్టి...డట్టవోలె; జెట్టి...గూడ నట్టవోలె.

శ్రీ ర స్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము - తృతీయాశ్వాసము

శ్రీ
త్వశివాత్వాలంబన
తత్వాశ్లేషాత్తశబలతాసంగతక
ర్తృత్వాది[1]కలీలాత్తను
హత్త్వాహంకారభావ హరిహరనాథా. 1

### ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపం గొనిపోవుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ బవనతనయుం డట్లు చని మహానసమందిరంబు పరిసరంబున శరీరప్రక్షాళనంబు చేసికొని యనులేపనంబున [2]నసృగ్గంధం బుడిపికొని కృతకృత్యుండై శయ్యాతలంబునం గూర్చుండె నిట యాజ్ఞసేనియు భీమసేనుం డింతకు[3]వంటయింటికిం బోయి నిశ్చింతంబున నుండు నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నాపతు లగుగంధర్వుల, చే పడి మృతిఁ బొందె వీఁడె సింహబలుం డీ
పాపాత్ముని జూడుఁడు దు, ర్వ్యాపారఫలంబుఁ గాంచె నని పలుకుటయున్. 3

ఆ. వారు సంభ్రమించి వడిఁ[4] గోలదివియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁబాఱి
నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నాకల,కల మెఱింగి కీచకవ్రజంబు. 4

చ. [5]కడువెస వచ్చి రూపఱినకాయము నున్న తెఱంగుఁ జూచి బి
ట్టడలు మనంబులం గదిరి హా యనువారును జోద్యమంది మ్రా
న్పడియెడువారు నగ్రజునిపైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱచోఁ బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడం బాఱి కీచకశవంబుం గనుంగొని. 6

ఉ. మానవకోటి నిట్టి[6]విసుమానపుఁబీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట యాఱడి వమ్మయిపోయె దుర్జయం

---

1. విలాసమయమ (విలాసాత్తమ) హత్త్వాలంకార. 2. నస్ర(విస్ర)గంధం. 3. వంటకంబు నింటికిం. 4. గాలుదివియలు; దివ్వెకోలలు. 5. కడువడి. 6. కసుమాలపుఁ.

బైనబలంబు కానితెరు వై తన కిత్తటిఁ దోఁడు [1]కాద యు
క్కినమనంబు కీఁడు పరికించునె క్రొవ్విసఁ జేటు తప్పునే. 7

వ. అనుచు డాయం జని. 8

తే. కరము లెయ్యవి శిరమేది కాళ్లు లెచటఁ, జొచ్చె గంధర్వవరులచేఁ జచ్చువార
లెల్ల నిట్టుల యగుదురో యితనితోడి, యలుకఁ జేసిరో యిది కడు నక్కజంబు.

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేతస్కు లయి
యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి. 10

క. మన మెంత[2]పనవి పిలిచిన, విన నేర్చునె సింహబలుఁడు వేగమ యితనిం
గొనిపోవఁగ వలయుం గా, కని యందఱుఁ దేర్చె ననునయాలాపములన్. 11

ఉ. సూతులు దాని కియ్యకొనుచుం దమయన్నకు నగ్ని [3]యేర్చువా
రై తగ వాచరించునెడ[4]నల్లన ద్రౌపది వీరిచందముల్
చూతము గాక యంచు నొకచోఁ దమచేరువ నున్నఁ గాంచి సం
జాతమహోగ్రకోపు లయి చారువిలోచనఁ బట్టి క్రూరతన్. 12

క. పెడకేలు కట్టి పాపపుఁ, బొడ వగు నిది కాదె యితనిఁ బొడ వడఁగించెఁ
గెడకూడ దీని నీతని, యొడలిపయిం బెట్టి కాల్పు టుచితం బరయన్. 13

వ. అని విరాటున కెఱింగించి చేయువా రై యంతకు మున్న యీవృత్తాంతం
బంతయు విని సంక్షుభితహృదయుం డై యున్నయతనిపాలికిం బోయి. 14

తే. ఎల్లభంగుల సైరంధ్రి నేము సింహ,బలునితోఁ జంపువార మై తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పఁగ వచ్చితి మీవు నింత,వట్టుమన్నన మాకు నీవలయు ననిన. 15

వ. అతండును దనమనంబున నియ్యుపకీచకులచందంబు చూడ నేను వారించితినే
నియు నుడుగం గలవారు కా రని (యు గంధర్వులు బలవంతులు కావునఁ
దద్రక్షిత యైన సైరంధ్రి కపాయంబు పొంద దని) యు నూహించి వారలం
గలయం గనుంగొని యట్ల కాక మీకుం బోలిన తెఱంగు చేయుం డనిన నదియ
యనుమతిగాఁ గైకొని సరభసంబునం జనుచెంచి. 16

ఉ. అంగజరాగమత్తుఁ డగునన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతినే
యం గలవార మీజఱభి యాతనితోడన తీఱుఁ గాక యం
చుం గొనిపోయి [5]దైన్యమున సూతునిపీనుఁగుమీఁదఁ బాండుపు
త్రాంగనఁ బెట్టి కట్టిరి దయాపరి[6]వర్జితచిత్తవృత్తు లై. 17

చ. అశుచియుఁ గష్టుఁడుఁ లఘువు నైననిజాగ్రజుమేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జనునింతిఁ గొంచుఁ గ
ర్కశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవవిప్రలాపముల్

1. గాక. 2. పవరి పలికిన. 3. యిచ్చు. 4. నల్కక ద్రౌపది. 5. ధైర్యమున (హీనమగు).
6. వర్జితు లై రయంబునన్.

దిశ లద్రువం జెలంగఁ గరదీపనికాయము ప్రజ్వరిల్లఁగన్. 18

క. పితృవనముదెసకుఁ జన న,య్యతివ భయభ్రాంతచిత్త యై బాష్పజలో
ద్గతి మొగముఁ గప్ప ని ట్లని, యతిరావముగా నొనర్చె నాక్రందనమున్. 19

ఆ. అనద నైతి నిచట నాలికుయ్యాలింపుఁ, డకట మీరు కలుగ నాక్రమించి
నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక భంగపఱచు [1]వారు. 20

ఉ. ఆనతవైరి యోజయ మహోద్భుతవిక్రమ యోజయంత దు
ర్దానవిఘూర్ణమానరిపుమర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకటశూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబలజృంభణభంజన యోజయద్బలా. 21

సీ. [2]తొడఁగినపని చలం[3]బెడపక యతిదుష్కరం బైనఁ గడతేర్చుప్రభువులార
[4]పెనఁగిన వైవస్వతుని నైనఁ గడిమిమై, వ్రేల్మిడిఁ బరిమార్చువీరులార
శరణార్థి యగుదుష్టశాత్రవు నైనను, గరుణ రక్షించుసత్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు లైనను డాఁపక, తమకించి యిచ్చునుదారులార

తే. నాథులార గంధర్వరత్నంబులార, నన్ను నుపకీచకులు తమయన్నశవము
నందు బంధించికొని [5]వెస నరుగు చున్న,వారు రక్షింప వేగ రావలయు మీరు.

### భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట

చ. అని పలవించునయ్యెలుఁగు లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు [6]వీండ్రును గ్రమ్మఱ నింత చేసిరే
యనుచు సరోషసంభ్రమత నాయిత మై వెసఁ బాఱి వప్రలం
ఘన మొనరించె గుప్తముగ గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 23

తే. ఇట్లు లంఘించి పోయి పరేతభూమి,యొద్ద నలుదిక్కులును జూచి యొక్కయున్న
తావనీజంబు పెఱికి రౌద్రాతిరేక, మడర [7]భుజశిఖరంబునయం దమర్చి. 24

మ. వికటభ్రూకుటిఘోరఫాల[8]కలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం [9]బ్రమర్దనదశావిర్భావసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బక[10]విధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్. 25

వ. తదనంతరంబ. 26

ఆ. సూతుశవముతోడ నేతెంచు [11]నెరవులు, దవ్వుదవ్వులన యుదగ్రరూప
కలితుఁ డైనభీముఁ గనుఁగొని నడవక, నిలిచి రంత నంతఁ గలఁగఁ బాఱి. 27

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రిం కెట్లొక్కొ యంచున్ భయం

---

1. వారె. 2. తొడరిన. 3. బెడలక. 4. పెనకిన వైవ. 5. వీరె యరుగు. 6. వెండియు వీండ్రును. 7. నిజభుజశిఖరంబునం. 8. ఘటితస్వేదో (ద్గముం) ద్భవుండుం. 9, బ్రవర్ధనదశా. 10. విధ్వంసనుఁ. 11. కీచకుల్ (వారలు.)

బోదవం బల్లములందు డాఁగియు సమీపోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుం భరితసంక్షోభార్తులై రత్తఱిన్. 28

ఉ. సూతులు భీతులై ద్రుపదసూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము వైచి వీటికి దెసఁ బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ వ్రేసి యందఱం
జేతులతీఁట వో నుఱుము చేసె విశృంఖలవిక్రమంబునన్. 29

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుండై వచ్చి పాంచాలీబంధమోక్షంబు గావించి యింక నిశ్చింతంబున సుదేష్ణమందిరంబునకుం జను మని యవ్వెలందిఁ వీడుకొలిపి తానును వేఱొకమార్గంబున మహానస గృహంబున కరుగుదెంచెం దత్సమయంబున విరాటుండు కీచకానుజులు గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిం బొంది రని విని చకితచేతస్కుం డగుచు సహోదరమరణశోకాయత్తచిత్త యయినజీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యి ట్లనియె. 30

ఆ. చంద్రవదన యింక సైరంధ్రి నిచ్చోటు, పాప వలయు నేమిభంగి నైనఁ
గాన నాదుపలుకు గాఁ జెప్పు వెడలుట, కనుగుణముగ నమ్మృగాక్షితోడ. 31

ఆ. పురుషు లాలతాంగిపొరువునఁ బోయినఁ, జేటు వచ్చుఁ గానఁ జెప్ప నేను
వెఱతు నాఁడువార [1]వెరవుతో మృదువచో, రచనఁ జెప్పు టరయ నుచితవృత్తి.

ఉ. ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవగాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. 33

క. అని నిశ్చయించి పలికిన, విని కేకయరాజపుత్త్రి విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గైకొని యాపని యట్లచేఁతకుం బూనెఁ దగన్. 34

క. అంతం గుంతీనందన, కాంతాచింతామహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ, సంతమసం బనఁ బ్రభాతసమయం బయ్యెన్. 35

వ. పదంపడి పద్మినీప్రమోదసంపత్కరుం డగునరుణకిరణుం డుదయించె నటమున్న పాంచాలి సచేలస్నానంబు చేసి రాగాదివికారనిరాసనంబునం బ్రసన్న యయిన బుద్ధియుంబోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలివొంది మందమంద యానంబునం బురంబు చొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు. 36

సీ. మనకీచకుల కెల్ల మారియై పుట్టిన, సుదతి పోయెడు నని చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగదేఁ జూతు గా, కని తల చూపక యడఁగువారు

1. తెఱఁగుతో.

నలవోక గనుఁగొని యంతరంగము బిట్టు, [1]బెదర మాఱుమొగంబు పెట్టువారు
నెదురుగా వచ్చిన నెంతయేనియు దవ్వుఁ, గలుగ వేఱొకత్రోవఁ దొలఁగువారు
తే. ముట్టఁబడి మేనఁ గంపంబుపుట్ట నొదిఁగి, యుండువారుఁ గరంబున నుదరమప్ప
ళించి యమ్మరొ [2]రక్కాస యంచు నుల్ల, ములుకువారునై పురజనంబులు తలంకి.

చ. పులిఁ గనుఁగొన్న [3]లేడులునుబోలె విభీతిఁ గలంగఁ బాఱ న
న్నెలఁతుక యంతరంగమున నిండినహాస్యరసంబు మోముపై
వెలి విరియంగ నీక చని వేచి మహానసశాలవాఁకిటన్
నిలిచినభీమసేనుఁ గని నెయ్య మెసం జిగురొత్తు చుండఁగన్. 38

క. తనయంతన యటు పలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు చక్కనిమాడ్కిం
[4]గనుఁగొనక ద్రుపదనృపనం,దన యిట్లను నిజకృతార్థతం దెలుపుటకున్. 39

తే. కీచకులదెసఁ బుట్టిన కిల్బిషంబు, పాచి నన్ను రక్షించినపరమధర్మ
రతికి గంధర్వపతికి నిరంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకుదాన 40

వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుం డై యి ట్లనియె. 41

చ. అతివ యపాయముం బొరయునప్పుడు కావక తక్కనేని నా
పతి పతియె తలంప మగపాడియె లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట కదా భవదీయమనోనువర్తన
స్థితి [5]కుచితంబు వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్. 42

### ద్రౌపది యర్జునునితో సల్లాపంబు చేయుట

తే. ఇట్లు తమ్ము నిరూపింప నితరజనము,లకు నశక్యంబు కాఁగ సల్లాపరసము
ననుభవించుచు నల్లనల్లన లతాంగి, యరిగె నర్తనమండపోపాంతమునకు. 43

వ. చని విరాటకన్యకల యాటఁ జూచుచందంబున నందుఁ బురందరనందనుం గనుం
గొను నప్పాంచాలి నాలోకించి యతండునుం దానును దదభిముఖంబుగా వచ్చి
యక్కన్నియ లి ట్లనిరి. 44

ఉ. కీచకకోటిచేత నొకకీడును బొందక వచ్చితమ్మ ని
న్నేచినదుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ యంతఁ బో
కేచినసూతు లీయొడలి కింతయపాయ మొనర్తురమ్మ వే
కాచి విరోధులం దునుమఁ గా నిటు ముట్టుదురమ్మ నీపతుల్. 45

వ. అని తారు మున్ను విన్న కీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు
పలుకు చుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 46

క. ఆపాపాత్ముల నీచ, వ్యాపారక్రమము వార లందఱు మృత్యు

---

1. బెదరి. 2. రక్కసి. 3. బెళ్లగమిఁ (బోలెను) బోలెడి భీతిఁ (గలంగిపాఱ) గలంగుసాఱ.
4. గొన నీక ద్రుపదనందన, యనియె నిజకృతార్థవృత్తి యంతయుఁ దెలియన్. 5. యుచితంబు
వారికి. 6. వృత్తముల్.

ప్రాపితు లైన తెఱంగును, నీపలుకుల నెఱుఁగ వలయు నెలఁతుక [1]చెప్పుమా. 47

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కి ట్లనియె. 48

తే. కన్నియల కాట కఱపుచు నున్న నీకు, నకట సైరంధ్రి యిప్పు డేమయ్యె నేని
ఖేద మెద్ద నించుకయు లేమిఁ గాదె సస్మితాననంబుతో న న్నిట్టులడుగు టెల్ల. 49

వ. అనిన బృహన్నల యి ట్లనియె. 50

క. [2]నీ వలుగులఁబడుటకు దుఃఖావేశము [3]పొందెనే నిరర్థక మగుని
య్యేవపుఁబుట్టువు పుట్టిన, నావగ పెవ్వరికి నెక్కు నలినదళాక్షీ. 51

క. నీతోడిపరిచయము [4]లే,దే తలపోయఁగ ననింద్య వెందును నీ వి
ట్లాతుర వగుటకు నామది, నేతాపము లేదు నైజ మెఱుఁగవు కంటే. 52

వ. అని తాను నిజసహోదరుల యట్లపోలె వేషాంతరంబు తాల్చినయంతియ కాక యూర్వశి యిచ్చిన శాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు చేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవుగా కునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదనసూను పలుకులు విని పాంచాలి యంతస్స్మితకమనీయకపోల యగుచు ని ట్లనియె. 53

ఆ. అట్లు కాక యింత యన నేల నీమది, తెఱఁగు కొంత యేను నెఱుఁగ కున్న
దానఁ గాను నగరఁ దగవుమై నీవు వర్తించుటయ కరంబు ప్రియము నాకు. 54

వ. అనుచుం గన్యకాజనపరివృతయై యరిగి యంతఃపురంబు చొచ్చి సహోదరమరణశోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు. 55

సీ. ముదమున నెలమిసొంపాదవి నెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు, లడర నుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలిశము లగు చెయ్వులు, తొడర [6]జూచినఁ జేయ కుడిగి యుడిగి
[7]మనమున నుబ్బు మై మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక కడపి కడపి

తే. ధీరయై యిట్లు సమ్మదపూరమునకు, గఱువతన మనుబలితంపుఁగట్టు పెట్టి
వెలఁదియెఱుఁగనియదివో లెవికృతి లేక, యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.

క. భయశోకంబులు తనదుహృ,దయమునఁ [8]బిరిగొన విరాటధరణీనాథ
ప్రియ సంభావన చేసె వి,నయపూర్వము గాఁగ ద్రుపదనందనకుఁ దగన్. 57

వ. ఇట్లు సంభావించి యుత్తరుణిం దన పరిసరంబున నునిచికొని తదీయవదనం బవలోకించి. 58

తే. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ
దలఁచి భయ మంది నిన్ను నీవలచు నెడకు

---

1. మాకున్. 2. నీవు వగలఁ; నీ వలజడిఁ; నీ వలమటఁబడు. 3. నొంద నే. 4. లే, నేతల. 5. శోకాయత్తచిత్త యగు కేకయరాజనందనకడకుం. 6. వచ్చినఁ. 7. మదమున నుబ్బు; 8. బిరికొన.

నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె. 59

వ. అని తనమనంబునం గదిరిన యనుజవియోగతాపం బుత్కటం బగుటయుఁ వెండియు ని ట్లనియె. 60

క. [1]విరుదు గలమగలు కల రని, తరమిడి చంపింపఁ జూచెదవు జనములు నీ పొరువునఁ బో వెఱతురు మా, పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మందైనన్. 61

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యి ట్లనియె. 62

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబులమాత్ర కుర్వీ భవ
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లుదాత్తమతిం భవదీయవాంఛితం
బుం దలకొల్పఁ జాలుదు రపూర్వమనగ్రప్రమదంబు చేకుఱున్. 63

క. కృతమెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెపుడు [2]వదలరు కరుణా
న్వితు లినరపతికి శుభ, ప్రతిపాదకు లగుదు [3]రేమిభంగుల నైనన్. 64

వ. కావున. 65

క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ, [4]గారణము తలంప నేమిగా నోపునో యం
చారసి బహుప్రకారవి,చారములకుఁ జొచ్చు టుడుగు సరసిజవదనా. 66

క. ఇది యేమియైన నే మగు, మది నా [5]కీచింత యేల మన్ననయెల్లం
దుదిఁ జెఱుపక ప్రార్థనచే,యుదుఁ గా కని నిశ్చయించు [6]టుచితమె నీకున్. 67

చ. అనిన సుదేష్ణ యి ట్లనియె నం తపునంతకు మద్గృహంబునం
దునికికి సమ్మతించితి నిజోచితవృత్తిఁ జరింపు నాదునం
దనుల మదీయవల్లభు నుదాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల చేసెదం దగన్. 68

క. అని యాఁడిల్లఁ బలికిన, విని తొల్లిటియట్ల యుచితవృత్తి ద్రుపదనం
దన యుండె నట్టియెడ ని,ట్లని య్రాసిరి జనులు పురమునందును భూమిన్. 69

చ. విరటు మఱంది కీచకుఁడు విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బలగర్వసముద్ధతచిత్తుఁ డెందు నె
వ్వరు సరి లేరు వీని కన [7]వాలినదండిమగండు చూడ న
చ్చెరు వగుచావు చచ్చె నటు చేసినవా రట యెట్టివీరులో. 70

తే. సింహబలుఁడు గంధర్వులచేత నొక్క, సతికిఁగా నిట్లు ఘోరంపుఁజావు చచ్చె
నకట రిత్తకు రిత్త మత్స్యావనీశు, లావు కోల్పోయె సూతకులంబు పొలిసె. 71

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లు జనవాదంబు క్రమక్రమంబున సమస్తదేశంబుల [8]నెరసి చెల్లుచుండె నట్టియెడ. 72

---

1. విరుదు లగు. 2. వరగుణ. 3. రెన్నిభంగుల 4. గారణ (మిది యేమి యేమి) ము మఱేమి యైన. 5. కింతేల యనుచు. 6. టుచితము. 7. వ్రాలిన. 8. నెగసి.

### దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట

ఉ. పాతకి యై సుయోధనుఁడు పాండుతనూజులు చల్పుచున్న య
జ్ఞాత[1]విధివ్రతంబు కలుషంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచి మును వోయెడునప్పుడు చెప్పుకొన్న సం
కేతపుఁజోటఁ గూడఁబడి ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్. 73

వ. మగుడి వచ్చి హస్తిపురంబు చొత్తెంచి. 74

సీ. వరుస నేనుంగులు కురిసినదానధా,రావలి తగుకలయంపి కాఁగ
రాజులసందడి రాసినతొడవులు, మురిసి రాలిన పొడి మ్రుగ్గు కాఁగఁ
గాంతలసంకులగతిఁ ద్రెస్సి తొఱఁగిన,హారముల్ పుష్పోపహారములుగ
నే మేమ యని [2]యోలి నెత్తినపరదేశి,దొరలపావడములు తోరణముగ

తే. సహజ మైనయలంకారమహిమ నతిశ,యిల్లి మహనీయవైభవ మెసక మెసఁగ
వఱలునరపతిమందిరద్వారభూమి, చేర నరిగి యావేగులవారు ప్రీతి. 75

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 76

తే. ద్రోణగాంగేయభానుమత్సూనుకృపసు, శర్మ [3]దుశ్శాసనులు సర్వసైన్యపతులు
నార్యజనములుఁ గొలువ మహార్హ కాంచ,నోన్నతాసనమునఁ గొలువున్నవాని.

స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీమానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలస్థా
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీబాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాధకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్. 78

వ. కని జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు చేసి. 79

క. మొగిచిన చేతులు ముందల, [4]నిగిడించి నితాంతవినయనిరతిం జారుల్
తగ విన్నవించి రిట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్. 80

క. దేవరయానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్నయెడ యే మరయం
గా వెడలి వారు చనినము,హావిపినం[5]బులకుఁ దొలుత నరిగితిమి వెసన్. 81

వ. అందు. 82

ఆ. [6]పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గమంపుఁజోటు
దుర్గమంపుఁజోటు దొన దొన గుహగుహ, యాదిగాఁగ నెందు నరసి యరసి, 83

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పుఁ గాంచి దానివెంబడిం జని చని. 84

క. కేవలసూతులతోడన, పోవుట గని వానిఁ జేరఁ బోవక యవి యిం
కేవంకఁ బోవునొకో యను, భావనఁ బోయితిమి వానిపజ్జన యేమున్. 85

వ. అవియును ద్వారకానగరంబున కరిగిన. 86

క. అందుల నుండుదు రనునా,సం దెల్లము గాఁగఁ బెక్కుచందంబుల ము

---

1. వృథా. 2. యొగి. 3. గురుసుతశకునిదుశ్శాసనులును 4. నిగుడించి. 5. ఖనకు. 6. పరఁగ.

ట్టం దిరిగి తడవి కుంతీనందనులం గాన లేక నానాభంగిన్.

వ. వచ్చి పోయి సమస్తదేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొకయు నుపేక్ష
[1]వెరవుతోడిదకాఁ బరికించుచు బయలను నాలస్యంబు తక్కి యోలంబు
శోధించుచుఁ [2]గీడయిన నుదాసీనత యుడిగి మేలిచందంబునం భావించుచు వి
ప్రకారంబు లయినబహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థల
బునం గూడికొని మావర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట దివ్యచిత్తం
బున నవధరించినభంగి చేయువార మై చనుదెంచితిమి మాకుం జూడఁ బాండవుఁ
పొడవడంగి (లేక) పోయిరి గాని యీలోకంబున నునికి కలిగిన నగపడకుండఁ
నేర రిది యిక్కార్యంబు నున్నరూపు మఱియొక్కవిశేషంబునం బ్రియం బనఁ
వచ్చితిమి చిత్తగింపుము. 88

సీ. మత్స్యదేశాధీశుమఱఁదిఁ గీచకునిఁ బ్రభోజ్జ్వలాకృతి యగునొక్కవనిత
కతమున నడురేయి గంధర్వు లతిరహస్యప్రకారంబునఁ జంపి రదియు
నక్కజం బాయుధ[3]వ్యవహార మేమియు, లేదు శిరంబుకాళ్లేలు డొక్క
లోనికిఁ జొరఁ ద్రోచి పీనుంగు ముద్దగాఁ, జేసి వైచిరి దుష్టచిత్తు లైన
తే. యతనితమ్ముల నొక్కరి నైనఁ దప్పి, పోవ నీక యారాత్రియ పొడివి చిత్ర
నిహతిఁ దెగఁ జూచి యనిరూపణీయదుర్ని,వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర. 89

వ. [4]విరాటుండు పగతుండు కావునఁ దదీయవ్యసనం బెఱింగింప వలయు నని విన్న
వించితి మది యట్లుండెఁ బాండవుల నన్వేషించుపని [5]యిటమీఁదం జిత్తగించు
తెఱం గాన తిచ్చునది యనిన విని యట్ల చేయుదముగాక యని వారలఁ బోవం
బనిచి [6]కొంతసేపు చింతాక్రాంతుం డై యమ్మహీకాంతుండు మంత్రులం జూచి
యి ట్లనియె. 90

తే. సమయసముచితకృత్యంబు చక్కఁజేసి
పాండవులు రాజ్యమున కాస పడక మున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ బొంటి
యట్ల యిడుమలఁ గుడువఁ బో నడుపవలయు. 91

క. ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి, నెఱుఁగంగా వచ్చు మీర లెల్లను మీమీ
యొఱిఁగినచందంబున నా, కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగు తెఱంగుల్. 92

వ. అనిన రాధేయుం డి ట్లనియె. 93

ఆ. వివిధదుర్నిరూపవేషముల్ గైకొని, నిఖిలదిశలయందు నిపుణవృత్తి
[7]నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన [8]నెఱుఁగఁబడరె. 94

1. పరువు. 2. గీడు నుదాసీనతయునుడిగి. 3. వ్యాపార. 4. విరాటుండునుం బ్రతిభటుం డై భంగించుచుండుం గావునఁ దదీయ. 5. యిఁక మీఁదం. 6. కొండొక. 7. నేఁగునట్లుగా. 8. తెలియఁబడరె.

అనుపలుకులు విని దుశ్శాసనుఁ డేమియు సరకుగొనక [1]సమదవిలాసా
ననుఁ డై నిజాగ్రజన్మునిఁ, గనుఁగొని యి ట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. 95

చ. వలవదు రోయఁ బాండవుల [2]వారక యూఱట లేని త్రిమ్మటన్
బల మఱి వన్యసత్త్వములపాల్పడి చచ్చినచోటఁ బూరియు
న్మొలవదె యింత కిం కిట మనోమున మస్ఖలితంబు కాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం [3]గొనియాడు మున్నతిన్. 96

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డి ట్లనియె. 97

ఉ. క్షాత్రసమగ్రు లార్యనుతగౌరవదీప్తులు వర్ణనీయసౌ
భ్రాత్రు లుదాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లాపృథా
పుత్రులు వారి నాపదలు పొందునె [4]యోపిన నింక నైన నీ
ధాత్రిఁ గడంగి యారయువిధంబులు చెప్పుడు నేర్పు లేర్పడన్. 98

భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజుసుగుణంబులఁ జెప్పుట

వ. అనిన నాతనిమాట లాదరించి భీష్ముం డి ట్లనియె. 99

ఉ. నల్లవొ నిక్క మాడె నృపనందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారి బాహుబలధీబలదైవబలంబు లొప్పు వ
ర్తిల్లెడు నమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేల పా
టిల్లెడు వారిఁ [5]గాన్పను గడింది తదీయమహానుభావతన్. 100

క. వారలును వీరలును నా, కారయఁగా నొక్కరూప యైనను గార్యం
బీ రెఱిఁగింప వలయు నని, కౌరవపతి నన్ను నడిగెఁ గాన నితనికిన్. 101

క. కలరూ పెఱిఁగింపంగా, వలయుం జెప్పెద మదీయవచనములు హితం
బులు కాఁగ నిశ్చయస్థితిఁ, దలఁచి యనుష్ఠింప బుద్ధి [6]తలకొను నేనిన్. 102

సీ. బ్రాహ్మణభక్తియుఁ బరహిత[7]శక్తియు, నిర్మలమతియును నీతిరతియు
సత్యభాషణమును సాధుపోషణమును, జిరవితరణమును సేవ్యగుణము
సన్మార్గరక్షయు నున్మత్తశిక్షయు, నంచితోదయముఁ గృపాతిశయము
బంధుసంప్రీతియు భవ్యవిభూతియు, [8]శాస్త్రోపగమము నస్ఖలితదమము

తే. సజ్జనస్తవనీయసౌజన్యములును, ధర్మసంచితబహుధనధాన్యములును
గలుగు నక్షీణపుణ్యదోహలుఁడు ధర్మ, సూనుఁ డున్న దేశంబున మానవులకు. 03

క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెద నతనియున్న యెడ గోధనముల్
మెఱుఁ గెక్కి పాఁడి[9]నేమిం, గొఱఁతవడక యుండఁ జేపి కురియుచునుండున్. 104

వ. కావున నిట్టిదేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీతనయుల నరయం బనుప

---

1. సమ్మదలీలా; సమదవికాసా. 2. వారక యుడుక్కవ; యిక్కువ; యూఁకువ లేనిపిమ్మటన్. 3. గొనియేలు. 4. యొందును. 5. గాంచుట. 6. తారొక్కను. 7. యుక్తియు. 8. శాస్త్రా(ధి)గమము. 9. నేమిటఁ, గొ.

వలయు ననినఁ గృపాచార్యుం డిట్లనియె. 105

క. అరయఁగ నయ్యెడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి నాలస్యము లే
కరయునది పెక్కుభంగుల, నరసినఁ దోఁచెదరు కాక యది యట్లుండెన్. 106

ఉ. వారలు పూనినట్ల వనవాసము చల్పిరి [1]వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడనియట్లుగ [2]నుండెడువత్సరంబునుం
[3]జేరువచేరువల్ కడచెఁ జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కిన్నృపాలునెడ వీరికి నూరక యున్కి కర్జమే. 107

క. అలు చైనను బగతునిదెసఁ, దలఁపు కలుగ వలయు ననిన దర్పోజ్జ్వలదో
ర్బలు లగుకౌంతేయుల మన, మెలమికలిమి నచ్చి యిట్టు లేమఱ నగునే. 108

చ. మనబల మెంత యంతయును సమగ్రసముద్యమదుర్దమంబుగా
మునుమును గూర్చి తోడుపడుమూఁకలకుం దగుమైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి రాఁ బనిచి భూరిసముజ్జ్వలసైన్యజృంభణం
బున [4]నెర వొంది యున్కి కురుభూపతి కిప్పటికార్య మారయన్. 109

ఆ. పాండురాజసుతులు బాసమై నడవడి, గడచి కయ్యమునకుఁ గాలుద్రవ్వ
కున్న యట్టులైన [5]నన్నరనాథుతోఁ, సంధి చేయు టొప్పు సముచితముగ. 110

క. [6]ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం
బేచందంబునఁ దెఱఁగగు, నాచాలుట కోర్వవలయు నది యట్లుండెన్. 111

క. వారలు [7]లేరట పో పెఱ, వారలఁ దగుభంగి మనకు వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయు, కారణ మను టనుమతంబు కాదే మనకున్. 112

తే. ఇవ్విధంబునఁ దమతమయెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
తగ విచారించి కార్యంబు తెగువ కాంచి
యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. 113

ఆ. సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు, హలధరుఁడు సమానబలము వార
లొండొరులను గెలుచునుత్సాహమునుగల, [8]యుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. ఈనలువురభుజశక్తుల,తోఁ నెనయఁగఁ జాలునట్టిదోర్బల మెందుం
గానము కావున వీరల, లోనన యొండొరుల కని గెలుపు సమకూడున్. 115

ఉ. తక్కినవార లాతనికి దప్పుల చోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలునుద్ధతి మాన్చిన మాన్పు వాఁ డతం
డక్కఁడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపది కాఁగ నోపు వే

---

1. వైరు లేచి. 2. నుండిరి వత్సరం. 3. జేరువసేరువం. 4. వెర వొంది; నెఱి వొంది. 5. నిన్నర. 6. ఏచిన చలమునఁ బోరఁగఁ, జూచిన; ఏచి చలంబున నేఁటికిఁ. 7. వేఱ పో, 8. యు (ఉ) ద్ధతులు భుజాసమిద్ధబలులు.

త్రొక్కరుఁ డాజిఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. 116

క. గంధర్వు లను నెపంబున, నంధతమసఘోరవృత్తి ననిలసుతుఁడు గ
ర్వాంధమతి యైనసూతు స, బాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే. 117

వ. పితామహుండు పుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగి యుండు నని విందుము పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటుప్రోల వసియించినవారు కావలయు నతండును బ్రతిభటుం డయి భంగించు చుండుం గావున నతనిపయి నెత్తిపోయి తదీయగోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున మనము సమయభంగంబు చెప్పి వారలం గ్రమ్మఱఁ బండ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తమ యట్లైన నప్రతిహతంబుగాఁ జతు రంతభూచక్రంబాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము కుంతీనందను లందు లేక తక్కిన మత్స్యపతి సమస్తవస్తువులను జూఱగొంద మఱియును లాభంబ యొల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుం జూడఁబోలు నేని దీని కనురూపం బగునుద్యోగంబు చేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగుసుశర్మ తొలుతఁ గర్ణదుశ్శాసనులతోఁ గొండొక ప్రసంగించి వారలయనుమతి నవనీ పతితో ని ట్లనియె. 118

క. కేకయ[1]సాల్వులు తోడుగ, నాకీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం
జా కుండ మున్న యొక[2]పరి, నా కాతనితోడ భండనము లే దయ్యెన్. 119

ఉ. భంగముతోడ నున్ననను బంపు [3]విరాటునిమీఁద భూమికిం
జేఁగట నుండు నా వయినజీతపు[4]టూళ్లను సంతతంబు వా
నిం గడు గాసిచేయు నతని జెఱుపం దఱి యయ్యె ముట్టి స
ప్తాంగముఁ జూఱదెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 120

ఆ. ఉద్ధవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి యడ్డపడిన
చోటఁ బాండురాజసూనుల నరయుదు, నెల్లభంగి దీని కేన తగుదు. 121

వ. అనవుడుఁ గర్ణుం డి ట్లనియె. 122

క. బరవసముమైఁ ద్రిగర్తేశ్వరుఁ డి ట్లను టుచిత మింక జననాయకుఁ డె
ప్పరుసున నానతి యిచ్చెను, దొర లే మని రట్ల చేయఁ దుదిఁ గార్య మగున్.

చ. అను నినసూనుమాట విని యందఱుఁ గన్గొని పెద్ద లెల్ల ని
న్ననుమతి సేయ సైన్యముల నన్నిటిఁ బన్నఁగఁబంపు రండుపమై
ల నడత మీత్రిగర్తులబలంబుల ముంచటఁ [5]బంచి హానిపో
యినమఱునాఁడు పోద మనిరొం గురునాథుఁడు దుస్ససేనుతోన్. 124

చ. అనుటయు ఫాలభాగకలితాంజలి యై యతఁ డట్ల చేయు వాఁ

1. సాల్వరు. 2. మరి. 3. విరాటుని భూమిమీఁదికిం. 4. టూళ్లులు. 5. బుచ్చి.

డ ననిన మేదినీశుఁడు దృఢం బగునిశ్చయ మెల్లవారుఁ గై
కొనుటకుఁ గార్య[1]బోధమునకుం దగఁ [2]జుట్టల నున్నవారలం
గనుఁగొని యాదరాధికసగౌరవ[3]భావనతోడ ని ట్లనున్. 125

ఉ. మున్ను సుశర్మ తాను బలముం [4]జని గోవులఁ బట్టుఁ బట్టినన్
[5]వెన్నడి వచ్చు మత్స్యపృథివీపతి సేనల నెల్లఁ గొంచు శౌ
ర్యోన్నతి [6]చూపువాఁ డయి సముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
కొన్నిటిఁ బట్టఁ గయ్యమునకుం బఱతెంతురు పాండునందనుల్. 126

ఉ. కందువ చెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు [7]దాడికిఁ గూడువారు మీ
రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనల గూర్చుఁ డెల్ల వాఁ
డుం దనవారిఁ [8]దోకొని కడంకఁ రభసంబునఁ గూడి వార్తకుఁన్
[9]ముందర పోయి గోధనము ముట్టుకొనం బలయుక్తి మహోగ్రసేన. 127

వ. అని చెప్పి వెండియు సుశర్మం జూపి, 128

క. బహుళాష్టమి నీతఁడు సన్నహనముతోఁ బసులఁ బట్టు నవమిని మనగో
గ్రహణ మని నిశ్చయించిన,నహికేతనుపలుకులకు మహోల్లాసమునన్. 129

వ సమస్తపరిజనంబులును సముద్యుక్తులై రట్టిసమయంబున. 130

ఆ. పాండురాజసుతులుఁ బాంచాలియును దమ్ము,నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు
దుష్కరంపుఁ బేఁడు తుదిసేరఁ బాతె నెవ్వరును దీనిఁ [10]దలఁపవలను లేర. 131

## సుశర్మ దక్షిణగోగ్రహణంబు చేయుట

వ. సుశర్మయు నేలినవానిపనిఁ బూని జోడు పక్కెర కైదువు బిరుదు రవణంబు మొద లైనసవరణంబులం జూడ నక్కజంబుగాఁ గూడి పరదేశం బాపోశ నంబు గొనం దమకించుతనబలంబులగజిబిజి యుడిపికొని గోగణంబులయగపా టూహించి జతనంబుతో (న) నడచుచుండియు వెస కుందక వేగరంపుఁబయనంబు లయ్యును బ్రజల నోలాకుపడనీక యి త్తెఱఁగుచోట్లను విడిదలయందును లోనుగా నిస్సాణాదు లైనయున్నటచిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని వేగుల వారివలన విరాటుతోట్టు లున్నయెడ యెఱింగి గ్రద్దనం గదుపులఁ [11]గార్చిచ్చు చందంబునం బొదివి పెలిచిన, 132

శా. కూడం బాఱెసముద్ధతిఁ గడఁగి తద్గోపాలకుల్ మూఁక ల
ల్లాడం దాఁకి నిశాతసాయకపటువ్యాపారఘోరంబుగా
నీడం బోక పెనంగినం గని త్రిగర్తేశుండు చే వీచుడుం
గ్రీడాఘాతనిరూఢి నాశ్వికులు వారిం దున్మి తూఁటాడినన్. 133

---

1. భార. 2. జుట్లను. 3. భావలతోడ. 4. గొని. 5. వెన్నడి వచ్చి. 6. చూపువాఁ డటు. 7. దాడిగఁ. 8. దోడ్కొని. 9. ముందుగఁ బోయి. 10. దలఁప వెరవు లేర; పలఁప వలను లేదు, దలఁచువారు లేర. 11. గాంతారంబుఁ గార్చిచ్చుపొదువుచందంబున.

వ. [1]వారలలోన. 134

చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱచై పారి నెత్తురు క్రమ్ముపోటులన్
వస మఱి తూలు చుండియును వారనిభీతిఁ బదంబులం గదున్
[2]వెస కలిమిం బురంబునకు వేగమె కొందఱు పాఱి మత్స్యనా
థుసభకు నేఁగి దీనదశతోఁ బ్రణమిల్లుచు నార్తమూర్తులై. 135

క. కారణ మెయ్యది యగునో, వీరలదురవస్థ కనుచు [3]వెఱఁగందెడు నా
భూరమణుఁడు సభయును విన, నీరెలుఁగు తలంకఁ బల్కి రిట్లని గోపుల్. 136

చ. హయరథదంతిసంతతి నిరంతరదుర్దమలీలఁ జేర్చి నే
ల యవిసి మూఁగిన ట్లగుబలంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్
రయమున గోవులం బొదివి రక్షకు లొక్కట నార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటుపాతపరంపరఁ దున్మి యుద్ధతిన్. 137

క. గోవులకు వెనుక నై వెసఁ, బోవుచు నున్నారు కడవఁ బోవక యుండం
బో వలయు నడ్డపడియెడు, దీవస[4]మెదఁ గలిగెనేని దేవర కడఁకన్. 138

వ. అనిన విని విరాటుం డగరిపడి. 139

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలు మే
లామై తోడనె పోవుఁ గాక యని వీరాలాపముల్ పల్కి యు
ద్దామక్రోధశిఖాకలాపవికటోద్యద్భ్రూకుటిస్ఫూర్తి యై. 140

విరటుఁడు సుశర్మమీఁద యుద్ధము చేయఁ బోవుట

చ. సచివులఁ జూచి యిప్పుడ వెసన్ మన [5]మెద్దిక తక్కినం బశు
ప్రచయము తప్పి పోవుఁ దుది భంగము నేఁగియు వచ్చుఁ గాన మీ
రుచితవిధాన [6]సత్వరత నుద్ధతయోధసమగ్రవాహినీ
ప్రచలితభూమి[7]భాగముగఁ బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్. 141

వ. అని నియోగించి. 142

శా. యానప్రక్రమసూచకంబు లగుతూర్యంబుల్ దిశాపాటన
ధ్యానస్వైరవిహారకల్పితసముద్రక్షోభముల్ గా ధరి
త్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ
[8]ర్తానీతిక్రమచతురులం బనిచె నయ్యైవారికిం గ్రక్కునన్. 143

ఉ. సారథిఁ జూచి నీవు రభసంబునఁ బూన్పుము ఘోటకంబులం
దేరఁ దదీయవర్మము లతిస్ఫుట[9]బంధముగాఁగఁ బెట్టు నీ
వీరవచోవిలాసములు విందుము మున్నిదె వచ్చెఁ గయ్య మే

---

1. వారలాలోన. 2. వెస కడిమిం. 3. వెగడొందెడు. 4. మేత్తెఱయుఁ గలుగు. 5. మేఁగక. 6. తత్పరత. 7. భాగమునఁ. 8. ర్తానీక క్రమదక్షులం. 9. బద్ధము.

పారఁగఁ జూపు నీ దగునహంకృతికిం దగు ధైర్య మియ్యెడన్. 144

వ. అని పనిచి తానును యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసి కొని ఖచితకాంచనబిందు[1]సందోహం బగుసన్నాహంబు పెట్టికొని విరచితాలంకార చక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును [2]బ్రతికల్పితతురంగం బును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నై నరథం బెక్కి గోగణ హరణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మత్స్యపతి యనుజన్ముండు. 145

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనాలుంటాకబాహాబల
శ్రీకల్మిఁ రథదంతిఘోటకభటశ్రేణీసముద్దాంతసే
నా[3]కల్పధ్వజవిభ్రమంబున సుహృద్యప్రోద్యముం డై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్. 146

ఉ. ఆతనితమ్ముఁ డైన [4]మదిరాశ్వుఁడు కర్ణఝళంఝళాసము
ద్ధూతబలోత్థరేణుపరిధూసరితాంబర మైనవారణ
వ్రాతము గొల్చి రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వలహేమవర్మని
ర్యాతరుచిచ్ఛటాపటలరంజితహేతిమహోగ్రసైన్యుఁ డై. 147

తే. అతనియనుజుండు సూర్యదత్తాహ్వయుండు, సమదసైనికనానాస్త్రశస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహతదినకరాంశు, రాజియై చనుదెంచె సంరంభ మెసఁగ. 148

తే. తెల్లనిజోడు పెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు వైరిమచాపహవిక్రమ[5]ప్రకా
రోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ [6]గొల్చుమృగేంద్రరేఖ శో
భిల్లుచు నుండ [7]శంఖుఁడు విభీషణశంఖనినాద మొప్పఁగన్. 149

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢులై గాఢసన్నాహంబు లగు నిజవ్యూహంబులతో నేతెంచు చుండిరి విరాటుండు బలంబులం గూర్చికొను తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మ తనయుం డనిలతనయమాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుం డని నిపుణం బుగా నియోగించి తానును మత్స్యమహీవల్లభునల్లనఁ జేరి యిట్లనియె. 150

చ. ఒకఋషిచేత నాయుధసముత్కర మెల్లను [8]సప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱ యైనవాఁడ గో
ప్రకరముల౯ మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం

1. సందోహసుందరం బగు (సన్నాహంబు) పై మఱువు వెట్టికొని విరచితవీరపతాలంకార.
2. బ్రకల్పిత. 3. కల్పోజ్జ్వలవి (భ్ర)క్రమంబున మహోద్యతోప్రోద్యముం డై. 4. మదిరా(స్యుఁ)
డుఁడు. 5. ప్రభా,వోల్లసితుం (ప్రకా,శోల్లసితుం) డసంఖ్యబల. 6. గొల్వ మృగేంద్రరేఖ.
7. శంఖుఁ డరిభీషణ. 8. సంప్రయోగ.

టికడన యున్కి పాడియె ఘటింపఁగఁ బంపు రథంబు చయ్యనన్. 151

క. అనిన విని యియ్యకొనున, మ్మనుజాధీశ్వరునితోడ మఱియు నతం డి
ట్లనుఁ బవనతనయుఁ గవలం, గొని సమరంబునకుఁ బోవఁ గోరెడుమదితోన్. 152

సీ. మనవలలుండు లావునఁబంటుతనమున, జను లెఱుంగఁగ నడిసన్న వాఁడు
మంచిమగండు దామగ్రంథి యసమసం,గ్రామకేళీగాఢకౌతుకుండు
వినుము తంత్రీపాలుఁడును దుర్దమారాతి,మర్దనచాతుర్యమహితభుజుఁడు
మున్నును వీరలు మువ్వురకడఁకల,కోలఁదు లే నెఱుఁగుదుఁ గొంతకొంత

తే. యెక్కుడగునట్టియరదంబు లిచ్చి వీరి, ననికిఁ దోకొని పోక కార్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీశుండు హర్ష,నిర్భరాత్మకుఁ డై శతానీకుఁ జూచి. 153

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూపి యి ట్లనియె. 154

మ. రథముల్ మంచివి కాఁగ నాలు[1]గతిశీఘ్రవ్యాప్తిపర్వంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సంగ్రామార్హచాపంబు ల
శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీలాదక్షతల్ మన్ననో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్గర్వం బఖర్వంబుగన్. 155

వ. అనిన నతం డట్ల చేయుదు నని వారలం దోడ్కొని చని సమస్తంబును సన్నద్ధంబు గావించి యంగరాగమాల్యాంబరాభరణంబుల నలంకృతులం జేసినం గైకొని తమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి రథంబులు తోలికొని చను దెంచిరి తదనంతరంబ. 156

సీ. గంధదంతావళకర్ణమారుతహతిఁ, గాంతారములు చాఁపకట్టు పడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చునద్రులు, భయమున వాపోవుభంగి నుండఁ
దురగఖురోద్ధూతధూళి [2]త స్వైరసిన, వననిధి పిండలివండు కాఁగ
బహుళపదాతిదుర్భరభార మడరిన, నురగకూర్మంబు లొండొంటిఁ బొంద

తే. సైన్యముల నడపించె నుత్సాహలీల, యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప
బరవసము మిక్కుటంబుగఁ బసులు సన్న,జాడఁ గైకొని యమ్మత్స్యజనవిభుండు.

వ. ఇట్లు చని కూడ ముట్టిన. 158

క. విరటుబలంబుఁ ద్రిగర్తే,శ్వరుబలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయం
కరనాదమేదురము లగు, శరనిధు లొండొంటిఁ దాఁకుచందం బమరన్. 159

మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవక్షోభంబునుం గింకిణీ
క్వణన[3]వ్యావృతహేషితస్వనములుల్ ఘంటానినాదా త్త[4]ఘో
షణనానాపటుబృంహితధ్వనియు శశ్వద్గాఢ మై పేర్చినన్
రణనం బించుక [5]తోఁప లేడ బహుతూర్యశ్రేణి నాసేనలన్. 160

1. వతి. 2. ద న్పొరసిన. 3. వ్యాపి(వృ)త. 4. ఘోషణ. 5. దోఁప దయ్యె బహు.

### విరాటసుశర్మలసైన్యంబు సంకులంబుగాఁ బోరుట

వ. అట్టిసమయంబున. 161

సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును, జిందముల్ పొడిపొడి చేయునవియు
గట్టిమై మలువులు దట్టముల్ గావించు,నవియును *నెఱసు నో నాడునవియు
[1]నెట్టుపైఁ బడిమేని [2]నెగయించునవియును, దల నేల డొల్లంగఁ దాఁకునవియు
[3]నిరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱునవియును, నలువుర నేవుర నాటునవియు

తే. నైనశరములు [4]కనుఁగొని యాడి యాడి, నారదుఁడు పిచ్చలింపంగ వీరకేళి
సలిపె నుద్ధతిమై ధనుర్బలము లడరి, లావు వెరవును నెఱయఁ జలంబు మెఱయ.

వ. అప్పుడు సుభటులు కడంగి. 163

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక [5]యమ్ము సెంపునం
బోటులవాతఁ బోవుభటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్
వ్రేటులఁ గ్రీడ సల్పి పృథివిం బడువీరులఁ ద్రొక్కికొంచు నె
చ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱు చేయుచున్. 164

సీ. ఒక్కఁడు పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ, బొదివి [6]చెఱ్ఱొకపోటు పొడుచునెడలుఁ
బలువు రొక్కనిమీఁదఁ [7]బఱపిన సైరించి, నళికి పైఁబెట్టక నిలుచునెడలు
దళము దళంబుతోఁ దాఁకి యగ్గలికమై, నీడఁ బోవక వ్రేటులాడునెడలు
నోహారిసాహారి నుయ్యాలచేరుగా, వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగునెడలు

ఆ. నైన యనేకభంగి నాశ్వికసేనలు, బొమ్మ లాడినట్లు పోరుచుండె
నమరగణము సిద్ధసమితియు వేడుకఁ, జదల నిలిచి చూచి సంస్తుతింప. 165

వ. ఒక్కయెడ. 166

ఉ. ఒండొరు మీఱుకోర్కిమెయి నొక్కట [8]బాసలవారు చొచ్చినన్
రెం డయి పాయ యిచ్చినయరిప్రకరంబులు వేఱువేఱ యు
ద్దండభుజాబలం బలరఁ దాఁకిన [9]సంగడిఁ బోఱు చుండఁగా
గం డమరంగ నిల్చి చెలికాండ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్. 167

సీ. కరశీకరంబులఁ గరటగళద్దాన,తోయంబులును ధరాధూళి మ్రింగఁ
[10]బొడవులసడి సన్న [11]యొడళుల దెంచ,నమ్ములపెంపు గగనంబు గొలఁదిపెట్ట
బృంహితధ్వనులును బృథులఘంటావలీ,రవములు దిక్కుల నవులఁ ద్రోవ
రోషారుణాక్షులరుచులును సిందూర,కాంతియు రవిదీప్తిఁ గ్రమ్మఱింప

తే. జోదులొక్కట వాలంపసోనగురియ, రౌద్రరసమాకృతులఁ దాల్చి రణమొనర్చు

---

* నెఱఁకు. 1. నేటు. 2. నెరయించు. 3. (నిరుమేను లుచ్చి) నిరుమెయి గెలిచి బెట్టిలఁ దూలు. 4. గైకొని. 5. యమ్ము పెంపునం, బోటులచేతఁ. 6. ఛెట్టొక (వే ఱొక). 7. బఱపిన సైరించి యలమి; బఱివిసైరించిన (నలఁగి)నలమి పైఁ. 8. బాసటవారు. 9. సందడిఁ బోరు చుండఁగా. 10. బొడువుల. 11. యొడళులఁ (దెంచి యమ్ముల) డెక్కియమ్ముల.

కరటి నత్యుగ్రముగఁ గరిఘటలు కడఁగి, కలను పీనుంగు పెంటగాఁ గలయఁ బరసె,

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుతసంపద నొందు శక్తులుం
జిక్కని మేనులుం గొమనకుఁ జెల్వగు కైదువులుం [1]దగంగ ను
క్కెక్కినయట్టి మేటిమగ లించుక వారణ లేక ఖేచరు
లొక్కస మంద నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. 169

సీ. నొగనొగతోఁ దాఁకి [2]పగులంగ నరదంబుఁ, బఱపి యా తేరిపైఁ గుఱుకువారు
రథ్యముల్ పడ్డ విరథు లయ్యు నసిముద్గ,రాదుల నడరి పోరాడువారు
[3]సారథి నొచ్చినఁ దేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు చేయువారు
నరదంబుపైఁ ద్రాలి యాలోనఁ దెలిసి త, న్నేసినాతనిఁ బడ నేయువారు

తే. నగుచు రథికనికా[4]యంబు లడరి యప్రమత్తనిజచిత్తవృత్తులై మగతనంబు
ఘోరమూర్తులు కైకొని పోరునట్లు, చలిపె సంగ్రామకేళి సంకులము కాఁగ.

వ. ఇట్లిరువాఁగును నరవాయిగొనక పెనంగుచుండ. 171

ఉ. భీకరబాణవర్షముల పెల్లున వైరులు [5]పెల్లగిల్ల వకా
రీకృతగర్జితంబు పృథివీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతి కల్పసంక్షయమహాభ్రముచందము నొందుచుం శతా
నీకుఁడు తాఁ కెంగంకటమణిద్యుతి విద్యుదుపాంతకాంతి నై. 172

తే. అతఁడు నానాప్రకారశస్త్రాస్త్రనిహతి, నతులవిక్రమవిభవ ఘనర్గళముగ
యోధసారథియుగ్యసంయుతము కాఁగ, నూఱు రథములు వ్రేల్మిడి నుగ్గు చేసె. 173

మ. *మదిరాశ్వుండును కడంగి యన్నకు బలోత్సాదంబు [6]రెట్టింప స
ప్రదరజ్వాలతికాక్రియాసమధిఘోరక్రీడనం బప్పు డొ
ప్పిద మై యోగవియోగసంధులు నిరూపింపంగ రాకుండఁ గ
ర్ణదళోపాంతము వింతసేయ నడరెం [7]రౌద్రంబు శోభిల్లఁగన్. 174

క. అడరి వడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వం బై యే
ర్పడఁ గరిహయనరనికరము, బడలుపడం దఱిమె నలి నఖచ్ఛరు లార్వన. 175

ఉ. మండలచారియై రథ మమానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథితంబుగ నత్తఱిఁ దాఁకి సూర్యద
త్తుం డనివార్యశౌర్యగుణధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే
దండఘటావిపాటనవిదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 176

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ [8]బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రములయుల్లసనంబున శత్రునేత్రముల్

---

1. జెలంగ. 2. పగుల బెట్టిదముగా; పగులంగ బెట్టుగా (పగులంగ బెడిదంబు). 3. సారథి చచ్చినఁ. 4. యంబు లప్రమత్త. మహితనిజచిత్త. 5. దల్లడిల్ల. * 'మదిరాశ్వుండు' సం. భా. 6. సిద్ధింప (స)సం, ప్రదర. 7. రౌద్రం బుదగ్రంబుగన్. 8. రయంబున.

కప్పఁగఁ జీఁకటుల్ రణముఖంబు సమస్తముఁ దానయై రథం
బుప్పరవీధిఁ దోలికొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 177

తే. మందరాచలచటులవిమర్దనమున, ఘూర్ణమానయై గాఢసంక్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు, బలము తిరుగుడుపడియె సంకులము కాఁగ.

వ. అయ్యవసరంబునం దక్కిన దొరలును దలపడి యతి[1]భీమంబుగా సంగ్రామంబు చేయం దొడంగిన. 179

చ. అనుజతనూజమంత్రిసుభటాప్తజనంబులపోరు చూచి నె
మ్మనమునఁ బొంగి మై పెనిచి మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని [2]యల్ల కంటె మొనఁ గ్రాలుచు నున్నత్రిగర్తనాథు[3]కే
తనమునచక్కటికిన్ మనరథంబు వెసం జన నిమ్ము నావుడున్. 180

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి [4]పటురయమున నా
మొగ్గరము తఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపుచేన్. 181

మ. అవనీనాయకుఁ జూచి యేచి [5]నలి వీరావేశ దుర్దాంతమై
కవిసెం[6]గుంతభుశుండితోమరగదాఖడ్గాదిశస్త్రాస్త్రతీ
వ్రవిహారంబు విరోధిదుర్విషహసంరంభంబుగా నొక్క పె
ట్ట వడిం దద్బల మెల్ల నారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. 182

వ. ఇవ్విధంబున విరాటుండు తానును సేనయుం జేయంగలవారును బరవసంబు చేసి యొక్కుమ్మడి నడరుటయుం దెరలి మరలిన నిజసైన్యంబు దైన్యంబు కలయం గనుంగొని కోపాటోపంబునం గెంపు కదురులోచనంబులుం [7]బెంపొలయు భుజశిఖరంబులుం గలిగి సుశర్మ తానుం దమ్ముండును సంగడంబుగాఁ గోల్తల నేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని. 183

క. బలవిక్రమములు మెఱయఁగఁ, దలపడి రథదంతిహయపదాతిచయంబుల్
[8]కలను సుడివడఁగఁ దామర,కొల నేనుఁగు చొచ్చినట్లు [9]గురుపుగఁ జొచ్చెన్. 184

ఉ. ఏలినవానిఁ గాంచి మొన లెల్లను నెంతయు దర్ప మెక్క యా
భీలనిశాతహేతిరుచి భీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ బేర్చి యా సమి
త్కేళి వియచ్చరప్రతతికిన్ వెఱఁ[10]గందఁగఁ జేసె నెంతయున్. 185

తే. కడిమి[11]మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు,రథముఁ గనుఁగొని కడఁగి విరాటవిభుఁడు
[12]వరపునకు నల్గినట్టుల సరకుగొనక, యతులరభసాతిరేకత నతనిఁ దాఁకె. 186

---

1. భీషణంబు. 2. యల్లగట్టి. 3. కేతనమునకై రథంబు వెస దండడిఁబోవఁగ నిమ్ము నావుడున్. 4. బలిమి మెఱయ. 5. ఘన. 6. గుంతముసుండి. 7. బలు పొలయు. 8. కలఁగి. 9. గూల్పఁగఁ జొచ్చెన్. 10. బొందఁగ. 11. మెఱయంగ. 12. పరువునకు.

### విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట

వ. ఇట్లు తలపడి. 187

మ. పటువేగం బగుశాతభల్లచయసంపాతంబునన్ మింట మి
క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించునట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు
త్కటవరోద్ధతులై పరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్. 188

క. తదవసరంబున నొక్కటఁ, బదియమ్ములు తోడి త్రిగర్తపతివక్షంబున్
వదనంబు నేసి విరటుఁడు, మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్. 189

క. ఇంచుకయు నీడఁ బోవక, కాంచనపుంఖప్రకాండకాంతి[1]స్ఫాయ
త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతి మేనన్. 190

తే. దొనలు తలపడ్డనాహవదోహలమున, నుభయబలములుఁ దమకించి [2]యోర్వలేక
కలయ బెరసి భూరేణువుకతన రాత్రి, కాక మున్న యొండొరువులఁ గానరైరి.

క. క్షతములఁ జెల్లు తొరఁగు శోణితము రజఃపటల మడఁచి [3]నెఱపిన నరుణ
ద్యుతిఁ దమము వాపు వేకువ, గతిఁ దత్సమయం బతిప్రకాశత నొప్పెన్. 192

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ముదంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు నుద్భటవిజృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ దాఁకి రణం బొనరించె నత్తఱిన్
భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టఁ దలిర్చినమావిమ్రాఁకనన్. 193

క. సమరంబున భటులు కడు, న్శ్రమ మొందిరి తమము కవిసినం గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది, సమయం బని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్.

వ. తదనంతరంబ. 195

క. మఱిమఱిచీఁకటి యప్పుడు, నఱిముఱి భటు లుడుగ కడరి యని చేయంగా
నెఱసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్. 196

వ. ఇట్లుభయసైనికులు సాంద్రసంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు
దక్కి తమకం బెక్క నొక్కింతసే పూరకున్నంత. 197

క. తనమనుమలు పాండుతనయు, లని చేఁతకు వేడ్కసేయు టాత్మఁ గని తమం
[4]బున వారు మెఱయ రని వచ్చిన క్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్. 198

క. వెలుఁగు గని కడఁగి యిరువాఁగులుఁ బోరికిఁ జొచ్చె మత్స్యకుంజరుఁడును న
గ్గల మగుమగఁటిమిసొంపునఁ, దలపడియె సుశర్మతోడఁ దదనుజతోడన్. 199

చ. తలపడి పోరవారియరదంబు లనేకము లొక్కపెట్ట యి
ట్టలపురయంబునం బొదివి డాసెఁ గడంగి వడిం ద్రిగర్తనా
థులు నిరుతేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయసారథిన్

1. స్ఫాయత్పంచాశ. 2. యోట. 3. నెఱసిన. 4. బున మెఱయ నేర రని.

బలువిడిఁ గూల్చి రథ్యముల ప్రాణములుం గొని రుద్రమూర్తులై. 200

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 201

చ. అతిరభసంబుమై నడరి యాతనిఁ బట్టి సుశర్మ పెల్చ నా
ర్చి తనరథంబుపై నిడి యశేషబలంబులు [1]నద్దెసఁ భయ
ద్రుతగతిఁ బాఱినఁ విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునఁ మది ముదం బొలయఁ మరలెఁ మహోద్ధతిన్. 202

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరం బగు చిత్తంబుతో
మత్స్యవిభునివలనను చూపుచు ని ట్లనియె. 203

తే. ఇతనియాశ్రమమున మన మెల్ల బ్రదికి, యున్నవారము కావున నుగ్రరిపుల
పాలుపడకుండవిడిపింపఁ బాడియితని, నెయిదుమెయిదుమురథరయమెసక మెసఁగ.

చ. అనవుడు మేను పెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము రయంబున దీన నరాతిసేన డొ
ల్ల నడిచి యీసుశర్మునిబలంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదఁ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్. 205

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయిలోటతోడఁ
గీచకారాతిఁ దప్పక చూచి నగుచు
నతని కి ట్లని చెప్పె ధర్మాత్మజుండు. 206

క. తెరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని నుభయబలము న
చ్చెరు వందుచుఁ జూచి వృకో,దరుఁడ వగుట యెఱుఁగ కున్నె తద్విధ మేలా.

వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబు లైనచాపకృపాణగదాదులగు
నాయుధంబుల విరోధివధం బొ పాదించి వేవేగ విరాటు విడిపింపుము. 208

చ. అనుపలు కంకుశంబున క్రియం గుదియించిన నిల్చి భూరుహం
బునదెస పోక మత్తగజపుంగవుచందమునఁ సమీరనం
దనుఁడు శరీర[2]దోళనవిధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లి యిట్టులను భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 209

క. మీపనిచినట్లు చేసెద, నేపారనవైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్యమహీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్. 210

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని. 211

పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట

తే. తాను మున్నుగ శాత్రవసేనమీఁద
రథము లొక్కటఁ [3]బఱపిరి పృథివి యద్రువ

1. నద్దెసఁ; బద్దెసఁ. 2. డోలన. 3. బఱపెను బృథివి.

నుఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ
జెలఁగి మాఱ్కొని పొదివి సంకులము కాఁగ. 212

క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు, డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయు[1]ఁ బోడిచేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు,[2]వేయింటి రథిరథ్యసూతవితథంబులుగాన్. 213

తే. ఏడునూఱురథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నూటినాయు మడఁచె
నతనియనుజుండు కుంతీసుతాగ్రజుండు, రథికముఖ్యుల వేవురఁ బృథివిఁగూల్చె.

వ. అతండు మఱియును. 215

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణంబు చేయ వాఁ
డుఱక నిశాతసాయకము లొక్క మొగిం బడి మేనియందుఁ గ్రి
క్కిఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్ యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములన్ [3]వరబాణపాణి యై. 216

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుం డై. 217

ఆ. ఆసుశర్మ తేరియందున్న ఘనగదాదండ మెత్తికొని యుదగ్రవృత్తి
జరఠదేహుఁ డయ్యుఁ దరుణవయస్కుని, ట్లవని[4]కుఱికి పోయి యతని వ్రేసె. 218

క. అట్టిసమయమునఁ గరువలి, పట్టి త్రిగర్తేశురథముపై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడగే, ల్గట్టి పెనుచ నార్చెఁ దద్బలము వెల్లగిలన్. 219

వ. ఇట్లు సుశర్మం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైన శోణాశ్వుండు మొదలుగా నాప్తభృత్యవర్గంబు ననుజుం డైన సుశర్మ లోనైనబంధుజనంబులు నాదిగాఁ గల పరివారంబు పలాయనపరాయణం బగుటయు వెనుకొని యొయిది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దలమీఱి పొదివి తెచ్చి యన్నపాలికివచ్చి తాను మున్ను త్రిగర్తేశురథంబుకడ నిలువ నియోగించి యున్న తమ్ములం గూర్చుకొని తమయంతవట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. 220

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దనమనమున ముప్పిరిగొన నా
భూదయితుఁడు వివిధప్రియ, వాదంబుల గారవించె వారల నెల్లన్. 221

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 222

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరి కాఁగ నీమదికిఁ బ్రియ మొసఁగం
గా నాకుఁ జేయ నయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్పదము కైకొనవే. 223

తే. ఒడలు సిరియును నాకు నీయొసఁగినవియ, కాన[5]దగ సమర్పించెదఁ గరుణ నీవు
సమ్మతించి యిమ్మత్స్యదేశంబుఁ గావు, పంచి పనిగొని నన్ను రక్షించికొనుము. 224

వ. అనిన విని యజాతశత్రుం డతని కిట్లనియె. 225

చ. మనుజవరేణ్య నావలనిమన్నన యట్టిద కాదె శత్రుమ

---

1. వడిఁ జేసెన్. 2. వేయింటిని రథ్యసూతవీతం. 3. బటు. 4. కెలఁగి. 5. నీకునర్పించెదఁ గరుణ నీవు; దగ సమర్పించెదఁ గరుణ నీకు.

ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ
చనుటయ నాకుఁ దేజమును సంపదయుం గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య [1]యే నిచట నైనది యేటిది యింత యేటికిన్. 226

క. అనుపలుకులకును విస్మయ,మును సంతో[2]షమును జిత్తమునఁ బెనఁగొన నా
జనపతి ధర్మతనూభవుఁ, గనుఁగొని యి ట్లనియె మఱియు గౌరవ మెసఁగన్. 227

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్రకీర్తిప్రియమో
రిపుదుస్సహ మగునీరణ, నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్. 228

ఉ. మంటయుఁబోనిశాత్రవసమాజము నించుక యేని శంక లే
కంటఁగఁ దాఁకి [3]వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీ
[4]వంటలవానిచేసినయవార్యపరాక్రమ మొండుచోటులం
గంటిమె వింటిమే యితఁడ కాఁడె వెసన్ [5]గెలిపించె నన్ననిన్. 229

క. [6]కంధరములు తెగి తలలు వ,సుంధర నతిపక్వతాలసుభగఫలాళి
బంధురత[7]రాలు దామ,గ్రంథి పగఱమీఁదఁ గినిసి కసిసినయెసలన్. 230

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజ మగుకడిమికలిమి నరిసేనఁ గరం
బుక్కఱఁ దంత్రిపాలుం, డొక్కఁడ [8]పాలియించె నీరణో త్సా[9]హమునన్. 231

క. ఈనలువురు తక్కఁగ మన,సేనల నొక్కరుని నైనఁ జేష్టడనిభటుం
గానం జెలి కెడ రైనం, బూని[10]తగులునతఁడ చూవె పురుషుం డెందున్. 232

ఉ. కావున మీకు దంతిహయకాంచనరత్నవిభూషణంబులుఁ
దేవనితంబినీజనసదృక్షమృగాక్షులు నాది కాఁగ నా
నావిధవైభవంబులు మనంబులవాంఛలకుం దగంగ నీ
కేవిధి నీఁగువాఁడ ఋణ మెయ్యెడి యేనియు వేఁడుఁ డిచ్చెదన్. 233

క. అనవుడుఁ బాండుతనూభవు, లనఘా యి ట్లింతయుం బ్రియంబున సంభా
వన చేసితి మా కిది[11]యా, ధనము పడయుదానికంటెఁ దక్కువె చెపుమా. 234

—— ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట ——

వ. మ మ్మెరవుగాఁ దలంచి యిమ్మెయ్యెడ నిట్టట్టన వలవదు పురంబున కరిగి యయ్యెడ నీ
కెట్లు ప్రియం బట్లు మన్నింపు మని రందుఁ గంకుండు మఱియు ని ట్లనియె. 235

క. తగ నొక్కటి వేఁడెద నిను, జగతీశ్వర యిచ్చు టొప్పు సరథగజాశ్వం
బుగ విడిచి పుచ్చు మిప్పుడ, త్రిగర్తపతి నిది య నాకుఁ బ్రియ మెబ్బంగిన్. 236

వ. మననగరంబునకు జంఘాలురం బంపుము పురంబున వారలువోయి భవద్విజయ
ఘోషం బాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును

---

1. యీ విచట. 2. షంబు నాత్మ ముప్పిరిగొనఁగా. 3. చెండి (వేగ). 4. వంటలవాఁడు. 5. విడి పించె. 6. కంధరలు ద్రెవ్వి. 7. రాలె. 8. పొదలించె. 9. హంబున్. 10. తలఁగు. 11. యే, ధనము.

బరప్పరగంధసలిలసేచనంబులును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింపవలయు ననిన విరాటుండును బనిచినం [1]గాలరులు వేగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి పట్టణాలంకరణప్రముఖ నిఖిలభద్రవిధానంబులు చేయించి రిట పాండవులును మత్స్యమహీవల్లభుండును సమస్తసేనాసమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు లజ్జావనతాననుం డగుసుశర్మ సపరిచ్ఛదంబుగా విడిచి పుచ్చి గుత్తులకొలందికిఁ గృత్తంబు లయిపడియున్న పాదంబులవలనం గెందలిరులసెజ్జలచందంబు లగుచోట్లును దునిసి చిక్కువడియున్న యూరుకాండంబులవలన మదగజంబులు చొచ్చిన కదలీవనంబులుం బోనియెడలును బ్రోవులు గొనియున్న ప్రేవులవలన లావు గలయంచపిండు పేరాఁకలి నతిముఱిం బెఱికినఁ గుఱుకులు కట్టినమృణాళనాళంబుల నొప్పుకమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయుప్రదేశంబులును నంగుళీయకరుచు లడర నెఱిం జాఁగిపడియున్న బాహుదండంబులవలన నురగనివాసంబుల ననుకరించుతలంబులును గీలాల(జలంబుల)పయిం దేలుచు నవ్వినట్లున్న శిరంబులవలన వికచారవిందదీర్ఘికలవిడంబించుతావులును నవయవభేదంబు లడంగునట్లుగాఁ దుత్తునియలై పడియున్న గాత్రంబులవలనం గృతాంతమహానసశాలలపగిది నొప్పు[2]నట్లును గలపాలికలను గలయం గనుంగొనుచు వెడలి చంద్రికాసుందరం బగు నొక్కసైకతస్థలంబున నారాత్రి పుచ్చి రని చెప్పిన విని మఱునాఁటివృత్తాంతం బెట్లయ్యెనో యని సాదరంబుగా నవలోకించిన. 237

చ. అపరిమితప్రకార వినిరస్తసమస్తవికార షట్ప్రమా
ణపరమదూర గాఢభజనక్రమగత్యనుభావ్యపార దే
వపితృపథప్రవర్తన వివర్జననిర్మలచిత్తచోర శాం
తిపరమహాత్మసంసరణతీర నిరంజన భక్తరంజనా. 238

క. విజ్ఞానానందరసా, భిజ్ఞహృదయకమలహంస భీమదురితమ
ర్మజ్ఞవివిధాభిధానా, యజ్ఞాత్మకరూప నిశ్చలావ్యయదీపా. 239

మాలిని. త్రిజగదవననిత్యక్రీడనోద్యత్ప్రమోదా
రజనిచరవిఘాతారంభలీలావినోదా
భజననిరతసౌఖ్యప్రాప్తిజాగ్రత్ప్రసాదా
నిజతనువిభవతోన్మీలనాచ్ఛిన్ననాదా. 240

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.

---

1. గాలరు లగుచారులు. 2. పట్లును, బోధ.

శ్రీరస్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము—చతుర్థాశ్వాసము

శ్రీమదరేఖవిషాదవి
రామాహితగాఢశమధురానిర్భరని
ష్కామర్దితవివిధవికా
రామలచేతోనివాస హరిహరనాథా. 1

### ఉత్తరగోగ్రహణము

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా,చార్యరవిసుతాదియోధసంఘోద్భట మై. 3

వ. (ఇట్లు) నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటు పశుగణంబులం [1]బొదివె నట్టియెడ ముక్కడిమూఁకలు చని యెక్కడెక్కడ యని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖ ప్రముఖరథికజనంబులు గోపాలవర్గంబు ననర్గళప్రసారం బగు శరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి [2]బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు తోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగుదెంచి రాజమందిర[3]ద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు చేసి యంతఃపురంబున నున్న భూమింజయుం గాంచి ససంభ్రమంబుగా నిట్లనియె. 4

మ. ధరణీచక్రము సంచలింపఁగ సముద్ధాంతంబులై గ్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొని యేర్చెం గోవర్గముం వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపుక్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు శోభిల్లఁగన్. 5

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతనుత్రాణ ముగ్రచాపబాణపూర్ణ
తూణఘనగదాసితోమరచక్రాదు, లనువుగా నొనర్పు మతిరయమున. 6

చ. విరటుఁడు నిన్ను [4]నెప్డుఁ బది వేవురముందటఁ జెప్పు బాహువి

---

1. బొదివిపట్టె నట్టి. 2. బెగ్గలం బగ్గలింప గవా. 3. ద్వారంబునరథా. 4. చెప్పుడును వేవురముందఱ.

స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు కా
తరపరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్. 7

క. అని కాంతాజనములలోఁ, దను నగ్గించుటయుఁ బొంగి దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు తనమనమున సంగరకౌతుకంబు ముడివడుచుండన్. 8

భూమింజయుండు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ బోరుటకుఁ బో నెన్నుట

ఉ. [1]ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొని లేని గోవులం
దెత్తు మహాస్త్రమాత్రమునఁ దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునం విచారదశ చెందెదు నెవ్వఁడు కల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప నెంతయు నేర్తు [2]రథం బనం బురిన్. 9

క. తగుసారథి దొరకొనినం, బగతుర [3]భంజించు టెంతపని కదుపుల ద
వ్వుఁగఁ గొని పోదురొకో యి, ట్లగు[4]నె కలం డేని సూతు నరయుం డెందున్. 10

చ. కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు [5]మత్సముద్యమ
స్ఫురణము చూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ గ్రమ్మఱఁ దేరక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే. 11

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 12

క. విని ద్రుపదధరణిపతినం, దన సామర్షాపహాసతరళహృదయ యై
చని తద్వృత్తాం[6]తము మె, త్తనిపలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. 13

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు పోయి వారలతో ని ట్లనుము మనబృహన్నలకు సారథ్యంబు చేయుసామర్థ్యంబు కలదు తొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథి యై యతని చిత్తంబు వడసె మఱియుఁ బెక్కెడలం దదీయం బగు రథంబు గడపఁ దాన యై యుండు నేను నెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింప వచ్చుటకు సంశయంబు వలవ దనుము వా రేమని రేని మఱియుం దగనాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు కావింపు మన నట్ల చేయుదునని సైరంధ్రి యుత్తర యున్న యెడకుం బోయి. 14

చ. జనపతినందనుండు తగుసారథి నారయు చున్న వాఁ డెఱిం
గినపని చెప్పఁగా వలయుఁ గ్రీడి మనంబున మెచ్చునట్టి నే
ర్పును భుజశక్తియుం గలిగి యూఢికి నెక్కినసూతవృత్తి మై
నని సడి సన్న యేత్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా. 15

1. ఎత్తర; ఎత్తెల. 2. రథంబు నా (నీ) పురిన్. 3. నిర్జించు; సాధించు. 4. నే కలఁడేని సూతుఁ డక్షుఁడు చాలున్. 5. మద్భుజాబల. 6. తంబు న, తనిపలుకులఁ.

తే. అర్జునునకు ఖాండవదహనాదు లైన, విక్రమము [1]లాబృహన్నల వెరవులావు
కాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ, నువిద దీని నెఱింగింతము త్తరునకు.

క. అని యమ్ముదితయుఁ దానును, జని యతనికి నత్తెఱంగు సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి, ట్లనియెం బాంచాలితోడ నల్లన నగుచున్. 17

తే. అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ, నేల చక్కఁగఁ గను విచ్చి యేను వేఁడిఁ
జూడరోయుదు రణమున సూతకృత్య, భరముఁదాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ.

వ. అదియునుం గాక. 19

చ. కురుబల మేఁగుదెంచె [2]నఁట గోవుల బిట్టుఱిఁ బట్ట దానిపైఁ
బరికొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁ బూని యే
[3]నరిగెద నట్టె తేరికి బృహన్నల సారథి యైన దీని న
వ్వారె పురిలోన నింతకఱవా రథచోదకు లింత యేటికిన్. 20

వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె. 21

ఉ. కౌరవసేన కాదు త్రిజగంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వ వచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన ము న్నెఱుంగుదుం
గారణజన్మ మై తనువికారము [4]వచ్చినఁ బెంపు దప్పునే. 22

వ. అనవుడు. 23

క. ఘన మురియాడుచు నుండఁగఁ, దన కోరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం, బనుచుట కొడఁబడినపలుకు పలుకుటయుఁ దగన్.

వ. సైరంధ్రి దెసఁ గనుంగొని యేను బోయి తోడ్కొనివచ్చెద నని పూని. 25

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మరా, [5]గంబులనెలకట్టుకరణి నొప్పఁ
[6]బాలిండ్లు తను వెడ వ్రాలింపఁ జెన్నొందు, నసదుఁగౌఁదీఁగె యల్లాడుచుండఁ
[7]దఱివేచి వెనువెంటఁదగులుకామాంధకా, రములీలఁ గ్రొవ్వెద కొమరుమిగులఁ
గర్ణభూషణమౌక్తికప్రభాడోలన, [8]మీక్షణదీప్తుల నినుమడింప

తే. నందియలమొరపంబున కరుగుదెంచి, ప్రోదిరాయంచ రయమునఁ బోవునవ్వి
ధంబు తగ నభ్యసించుచందమునఁ దోన, చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 26

ఆ. మెఱుఁగు [9]మొగిలుసొచ్చు తెఱఁగుననాట్యమం, దిరముచొచ్చి తనదుగురువుకడకు
నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా, వినయసంభ్రమములు పెనఁగొనంగ. 27

క. ఇచ్చట నొకకయ్యంబునఁ, జచ్చె మదీయాగ్రజన్మసారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం, డచ్చుపఱుపఁ డయ్యె నీక్రియకు నొండొకనిన్. 28

---

1. ల; లీబృహన్నల. 2. నట. 3. నరిగెద నంట (నట్టె). 4. వొందిన. 5. గములఁగుట్టిన నేలకరణి. 6. బాలిండ్ల తను వెడ. 7. వ్రేఁగైనవేనలి వెనువెంటఁ దగులు కామాంధకారములీల నతిశయిల్ల. 8. మీక్షణ రోచుల. 9. మొగులు; మొయిలు.

వ. అది య ట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన [1]సన్న సన్న
ద్ధుఁడై వెనుకం దగుల సమకట్టి సారథ్యంబు చేయువాఁడు లేమికి విషాదంబు
నొందిన నీకందువ సైరంధ్రి చెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁ బని
చిన నేనును నీపాల నాకుఁ జనవు కలుగుటం జేసి యెల్లవిధంబులం [2]దెత్తు నని
పూనివచ్చితి నీవును నాపలుకులు కుఱుచసేయక నీపెంపునుం బ్రకటంబుగా
నయ్యుత్తరకుమారునకు రథంబు కడప నియ్యకొని యియ్యాపదఁ దలఁగ
వలయు నిట్లాడంబడక తక్కుట నావలని వాత్సల్యంబు కొఱంతపఱుచుట
యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి. 29

క. నగుచు బృహన్నల యిట్లను, జగతీశ్వరపుత్రి నాకు సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే, మిగులంగా వెఱతుఁ [3]బోదము మీఁద ట్లుండెన్. 30

క. భవదీయప్రార్థనచేఁ, దివిరి పరమదుష్కరములు తీర్చి యయిన ను
త్సవ మొనరించెద సారథ్యవిధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా. 31

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్తన నడతెంచు
మత్తశుండాలంబునుంబోలె. 32

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిగాఁ జేసికొనుట

[4]తే. అరుగుదెంచుబృహన్నల నంత నంతఁ, గని నృపాలసుతుం డను గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబుకలిగె నాకుఁ, గడఁగి నేఁడు రథమ్మీవు కడపవలయు.

క. [5]వేరమ్ము మైమఱువుఁ బోడి, తే రెక్కుము తప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్
సైరంధ్రి చెప్పె నీ దగు, [6]బీరమ్మును బెంపు లావు వెరవును మాకున్. 34

చ. అనుటయు నాటపాట గలయప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరమునేతకు సారథి కమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁ డైనయో
క్కని రథ మేత్తెఱం గడపఁగా నియమింపుము రాజనందనా. 35

వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 36

ఉ. ఖాండవ మేర్చునప్పుడు తగన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము కల్గ నొనర్చినయట్టిబుద్ధియున్
దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట తక్కుము రణోత్సవానం బొనరింపు గ్రక్కునన్. 37

తే. అనిన నాతనిమాటకు నడ్డ మాడ, వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల

1. సమరసన్నద్ధుం. 2. దోడ్తెత్తు నని పనిఁ బూని వచ్చితి. 3. బోదు మీఁ దెట్లుండెన్. 4. ఆ. అరుగుదెంచు నాబృహన్నల నంతంతఁ, గని నృపాలసుతుఁడు గారవమునఁ, గౌరవులకు నాకుఁ గయ్యంబుగల దీవు, కడఁగి నేఁడు రథము గడపవలయు. 5. నేరమి (ధీరత) మై మఱు (పుం బోడి) పు బోడిగి. 6. వీరత్వము బాహుబలము.

నియ్యకొనుటయు నమ్మనుజేంద్రసుతుఁడు, దృఢతనుత్రాణ మతనికిఁ దేరఁ బనిచె.

క. తెప్పించి తొడుగు మీ వని, యొప్పించిన నిట్టు నట్టు నొఱవలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల, యప్పుడు [1]నగుపించె నచటియబలాజనమున్. 39

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ, దత్తనువున మెఱువు [2]తొడిగి తానును హృద్యో
దాత్తం బగుకంకట మిడి, చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 40

వ. బృహన్నల నవలోకించి. 41

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడ మెత్తు మిపుడ రావలయును గో
చయము గొని యస్మదీయవి,జయ మభినందింపఁ బురముజను లెదురుకొనన్. 42

తే. అనిన నీవేమి పనిచిన నట్ల చేయ,వలయు నీవున్న యెడ నుండ వలయు నీవు
చన్న దెసఁ జనవలయు నాశక్తిమెఱిఁగి, పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలుము.

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నాధనంజయుండు. 44

క. కాంచనమాలాలంకృత, చంచత్తనులీల [3]మెఱయ జవనాశ్వములం
బూన్చి రథంబున మణిమయ, పంచానన కేతు వెత్తె బంధురభంగిన్. 45

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి. 46

క. కురువీరుల గెలిచి తదం,బరములలోఁ జిత్రవర్ణభాసురములు గాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ, కరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ. 47

క. అనుడు బృహన్నల యి ట్లను, జనపాలకనందనుండు జయలక్ష్మిం జే
[4]కొను నటు చీరలు తెచ్చుట, పనియే యటు చూడుఁ డెల్లభంగులఁ దెత్తున్. 48

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాదివివిధసాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల నుఱుక్క చక్కం జేయ నుత్తరుండును బనుపం బట్టిన దెస [5]గోపాలకు నడిగిన వాఁడు పితృవనంబు[6]వలనని చెప్పిన వినుచు రథారోహణంబు చేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయిన మాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు చల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముండయిన యాఫల్గునుఁ నైపుణంబున వల్గదశ్వం బగురథంబు రయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంతప్రదేశంబు చేరం జనె.49

సీ. అభినవజలధరశ్యామంబు లగునెడ, లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుచట్లు, కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళగౌరము లగుచోటులు, తఱచుఁబూఁబొదలచందంబు నొంద
హరిద్రరుచిసమానాకృతు లగుతావు, లదరెడు[7]పుప్పొడు లట్లు మెఱయఁ

---

1. నగి (పిం)యించె. 2. దొడిపి. 3. మెఱయు. 4. కొను(టే)డే చీరలఁ. 5. గోపాలకుల నడిగిన వారు. 6. వలనిం జెప్పిన వినుచు వలగొని రథా. 7. పుప్పొళ్లకడిమి.

తే. గలయ నెగసి ధరాధూళి లలితపవను
దిశికి [1]నలిఁ గాఁపువోయెడు తెఱఁగు తోఁప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడుచుకౌరవరాజసైన్యంబుఁ గనియె. 50

ఉత్తరుఁడు కురుసైన్యంబు కనుంగొని భయభ్రాంతుం డగుట

క. కని యుత్తరుండు గరుపా, ఱిన మేనును దలఁకుమనము ఱెచ్చవడినచూ
పును నై త్రొట్రుపడుచు ని, ట్లనియె దిగులు చొచ్చి యాబృహన్నలతోడన్. 51

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. 52

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా, ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢు లయినయా
శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే. 53

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మనభంగి వీర లింతఱును గడుఁగన్
బెట్టిదులు మనకు మార్కొ, నను, నట్టికొలఁది కాదు భీతి యడరెడుఁ దోడ్తోన్. 54

ఉ. కౌరవసేనఁ జూచి వడఁకం దొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవు చున్కి యిది యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు తీ పన మున్ [2]వినవే బృహన్నలా. 55

వ. [3]అనిన దరహాసితవదనుం డగుచు శతముఖతనయుం డతని కి ట్లనియె. 56

చ. అసదృశలీలఁ బొల్పురథికావలిమీఁదఁ జనంగ వెట్టినే
మసలక యామిషంబు గొని మార్గము పట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము వేగ మరల్తము కాక యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ బాడియె నీకు నరేంద్రనందనా. 57

ఉ. అంతిపురంబులోనఁ గలయంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయుమేటి వై యరద మెక్కి రయంబునఁ వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భట[4]కదంబముఁ జూచి కలంగు టొప్పునే. 58

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని, యెఱుఁగు [5]వడఁక నాతఁ డిట్టు లనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతులసంతోష, మేల నాకు ననికిఁ జాల నేను. 59

వ. అనవుడు. 60

1. వెసఁ గాఁపు; నరిఁ గాపు. 2. వినమే. 3. అనిన విని మందస్మితముఖుం డగుచు ననిమిషపతితనయుం డతనికి. 4. రథంబు(ను)లఁ. 5. వడఁక.

చ. తనభుజశక్తియుఁ రిపులదర్పము నేర్పడఁ జూచి చూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది లోకముచక్కటికిన్ దూరు లైన దీ
నిని మది మెచ్చు రీబలము నీదెసఁ దేఱియుఁ జూడ దింతయుఁ
మును భయ హేతు వైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 61

సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురు[1]చిందంబుల, కోలాహలములకుఁ గుడియఁబడక
యురవడి సేనలు [2]తెరలఁ బైఁ దోఁతెంచు,ధూళి పెల్లడరినఁ దూల పోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన, యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్గాంగ,తతి నాటుతఱచునఁ దల్లడిలక
తే. బహువిధంబులఁ బగతుర బరవసమున, నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక, దవ్వుదవ్వుల [3]నిక్కిన నవ్వ రెట్లు. 62

చ. అనుడివిజేంద్రనందనున కమ్మను[4]జేంద్రతనూజుఁ డిట్లనుఁ
వినుము త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బఱి యుదగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి బాసట లేర యెవ్వరున్. 63

తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ, నే యిదేటికి వెడమాట లిట్టు లాడ
వారు కానక [5]ముందఱ తేరు వోలు,కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి. 64

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 65

క. [6]వెగ డొంది యిట్లు పలుకఁగ, నగునే పగతురు ప్రమోద మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు, తెగడంగా [7]మగిడి పోక దీనత కాదే. 66

వ. అట్లుం గాక. 67

మ. నను సైరంధ్రి కడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి వీవు బంటుతన మట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వోదునె భయోత్కంపంబు నీ కేటికిన్. 68

తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁ బట్టు, మిపుడ కౌరవసైనికు లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమునులావు వెరవు మెఱయఁ,గదుపుఁ బెట్టించిపోదము క్రమ్మఱంగ.

వ. అనుచు విబ్బచ్చుండు కడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్లటిల్లమాన
సంబు తల్లడిల్ల నాభూవల్లభు కుమారుండు. 70

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదు రది మేలు మేలు నను నాఁగకు నీ
క్రొవ్వులుగ దేనిఁ దలపడు, మెవ్విధిఁ జని తేని యనుచు నెత్తినభీతిన్. 71

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్

1. చిందములఁ,కోలాహలంబులఁ గలఁగఁ బడక. 2. దెరలుపైఁ దోఁతెంచు. 3. విఱిగిన. 4. జేశ్వరసూనుఁ. 5. మున్న యీ తేరు. 6. బెగడొంది. 7. మగుడి.

ధరణికి లంఘించి వెసం, బురి దెసకును లజ్జ వీటిఁ బోవం బాటెన్. 72

వ. ఇట్లు పాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబులపగ్గంబుల నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళితరక్తాంబర యుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచుసమయంబున నిలిచి కనుం గొను కౌరవబలంబునందు. 73

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డపహాసము చేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయముమీఁదను [1]దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసామ్యతయు బాహులపెర్మతయుం [2]భటత్వ
త్వజ్ఞతయుం గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్. 74

తే. ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నది యొప్పు సూక్ష్మలతసొంపు
వికృతవేషాకృతంబు లై వెలయ కితఁడు
నివురు కప్పిన మెఱయనినిప్పువోలె. 76

ఉ. బాహులచాయయుం గమనభంగియు నర్జుననట్లు దీన సం
దేహము లే దితండు తనతేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ జేడి యనఁ గీడ్పడి యుండెనొ కాక యీకురు
వ్యూహముతోడికయ్యమున కొండొకరుం డిటు లొంటి వచ్చునే. 76

చ. విరటుఁడు [4]దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొనిపోయిన [5]నొండులు లేమిఁ జేసి యు
త్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు తగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు చూడఁగన్. 77

చ. పరి చనుదెంచి గోగణముఁ [6]బట్టి రనన్ విని పిన్న కాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి కలంగినఁ బాఱఁజొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. 78

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగుచుండ శుండాలరయలీలాసముల్లేఖం బగుగమనంబునం బురుహూతపుత్త్రుండు పదశతమాత్రప్రదేశపలాయితుం డైనభూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 79

సీ. [7]వెలవెలఁ బాఱుచు వెగడొందఁ [8]బెదవుల,తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్చుఁ, బదములుఁ గరములుఁ [9]గుదియ వడఁకు

1. దృష్టి. 2. బటుత్వత, త్వజ్ఞత. 3. వృతంబు లై వెలయు నితఁడు. 4. పట్టుదట్టముగ; బెట్టుదిట్టముగ; దండుదట్టముగ. 5. నొండొరు లేమిఁ. 6. బట్టె ననన్. 7. వెలువెలఁ. 8. బెదవులఁ దడవుచు. 9. గుదులువడఁగ; గుదిలవడఁగ; గుదువవడఁగ.

హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు,దీనదృష్టుల మోముఁ దేఱి చూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని, ప్రార్థించు మాటఁ గీడ్పాటు తోఁప
తే. నిష్కశతశుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ బురము చొచ్చి
నపుడ [1]యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు. 80

క. నాతోడిప్రముడిం గడు, నాతుర వై యొదుపుచూచునంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ, చూతుం బో నీఁగదే విశుద్ధచరిత్రా. 81

అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొనుట

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు నగుచు
నతనిం దేరు చేరం దెచ్చి. 82

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ [2]కుడుగు తేరికి సారథి కమ్ము నాకుఁ జి
చ్చఱపిడు గెట్టు లట్టరి శూరులమొత్తము నుగ్గు చేసెదం
బఱపద సేన రాజుధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 83

క. అనుచు నొడఁబాటులే కున్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి, చనియె నరుఁడు జమ్మి చేర సమ్మదలీలన్. 84

వ. ఇట్లు సవ్యసాచి నిజాస్త్రాయుధం బైనశమీవృక్షసమీపంబున కరుగునవసరంబునం
గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బస్ఫురణవిశేషభీషణుం డగు నతనిం గనుంగొని
కౌరవ సైనికులు కలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ వారలం గనుంగొని
తోఁచు నుత్పాతంబుల నాలోకించి గురుం డి ట్లనియె. 85

క. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసలకుం బలుచాయల్
[3]చేసెం బఱమొయిళు లడరి, మ్రోసెం దమమంతఁ దూర్యము లపధ్వను లై. 86

క. ఇగ్గజములు మిన్నకయును, మ్రొగ్గెడు నుత్తమతురంగములు బాష్పజలం
బగ్గలము విడుచు చున్నవి, [4]తగ్గెడుఁ గారణము లేక [5]తడఁబడ పడగల్. 87

క. దగ్ధము లై నట్టులు స,మ్యగ్ధర్యము లెడలె మండె నాయుధచయముల్
దిగ్దాహముం బెనఁగె నసం,దిగ్ధము మన కాజి యగుట దీనికిఁ దగఁగన్. 88

క. మొన [6]లొఱపుగఁ దీర్చికొనుఁడు, తనతనవాహనము లాయుధము లెల్లజనం
బును నను వు చేసికొనుఁ డో,పినయంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్. 89

వ. అని చెప్పి తా నప్పు డర్జును నెఱింగినవాఁడు కావున నతనికి నజ్ఞాతవాససమయ

1. యిచ్చెద ననుఁ గడు వార్తు. 2. వుడుగు. 3. సేసెఁ బఱిమొగులు గీడై. 4. త్రగ్గెడు కారణ. 5. తడఁబడె. 6. లొఱపుగఁ.

భంగం బగునో యను భయంబున సురనదీసూనువచనం [1]బు వీక్షించి సన్న
వాఱ ని ట్లనియె. 90

చ. [2]వెరవరి కాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొక [3]మ్రానిపేర నిటఁ జేరఁగ వచ్చుచు నున్నవాఁ డహం
కరణము కాని యొం డొకటి కానఁడు మూర్తివిశేషమారయన్
సురపతియట్ల వీనిమదిచొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్. 91

క. అనిన విని యెఱిఁగికొని యాతనిమది సందియము మాన్పఁ దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతనితోఁ జెప్పినభంగి నిగూఢవృత్తి భీష్ముఁడు పలికెన్. 92

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁది కడచి వచ్చితిమి యకుంఠితబాహా
బలము నెఱుపఁ దఱి యయ్యెను, జలింప వల దింక మనకు శత్రులవలనన్. 93

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు [4]కనికొని పార్థునకు సమయభంగంబువలని
సంకటంబు లేకునికి మనంబునం బ్రియం బంది మొగంబునం దోఁప నీక పుయిలోటం
తక్కి యి ట్లనియె. 94

శా. సింగం బొకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముఁడు సమరస్థేమాభిరామాకృతిన్. 95

ఉ. ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ [5]సంశయ మెల్లభంగి గో
వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా విననె పెం పెస లారెడుబాహుసంపదన్. 96

వ. అను పలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కి ట్లనియె. 97

ఉ. పాండవపక్షపాతమునఁ [6]బల్కెడు నోరికి వచ్చినట్లు ని
న్నొం డన రామిఁ జేసి యిది యొప్పునె కౌరవసేన కెల్ల నా
[7]క్కండవ మేటి వీబలము గర్వముఁ గుందఁగ నిట్లు శత్రునో
ళ్ళండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ డింతయెక్కుడే. 98

ఆ. అతఁడు వచ్చెనేని నస్మచ్ఛిలీముఖ, పాతచలితహృదయపద్మఁ జేసి
వెగడుపఱచి యోధవీరుల కెల్ల నుత్సవ మొనర్తు బాహుదర్ప మొప్ప. 99

వ. అనిన విని సుయోధనుండు రాధేయున కి ట్లనియె. 100

ఆ. తప్పఁ బలికి తీవు చెప్పెద విను మిత్ర, డర్జునుండ యేని నడవి కేఁగి
భార్తృయుతము కాఁగఁ బండ్రెండువత్సరములును నంద నిలువవలయు మగుడ.

క. ఒరుఁ డయ్యెనేని మామక, శరాసనతీక్ష్ణదీప్తసాయకపంక్తిం

---

1. ఖుపలక్షించి కనుసన్న. 2. వెరవిఁడి. 3. మ్రానిసేరి యిట. 4. గనుంగొని. 5. దుర్లభ. 6. బల్కెదు. 7. కండవుమేటివీపబలగ.

బరిమార్చెద ప్రేల్మిడి న,చ్చెరువుఁ బ్రమోదంబు నొంది సేనలు పొగడన్. 102

క. అనుపలుకు[1]లకును భీష్మం,డును ద్రోణుఁడు ద్రోణసూనుఁడును గృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయా, ననురూపము లైన తెలుపు లాస్యముఁ బొందన్.

అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైనగాండీవంబు గొనుట

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం బంచి పార్థుం డుత్తరున
కి ట్లనియె. 1C4

క. ఇన్నగమునందు గాండీవ, మున్నది యది గాని మద్భుజోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీవిండ్లు కుఱుచ లలఁతిబలంబుల్. 105

క. ఇవి నీ తెగకోలఁదివి వీ,రవినోదము నప్పు డధికరభసము లగుమ
ద్వివిధాటోపములకుఁ జా,లవు విల్లది నూఱులేలలా వరయంగన్. 106

క. [2]వీనిఁ గొని గట్టిమైమెఱు, వేనుంగును మఱియు నెట్టి వేనియుఁ దునియం
గా [3]నేయ నగునె కైదువు, లేని [4]యలవుకలిమి పోర లెస్సె యున్నే. 107

వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయచాపంబు తెచ్చియిమ్ము ధర్మజ
భీమార్జుననకులసహదేవులు తమతమ సమస్తాయుధంబులుఁ గూడంగట్టి యిందుఁ
బెట్టినవా రాకట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చికొని [5]తక్కటియవి యెప్పటి
యట్ల బంధింపు మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్రసంచయంబు చూపిన
భూమింజయుం డతని కి ట్లనియె. 10ꤸ

క. పీనుఁగు నంటఁగ నగునే, భూనాథతనూజుఁ డనక పుయిలోడక న
న్నీనీచపుఁబనిఁ బనుపం,గా నీకుం దగునె పాపకర్మము కాదే. 109

వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున. 110

ఆ. మనుజు లంట కుండ మఱుపడఁ జేసిన, యస్త్రశస్త్రసంచయంబు గాని
శవము కాదు మత్స్యజనపాల[6]తనయ యే, నట్టి దైనఁ బనుతు నయ్య నిన్ను. 111

క. నమ్ముము కైదువుమో పగు, జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం
ది మ్మనుసఁ జేయునది లే, కమ్ముగ్ధుం డమ్మహీజ [7]మలసత నెక్కెన్. 112

వ. ఇట్లుత్తరుండు సమారూఢశమీవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి
పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయబంధం
బెడలించిన. 113

క. మెఱసి యుదయించు గ్రహముల, తఱచు ప్రభలఁ గ్రేణిసేసి దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలె [8]నావిండ్లక్, మెఱుఁగులు నృపతనయుదృష్టి మిఱుమిట్లు గొనన్.

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115

---

1. లు విని భీష్మం. 2. దానిఁ; దీనిఁ. 3. నేయ నగును. 4. యొలవు. 5. తక్కిన. 6. పుత్ర.
7. మల్లన. 8. నావిండుల.

క. పెనుఁబాములచందంబున, నునికికి భయ మంది వడఁకు నుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ,తనయుఁడు వెఱ పాపుటయు నతం డచలితుఁ డై. 116

వ. [1]పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచిం బిలిచి యి ట్లనియె. 117

క. ఇది యొకచాపము విస్మయ, మొదవించుచుఁ గొండచిలువయొకో నాఁ దగియు
న్నది ఖచితకనకకమలస,ముదయద్ద్యుతిసముపగూహనోజ్జ్వల మగుచున్. 118

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహువిధంబు లగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి యివి యెవ్వ రెవ్వారి వని యడిగిన నర్జునుం డి ట్లనియె. 119

తే. తొలుత నీవు న న్నడిగినదొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేడుగడయు నదియ
సమరమున దేవదానవసమితినైన, గెలుచు నశ్రమమున దానివలన నతఁడు. 120

క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతితరోచిరుద్గమోగ్రం [*]బరిని
ర్భేద్యము దివ్యజనన మన,వద్యం [2]బిది కార్ముకైకవరము కుమారా. 121

వ. [3]ఇమ్మహనీయచాపంబు బ్రహ్మ శతసహస్రవర్షంబులు ప్రజాపతి చతుష్షష్టిసహస్రవర్షంబులు నింద్రుండు పంచాశీతిహాయనంబులును సోముండు పంచశతాబ్దంబులు వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబున ధరియించిరి వరుణుచేత నగ్నిదేవుండు వేడుకపడి పుచ్చికొని పదంపడి ఖాండవదహనంబున నద్భుతకర్మంబునకు మెచ్చి వివ్వచ్చున కిచ్చె నతండును నఱువదే నేండ్లు ధరియింపం గలవాఁ డిట్లిది త్రిలోకపూజ్యమహిమ నొప్పుచుండు. 122

సీ. నీలోత్పలచ్ఛాయ నెరసి సౌవర్ణవృ,షావలి నొప్పుబాణాసనంబుఁ
దాళప్రమాణసుందర[4]మునై భర్మశా,[5]ఖామృగాంచిత మగుకార్ముకంబుఁ
దీవ్రకృశానుసందీప్తాకృతియుఁ గన,త్కనకమత్స్యంబులుఁ గలుగుధనువు
మెఱుఁగారుసారంబు [6]మెఱయు కాంచనమయూ,రములశోభిల్లుచాపమును వరుసఁ

ఆ. బాండవాగ్రజుండుఁ బవనపుత్త్రుఁడు నకు,లుండుఁ [7]దదనుసంభవుండుఁ బట్టు
నవి కుమార యగ్గవాజినకోశమ,హాశరంబు పార్థునదియ చూవె. 123

క. ఎద్దెసలం దనరుచులు స్సముద్దీప్తము లగుచు నుండ నుజ్జ్వల మగు న
య్యుద్దండగదాదండము, పెద్దయు [8]నెడ మెచ్చి పట్టు భీముఁడు పోరన్. 124

### అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించుట

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగువివిధసాధనంబులు వేఱువేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మూఢాత్ముం డగునయ్యుత్తరుండు పాండవోత్తము నెఱుంగమి ని ట్లనియె. 125

---

1. పొది. *బవి. 2. బది. 3. అమ్మహనీయ. 4. మైన. 5. ఖామృగఖచిత మా; ఖావృతాంచిత. 6. మెఱయుఁ గాంచన. 7. నతని యవరజుండుఁ బట్టు. 8. నెద.

క. ఈయెడ ని ట్లిమ్మహనీ,యాయుధములు పెట్టి యెచటి కరిగిరి మనకౌం
తేయులు బృహన్నలా తగ, నీయెఱిఁగినయంతవట్టు నిక్కము చెప్పుమా. 126

వ. అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుం గా మఱియును. 127

క. ఏ నమ్మహానుభావుల, మేనల్లుఁడ వార లార్యమిత్రులు శత్రు
ఘ్నానాయకగర్వితమో,భానులు బంధుహితకార్యపరతంత్రాత్ముల్. 128

తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగి యున్న,వాఁడొ భీముని పార్థుని వర్తనంబు
లెయ్యెడల నేమిచందంబులయ్యె నక్కు,టా విధాత్రుండ కవ లెందు డాఁగిరొక్కొ.

క. భూపాలవల్లభాజన, దీపిక యనఁ జాలు ద్రౌపదికి నెయ్యెడలం
దేపాటులు పాటిల్లెనొ, కాపురుషులవలన నిట్టికాఱియ పుట్టెన్. 130

క. కపటద్యూత మొనర్చిన, నృపతియు దుర్యోధనాదినీచుల[1]వలఁ బా
ఱి పడియెఁ గడుఁ బెక్కిడుమల, రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుం డయ్యున్. 131

క. వినఁబడ రెచ్చోటను దమ, వినుతమహీరాజ్యమహిమ విడిచి చనుట నే
మని వినియెదనో నీచే, ననుడు నతం డిట్లు లనియె నాతనితోడన్. 132

వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చినయాపదకు నోర్చి బాస తప్పక తారును బాంచాలియు నొక్కటఁ బండ్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁడగునేఁ డజ్ఞాతవాసంబు చలుప వలయుట నిట వచ్చి మనవీట [2]నవ్యాపన్నులై యున్నవారు వినుము వారి నెఱింగించెద. 133

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల,లాంకుఁడు భీముఁడు కవలు హయశిక్షకగో
కింకరులు చెప్పఁ దొడఁగితి, నింకఁ గొఱఁత పెట్ట నేల యే నర్జునుఁడన్. 134

తే. అధిపనందన మాలిని యనఁగఁ బరఁగు, కాంత ద్రౌపది దానికై కాదె సింహ
బలునిఁ దమ్ముల గంధర్వపతులు చంపి, రనఁగఁ జంపె మహోగ్రత ననిలసుతుఁడు.

వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్యసంశయంబులు మనంబున ముప్పిరిగొనం దప్పక చూచి సవ్యసాచికి వెండియు ని ట్లనియె. 136

క. చిరకీర్తిప్రియుఁ డగున, న్నరునకుఁ బది కలవు భవ్యనామములు మనో
హరముగ నవి చెప్పుమా యెం, డరయక యే నమ్మెదను బృహన్నల నిన్నున్. 137

వ. అనుడు నతండు సస్మితాననుం డగుచు నర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు బీభత్సుండు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు నను నివి పదియును నావేళ్లనవుడు నుత్తరుఁడు పాండవమధ్యమున కి ట్లనియె.

క. [3]ఏమికతంబున ని ట్లీ, నామంబులు సంభవిల్లె నరునకు నవి చే
తోమోదంబుగఁ జెప్పుము, నీమదిఁ దత్తద్విధంబు నిశ్చిత మేనిన్. 139

వ. అనుటయు నట్లు చేయుదు నని యతం డి ట్లనియె. 140

ఆ. ధరణి యెల్ల గెలిచి తగ ధనంబులు గొని, యునికి నే ధనంజయుండ నైతి

---

1. చే నోఁటు; భార; బాధ పడియెఁ. 2. నత్యాస(ప)న్నులై. 3. ఏమేమికతంబున నీ.

నెట్టివారి నైన నెదిరినఁ బోర జయంబు గొనుట విజయుఁ డండ్రు నన్ను. 141

తే. తెలుపు లగువాహనములు నా [1]తేర సమర
భూములం దెప్డు [2]నియతిమైఁ బూన్కిఁ జేసి
శ్వేత వాహననామవిఖ్యాతి నాకు
సకలజనసమ్మతంబుగ సంభవించె. 142

చ. రవి యుదయించినట్లు సమరంబున నాతలమీఁదఁ గాంతిమూ
ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చినకిరీట మభేద్యమహోగ్రసుస్థిర
త్వవిభవయాఢ్యమై జనులు దానన నన్నుఁ గిరీటినామసం
స్తవనవిశేషపాత్రముగ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా. 143

తే. వీరులకుఁ జూడ బీభత్సవిధము కలుగు, నట్టికార్యంబు [3]చేఁతకు నెట్టిసమర
భంగులను దడఁబడక [4]బిభత్స చేయు, దాన బీభత్సుఁ డనునభిధానమయ్యె. 144

క. భండనమున నిరుగేలను, గాండీవము దివియ నేర్పు కలిగిన నం దు
ద్దండ మగుసవ్యకరముప్రచండతఁ బరఁగుదును సవ్యసాచి యనంగన్. 145

తే. ధరణి దుర్లభ మగునవదాతవర్ణమారఁ గలుగుట నర్జునుఁ డండ్రు నన్ను
ఫల్గునాహ్వయ ముత్తరఫల్గునీవిశిష్టకాలసంజననతఁ జేసి కలిగె. 146

క. అనిమొన మార్కొని వ్రణ మేఁ, గనుఁగొన ధర్మజుని మేనఁ గావింపఁగ న
య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ, జెనకినఁ బరిమార్తుఁ గాన జిష్ణుఁడ నైతిన్. 147

క. పృథ యనుపేర మదంబకుఁ, బ్రథితం బై యునికిఁ జేసి పార్థుఁడ నైతిఁ
వృథయుగఁ బలుకుదునే యవి, తథవచనుం డైనధర్మతనయునను జూఁడన్. 148

వ. ఈపదివేళ్లును నివి కారణంబులుగాఁ బ్రకాశంబు లయ్యె సకలసురనికరంబు లడ్డపడినం బుండరీకాక్షుసహాయుండ నై ఖాండవం బేర్చినప్పుడు మెచ్చి భద్రమూర్తు లైనరుద్రవిరించులు సన్నిధి చేసినం బెన్నిధిఁ గన్న పేదచందంబున సంభ్రమించు నాకుం గరుణించి కృష్ణుం డను నేకాదశనామంబును నప్రతిహతబాణంబు[5]లు నొసంగిరి వారల యనుమతి నింద్రాదు లయిన విబుధులును వివిధంబు లగుదివ్యాస్త్రంబు లిచ్చిరి పదంపడి గీర్వాణులకు నోర్వరాని యట్టివారి వరదానగర్వితుల నివాతకవచు లనియెడు దైతేయుల మాతలి సారథికం బగు నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడుకోట్ల నిర్జించితి దుర్జయు లగు హిరణ్యపురనివాసుల నఱువదివేవుర దేవారాతుల వారాశితీరంబునం బరిమార్చితి నప్పుడు ప్రీతుండై (కదా) గిరిభేది కిరీటం బొసంగె దేవసంఘంబు శంఖం బిచ్చె నది కతంబుగా నచ్చిందంబు దేవదత్తం బన బరఁగె మఱియు నెయ్యెడల నెవ్వరు తొడరినం బొలివోని బలిమికలిమి వెలుంగుదు గాంధారీ

1. తేరు. 2. నియతమైఁ. 3. సేఁత కే నట్లు సమర. 4. బీభత్సుఁ జేయ. 5. లక్షయ తూణీరంబు లొసంగిరి.

నందనుండు గంధర్వరాజుచేతం బట్టువడినయప్పుడు పదునాలుగువేల గంధర్వుల జయించి యతని విడిపించితి నీ వోడకు మీఁగూడినకురుబలంబుల గెలిచి కర్ణగాంగేయకృపద్రోణద్రౌణిదుర్యోధనులు కనుంగొను చుండఁ గదుపులం గ్రమ్మఱించెద నని సత్వరంబుగాఁ జెప్పిన విని యుత్తరుండు చిత్తంబున [1]నద్భుతహర్షంబులు వొడువ మ్రాను డిగ్గనుఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలిచి యి ట్లనియె. 149

ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁ గా నెఱుంగుట

ఉ. బాహుసమగ్రశత్రుమదభంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్న విస్ఫుర
ద్దేహముతోడ భాగ్యమయదేవత సన్నిధిసేఁత కాదె స
మ్మోహము పాసెఁ జిత్తము ప్రమోద[2]రసత్వముఁ బొంది పొంగెడున్. 150

క. ని న్నెఱుఁగ[3]క యే నేమే, నన్నపలుకు లెల్ల మఱచి యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ, నన్నుం గృపఁ జూడవే [4]సనాథుఁడ నగుదున్. 151

క. [5]అన వినుచుఁ దేరు డిగి గ్రక్కునఁ గౌఁగిటఁ జేర్చి విరటుకొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన,[6]కనుఁగవఁ గడు నశ్రువారి కడలుకొనంగన్. 152

వ. ఇట్లు సమాలింగితుండై. 153

చ. మనము కలంక తేఱె రిపుమర్దనవిక్రమ యొక్క తేవ నీ
ఘనభుజశక్తి ప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండ నై
యనిమొన సారథిత్వముమహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథు [7]నదల్చు మరల్చు గోవులన్. 154

క. మనమునఁ గోరుదు నే నర్జునునకు సముఖమున రథ్యచోదకభావం
బునఁ బనిసేయ వలయు నని, యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్. 155

వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కి ట్లనియె. 156

మ. ప్రియ మక్షీణము నాకు నీదెస మదిన్ భీతి [8]ప్రమోద్వేగసం
శయముల్ చేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదుదృష్టి నిను నశ్వవ్రాతముం జోఁక గా
లియు రా నీను [9]దృణీకరింపు రిపు దోర్లీలాసముల్లాసమున్. 157

వ. అనిన విని భూమింజయుఁడు సవినయంబుగా ని ట్లనియె. 158

క. నిను నర్జునుం డని యెఱుంగనియంతన పాసె నెల్ల కిల్బిషములు నీ
తను వేల షండభావం,బునఁ బొందెనో యెఱుఁగ వలయుఁ బుంస్త్వాభరణా. 159

---

1. నద్భుతహర్షజలు. 2. రసంబునఁ. 3. లేక యిమ్మెయి, కయే నమ్మెయి. 4. సనాథుఁడ నై తిన్. 5. అనిన విని తేరు. 5. కనుఁగవపైన నశ్రువారి; కనుఁగొనఁ బ్రమదాశ్రువారి. 7. చెరల్చు మరల్చు 8. భ్రమోద్వేగ. 9. దృణీకరింతు.

చ. అనవుడు నాతఁ డిట్లను మదగ్రజుపంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహితం బగురూపముఁ దాల్చి యేకహా
యనపరిపాలనీయ మగునట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజతనంబు లోకులకుఁ బేడితనం బయి తోఁచె నిమ్మెయిన్. 160

వ. అదియును నిట మీఁద లే దనినఁ బ్రమోదమానమానసుం డయి మత్స్యపతి
సూనుండు పాండుసూనున కిట్లనియె. 161

ఆ. ఇట్లు తెలియఁ జెప్పు టెల్ల నాదెస దయ, పెంపుతోడికూర్మి పేర్మిఁ గాదె
యింక సురల కైన శంకింతునే భవ,ద్బాహువప్రగుప్తి [1]బలుపు కలుగ. 162

వ. నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండును గాండీవంబును గాంచనపుం
ఖంబు లగు[2]బాణంబులు గలతూణీరయుగళంబును మదీయతనుత్రాణకృపాణం
బులును బుచ్చికొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టి పెట్టి రమ్మని నియోగించిన
నాతండు నట్ల చేయుటయు నమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవతలకుం
బ్రణమిల్లి భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు కైకొని సవిశేష
స్ఫూర్తియగుమూర్తి నత్యంతదర్శనీయత్వంబు నొంది. 163

క. బలరిపుఁ డిచ్చినకుండల,ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం
దలఁప నవి వచ్చె వెండ్రుక, [3]లలవడఁగాఁ బాచి ముడిచె నమర దృఢముగన్.

క. తలచుట్టు [4]చుట్టఁ గుండల,ములు పెట్టను దిండు గాఢముగఁ [5]గట్టఁ గరం
బుల వలయంబులు కనుఁగొని, యెలన వ్వాలయంగ నెక్కె నేత్తైఱ రథమున్.

వ. అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 166

క. పెట్టక కట్టక మౌళిం, బుట్టినక్రియ దీధితులు నభోభాగంబుఁ
ముట్టి వెలుంగఁగ నింద్రుని,పట్టి కిరీటంబు పొలిచెఁ బ్రస్ఫురితం బై. 167

వ. ఇవ్విధంబున సన్నద్ధుం డై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధంబులు
పదిలంబుగా నిడి తనుత్రాణతలత్రాణంబులు తాల్చి కవదొనలం బూని గాండీ
వంబుఁ బుచ్చికొని యెక్కు పెట్టి ముష్టి నలవరించి గుణధ్వని చేసిన. 168

తే. పక్షిమృగజాతు లెల్లను బ్రమసి యిట్టు,నట్టుఁ గల[6]గొనఁ జెదరె వృక్షాళియదరెఁ
గురుబలంబును బెదరె నంబరము దిశలు, బూరటిల్లంగ[7]నొడఁగెఁ దదారవమున.

వ. తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దన పరంబున మున్న కలిగి
(న)విశ్వకర్మనిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగుమహాగ్ర
కేతనంబును దదాశ్రితంబు లై నవికృతాభీలనానావిధభూతంబులఁ బుత్తెంచిన
నుదాత్తచిత్తుం డయి యుత్తరుసింహ[8]పతాక శమీవృక్షంబునం బెట్టించి నిజ
ధ్వజంబు రథంబునం గట్టించి దివ్యంబు కావున దేవదత్తంబు చిత్తజ్ఞత్వంబున

1. బలము. 2. బాణంబులతూణీర; బాణంబులపొదియుఁ దూణీర. 3. లలవడఁ బాచి ముడిట్టె.
4. చుట్టి. 5. గట్టి. 6. గొనిచెదరె. 7. జెలఁగెఁ. 8. పతాకంబునం.

సన్నిధి చేసిన సవినయంబుగాఁ గైకొనియె నక్కుమారుండును నాయితం
బై నొగ లెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబుల యంగంబులు
తొడయుచు వాని జవసత్త్వంబులు వేఱువేఱ వర్ణించిన. 170

అర్జునుఁ డుత్తరసారథికం బైన రథం బెక్కి దేవదత్తంబు పూరించుట

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు పోవ ని
మ్మెడ కలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
నడపఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బి ట్టులియు [1]పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. 171

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకా[2]కులము సంక్షోభించె నవ్వేధయున్. 172

తే. అపుడు నిశ్చేష్టితంబు లై హయము లవనిఁ, జాఁపకట్టుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై వ్రందినట్లు, [3]మ్రొగ్గతిలఁ జాఁగి బలితంపుమూర్ఛఁ బొందె.

చ. కనుఁగొని ఫల్గునుండు తురగంబులవాగెలు పట్టి యెత్తి త
త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృతం బగురూపము చక్కఁజేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి గరి[4]మంబుగఁ గౌఁగిటఁ జేర్చి యి ట్లనున్. 174

తే. శంఖభేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింతలే పృథులసైన్య
పరిచయోదాత్తు లగునరపాలసుతుల, కెలమిఁ బొందుము దీనికి నింత యేల. 175

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ డాతని కి ట్లనుఁ దొల్లి శంఖని
స్వనములు విందు భేరులరవంబులు విందుఁ గరీంద్రబృంహిత
ధ్వనులును విందు నద్భుతవిధంబుగ ని ట్లవి యెల్లఁ జిత్తమో
హన మొనరింపఁ జాలు నె మహానినదం బిది యోర్వ వచ్చునే. 176

చ. చెవు లవిసెన్ దిశల్ తిరిగెఁ జిత్తము నీఱయి పోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్రకపిరాజపతాకయుఁ జూడ్కిఁ జీకటుల్
కవియఁగఁ గ్రాలెడున్ భవదఖండితతేజము పర్వ యాత్మకున్
వివశతఁ జేయుచున్న యది విహ్వలభావము మాన నేర్చునే. 177

క. అన విని తగుమాటల నా,తనికొంకలపాటు పాండుతనయుండు క్రమం
బున డిందుపఱిచి యరదము, చనఁగా నెఱిఁగించి పట్టె శంఖము మఱియున్. 178

వ. ఇత్తెఱంగున నయ్యుత్తరకుమారు ధీరుం గావించికొని పాండవవీరుండు రథనేమి
నిస్వనజ్యానాదమేదురం బగు శంఖారవంబు చెలంగ నడచుసమయంబున

---

1. బెట్టుగఁ. 2. గణము. 3. మ్రొగ్గడిలఁ. 4. మంబునఁ.

నాచార్యుండు దుర్యోధనున కి ట్లనియె. 179

సీ. శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం,క్షోభంబు [1]గావించె గుణముమ్రోఁత
బ్రహ్మాండభాండంబు పగిలించి భూతని,శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ, డడరించె నుగ్రంపుఁబడగపటువు
మిఱుమిట్లు గొని చూడ్కి పఱివోవ వెలిఁగి [2]ప,రిభ్రాంతిచేసెఁ గిరీటకాంతి
తే. తెల్ల మిది గాండివంబును దేవదత్త,మును గపిధ్వజమును వాసవునివరమునఁ
గన్నమకుటంబు నగు వేఱొకొన్నియైన, నుజ్జ్వలాద్భుతభంగులై యున్నె యిట్లు.

ఉ. అచ్చెరువైన విక్రమమునగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచు నున్నవాఁడు బలవద్రిపుభీషణ[3]బాహుఁడైన వి
వ్వచ్చుఁడ యింక మిన్నక వివాదము చేసినఁ బోవ దియ్యెడం
బొచ్చెము లేనిబల్మ గలఁ బోరి కమర్పుము దర్ప మేర్పడన్. 181

వ. అని కృపాశ్వత్థామాదియోధ[4]ముఖ్యుల నవలోకించి. 182

క. మన మొనల దుర్నిమిత్తము, లనేకములు పుట్టఁ దొడఁగె నట్లగుట జయం
బనుమానం బొకకార్యము, వినుఁడా మీ కెల్లఁ జూడ వెర వగు నేనిన్. 183

ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ కలయంబడి గోవ్రజంబులన్
దందడిఁ బెట్టకుండఁ బిఱుఁదన్ నడపింపఁగఁ బంచి గట్టిమై
నందఱు నింతకున్ వెనుకయై మొన లేర్చి చనంగ నప్డు సం
క్రందనసూతి డగ్గఱియెఁ గయ్యము చేయుట కప్పు డిమ్మగున్. 184

వ. అనిన విని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణులదెసం గనుంగొని [5]మున్ను నుం జెప్పితిన కాదె జూదంబునం బరాజయం బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను బదుమూఁడగునేఁడు జనపదంబున మన మెఱుంగకుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి *యాపదుమూఁడవయేఁటి కొలంత కలుగం బార్థుండు తన్నెఱింగించికొనియె నేని నెప్పటియట్ల వనవాసంబునకుం జనవలయు [6]నిది మనము మోహంబునం [7]గానమి నొండె వారు లోభంబున [8]వచ్చుట నొండె నగుం గావున నెక్కువ దక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు రిత్తయుత్తరుండ కాక [9]గాండీవియు నగుట మన కార్యంబు సఫలంబు సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయు లున్నవారని శంకించి వారలు కూయివచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చయించి చేసిన పనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు ని ట్లనియె. 185

ఉ. అర్జునుఁ డైన నేమి సురలైనను నే మగు విద్విష[10]చ్ఛిదో

---

1. నొందించె. 2. దిగ్భ్రాంతిసేసెఁ గిరీటకాంతిసొంపు. 3. రోషుఁ. 4. వీరు. 5. మున్న చెప్పితిం గాదె. *యీపదు. 6. నది. 7. గానమి యొండె. 8. వచ్చుట యొండెఁ గావలయుం గావున. 9. గాండీవియు వచ్చుట. 10. చ్ఛిరో.

పార్జిత మైనగోగణముఁ బట్టితి మెవ్వరు వచ్చి రేని వి
స్ఫూర్జితబాహుసంపదలు చూపుద మొండొరు మీఱి నిర్మలా
తూర్జితకీర్తికారణరణోద్ధతి వెల్వ్రలఁ బాఱ నేటికిన్. 186

చ. [1]మనసుల నాలుకొల్పి యనుమానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును నాయిత మయ్యెడుభంగిఁ జేయుచున్
మొనలకు [2]హెచ్చుగా మనము మున్ను కడంగినఁ గాక శత్రులం
గనుఁగొని యిట్టు లొండొరుమొగంబులు చూచుచు [3]నున్నఁ బోవునే. 187

దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట

ఆ. హరుల హేషితములు ననుకూలవాయుసం,చారములును మనకుజయముకలిమిఁ
దెలుపు చున్న యవి యుధిష్ఠిరానుజుఁ డొక్కఁ, డీబలంబు గెలువ నెట్లు నేర్చు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదు రని యెఱుంగఁ డకట నాయెదు రెదురన్
విప్వచ్చుఁ జూపి సేన, ౹, క్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు పలికెన్. 189

తే. రోష మొండెను రాజ్యాభిలాష మొండెఁ, గాక యీతనిరాకకుఁ గారణంబు
[4]పెఱయెఱుంగమ యెదిరిని బెద్దఁ జేసి, పూని వందివిధంబునఁ బొగడ నేల. 190

వ. [5]ఆచార్యు లైనవారలు కార్యంబు దప్పులం గనియెడువారు [6]కానఁ గయ్యంబు తెఱంగువారల నడుగ వలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధశ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు పలుకుదురుగాని పోట్లాడెడువారు కారు వారిం గలనం గలసి నిలువనీక పిఱింది దెస నిలిపిన మనకు వారు [7]విజయంబు గోరుచుండుట లెస్స యనిన విని యశ్వత్థామ యతని కిట్లనియె. 191

ఉ. కావలివారిఁ దోలి యొసకంబున గోవులఁ [8]బట్టికొంటి నం
చీవెడమాట లేల ధరణీశ్వర యింతకు మున్న వీటికిం
[9]బోవవు శత్రునే పుడిపి పోయెదు వాఁడవు కావు నీవు దై
న్యావళి నైనఁ [10]జేడ్పడక యాతల కెద్దుట లేదునేనియున్. 192

క. సమరమున గెల్చి యొరురా,జ్యము గొనియును సుజనుఁ డిట్టు [11]లాడఁడుసిరిజా
గమునఁ గొని రజ్జు లేటికి, సమయం బరుదెంచెఁ దొంటిచందము కలదే. 193

ఉ. పాండవవీరులం గలన బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు తొల్లి ద్రుపదక్షితిపాత్మజుఁ గొల్వులోనికిం
దెం డని [12]పుచ్చి తద్దెసకుఁ దెచ్చుట సౌబలునీతిఁ గాదె యా

---

1. మనముల. 2. నుబ్బుగా మనము. 3. నుండఁ బోలునేఁ 4. బీర మెఱుఁగమి. 5. ఆచార్యులు దప్పులఁ గార్యంబు తెఱంగుఁ గనియెడు 6. కయ్యం బిచ్చుతెఱంగు. 7. విజయంబు గోరుచుందు; (గోరుట; గోరుదు) రది లెస్స. 8. దెచ్చికొంటి. 9. బో వవి. 10. బాల్పడక యాతల కేదుట లేదయేనియున్. 11. లాడునె. 12. యద్దెస.

తండ్రి మఱల్చుఁగాక సముదగ్రత వచ్చువిరోధి నిప్పుడున్. 194

వ. అబ్బంగి నవమానింపంబడిన[1]వాఁడు కావున ధార్తరాష్ట్రకులధూమకేతు వగు [2]కపికేతనుండు తోఁచె నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింప వచ్చు నంతియ కాక దేవదానవుల కయినను దుర్జయుం డగు నర్జునునకుం దలసూప వచ్చునే నయవిక్రమంబుల నతిలోకుం డగు నతని నెవ్వరికేనియుం బొగడ వలయు *ననినం బుత్రనిర్విశేషుం డగు నిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె యింక సిగ్గుమాలి రణంబు చేసెనేనియు ద్రోణుండ చేయుం గాని యే నిట్టిదాని కోర్వ నదియునుంగాక. 195

క. ప్రళయాంతకుండు బడబా,నలమును మృత్యువును నెదిరినం గొఱఁతవడన్
నిలిపినను నిలుపు మార్కొని, చెలఁగిననరుశరము [3]లనవశేషము చేయున్. 196

ఆ. కుటిలబుద్ధు లిచటఁ గొనవు నెట్టన ఘన,దోర్బలంబు మెఱసి తొడరవలయు
నతఁడు గాండివమున నడ్డసాళులు వైవఁ, [4]దురుల నంపవానఁ గురియుఁగాని. 197

క. విను మట్టులు కా కున్నం, దనగోవులవెనుక మత్స్యధరణీశుఁడు వ
చ్చిన [5]మార్కొందుము నరుఁడేఁ, బునముట్టిన నతనిపొంతఁ బోదుమె యధిపా.

వ. అనిన విని రాధేయుండు సక్రోధుండై యోధవీరలోకంబు నాలోకించి. 199

చ. పశిగొని గోగణంబుఁ బోదువం బఱతెంచితి రెల్ల వారు ము
న్నొడఁబడి పాండునందనులయున్నెడ యిమ్మెయిఁ గాన వేఁడి యి
ప్పుడు నరుఁ గాంచి మీ రతనిపోటు నుతించుచు భీతి నిట్లు [6]వా
విడిచి యనేకభంగిఁ బృథివీపతి వీఱిఁడిఁ [7]జేయు టొప్పునే. 200

చ. వెఱచితి రేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక యొం
టఱు నలయుం గపిధ్వజము దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచి వైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నముచేసెదఁ దేరు సారథిన్
నెఱకులు నొంచెదం బొదులు నించెద నర్జునుగాత్ర[8]శాలలోన్. 201

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశాచక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండు కా నారద
శ్లాఘాపాత్రము నై యనర్గళభుజాసంరంభతన్ రౌద్రరే
ఖాఘోరాకృతి యేన [9]చూపెద నశంకం జూడుఁడీ యేర్పడన్. 202

క. క్రోధజ్వాలలు నిగుడ వి,రోధిబలేంధనముఁ బొదువుక్రూరతమై దు
స్సాధ మగునర్జునాగ్నిని, సాధించెద [10]నేన పూని శరవర్షమునన్. 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడు వత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబునకు వచ్చె నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్న యవి యేనును గురు

---

1. వాఁ డగుటం జేసి ధార్త. 2. కపికేతువు. *ననిన ఇది కొన్ని ప్రతులలో లేదు. 3. నిరవశేషము. 4. దరుల. 5. మార్కొందము. 6. వో విడిచి. 7. జేయఁ బాడియే. 8. శాలలన్. 9. మాపెదను జక్కం. 10. నేన యనిని.

సేనయందు శక్తిశౌర్యంబులు కలవాఁడనపోలె వర్తించెదం గావున నే మిరువు
రము నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రక
టించుట యుచితంబు కాదె యని వెండియు ని ట్లనియె. 204

సీ. అనుదినంబును నంత కంతకుఁ [1]బెరిఁగెడి, యధిపతిమన్ననయప్పుఁ దీర్ప
నర్జును నోర్చెద ననిలోన నే నని, యతనితోఁ బలికిన ప్రతిన నెఱపఁ
గర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగునొక్కొ, యనుజనంబులసందియంబు మాన్ప
జమదగ్నిసుతకృపాశ్రయమునఁ బడసిన,విలువిద్య కలరూపు వెలయఁ జేయఁ

ఆ. గనుట నేఁడు పుణ్యదిన మయ్యె నాకు [2]మీ, కెల్లఁ బోరు చూడ నిష్టమేనిఁ
జూడుఁ డట్లు కాక వేడుక లేదేని, సంతసమునఁ బసులఁ జూడఁ బొండు. 205

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కి ట్లనియె. 206

ఆ. కయ్యమునక యెప్పుడుఁ గాలుఁ ద్రవ్వుచు కార్య,గతికిఁ జొరవు నీతియుతులు సమర
మథమసాధనముగ నాడుదు రర్థసం,సిద్ధిఁ బొందు తెఱఁగు చేయునెడల. 207

క. అగు దేశకాలబలయుత,ముగఁ జేసినపోర నర్థములు మోఱకులై
తెగఁబాఱి తమ్ము నెదిరిని, వగవక తోడరుటలఁ గీడు[3]వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతు మేని. 209

సీ. శక్రాదిసురలతో సంగ్రామ మొనరించి, ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల [4]నాఁగఁ ద్రోచి సుభద్రఁ, గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు చేసె ని,క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ, గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె

ఆ. యని నివాతకవచు లనుదానవుల నాతఁ, డొక్కరుండ కాఁడె [5]యుక్కుమడఁచె
నమరులకు [6]నజేయు లగుకాలకేయుల, నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ. 210

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం
జేవ చెడి పోవు నప్పుడు, నీ వచ్చటఁ గలవొ లేవొ నిక్కము చెపుమా. 211

శా. కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపుక్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్వైరపరాక్రమంబులు మహోత్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బెల్కు దీ విచట బాహాశక్తి యిమ్మేదినీ
కాంతుం డియ్యకొనంగఁ [7]బూనితి వృథాగర్వంబు నీ కేటికిన్. 212

తే. ఏచి మున్నీరు చేయీఁత నీఁద నగ్ని, నుఱుక వాసుకికోఱలు పెఱుకఁ గడఁగి
నట్లు కాదె రాధేయ నీ వర్జునునకుఁ, బోర నెక్కటి మార్కొనఁ బూను టరయ.

క. బలుగాలిఁ బేర్చుదావా,నల మొక్కరుఁ డార్పఁ బోయినను దీఱునె నీ
చల ముడుగు సాహసమునం, గలదే మే లెట్లు నధిపుఁ గావఁగ వలదే. 214

---

1. పెక్కుడు నధి. 2. మీ, కేల పోరు. 3. వాటిల్లుఁ. 4. నాఁగి త్రోచి. 5. యుక్కు మడిచె. 6. నజయ్యు. 7. జూపుము; జూపితి; జెప్పితి.

తే. కురువిభుండును భీష్ముండు గురుఁడు గురుత,నూభవుండును నీవు నేనును గడంగి
కూడుకొని తాఁకుదము కాక క్రీడితోడ,నొంటిమార్కొన నవశమె యుక్కటికైన.

కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట

క. అని పలికిన సంరంభం,బున నినసుతుఁ డిట్టు లను రిపులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము కలుగుటఁ, గని కని నినుఁ దోడు పిలువఁగాఁ బలి చేలే. 216

క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రతికినదినముల్
[1]వేలారిచి తిం డ్రాతని, యాలము గని పిదప భీతి నొదుఁగుదు రాజిన్. 217

క. జన్నములు చేయునెడ బ,క్కాన్నంబులు కుడుచు [2]చుండు మధిపతి నిన్నుం
జన్నియ విడిచె రణముతఱి, మిన్నక[3]కినువడక పొమ్ము మీగృహమునకున్. 218

తే. ఏను విల్లందుకొనిన నీరేడుభువన,ములును వడవడ వడఁకు నాయలఘుబాహు
బలముఁ దలఁపక పలికితి పార్థుఁ డనఁగ, నెంతవాఁ డొక్కరథికున కింత యేల. 219

వ. అనియె ని త్తెఱంగున నందఱుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును సువిహితంబుగా నిట్లను ద్రోణాచార్యుండు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు కృపాచార్యుం డాడినచందంబును దెఱంగు పడియున్నయది మన్నన గలమానిసి యగుట నంగరాజునకు సంగరపాటవంబుమాటలు తగుంగాక మాన్యుల నధఃకరింప నగునే యని వెండియు. 220

ఆ. నేల ప్రొద్దెఱింగి చాలుమానిసి రణో,ద్యమ[4]మొనర్చు కాక తగినవారి
చెవికి జేదు కాఁగ నవమానవాక్యంబు, లుడుగ కిట్లు పలుకు టొప్పు నెట్లు.

క. బీరము లావును [5]మిగులఁగ, వైరులు తఱి యైనఁ దొడర వచ్చినచోటన్
దూరమున వెరపుతోడివి,చారము కలుగుటిది తగదె [6]సద్బుద్ధులకున్. 222

ఆ. అరులగుణము లైన నగ్గింతు రెప్పుడుఁ, [7]గలయ బెరసినపుడు కలితనంబు
మెఱయుదురు మహాత్ము లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నితఁడు బెట్టు పలుకు.

వ. ఆచార్యులైనవారలు పూజావాక్యంబుల కర్హులుగాక గర్హించుటకు విషయంబె యనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులు చాఁచి యి ట్లనుఁ బని చాలినంత కలదు వివ్వచ్ఛుండు వచ్చుచున్నవాఁడు విరోధంబునకు సమయంబుగాదు మనమందఱము గూడికొని కయ్యంబు చేయుదము బలవద్వ్యసనంబునందు భేదంబు కలుగు టొప్ప దని బుధులు చెప్పుదురు వేదంబు లొక్కవలనను ధనుర్వేదం బొక్కవలనను గలమీయట్టిమహానుభావు లెందునుం గలరె కురుబలంబున[8]కొకటిపుట్టినం బ్రసిద్ధులరు కావున నది మీవలన నిలుచు నట్లగుటం జేసి.

క. క్షమియింప వలయు నొకఁ డెఱుఁ,గమి నేమే నన్న నంతఁ గటకటఁబడి భూ

---

1. మేలనుకొని...; మే లరసి తిందు రాతని. 2. చుండు నధిపతి. 3. కినుక వడక చనుము పొమ్ము. 4. మొనర్చుఁగాక. 5. గలిగెదు; వైరులు పోటొడ్డి తొడర. 6. సద్భటులకును. 7. గలన. 8. కొక కీడు.

రమణునికార్యస్థితి చి, త్తములం దెడ చేయునట్టితరమే [1]మీరల్. 225

వ. అనిన విని వార లి ట్లనిరి. 226

క. క్షమియింప నెవ్వరము భూ,రమణునికార్యమున కెవ్వరము ద్రోణులచి
త్తము శాంతిపొందఁ జేయుట, మముఁ*దెలచుటయిట్టు లేల మాకొలఁదులకున్.

వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వత్థామను
వేఁడికొని కృపాచార్యులం దేర్చినం బ్రసన్నుం డయి యోధవీరులం గలయం
గనుంగొని ద్రోణాచార్యుం డి ట్లనియె. 228

తే. అలుక భీష్ముని[2]పలుకులయపుడ పోయె, మీఁదికార్యంబు నడపుఁడు మీర లింక
మోహసాహసములఁ గురుముఖ్యు దెసకుఁ, గీడు రాకుండఁ దగఁ బరికింపవలయు.

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం
దా సైరణ చేయఁడు కను, మోసము లే కొక్క మొగిన [3]ముసరఁగవలయున్. 230

వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడిన మాటయుం గలదు దాని
నిరూపించి యున్న రూపు గాంగేయుండు చెప్ప నర్హుఁ డనిన నతండు దుర్యో
ధనున కి ట్లనియె. 231

## భీష్ముఁ డర్జును నజ్ఞాతవాసవత్సరవ్యాప్తి నిష్కర్షించుట

సీ. రెండవయేఁట నొక్కం డధిమాస మి, ట్లక్కనయన్నెల లెల్లఁ గూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటితోడన నిండె నంత
యొఱిఁగియ తమపూన్కి యెల్లను దీర్చితి, మని పొడచూపె నర్జునుఁడు నేఁడు
పాండుపుత్త్రులు ధర్మపరులు ధర్మాత్మజుం, డేరి కధిష్ఠాత వారు ధర్మ

తే. పథము తప్పుదురే యన్నిపాటు లట్లు, పడినవారలు తెలియంగఁ బాలు నేర్తు
రెట్లు తమకించి నీతివిహీనవృత్తిఁ, దమకు నొకకీడు వచ్చువిధంబుఁ గాఁగ. 232

ఉ. అట్టిద యైన నాఁడ తెలియంబడి మూర్ఖతనంబు చేయరే
నెట్టన ధర్మపాశముల నిల్చిరి కాలము వేచి యుండి రిం
కెట్టును వారు కొంత తమయే డ్తెఱ చూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చి రేని మనముం దగ నోర్తము కాగ దానికిన్. 233

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు టెల్లవిధంబుల [4]కోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్క మెయి నిత్తెఱఁ బొం దగుచేతయుం దగున్. 234

వ. అనిన విని కురుపతి దరహసితవదనుం డగుచు ని ట్లనియె. 235

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు [5]కలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగికె విక్రమ, నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 236

1. మీరలె. *దెలుచు. 2. పలికినయపుడ. 3. మూఁగఁగ. 4. కోర్చుఁ దట్టు. 5. పొసఁగు.

వ. అనిన నయ్యిరువురవచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ గార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లే రయినను నాయెఱింగిన యంత నొక్క తెఱంగు చెప్పెద నీబలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందర పోవ వలయు నంతియ నేన తదనంతరంబ కదుపులం బొదివికొని చన వలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగ వలయుఁ గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడిం బడక నడచు గోవులు [1]నిన్నెలం గడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యట తోడుపడ నెవ్వరు గలిగినను వారికిం [2]జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబు బంచి యిచ్చి పుచ్చి పసులకుం దోడగుభాగంబునుం బంచి యున్నంత వట్టు చతురంగంబుల నియతి నేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్రుండు దాపటం గర్ణుండు ముందట వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లీక భూరిశ్రవఃప్రభృతియోధవీరు లెల్ల నెడనెడం గలయ నిలుచునట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహసౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసి తాను వెనుక యయి నడపించుచుండె నట్టిసమయంబున. 237

చ. అరుదుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకున్ మహోగ్రసం
గరమగుడున్ మనం బతులకౌతుక మొంది కనుంగొనన్ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కువిమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవమునిపంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాన్. 238

వ. అద్దివ్యయానరత్నంబునందు. 239

తే. స్వర్గమున నున్న రాజులుఁ జక్రవర్తులును [3]యథోచితచ్ఛత్రంబులును నిజార్హ
చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ, గొలిచియుండిరి వేడ్కలు కొనలు నిగుడ.

క. పాండుమహీపాలుం డాఖండలుచేరువన పెద్దగద్దియ నమరీ
మండలి వీచోపు లిడఁగ, నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వలభంగిన్. 241

వ. అంత. 242

సీ. దేవదత్తాభీలరావంబు వెస[4]ఁ గర్ణముల దీటుకొన పేటపముగను పడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు, లెల్లఁ గప్పఁగ [5]వెలువెల్ల నగుచు
బహుళకపిధ్వజప్రభలు లోచనములు, మిఱుమిట్లు గొనఁ [6]బర్వ మేడుపడుచు
నుద్భటాకారసముద్ధతి మనము [7]లు, త్తలపాటు తోఁపంగఁ దల్లడిలుచు

1. నిన్నెలవు. 2. జాలుద (జాలితి; జాలింత) మనిన. 3. నిజోచితచ్ఛ. 4. కర్ణములు
5. వెలవెల్ల. 6. బర్వ మెండుకొనుచు. 7. లుత్తలపడఁ.

తే. నడచుకౌరవరాజసైన్యంబుఁ గడిసెఁ, దీఁగ తిగిచినగతిఁ దనతేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయభైరవసహస్ర, [1]గర్జనోదగ్రతర్జనుఁ డర్జునుండు. 243

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ [2]గ్రోశద్వయంబునం గూడ ముట్టి క్రీడి తల యెత్తి చూచి యుత్తరున కిట్లనియె. 244

చ. ఇది యొకపెద్దగట్టిమొన యీమొనముందట గోగణంబుతో
నది యొకయల్పసైన్య మట [3]యాతల వే ఱొకకొంతసేన య
ల్లదె యిటు పంచి పెట్టఁ [4]జనునంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురురా జెచటం జనుచున్నవాఁడొకో. 245

క. అరయుదము గాని యిమ్మోహరమునకును డాపలించి యరదముఁ బో ని
మ్మురవడి నతనిక యుఱికెద, నరుదుగ నెబ్బంగి నెవ్వ రడ్డం బైనన్. 246

ఉ. ఆతఁడు చిక్కెనేని బల మంతయు విచ్చు మరల్చ వచ్చు గో
వ్రాతము [5]నట్ల యైన సుకరంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతతసేనయం దతని నారసి కానక యున్న వీరి ని
ట్లీతల డించి యాకదుపు నెయ్యఁగఁ బోదము కాక వ్రేల్మిడిన్. 247

క. విచ్చి చనకుండఁ బసులం, దెచ్చుట మునుమున్న వలయు తెఱఁ గాపనికిం
జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, నచ్చోటన దాయ మనకు నగపడెడు బలే. 248

క. అనిన విని యుత్తరుం డమ్మొనవలపటఁ బెట్టి యరదమును బోవఁగ ని
చ్చిన సరస కరిగి కవ్వడి, కను విచ్చి బలంబు నెల్లఁ గలయఁగఁ జూచెన్. 249

వ. ఇట్లు కలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల నిట్టట్టివారలు నడచుచున్నవా రని సారథితో నేర్పడం బలికి వీరలలో నురగకేతనుండు లేఁ డతఁడు గోవులం గొనిపోవనోపు [6]నిరామిషం బైనయీసేనతో నని చేయం బని లేదు [7]వీర లెయిది యడ్డపడి తడవు చేయకుండునట్లుగా ముట్టికొని పసులఁ బెట్టించి [8]వొరయును నెల గడవం బోవక యుండఁ బొదువ వలయు నని చెప్పి యతని నద్దెసకుఁ దేరఁ బఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబుల నిలువ రెంపును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలుగేసి యమ్ము లేసిన నాసవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తు లగు నాప్తజనంబులతో నల్లనయర్జునుం డింత యొప్పియుండునే యని యగ్గించి వెండియు.

ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట

మ. విలసద్గాండివచాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీల గా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సముద్యద్గర్జచందంబు గా

1. గర్జనోగ్రతర్జనుఁ డగనర్జు. 2. క్రోశద్వయమాత్రంబునం. 3. యావల. 4. జనె నన్నిటిలోన. 5. నట్టు లైన సుకరం బగు. 6. నిరామిష యైన. 7. వీ రియ్యెడ నెయిది. 8. దొరయును గడవం

జలదాకారత [1]నొందెఁ దేరితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీవ్రాశనిదాఘదుర్విషహగర్వ[2]స్ఫూర్తి నిర్ఘార్తిగాన్. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబుల మొదలం బడ రెం డమ్ము లేసి పెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు కావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం సోఁకములుగా రెం డమ్ము లేసె నని పలికి వెండియు ని ట్లనియె. 252

క. ఇషువులఁ బదుమూఁ[3]డేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చె బలువిడి నీక
వ్వడి తఱియ నుఱికి వడి ని, ప్పుడ [4]యిమ్ముల ప్రోవు నెల్లఁ బొరిగొనెడు బలే.

తే. విపినవాసంబు నజ్ఞాత[5]విధమువర్త
నంబు గడపి నవాభ్యుదయంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోతెంచుమార్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుం డగుచు నర్జునుఁడు పొలిచె. 254

వ. అనియెఁ గృపాచార్యభీష్ములు పార్థబాణపాతప్రకారంబులు ప్రణామకుశల ప్రశ్నంబులు గా నంతరంగంబులం గని*కొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కిన వారికి దుర్నిరీక్ష్యుం డగుచు నమ్మోహారంబు దెస ననాదరంబు చేసి గోవుల పజ్జం బోవు చుండె నతనిం జూచి సురనదీసూనుండు కురువీరులతో ని ట్లనియె. 255

క. చిరకాలమునకుఁ గంటిమి, నరు నక్కట వీఁడుసజ్జనప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ, డరిభీకరుఁ డిట్టివార లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁ గయి యీ,తనియతులితమూర్తి యత్యుదాత్తతఁ గడునొ
ప్పినయది కంటిరె జగ మె,ల్లను నేలఁగఁ దగుసముజ్జ్వలత యూహింపన్. 257

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ, దనరథముఁ దొలంగ నిచ్చి తఱియఁ బడుట కొ
ల్లనితలఁపు కలిగి క్రేఁగం,టన మనలం జూచుచుం గడచి యట నడచెన్. 258

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి తా నిచటఁ గానక యీ
తనిపజ్జ నరుగు తెఱఁ గగు, ననుమానము లేదు క్రోధ మగ్గలము మదిన్. 259

చ. మనకును గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చినయేని నాతఁ డ
ర్జునునకు [6]నొంటి చాలఁ డని రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
[7]డనిన నొరుండు శక్తుఁడె రయంబు మెయిన్ మన మెల్ల నిప్పు డా
తనికడ చేరఁగాఁ జనుట తప్పినఁ గార్యము తప్పు నెంతయున్. 260

ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను, ముట్టికొనిన నొకటి పుట్టెనేని
మనప్రయోజనంబు మఱియేమి పసు లవి, యేటికొండుధనము లెల్ల నేల. 261

వ. అని పలికి బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణాతత్పరత్వంబున నర

1. నొప్పెఁ. 2. స్ఫూర్తి (ను) మన్మూర్తిగాన్. 3. డేఁడులు, వడి. 4. యి మ్ముఖుఁ బ్రోవు (మ్ముఱి ప్రోవు). 5. వివిధవర్త. *కొని కొన్నింట లేదు. 6. నొంటిఁ జాల. 7. డన నొకరుండు.

దంబు సత్వరంబు చేసిన [1]సేనాపతిం గని సైనికనికాయంబులుం గడఁగి చనం దొడంగె నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవుల కావలిమూఁకయు వానిం దఱిమికొని యతిరయంబున నరుగం దానును [2]గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్తరున కిట్లనియె. 262

మ. ఇదె గోవర్గము చేర వచ్చితిమి పో నిం కేల సైన్యంబులుం
గదియన్ వే చనుదెంచె రెంటినడుమం గాఁ జొచ్చి యీవచ్చును
న్మదవీరావలికిన్ భుజావిభవవిన్యాసంబు కాన్పించి మా
న్పెద గర్వంబు మరల్చెదం బసుల నాచేఁ జిక్కె రా జెమ్మెయిన్. 263

## యుద్ధారంభము

క. అనుటయు విరాటతనయుఁడు మొన కడ్డము కాఁగఁ దూర్పు మొగమై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ, దనమూఁపులు రెండు నపుడు తలకుం గడవన్. 264

వ. తేరు సమ్ముఖంబు చేయించి పేరు వాడి క్రీడి కరతలం బెత్తి నిలునిలు మని యదల్చిన ఘోషంబుతోడన వెడలునిశితశరపరంపరల దట్టంపుఁబఱపున నంబరంబు నీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గలసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడవను మరలం బఱవను మఱచి వెఱచఱచి హరితనయహస్తలాఘవప్రశస్తి దక్కం దక్కిన చేష్టలు తక్కియుండె నతండు గోవుల వెనుకం బోవు నల్పబలంబు బెదరి తూర్పు దెసకుం [3]జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపి చూపి [4]వెలిఛీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబు లార్వ మౌర్వీరవంబును రథ[5]నినదంబును బ్రతిపతాకినీతుములంబును గగనంబునం బొగడునమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీకుహరంబు నిండిన నొండొండ [6]మట్ట లెత్తుకొని నేలమట్టవియుచు నద్రువం బసులు వెసం దిరిగి మున్ను విచ్చ్వచ్చుండు వచ్చినజాడ గైకొని దక్షిణదిశకుఁ [7]గెరలువొడుచుచుం దెరలం బాఱెన. 265

క. గోవులతోఁ జొదువంబడిఁ, బోవుచు నున్నట్టిగోపపుంజంబు తదీ
యావసరంబున సరభస, మై వానిపిఱుందఁ [8]దిరిగి యమ్మెయిఁ బఱచెన్. 266

ఆ. అప్పు డర్జునుండు తప్పక చూచి యీ, బలము పసుల కడ్డపడక యుండ
నెడ చొరంగ వలయు నిట [9]యొద్దికొనుమని, పనిచె మత్స్యభూమిపాలసుతుని.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జన నిచ్చె రథంబు గోపసంఘముఁ దిరమై

---

1. సేనాపతి సైనికనికాయంబులం గడచి చనం. 2. గెలనిట; గెలనిపట్ల క్రోశ. 3. జేరునట్లు. 4. విలునారి సారించి. 5. నేమినినదం. 6. మంట లెత్తుకొని నేలమట్టివిసి యద్రువం. 7. దెరలు పొడుచుచుఁ; జెరలు వొడుచుచుఁ; జిట్టలు వొడుచుచుఁ. 8. దగిలి. 9. యెదుర్కొను మని.

కొని పాండు పసుల నోడక, యని తా [1]నెలుఁగించి వీఁకకై నూల్కొలిపెన్. 268

వ. అట్టిసమయంబున. 269

క. కరితురగసమితిఁ [2]గార్కొని, కురువీరుల మొనలు[3] మొగులుకొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డుద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరల్చెన్. 270

క. కడిసినబలములు విచ్చినఁ, గడుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం
బొదివి యట కడపె నవియును, గొదగొని తమపాలముచొచ్చె గోపాలురతోన్.

వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272

ఆ. పసులు పట్టువడిన పదపడి నరుఁ డెద్ది, యాచరించెఁ గౌరవాధినాథుఁ
డేమి చేసె బలము లెట్లయ్యె భీష్మాది, వీరు లెవ్విధంబువార లైరి. 273

వ. అనవుడు. 274

మ. నవతాదూర పురాణతానుపగతా నానాత్వసం[4]శోభితా
వివిధత్వాపగమోజ్జ్వలా బహుకళావిర్భావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ [5]సూక్ష్మతర సంభాసా మహాస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయా [6]ధీవర్తకా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ, శాంతిసముద్యద్వివేకసంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా,త్యంతవిదగ్ధైకభజనతత్పరహృద్యా. 276

మాలిని.—

ప్రణమదవనవిద్యాప్రౌఢసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా పద్మజాదిత్యసత్ప్రే
షణచతురదయావిస్ఫారితాలోకలోకా
పణనిపుణజనాంచద్భక్తివిక్రీతమూర్తి. 277

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

1. నెలుఁగిచ్చి. 2. దార్కొని, కురువీరులు మొగులగములకొమరున; గూర్కొని. 3. మొగులు గవియుకొమరున: 4. బోధితా. 5. సూక్ష్మతరసం (భాషా) భావా. 6. ధీవర్తనా.

శ్రీ రస్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము - పంచమాశ్వాసము

శ్రీ సంపాదనచాతు
ర్యా సేవ్యపదారవింద యోగికవిద్యో
[1]ద్భాసితమూర్తిమయాత్మ
వ్యాససమానైకరూప హరిహరనాథా. 1

### అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున విరోధివర్గం
బుక్కు దక్కి వెక్కసపడి చూచుచుండ నిరర్గళభుజార్గళసంరంభవిజృంభణంబు
శోభిల్లఁ బసులఁ బెట్టించి యనతిదూరవర్తి యగుకౌరవచక్రవర్తిదెసం గనుం
గొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు పఱుపం బనుప నప్పళించు
నప్పుడు కురువీరులు కూడుకొని మూఁడువేలరథంబులతోడను గాంగేయకర్ణ
లొకొక్కరుండు వేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వాడిదిక్కు
మొగంబుగాఁ దిరిగి రట్టియెడఁ గదుపులు పట్టువడుటకు నిట్టూర్పు [2]నిగిడించుచు
మగిడి మనుజపతియు ననుజసహితుం డై సహస్రస్యందనంబులతోడ వెన్నుదన్ని
నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదికొని[3]యుమ్మెయిన దళంబుగాఁ గవిసిన. 2

క. కనుఁగొని యొలన[4]వ్వాలయు వ,శనమున గరువంపుఁజెన్ను దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతన కి, ట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్. 3

సీ. కాంచనమయవేదికాకనత్కేతనో,జ్జ్వలవిభ్రమమువాఁడు కలశజుండు
సింహలాంగూల[5]భూషితనభోభాగకే,తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు
కనకగోవృషసాంద్ర[6]కాంతిపరిస్ఫుట,ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు
లలితకంబుప్రభాకలితపతాకావి,హారంబువాఁడు రాధాత్మజుండు

---

1. ద్భాసితమూర్తిమయాసం(శ్రీ; సద్) వ్యాససమానైకరూప; ద్భాసితమతి(గుణ) మూర్తిమయా, వ్యాససమానైకరూప; ద్భాసి...యాత్మ, వ్యాస; వి,న్యాస. 2. నిగుడించుచు. 3. యమ్మెయి సరభసంబుగాఁ; యమ్మొన దళం. 4. వ్వాలయ. 5. భాసిత. 6. కాంతిపరిస్ఫురద్ధ్వజ.

తే. మణిమయోరగరుచిజాలమహితమైన, పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘనతాళతరు వగుసిడమువాఁడు, సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము.

క. గురునకుఁ బ్రదక్షిణంబుగ, నరదముఁ బోనిత్త మిమ్మహాపురుషునెడం
బరిభవము వలవ దీతఁడు, కురుకులనృపతనయశిక్షకుఁడు సుమ్మనఘా. 5

క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు ధను, శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్. 6

ఉ. ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగ దేను దుష్పృథ
ద్యూత[1]జయోద్ధతుం డగుసుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము తాన మున్ననికిఁ జొచ్చినఁ జొత్తముకాక పిమ్మటన్. 7

క. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱి చూడ నరిది సం
గరమున [2]నీతని నీశ్వర, వరజనితుఁడు మేటి కౌరవవ్యూహమునన్. 8

క. [3]ధైర్యధనుఁ డితఁడు ద్రోణా,చార్యుల కెన వచ్చు దివ్యశరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా,చార్యక మొనరించె మాకు శైశవముతఱిన్. 9

తే. వీర లిరువురు మాన్యులు వీరితోడి, కయ్యమున కెప్డు మన మంత కాలుద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా మెలఁగి రచట, మనరథం బల్ల నల్లనఁ జనఁగ నిమ్ము.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు కురుక్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలితశ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో,ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు చేయు నాకును, దుర్యోధనుఁ డెపుడుఁ దన్నెదురు చేయంగన్ .12

చ. అతిదృఢ[4]వేది పేరు గలయట్టిమగండు రణంబు కల్గెనేఁ
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ
మతి కలఁగంగనీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱతారతమ్యమున్. 13

క. [5]ఈయెడ ననుఁ గని వారణ, చేయుఁడు నితఁ డగ్గమైనఁ జిచ్చుఱపిడుగై
పోయి పయిఁ బడుదు నీ వర, వా యించుక లేక పఱపవలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పండువు నాకు నుత్తరా. 15

---

1. జయోన్నతుం. 2. నీతం డీశ్వర. 3. శౌర్యఘనుఁ. 4. వేధి. 5. ఈయన ననుఁగని వారణ, సేయండితఁ.

తే. అరసికొని యెన్నిభంగులనైన నితని, తేరు మనబారి కగపడుఁ దెఱఁగు గాంచి
యడరి బాసటయై యెవ్వరడ్డపడిన, [1]మెఱపు మెఱసినచాడ్పునఁ దఱియఁ జొరుము.

క. అస్మత్పితామహుం [2]డతి, విస్మయజననప్రతాపవిభవాగ్నిశిఖా
భస్మీభూతప్రతిప, క్షస్మయకాననుఁడు ప్రథమగణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా,రహస్యసంవేది ధార్తరాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁడై, [3]సహాయ మగు వారలకు నచటఁ దా నునికిన్. 18

క. వివిధము లగులక్ష్యంబుల, నవలీలం దునియ నాట నవియఁగ [4]నేయున్
భువనైకధన్వి నత్యు,గ్రవిచేష్టితు నోర్చెఁ బరశురాముం బోరన్. 19

క. శంతనునందనునరదము, పొంతం బో వలవ దలుక పుట్టి యతఁడు భూ
[5]కాంతునకు సైన్యమునకుం, [6]జెంతలఁ జేరంగ నీక సిలుగులఁ బెట్టున్. 20

వ. అని యిట్లు వేఱువేఱం జూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరో
న్ముఖుం డగుసమయంబున [7]సస్మితుం డగుచు నశ్వత్థామ రవితనయు నవలోకించి
యి ట్లనియె. 21

క. నిను నీవ పొగడికొని పలి,కినపలుకులు పెక్కు కలవు క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె మ్రా,ర్కొన [8]రాదే కర్ణ సేనకుం బ్రియ మెసఁగన్. 22

క. తలఁకు కల దేని శకునిం, బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీపతి నీ
తలన *మనకార్యఖడ్గం,బులమో పెక్కించె రిత్త వోవునె నీకున్. 23

వ. అనిన విని యతండు క్రోధఘూర్ణమాన [9]తారకుం డగుచు ని ట్లనియె. 24

చ. తలఁకెడువానికిన్ [10]మగఁడ తా నటె నన్నడఁకించువాఁ డిపీ
పలుకకు [11]భితున ట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడ కాఁ డట వాసవుఁ డైన నేమి నా
బలముఁ జలంబు [12]నేరిమియు బంటుతనంబును నీవ చూడుమీ. 25

క. అని [13]కడఁగునినసుతునకు, న్మను ద్రోణుఁడు ద్రోణనందనుఁడుఁ గృపుఁడును శాం
తనవుఁడుఁ గడఁగుట దుర్యో,ధనుఁ డవలోకించి యత్యు [14]దగ్రతఁ గడఁగెన్. 26

వ. ఇవ్విధంబున నయ్యేవురు దొరలును ధరణీశుండును సరభసంబుగా బరవసంబు
చేసిన దుశ్శాసన దుష్ప్రిహ దుర్ముఖ ప్రముఖ నిఖిల కురుకుమారనికాయంబును
శకునిసైంధవప్రభృతిబంధునివహంబును బాహ్లికసోమదత్తాదిసామంతనికురుంబం
బును మఱియునుం గలవివిధయోధవీరనిచయంబును నొక్కటఁ గరటి ఘటా
ఘోటక ధట్ట రథ యూథ పదాతి వితతి సంరంభశుంభత్సేనాసమూహసహితం
బుగాఁ ద్రోచి నడచిన 27

1. మెఱుఁగుమెఱసిన. 2. డరి. 3. సహాయుఁ డగు నచటఁ దాను సన్నిధి యగుటన్.
4. నేయన్. 5. కాంతుదెస. 6. జెంతం. 7. మందస్మితాననుం. 8. వలదే. *తన. 9. మానసుం.
10. మగఁడు. 11. భీరున. 12. ధీరతయుం. 13. కడఁగెడు నినజునకున్. 14. దగ్రత నడరన్.

చ. ధరణి వడంకె ధూళి దివిఁ [1]దన్నినభానునిఁ గానరాద బం
ధురవివిధప్రకారపటుతూర్యరవంబులఁ బొంగె దిక్కులా
స్ఫురితమహాయుధోగ్రరుచిపుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖదైవతమండలదుర్నిరీక్షమై. 28

అర్జునుఁడు కౌరవసైన్యంబుల నుఱుమాడుట

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు శతమఖతనయుండు. 29

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ [2]గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమీఱినకా,ల్బలములఁ బొడిసేయు మఱియుఁ బైపైఁ బీనుం
గులఁద్రొక్కికొనుచు వెస ముం,గలిమొనఁ [3]గవియుటకు వేడ్కకడలుకొనంగన్.

క. తనదృష్టియు ముష్టియుఁ దగు, ననువున మున్నెత్తి యేయునతఁ [4]డప్పుడు డిం
చినగాయముల సపాటం,బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్. 32

చ. ఉడుగక *నెంచియుఁ సుభటు లొక్కమొగిఁ వెస నంటఁ దాఁకి క
వ్వడిపటు బాణభాస్వదనివార్యసముద్ధతిఁజేసి మంటలో
మిడుతలు చొచ్చిన ట్లయిన మేటిమగల్ కని యీడఁబోక బ
ల్విడి మఱియుఁ వడిం బొదువ ప్రేల్మిడిఁ ద్రుంచె నతండు తోడుతోన్. 33

తే. అంత కంతకుఁ గదిసి సైన్యములు చుట్టు, ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు
దీటుకొనునట్లు చేయఁ గిరీటి గాండి,వంబు పరి[5]చాలనంబు తీవ్రంబు కాఁగ. 34

సీ. గోర [6]బోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ,బాలుగా [7]వ్రయ్యలు వాపి పాపి
[8]బాడిస నఱకినభంగిఁ గొన్నింటిఁ దు,త్తునియలుగా [9]బిట్టు త్రుంచి త్రుంచి
వెస అంపమున [10]నిడ్డవసిగఁ గొన్నిటి నిసు,మంతలుగా నుఱుమాడి యాడి
పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ, జిఱునుగ్గుగాఁ బొడిచేసి చేసి

తే. యడరిపొదివినబలము నానాయుధములఁ, బ్రతిహతంబులఁగావించె నతిరయమున
నతులతధ్వజసూతహయత్వలనద, ఫల్గురథవల్గనుం డగుఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధ [11]వర్మ,స్తోమం బలువుల్లు చేసి సునిసితబాణో
ద్దామప్రసారవిభవ, శ్రీ మూర్తుర కద్భుతంబు చేసెం గడిమిన్. 36

క. గర్జద్గుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు పొగడఁగ, నిర్జరవరనందనుండు నిమిషార్థమునన్. 37

---

1. దన్కిన (దాఁకిన; దాఁకెను) భానుఁడు గానరాఁడు. 2. గ్రేళ్లు వాఱ; గేల ధార. 3. గదియుటకుఁ గడఁక. 4. డపుడు ని(గు)గ్గి,డ్చినఁగాయ *వెండియుఁ. 5. చలనం బుదగ్రంబు. 6. జీరిన. 7. వ్రక్కలు. 8. బాడిత (ద). 9. బెట్టు. 10. నిడ్డవసిఁ; నిడ్డపసగఁ. 11. మర్మ.

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజాసంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబులక్రియన్ రంజిల్లి యొప్పెం గడున్. 38

చ. తదవసరంబునన్ దొర నుదగ్రతఁ ద్రోచిన [1]వజ్రఘట్టముల్
మదమున నొక్క పెట్ట బల[2]మర్దనసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణులభూరిరవంబుఁ గరీంద్రఘంటికా
ఘ్యుదితనినాదమున్ రథవ[3]రోద్ధితఘోషము [4]నుత్కటంబుగాన్. 39

తే. అట్టియెడ వేల్పు[5]వచ్చినయట్లు మేను, పొంగ నలిరేఁగి పాండవపుంగవుండు
మత్స్యనృపనందనునిబలుమాటతోడి, యేపు చెవికిని జూడ్కికి నింపు నొసఁగ. 40

క. మేదురదీర్ఘతరం బగు, నాదం బెడ తెగక గుణమునను వడి [6]నిగుడం
గోదండము సంతతవల, యోదాత్తస్ఫురణ వెలుఁగు చుండఁగ నేసెన్. 41

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడాత్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబులై యాగప
ద్యకృత వ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమార్తాండున్ విడంబించుచున్. 42

క. నరు లొరులు దృశ్యములపైఁ, బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు పడుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయునిశిత,శరములు లక్ష్యములు తప్పి చన వించుకయున్. 43

క. గజఘోటకరథసూత,ధ్వజకంకటయోధగాత్ర[7]తతియం దెచటన్
విజయధనుర్ముక్తశర,వ్రజములు [8]తవులంగఁ బడ కవారణ నిగు[9]డున్. 44

చ. కవదొన *లేల పూనునొకో కవ్వడి నా వలదుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరపటిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ
పువెరవుతోన పీడ్వడక పొం దొడఁగూడెడు [10]నెప్డు చూచినన్. 45

క. సమవిషమవివిమ్నోన్నత, సమీపదూరస్థలములు సదృశములు గఁ [11]జి
త్రముక్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము చను నవితథమై. 46

వ. వెండియు నతండు. 47

మ. బల మెల్లన్ [12]వెఱ రెండుపాయలుగ శుంభద్వేగుఁడై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై

1. పోల్చుధట్టముల్. 2. మర్దనసూతి. 3. రోద్ధత. 4. నుద్భటంబుగాన్. 5. సోఁకిన; పట్టిన. 6. నిండం. 7. తతులందెల్లన్. 8. దవులంగఁ బడ. 9. డన్. *పూనె. 10. నేపు నెప్డు; సూడఁగన్. 11. జిత్తముక్రియ నవహిత. 12. వెస.

వలయంబుల్ చని చించి చిక్కు*పఱచుఁ వైకల్యసంపాది యై. 48

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించు చందంబునఁ దదీయరథంబు కౌరవసైన్యంబునందు సంచరించు నయ్యవసరంబున. 49

ఆ. రత్నకేతనములు రాజిత[1]శేఖరంబులును రుచిరఘంటికలును బార్థ
బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవులచేటు, తెలుప డుల్లు[2]నుల్కలునుబోలె. 50

క. నరు[3]భల్లంబుల నగ్రిమ,చరణంబులు [4]త్రెస్సి మ్రొగ్గుజవనాశ్వంబుల్
కరుణమెయి[5]రాహుతులకుఁ, శరణంబగు మనుచు మ్రొక్కుచందంబొందెన్. 51

క. దంతిఘటాసంతానము, కుంతీసుతునారసములఁ గూలినతఱి న
త్యంతనిబిడాభ్రముల దివి, యెంతయు సొంపారుభంగి నిల చెలువొందెన్. 52

క. పలుపులుఁ [6]గాండ్లుం బగ్గంబులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాఱెడురథ్యంబుల నేయఁడు దివిజరాజ[7]పుత్త్రుఁడు కృపతోన్. 53

ఆ. అర్జునాస్త్రఖండితాతపత్త్రధ్వజ,చామరములు గాలిఁ జదలఁ దూలఁ
జిహ్నములవిభూతిఁ జెందంగఁ గని యొప్పె, నప్పు డాడుచున్నయట్ట లచట. 54

క. ఒకమరి కిరీటికట్టెదిరికి[8]నుఱుమునఁ బోయి రేని రెండవమాఱి
య్యకొనుట కోర్వఁగ లేరై, రొకళ్లుఁ గురురాజసేన యోధులలోనన్. 55

సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి, [9]విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర,యంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి,[10]గలిబిలి యగునట్లు కలఁచి కలఁచి
మదభరభీషణమాతంగముల ముట్టి, చిందఱ వందర చేసి చేసి

ఆ. పటుపదాతిచయముపై రౌద్రరసమహో,గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచిబాణసంఘంబు మత్తశుం,డాలఘోరలీలఁ గేలి చలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిహేతిఖండనా
దక్షత పెంపుసొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ
స్రాక్షతనూజుసారథిరథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము [11]వెక్కస మంది బెగ్గిలన్. 57

క. తేజోధనుఁ డగునరుఁ డు,ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ దెక్కొనియెడు, నోజం గురుబలము పేర్మి యుడిపెం దోడ్తోన్. 58

తే. కాలపక్వంబు లైనలోకముల జముఁడు, వారిసమరెడుచాడ్పున మారి మసఁగి
యుగ్రరూపుఁ డై శౌర్యసమగ్రబాహు,సంపదుద్దాముఁ డగుక్రీడి చంపె రిపుల.

---

*పఱిచెఁ. 1. శిఖరంబులును సురుచిరఘంటలును గిరీటి. 2. నుల్కములును. 3. బాణంబుల తాఁకునఁ, జర. 4. తునిసి మ్రొగ్గు. 5. రావుతులకుఁ. 6. గాఁడులుఁ. 7. పుత్త్రుండు కృపకుఁ. 8. నఱుమఁగఁ; నఱిముఱిఁ; నిమ్ముగఁ. 9. పీటతాటంబుగా. 10. గజిబిజి యగు. 11. నివ్వెఱఁ గంది.

వ. అట్టియెడ మున్ను తురంగమ [1]ఖురాదులం దూలిన కెందూళియుం, బైపయి *నెగ
యఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చి చనువివ్వచ్చు[2]నిశితశరపరంపరలు(ను),
సైనికశరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరనికరవికీర్ణ రవికిరణపరిణతం బగు సమీ
రణంబును, ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబునుం గలయం గెంపు
సంపాదించి[3]యకాలసంధ్య నావహించినం దదుచితవ్యాపారపారంగతంబులై పొడ
చూపిన యుడుగణంబులుం బోలెఁ బొలుచు ధనంజయసాయకదళితకుంజరకుంభ
వికీర్ణమౌక్తికవిసరంబులవలనను, సముదీర్ణమదవేగదుర్నివారవారణవిదారణంబు
లగు నర్జునాస్త్రపాతంబుల బెదరి తేం ట్లెగయుట పొగ లెగయుటయుం, బ్రతిభట
బాణఘట్టనంబునం బాండవమధ్యము కాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగు
డుట మంటయునుగా, మూర్తం బగు తదీయక్రోధదవానలంబు చటచ్ఛటాశబ్దం
బులచాడ్పునం జెలంగుచున్న యుధిష్ఠి*రానుజు నతినిష్ఠురభల్లభజ్యమానబలవద
రాతిఖరాస్థినిస్వనంబులవలనను, దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టుశోణితంబు
నీళ్లనందుఁ బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళ
పుంజంబును నై కొలంకులచందంబు నొంద వాని [4]కెలఁగెడు కొదమతుమ్మెదపదు
వులపగిదిఁ దొరఁగు నాఖండలతనయఖండితపరవీరకాలాయసవారాచకలంబుల
వలనను, గిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాలగళిత మస్తిష్కపలలపంకంబునను,
నలుదెసల నంతంతఁ గదియం జాఁగి పడియున్న [5]కృత్తకరచరణంబులను, వెదపదనికి
రొంపి కలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెఱంగు తోఁచుటకు
నీడై చతురహాలికుండు చల్లుపరువంపు మొలకలచెలువునఁ బెల్లు దుల్లుఘల్లునాశుగ
సంతాడనవికీర్ణశత్రుశేఖర వజ్ర[6]వ్రజంబులవలనను, సంగ్రామం బభిరామం
బయ్యెను ఘోరప్రకారంబయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల నుక్కడఁగఁగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు పాండవమధ్యము తేరివీథియం
దఱవఱ లై పడం గని భయంపడి యిద్దెస వచ్చెనేని న
త్తెఱఁ గయి పోమె యంచు [7]నెడ తెంపిగఁ గొందఱు [8]పాయఁ బాఱఁగన్. 61

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలుభటులఁ జూచి [9]యొదలు వడఁకఁగ మేనుల్
తూలఁగఁ దముఁ దాఁకకయును, నాలము చాలించి కొంద [10]ఱవలఁ జనఁగన్. 62

తే. ప్రొద్దు గ్రుంకిన మఱి కాని పోవఁ డొక్కొ, క్రీడి యనికొంద ఱాజికి నీడఁబోవ
బలములెల్లను దెగటాఱఁ బఱపికాని, తక్కఁడెట్టులు ననుచుఁ గొందఱు చలింప.

---

1. ఖురంబులఁ. *నెగయఁ పర. 2. శితవిశిఖశరఁపరలు. 3. లయకాలసంధ్య. *రానుజనిష్ఠుర.
4. కరిగెడు. 5. నికృత్తచరణంబులను. 6. పటలంబునను. 7. నెడతెంపుగఁ; నెడత్రెవ్వఁగ. 8. పాయ
వాఱఁగన్. 9. యొడలు. 10. అవుల.

క. తరతరమ ప్రజలఁ దునిమెడు, నరునప్పటియొత్తికోలునకు సురవిద్యా
ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. 64

క. తమతమయొద్దిబలంబులు, క్రమవిరళము లైనదొరలు గాండివిపై సు
గ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్యశరతత్పరుఁ డై. 65

సీ. ఆచార్యు డెబ్బది యమ్ముల నాచార్యపుత్త్రు నేడింటఁ గృపునిఁ బదింట
దుస్సహుం బన్డ్రెంట దుశ్శాసనునిఁ బది,యేనింట సౌబలు నెనిమిదింట
సమరనదీసూను నఱువదింటను నేసి, రవిసుతురథ్యసారథుల నొంచి
వర్మమంతముఁ ద్రుంచి వైచి మర్మాస్థిబంధములు భేదించి విక్రమము నెఱపి

ఆ. ఇట్లు దొరలు నొవ్వ నేద్దెఱఁ దనచేతి, కోలఁది చూపి క్రీడి చెలఁగి దేవ
దత్తమొత్తుటయును దత్సైన్యములు చెడ, విఱిగి పాఱె భీష్ముమఱువు చొచ్చె.

క. గాంగేయుఁ డవష్టంభో, త్తుంగతనుం డగుచు నిట్లు తూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు, సంగతములు చేసె సమరసమ్ముఖములు గాన్. 67

వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసి యగు భీష్మభుజబలంబు ప్రాపున [1]మాతంగ
తురంగస్యందనసందోహంబులతోఁ గుంభసంభవకృపాశ్వత్థామకర్ణవికర్ణ[2]ప్రముఖ
నిఖిలయోధజనంబులు సుయోధను ముందటఁ బన్ని నిలిచినం జూచి సవ్యసాచి
ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుం డగుచు నుత్తరున కిట్లనియె. 68

ఉ. కంచము లప్పళించి తురగంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ఘనప్రకరంబునుబోలెఁ గాఱుకొం
చుం దఱ చైనదంతి[3]భటసుందరకేతనరాజి క్రాలఁగా
[4]ముందట నిల్వఁ గట్టెదిరిమోహర మున్నవిధంబు గాంచితే. 69

ఆ. కర్ణుకేతనంబు క్రాలెడు [5]నల్లదె, యీతఁ డాజికేళికౌతుకమునఁ
గడఁగి వచ్చుటయును గలిగియున్నది మున్న, తొడరవలయు[6]నతనితోడ మనము.

వ. అని మఱియును. 71

చ. రయమునఁ గిట్టి [7]యీతనిపరాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మి యున్నకురురాజునకున్ వగ పుట్టఁ జేసెదన్
హయములఁ బోవ నిమ్మనుఁడు నాతఁడు నాతనిలావు నచ్చి ని
ర్భయమునఁ [8]దేరు వోఁ బఱపె భాస్కరసూతికి సమ్ముఖమ్ముగన్. 72

అర్జునుండు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొను బెబ్బులియుంబోలె రాధేయుదెస నడచు
కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుస్సహుం

1. నేచి మాతంగ. 2. దుర్ముఖప్రముఖ. 3. రథ; ఘట. 4. ముందర నిల్చి కట్టెదిరి; ముందర గట్టిమై నిలిచి. 5. జూచితె. (నిం దిదె), యాతఁ. 6. నితని (వీని) తోడ. 7. యాతని. 8. దేరు వేసడపె.

డును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును
శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గలకురుకుమారవర్గంబు నిరర్గళ
ప్రకారంబు లగురథచిత్రప్రచారంబులు మెఱయ మొనకుం దలకడచి చటులపటు
బాణవేణికాపరంపరలు నిగుడ నొక్కపెట్ట కవిసిన నతండును గుణధ్వని తంత్రీ
నాదంబుగా నావిండ్లవా రొత్తుకాఁడుగా గాండీవంబు వీణగా వినోదంబు చలిపె
నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఁటి నిశితశరముం, డలిఁ గప్పెం బార్థు నుత్కటక్రోధమునన్
విలు విఱుగ నేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్. 74

క. [1]ఇంతయుఁ గనుఁగొనియును శ, త్రుంతపుఁ డోసరిల కాజి దోహల [2]మలరం
గొంతేయుతోడఁ దలపడి, వింత లగునకూర్మనఖరవిశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును. 76

క. సూతుఁ బదింటను నైదిట, నాతనియంగంబు నొంచి యంత నిలువమిన్
[3]శాతఘనశరము వేకొని, యాతల వెడలంగ నేసి యసువులఁ బాపెన్. 77

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర వెల్లిఁగొలిపె
భయరసమువట్టుపెట్టునఁ బగఱు పాఱ. 78

క. అందఱు రథికులు పఱవఁగ, నిం దేటికి మున్ను వచ్చి [4]తిస్సీ యని సం
క్రందనసుతు మార్కొనియెఁ ద,గం దెగి సంగ్రామజిత్తు గర్వోద్ధతుఁ డై. 79

క. తలపడి వాలమ్ములు పై, నల వేర్పడ నినుచుటయును నలుక పొడమినం
దల దునిమి వైచె నాతని, బలసూదనసూనుఁ డొక్కపటు [5]భల్లమునన్. 80

తే. అప్పుడు రాధేయుఁ డిమ్మెయి ననుజుపాటుఁ, జూచి యేనుంగునకు సిళ్లు చూపినట్లు
కవిసి హయముల మత్స్యభూకాంతుతనయు, నేసి పండ్రెండుశరముల నేసె నరుని.

ఉ. కేసరివిక్రముండు కపికేతనుఁ డత్తఱి వైరివీరసం
త్రాసకరప్రకార మగుదర్ప మెలర్పఁగ బాణజాలవి
న్యాసమునన్ వెసం బొదివె నర్కసుతున్ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁ డై పొదువుభంగి సురావలి పిచ్చలింపఁగన్. 82

క. ఇరువురువీరులు ని ట్లొం, [6]డొరువులఁ దలపడుట చూచి యుత్కట మగున
చ్చెరువాటుఁ గౌతుకంబు న,డర నూరక [7]యుండె నయ్యెడం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసరత్పాషాణవర్షంబు మి
క్కిలి యై శైలముఁ గప్పునట్లు నరు నక్షీణాస్త్రసంతాన మి

1. అంతయుఁ. 2. మదరం. 3. శాతఘనశరము చేకొని; శాతశర ముద్ధతిం గొని, యాతత వేగమున నేసి. 4. రిస్సీ. 5. బాణమునన్. 6. డొరులం. 7. యుండి రయ్యెడం గురువీరుల్.

ట్టుల మై కప్పినఁ దీవ్రమారుతము గాఢవ్యాప్తిజీమూతమం
డలిఁబోలెన్ విరియించె భానుజుఁ డవష్టంభోజ్జ్వలాకారుఁ డై. 84

క. విల్లును దానును శిఖి రా, జిల్లఁగ వెలుఁగొందువహ్ని చెలువంబున శో
భిల్లుటఁ గని కురుసైన్యము, లెల్లను దూర్యములు మ్రోయ నేడ్తెఱఁ జెలఁగన్. 85

క. రవితనయుబాణములు వా, సవనందనుఁ బొదివినపుడు సంతోషముఁ ద
ద్వివిధాస్త్రము లాతనిపైఁ, గవియ విషాదంబు నొందుఁ గౌరవసేనల్. 86

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాండీవి కర్ణున కి ట్లనియె. 87

ఆ. సభలఁ బలుకు దీవు సరి [1]లేరు నా కని, యిదె రణంబు వచ్చె నెల్లవారు
కెఱుఁగవచ్చు దీనఁ బెఱచోట రజ్జైన, యట్లు పూరగింప నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ, పోటుమగలు వినఁగ నింకఁ బోఁపుట తగ దె
ప్పాట నది కాక తమ్ముని, పాటును గన్నారఁ గంటి పాఱుదు మింకన్. 89

ఆ. పలుక వచ్చుఁగాక పలికినయట్టుల, చేయ వచ్చునెట్లు దాయ యొంటఁ
బోయి దట్లు ద్రుపదపుత్రికఁ [2]బఱుపంగఁ, గాంచి నగినఫలము కంటు కాక. 90

క. ఏ నపుడు ధర్మపాశా, ధీనుఁడ నై కోపమునకు దీ కొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ, బో నయ్యెం గాక యింకఁ బొమ్మా యిచటన్. 91

వ. అనిన విని రాధేయుం డి ట్లనియె. 92

ఉ. అప్పుడు ధర్మహానికి భయంపడి [3]నిల్చితివో కడంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట యెల్లను జేయుదుఁ గాక యన్నప్పఁ
దప్పు ఘటించి నీవు నొకతాలిమి కల్గినవాఁడ వై నెసం
బొప్పినఁ జెల్లె [4]నీదునిలుపోపును జూతము గాక యిచ్చటన్. 93

క. సమయంబు నడపినను రా, జ్యముభాగం బీరె [5]యెట్లు నను నాస నర
[illegible]ణ్యమున వసించితి కాక ని, జమునకు నీయందు [6]ధైర్యసారము కలదే. 94

క. మును నీ వచట నచటఁ జే, సినబంటుతనంబు లెల్లఁ జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్ముదు నవి, యనుమానము నాకు నీభయస్థితిఁ గనుటన్. 95

### కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును [7]గుపితుం డై గాండీవవిక్షేపక్షోభిత నభోభాగుం డగుచుం గానీనుపై నానానిశితవిశిఖంబులు నినిచె న ట్లయ్యిరువురును దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొనిచి రట్టిసమయంబున. 96

క. రవిదీప్తులు చొర నేరమిఁ, గవిసెం జీఁకట్లు పవనుగమనం బడఁగెన్
వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁబడుట నద్భుతభంగిన్. 97

ఉ. అప్పుడు కర్ణుసైన్య మమరాధిపనందనుఁ జుట్టు ముట్టఁ దె

1. నాకు లే రని. 2. నొలువంగ. 3. నిల్చితెపో. 4. నీవిలువు (పు) నోపును. 5. యనుచు వాసమెయి నర. 6. ధర్మసారము. 7. భ్రీతుండై.

రుప్పరవీధి మై వలయ మొప్ప వెసం బఱపించి క్రీడి పెం
గుప్పలుగా రథావలిని ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం
దప్పక భానుసూనుమెయి తాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. తఱిమి పయి నడరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలం
గొఱతవడ నీక కర్ణుఁడు, మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ వైచెన్. 100

ఆ. వైచుటయును సవ్యసాచియుఁ గౌరవుల్, విస్మయంబుతోడివెఱపు [1]నొంద
నధికరయము మెఱయ నది పెక్కుతునియలు, చేసె నంతరమున శితశరముల. 101

వ. అట్టియెడ నినతనయు మన్నించుజోదులు తెగిపయిం బడినఁ గ్రోధారుణనయన పల్లవితంబును దంతకాంతిస్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయ కరటిఘటావికటవిటపిపటలంబు నాత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునకు బడలువడం గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లువీభత్సుం గని యతండు బొమముడి[3]వడ నెక్కొని వే ఱొక్కవిల్లెత్తికొని. 102

క. తురగముల నాలుగిట సు, త్తరు నాఱిట నెనిమిదిట రథముఁ బదిటను వా
నరు నఱువదిశరముల న, న్నరునంగంబులను బెలుచ నాటఁగ నేసెన్. 103

వ. ఇత్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణరూప మై చెలువొంద, నతులకేతువు శిఖ యై వెలుంగ
శరజాలములు పటుజ్వాల లై నిగుడ న,ర్కతనూభవోగ్రాగ్ని [4]ప్రజ్వరిల్లు
నుద్ధతి సైఁపక యుజ్జ్వలదివ్యప్ర,తాప మెఱుంగు గా దళితధరణి
రథనేమిరవము గర్జనము గ శరపరం,పరలు ధారలు గాఁగఁ బరఁగి యడరె

ఆ. నర్జునాంబుదం బనన్యసామాన్యస,ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి తఱఁగి యపుడు కౌరవసేనాప్ర,రోహవరంబు దీనభావ మొంద. 105

క. వెండియు నుఱుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయకోత్కరము సము
ద్దండతఁ బై నించిన నా,ఖండలనందనుఁడు కెంపు కనుఁగవఁ గదురన్. 106

క. శిరము లలాటంబును గం,ధరమును బాహువులు నురము దండడి వ్రయ్యన్
గిరిపైఁ బిడుగులు దొరఁగెడు, పరసున దృఢదీప్తశాతభల్లము లేసెన్. 107

క. అఱిముఱి నంగము లెల్లను, నుఱుముగ నిట్లదరు నర్జునునియమ్ములకున్
వెఱచఱచి సూతపుత్త్రుఁడు, పఱచెం బుడమియదరువ మత్స్యపతిసుతుఁ డార్వన్.

వ. ఇట్లు కర్ణుండు [5]కయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యుత్తరున కిట్లనియె. 109

క. వీఁ డొకఁడు కురుబలంబున, వాఁడిమగం డనఁగఁ జాలువాఁ డిబ్బంగిం

1. పొంద. 2. తఱిమి పయిం. 3. బొమముడి నెక్కొన. 4. ప్రజ్వరిల్ల. 5. కయ్యంబున లజ్జ విడిచి.

బోఁడిమి చెడియెను ద్రోణుల, వేఁడిమి [1]యిట మనకు మునుము విక్రమమునకున్.

వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు. 111

ఉ. వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లను
న్నిక్కలి యైన [2]శౌర్యమును నిర్భరతేజము నంత కంత కి
ట్లెక్కుడులావుఁ జూచి మది యెంతయు బెగ్గిలె మేను చేష్టలం
దక్క నశక్య మింకిట రథవ్యవహారము నిర్వహింపఁగన్. 112

ఆ. పుట్టినంతనుండి [3]యిట్టివి యెన్నఁడుఁ, [4]గాన నెందు నట్లు కాన చోద్య
మంది యంతరంగ మవశతఁ బొందిన, కతన నింద్రియముల[5]కడఁక తక్కె. 113

తే. అనినఁ గొండొక నవ్వొలయంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె
నేను గలుగంగ నీ కేమి యెలమి వాహ,నములఁ గుబ్బుగ సం[6]చోదనంబు చేయు. 114

క. అనుటయు నాతఁడు తగ నూ,ల్కొనినం దా నుదితనినదకోదండుం డై
యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టు లను నతనితో మఱియున్. 115

క. అరుణాశ్వంబులఁ బూనిన, యరదంబున వీఁడె నిడుపులగు చేతులు బం
ధురకంధరంబు వెడలుపు, టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తర కంటే. 116

వ. అని చూపి వెండియు ని ట్లనియె. 117

ఆ. సకలకురుకుమారచాపశిక్షాచార్యుఁ, డాజిదుస్సహుండు సాంగవేద
వేది నీతిశాస్త్రవిదుఁడు దివ్యాస్త్రకో,విదుఁడు సుజనహితుఁడు విమలబుద్ధి. 118

వ. అని యగ్గించి. 119

క. తనతనయుకంటె నెమ్మన,మున నాకుం గూర్చు [7]భావమున గురులకు మా
ర్కొనియెదము రాజధర్మం,బున కీడునఁ జేసి యింత పుట్టఁగ వలసెన్. 120

చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ మీతని తేరికి నన్న నాతఁడుం
బదిలముతోడ రథ్యములఁ బగ్గము [8]లేర్తెఱ నూలుకొల్పి యు
న్మదగతి నట్ల చేసిన నమానుషవిక్రముఁ డైన ద్రోణుఁడుం
[9]గదిసి యిభం బిభంబుఁ జెనకం జనుదెంచినలీల వచ్చినన్. 121

వ. నరుఁడు నమస్కరించి గురున కి ట్లనియె. 122

క. అడవులఁ బెద్దయుఁ గాలం, బిడుమలఁ గుడిచితిమి మాకు నిది తఱి యని యి
ప్పుడు వచ్చితిమి విపన్నుల, యెడఁ గృపసేయుటయ లెస్స [10]యీ ఱలుగకుండీ.

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు చేయుట

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతుం
ధనురాచార్యుం డిసువది, సునిశితబాణముల నేసెఁ జూపఱు పొగడన్. 124

1. యీఁకమీఁద మనకు విక్ర. 2. ము న్వరుస నిర్భర. 3. యిట్టిది. 4. జూడనట్లుగాన చోద్యమంది, యంతరంగ మిప్పు డవశతఁబొందిన. 5. కణఁకయుడిగె; దఱిఁగె. 6. బోధ. 7. బావమున. 8. తేర్పడ. 9. గదలి. 10. యిపు డలు.

ఆ. అర్జునుండు వాని నన్నింటి నడుమన, తునియ నేయుచుండ ద్రోణుఁ డడరి
శతసహస్రసంఖ్య శరములు కప్పిన, నతఁడు నతనిఁ గప్పెఁ బ్రతిశరముల. 125

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు తాఁకి గురుశిష్యులు కౌరవసేనలోనిభూ
పతిసుతకోటికిన్ వెఱఁగుపాటొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగునవీనమహాహవ[1]విక్రమంబునన్. 126

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. [2]గురుఁ డొక్కరుండు దక్కఁగ, నరుఁడు కడఁగినప్డు మాఱొక్కఁడనం జాపధరుం
డొరుఁడు కలఁడె మఱి వెదకిన, హరుఁడు కలండింకఁ గలుగు ననరా దెందున్.

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడతెగక యొక్క బాణముపోలెన్
శ్రేణి యయి పోవఁ బార్థుఁడు, రేణువుఁ గావించుఁ గంటిరే చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష, స్ఫురణంబున నంచపిండుపోలుపు వహించెన్
నరుబాణతతి ఘనావళి, కరణి మిగుల నొప్పె నల్లగఱుల చెలువునన్. 130

వ. అనుచుం గనుంగొనుచుండ. 131

శా. శ్రావ్యం బై చెలఁగన్ గభీరమధురజ్యానాద ముద్దామవి
రవ్యాపారనిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రోథి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్. 132

వ. ఇంద్రాగ్నివాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు చేయుచు వచ్చె నయ్యిరువురఁ బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దళంబై సంతమసంబు కలిగి యునికి నేబాణం బెక్కడఁ బాఱుటయుం దోఁప కుండె నట్టియెడఁ గుంభసంభవుబలంబు [3]సరభసంబుగా నతని కడ్డంబు చొచ్చిన వివ్వచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగుబాహుదండంబులను సకుండలంబు లగుకర్ణపాశంబులను సకిరీటంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పుడావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె నిట్లు దుర్జయుండగునర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేట్లాడుచున్నం జూచి యతండు విస్మితుం డై. 133

క. అర్జునుని నాహవంబున, నిర్జింపఁగ [4]నగునె ఫాలనేత్రున కైనం
బర్జన్యసుతుఁడు శరవర్షోర్జితమూర్తి యగు టరయ నుచితమ కాదే. 134

వ. అని మఱియును దగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు. 135

తే. ఇంతప్రొద్దు కిరీటికట్టెదుర నిలువ, వెఱవ కున్నప్డు ద్రోణుండ వింటివాఁడు

---

1. విభ్ర. 2. నరుఁ డొక్కరుండుదక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ జాపధరుం, డొరుఁడుగలఁడె మఱి వెదకిన. 3. ససంరంభంబుగా. 4. వశమె.

నల్లచో తనయున్నసేనకు నొకండ, బలిమిఁ దలమీఱునే యిట్లు నిలువ వలదె.

మ. అనుచుండం ద్రిదశేంద్రసూనుఁడు రయం బత్యంతఘోరంబుగా
ఘనశాత్రోజ్జ్వలదుర్నివారవిలసత్కాండంబులన్ ద్రోణువా
హనసూతధ్వజదేహముల్ పొదివె ని ట్లస్త్రాబ్ధినిర్మగ్నుఁ జే
సిన హాహానినదంబు లొక్క మొగిఁ బేర్చెన్ సర్వసైన్యంబులన్. 137

క. ఈమెయి నిజజనకుభుజో,ద్దామబలము తోడుతోడఁ దఱుఁగుటయు రథ
స్తోమంబుఁ దాను నశ్వ,త్థామ వెసం దాఁకెఁ బాండుతనయునితోడన్. 138

అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము చేయుట

చ. అతఁడును దీవ్రబాణముల నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతమఖవృత్రసంగరముచందము తోఁచె వడిన్ ఛటచ్ఛటా
యితరవ ముఖ వేణువులనేర్చుదవానలు మ్రోఁతభంగి ది
క్తతిఁ బరఁగెన్ మహాద్భుతము కౌరవసేనకు నావహిల్లఁగన్. 139

వ. అట్టియెడ. 140

చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క
న్గిఱిపినమాత్రలోన నతనిం బటుబాణచతుష్కయుగ్మ మే
త్తెఱఁ దొడి మార్వి గ్రమ్మఱ ఘటించునెడన్ వడి నేసె యఫార్జునన్. 141

క. కురుసేనలోన ని ట్లీవ్వరుఁ జేసిన వారు లే రవార్యభుజావి
స్ఫురణోద[1]గ్రుండు కదే, గురుపుత్త్రుం డనుచు నమరకోటి నుతించెన్. 142

చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యము చేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరెఁ గవ్వడి ద్రౌణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దండడి [2]మార్కొని యుండుచుండెఁ [3]జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు[4]చాడ్పున నంబరవీథి నుగ్ర మై. 143

వ. ఇవ్విధంబున ధనంజయుం[5]డు రయంబున నేయ వేగంబున నేయు ద్రోణతనయు తూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగుటం జేసి యంతకంతకు నతిశయిల్లుపెల్లున నేయుచు నధికుం డగునప్పాండవ మధ్యముం గనుంగొని కృపాచార్యుండు చెంగటం దలమీఱిన. 144

అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము చేయుట

క. గురుపుత్త్రునిరథము విడిచి, సరభసముగ నందు సవ్యసాచి కవియుచుం
దిర మై యాతఁడు శితశర,పరంపరలు కురిసె నుగ్రబంధుర[6]గతులన్. 145

వ. పాండుపుత్త్రుండును జిత్ర[7]సంచారంబుల మెఱయుచు. 146

---

1. గ్రుఁడు గదె యీ, గురు. 2. దార్కొని. 3. జి, చ్చఱ. 4. చొప్పున నంబర. 5. ధనంజయుఁ రయంబు నెనయు వేగంబున నేయు; డేయు వేగంబున నేయుటయు ద్రోణ. 6. భంగిన్. 7. ప్రచారం.

క. పటువిశిఖపంక్తి[1]యత్యుత్కటరయమున నిగుడఁ జేయఁగా నవ్విధ మా
డుట[2]యైన మండె దీప్తోద్భటభంగిఁ గృపానలంబు బలములు పొంగన్. 147

వ. ఇట్లు [3]మండి శిఖింబోలెడి కనకలిప్తఘనబాణంబు వనచరకేతువుం దాఁకించి వేఁడిమి చూపి వివిధాస్త్రజ్వాలలు కవియించి [4]దిక్కులు చెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతనికేతనంబు దునిమి తరణికిరణానుకారపారంగతంబు లగునారాచంబులు తదీయాంగంబుల నిలుపం దొడంగిన రథచక్రరక్షకు లగుచంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమాలియు హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కుమెఱయ [5]నొక్కటం దాఁకిన. 148

ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి [6]గ్రక్కునంగ
నతఁడు లీలఁ దునిమె నందఱతలలును, ఘోరభంగి రక్త[7]ధార లెగయ. 149

సీ. తునిమి తోడన యొక్కసునిశితశరమునఁ, గాఁడియు రెంట నక్షములఁ ద్రుంచి
హయముల నాల్గిటఁ జంపి యాలంపుఁ[8] గోలతో, నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి
ధనువును సూతుని [9]తలయుఁ జెఱొక్కట, నఱికి లోచనముల నవ్వు నెఱయఁ
గృపుని నాలోకించి క్రీడి తద్వక్షఃస్థలంబునఁ గ్రూరభల్లంబు నాట

ఆ. హతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్న, చాపుఁడును నికృత్తసారథియును
నయ్యు నొచ్చియును భుజార్గళసంరంభ, మతిశయిల్ల శక్తి నతఁడు వైచె. 150

ఉ. మండుచు[10]వచ్చుదానిఁ బదిమార్గణముల్ గొని వేగ మొప్ప నా
ఖండలనందనుండు కడికండలు చేసినఁ జూచి యప్పు డా
తం డుడి[11]వోక లేక సమదంబున ఖడ్గము ఖేటకంబు ను
ద్దండతఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. 151

వ. ఇట్లు కవిసిన. 152

క. పలకయు వాలును నింతింతలు తునియలు చేసె బాణతతిఁ బాండవుఁ డి
ట్టల మైనవెఱఁగుపాటున, నిలిచి కృపుఁడు ద్రోణపుత్రునిరథం బెక్కెన్. 153

ఆ. అప్పుడే పడంగి యన్నిసేనలు భీష్ము, రథముపొంత కొదిఁగె రౌద్రరసవి
నోది యైనయర్జునుఁడు ధనుశ్చాలన, దీప్తమూర్తి యగుచుఁ దిట్టకుఱికె. 154

వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155

క. బలములు దొరలుఁ బొదివి సంకుల[12]యుద్ధము చేయఁ గ్రోధఘోరాకృతి యై

---

1. యం దుత్కట. 2. యై మండెం దీప్తో. 3. మండెడు శిఖిపోలెఁ గనలి దీప్తఘన; మండెడు శిఖింబోని కనకదీప్తఘనబాణంబులఁ గపికేతువుం. 4. దిక్కులు గలంగ; పెల్లగిల్ల. 5. నొక్కుమెయిం దాఁకిన. 6. యుక్కుమెఱయ. 7. ధార లులియ. 8. టెలుఁగుతో. 9. తలయు (వేఱొక్కట; నొక్కొక్కట.) 10. పోవుదానిఁ. 11. వోక యెక్కుడుమదంబున; వోక వెక్కసము దక్కఁగ. 12. సమరము.

యిలఁ ద్రోవఁగఁ జతురంగంబుల ద్రెళ్లిడఁ బాండురాజపుత్త్రుఁడు కూల్చెన్. 156

ఉ. చేతులతీఁట వో నిటు లశేషబలంబుల నుగ్గుచేసి మాం
సాతతపంక మై బహువిధాయుధమీనము లొప్పఁ జామర
వ్రాతము ఫేనభంగి గ నిరంతరవీరశిరస్సరోరుహ
స్ఫీతవిభూతిఁ బొల్చునది చేసె రణస్థలియందు నెత్తుటన్. 157

తే. ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ గలఁచి, యాడి భీష్మునిదెసఁ [1]బోవ క్రీడిఁ దాఁకెఁ
గొండతోఁ దాఁకుతగరునుద్దండవృత్తి, తోఁప వృషసేనుఁ డాహవదోహలమున.

వ. విజయుండును. 159

తే. భల్ల మొక్కటి నాతనివిల్లు దునిమి, యైదునారసములు వక్ష మాడ నేసె
నతఁడు సైరింప రానినొ వ్వడరుటయును, బెగ్గలంబున నరదంబు డిగ్గి పాఱె. 160

వ. అట్టియెడ దుశ్శాసనశకునిదుర్ముఖవివింశతి[2]వికర్ణులు తన్నుం బొదివికొనిన వారల రథరథ్యకేతువర్మంబులు జర్జరితంబులుగా నేసి గాసిచేసిన నందఱుం గనుకనిఁ బఱవం దొడంగినఁ బార్థుండును [3]బ్రహాసోల్లాసభాసి యగుచు నుత్తరుం గనుంగొని. 161

తే. కనకమయతాలకేతువు క్రాలఁ జిరతటిల్లతాలీలఁ గలిగి శోభిల్లునంబు
దంబుచాడ్పున సురనదీతనయుఁ డున్న, వాఁడు చూచితె మత్స్యభూవరతనూజ.

## అర్జునుఁడు భీష్మునితో యుద్ధము చేయుట

క. బలువిడి [4]మనదివ్యాస్త్రంబులచవి చూపంగవలయుఁ బోనిమ్ము రథం
బలసగతి నతనిదెస కని, పలికిన నతఁ డట్ల చేసెఁ బరమప్రీతిన్. 163

శా. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజసైన్యముల్
సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంతభుజాబలప్రకటదర్ప మెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయకర్ణపుట[5]దారణవిత్తము దేవదత్తమున్. 164

తే. మలసి ఱంకెలు వైచుచు మాఱుకొనిన
వృషభములభంగి నక్కురువృషభు లిట్లు
సమదగతిఁ జేరునెడఁ జూచి రమరు లర్థి
ననిమిషత్వంబు తమ కప్పు డచ్చుపడఁగ. 165

వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు తమలోన. 166

క. మనలను దానవులను గడచినయవి భుజబలము లస్త్రశిక్షావిధముల్
కొనియాడఁ గొలఁది కా[6]దీతని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్. 167

---

1. బోవఁ గ్రీ. 2. వికర్ణులు మొదలుగాఁ గలవారలు. 3. బ్ర (హాసో) హర్షోల్లాసభాసురముఖుం డగుచు. 4. నాదివ్యా. 5. దారుణవృత్తము. 6. దీతని కాతఁడ యతని కీతఁడ తగుఁ.

సీ. అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడబొబ్బ,లును దూర్యనాదంబు[1]లుల్లసిల్లఁ
బేర్చి యొక్కుమ్మడి భీష్ము నగ్గింపంగ, నతఁడు నిశాతబాణాష్టకమునఁ
బడగపై హనుమంతునొడలను బహుశరం,బుల నందుఁ జెలఁగెడుభూతములను
దశవిశిఖముల రథ్యములను సారథి, నేసె వాసవియును నెసక మెసఁగు

తే. నగ్గలిక గాండివంబు చక్రాకృతిప్ర,కాశవహ్నిస్వ[2]రూపత కలిగి వినువు
తెఱపి కానంగ రాకుండ మెఱపి యొప్పు,సాంద్రసాయకతతి నాకసంబుఁ గప్పె.

తే. [3]అర్జునుండు కవించిన యంప మూడ, మంచు దళముగఁ గప్పినమార్గణాంశు
జాలముల వెస విరియించె శాంతనవప్ర,తంగుఁ డుద్ద్యోతమానప్రతాపలీల. 169

క. అమరేంద్రతనయుఁ డుగ్రా,స్త్రములు [4]వడిం గురియఁ గుఱియఁ దరమిడి వానిం
దుమురుగఁ జేయుచు వచ్చెను,సమరోల్లాసంబు మెఱయ శంతనుసుతుఁడున్. 170

క. అర్జునుఁడు దివ్యబాణ,స్ఫూర్జితదోశ్శక్తి తనకుఁ జూపిన నతఁ డ
తూర్జితబలుఁడై నియమో,పార్జిత ఘోరాస్త్రవితతిఁ బ్రతిహతిఁ జేసెన్. 171

క. కవ్వడి యెమ్మెయి నేసిన, నవ్విధమున [5]నాశరంబు లన్నియు దాడా
దవ్వులన నిలువరింపఁగ, నివ్వచ్చుఁడు కినిసి యేసె విలు విఱుగంగన్. 172

మ. తనకోదండము ఖండితం బగుడుఁ గ్రోధంబార మందాకినీ
తనయుం డప్డు సటా[6]విలుంఛనసముద్యత్క్రోధసింహాకృతిన్
ధను వొండుద్ధతలీల నెత్తికొని యస్త్రశ్రేణిఁ బర్వించె న
ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నార్పుల్ నింగి ముట్టన్ వడిన్. 1 3

చ. విజయుఁడు వారినెల్ల నొకవ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక
వ్రజము నడంచియున్ రథమువాజుల నొంచియు నాజికేళియం
దజితవిలాసముల్ మెఱయ నప్పుడు విస్మయ మందుచుండెఁ గుం
భజముఖయోధవీరతతి ప్రస్తుతి చేసిరి సిద్ధఖేచరుల్. 174

క. కొండొకయెడఁ గని శాంతన,వుం డాఖండలతనూభవుం డామూఁ పు
ద్దండభుజబలము మెఱయఁ బ్ర,చండాస్త్రక్షతము చేసె సరభసవృత్తిన్. 175

చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం
దునిమి [7]నితాంతగాఢరయదోర్విభవంబున నొండువిల్లు కై
కొనియెడుసందునన్ నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు గ్ర
క్కున నతఁ డొల్లఁ బోయి రథకూబర మూఁతగ నిల్చె సోలుచున్. 176

క. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నపుడు కుంతీతనయుం
డనిఁ దనివి సనక గుంపులు,గొని యున్నెడ లరసెఁ గలయఁ గురుసైన్యములన్.

---

1. లును జెలంగ. 2. రూపత గడల విద్రువు (వ). 3. అర్జునుఁడు గవియించిన యంప మూడు. 4. వడిం దొరుఁగఁజేయ; వడిం గురియ నడుమఁ. 5. నారసంబు లన్నియుం నతఁడున్. 6. విలుం (టు) తన. 7. నిశాతకాండరయ.

వ. ఇ ట్లుత్తరు చూచి గాండీవంబు తొడసి గుణంబు సారించి కవదొనలు బిగియించి.

క. ఆచార్యసూర్యతనయకృపాచార్యప్రభృతిరథికు లందఱుఁ [1]దన్నుం
జూచుచు నుండఁగ నద్దెస, కేఁచి భుజాబలము మెఱయ నింద్రజుఁ డరిగెన్. 179

వ. అప్పు డశ్వత్థామ కర్ణున కి ట్లనియె. 180

ఆ. [2]వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమి చేయువార మిప్పు తక్క
నొరులు నిలువరింప నోపెడు[3]వారు లే, రోట లేక తాఁకి యోర్వవలయు. 181

క. అని తను నుల్లస[4]మాటకుఁ, గినిసి యినతనూజుఁ డేను గ్రీడి నిచట మా
ర్కొనుపీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ గవిసెం బెలుచన్.

క. దొరలును సుభటులుఁ గర్ణుని, యరదమునకు మున్న పొదివి రర్జును నచటం
గరి[5]సొచ్చుతుంగమడువున, పసుసున మొన చాఁపకట్టు పడియె నతనిచేన్. 183

తే. ఇవ్విధంబునఁ బోరెడు నింద్రతనయు, నుక్కు లావును నంతంత కెక్కుడయ్యె
[6]నలసి మేనులు తూలాడ నిలిచి రంత, నంత నయ్యోధముఖ్యు లాహవముతక్కి.

వ. అట్టియెడ నుత్తరుండు నరున కి ట్లనియె. 185

చ. [7]ఉఱుకువ లేనికయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు డప్పి పు
ట్టెడు నొకమాటు నాగ్రహము డింపవు నీవును జక్కఁ జేసి ప
చ్చడి కలపంగ వెండియును జండితనంబున వచ్చి వచ్చి పో
రెడు మొన లింకఁ జాల నొనరింప భవద్రథసూతకృత్యమున్. 186

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నోహటింప నేల యంతియ వల
సినం దురంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువ వలయు నెల్లపను
లును జక్కనయ్యె రా జొక్కరుండు కొఱంత [8]యాతం డభిమాని మనలం గని
సరకుగొనఁ డిప్పుడున్నచందంబు మనతోడం దలపడం గడంగుట తోఁచుచున్న
యది తమ్ములు నాప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి డగ్గఱి యున్నవా
రని కౌరవేశ్వరునిగట్టి మోహరంబు చూపి యతనిం బురికొల్పి యద్దిక్కు తేరు
పోవని మ్మనుటయు నతండును దలకొని యట్ల చేయ నడరి యెడనెడ నడ్డపడు
[9]కురువీరులం జిఱునగవు (గెడ) నిగుడ మెఱుంగు వాలమ్ములఁ దొలంగ జడి
యుచుం గడిసిన నమ్మేదినీవల్లభుండు, 187

అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు చేయుట

క. పులిఁ గోల వేసిన ట్టిట్టలపురయంబునఁ గడంగుటయుఁ దద్వక్ష
స్థలమునఁ గిరీటి రెం డమ్ముల నాటఁగ నేసె బొమలు ముడివడుచుండన్. 183

1. మ్రొడై, ప్రోవై చూచు. 2. చూడు వీఁడె వచ్చుచున్నాఁడు పార్థుఁ డే, మేమి సేయు. 3. వారలే, యోట లేక తాఁకి; వారు లే, రోర లేక తాఁకి. 4. మాడినఁ. 5. సొచ్చినతుంగమడువు, పసు. 6. సొలసి మేనులు తూఁగాడ. 7. ఉడుగ వదేమికయ్యమున కోపఁగ. 8. యాతండు దురభిమాని. 9. కురుబలంబులఁ.

క. క్షతములఁ బెల్లు దొరఁగు శో, ణితధారలు మదముగా [1]వినిర్గళకరియా
కృతిఁ గవిసి యతం డేసెను, శతమఖసుతుఫాలతలము [2]శాతశరమునన్. 189

తే. [3]రక్తధారయు వెడలంగ రశ్మి వెలుఁగఁ
బొలుచు [4]బాలార్కుచాడ్పునఁ జెలువు మిగిలి
ఫల్గునుండు ప్రతాపసంభరితమూర్తి
[5]యగుచు శరకిరణంబులు నిగుడఁ జేసె. 190

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గర్వం [6]బెక్క నానాస్త్రసం
తానంబుల్ కురిసెన్ సుయోధనుఁడు దుర్దాంతాకృతిన్ గోత్రభి
త్సూనుండుం బటుసాయకోత్కరమునం జూపెన్ భుజాటోప మి
ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరం బేపారఁగా నయ్యెడన్. 191

తే. హస్తిపురిఁ బేరు గల [7]మదహస్తి నెక్కి, క్రాలు[8]కావలిరథములు కవియుదేర
నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప,వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె. 192

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసముదగ్రత నెఱ్ఱనిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోడ నున్నజమునాకృతి భీషణరేఖ యొప్పఁగా
వ్రేఁకనినారసంబు దొడి క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్. 193

ఆ. ఫాలకుంభసంధిఁ బడి వాలమున [9]దెస, నుచ్చిపోవుటయును నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు [10]కులిశచండాహతిఁ, బడుమహానగంబుభంగి దోఁప. 194

క. అరుణమణిమాలికావి, స్ఫురణంబున దంతితనువు చూడఁగ నొప్పెన్
[11]ధరణిఁ బడియున్న బహుముఖ, పరిగతదావాగ్నిఁ బొల్చుపర్వతము క్రియన్.

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివింశతిరథం బెక్కె నాలోనన యట్టినారాచంబున రారాజునురంబు నొనాట నేసినఁ గరీంద్రుండు పడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని ఱిచ్చవడురథికుల వివ్వచ్చుం డనర్గళ ప్రసారం బగుమార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి రిత్తెఱంగునఁ దనచుట్టును బయలైన నయ్యురగకేతనుండును మరలె నిట్లు [12]దొరయును విఱిగి కలను వాసి కాలు ద్రొసిపోవుటయు నతిరథమహారథు లెల్లం జెల్లాచెద రగుటయుం జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనింబఱవం దొడంగిన. 196

తే. యూథపతితోడిదంతిసముత్కరంబు, పెనుకఁ దగిలెడుసింగంబువిధము దోఁప

---

1. వినిద్రకరీంద్రాకృతిఁ; వినిర్గతకరియాకృతిఁ. 2. శాతశరములన్. 3. రక్తధారలు వెడలంగ; రక్తధారవెడల నొక. 4. బాలార్కబింబంబు చెలువు మిగుల. 5. యొగచి శర. 6. బెక్క. 7. మదహస్తి. 8. కావలిమూఁకలు; కావలిరథికులు. 9. వెస. 10. కులిశధారాహతిఁ. 11. ధరఁబడియున్నను. 12. దొరలును విఱిగి; దొర విఱిగి కాలు దూసి.

నార్పు నాదంబుగా నరుఁ డంటఁ దాఁకె, రాజుఁ దారును బొలెదురథికవరుల.

క. వెనుకొని కర్ణుని పెడతల, యును దుశ్శాసనుని వీఁపు నొక్కొక్కశరం
బున నేసె నప్పు డయ్యన, తనయుం డిట్లనియె నతిరథశ్రేష్ఠులతోన్. 198

ఆ. కూడ ముట్టఁ గ్రీడి కురువంశమున కెల్ల, మూలకంద మీనృపాలుఁ [1]డతని
నిచటఁ గాచికొనుట యెల్ల పౌరుషములుఁ, జేత నిలిచి లావు చేయవలయు. 199

క. అనవినుచుఁ గురుపితామహుఁ, డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁడును గృపుఁడునుగ
ర్ణునిమాట సరకు సేయక, చను చుండఁగ దీనవృత్తి జనపతి పలికెన్. 200

క. లోకంబుతోడివారుగ, మీకుం జనునయ్య మగఁటిమికి గుఱి కాదే
నా కెడ రైనయెడం దగఁ, జేకొని యది [2]మీరు చక్కఁ జేయుట యరయన్. 201

వ. అనిన విని వారలు వెనుక యై యాశ్వాసవచనంబులు పలుకుచుం బోవం బోవు
చున్న యన్నరేంద్రు నెలుం గెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. 202

అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట

ఉ. క్షత్త్రియుఁ డోడునే తగదు కౌరవరాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ బిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగ [3]మాని నాఁగ ని
ద్ధాత్త్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్పసమగ్రుఁడ వైననీవు నీ
మిత్త్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ [4]భూభుజుల్. 203

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ, రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయం బైనభూషణజాల[5]ముల నొప్పి, యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూరచందనకస్తూరికాదుల, నింపు సొంపార భోగింపఁ గలదె
యతిమనోహర లగుచతురాంగనలతోడి, సంగతి వేడ్కలు సలుపఁ గలదె

తే. కయ్యమున [6]నోడి పోయినఁ గౌరవేంద్ర, వినుము నాబుద్ధి మరలి యీతనువు విడిచి
సుగతి పడయుము తొల్లింటిచూఱఁ గలదె, జూద మిచ్చట నాడంగ రాదు సుమ్ము. 204

వ. అని వెండియు. 205

క. నీయట్టివాఁడు నిన్నే, పోయెడిదే యిట్లు పోకు పోకు మనుచు భూ
నాయకుఁడు మరలి పటుకో, పాయత్తతఁ ద్రొక్కఁబడ్డయహిగతిఁ గవిసెన్. 206

వ. ఇట్లు కవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మద్రోణాదియోధవీరులు
నొక్కుమ్మడి మగిడి యధిపతితోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి తక్కిన
బలంబులు నంతకు మున్న కౌంతేయుదెస మరలి చూచుచుం బాఱు చునికిం
జేసి యేలినవాఁ డఱుముటయును దొరలు [7]తెగి తిరుగుటయుం గని తెంపు
చేసి కూడికొని రభసంబునం జుట్టు ముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె నివ్వి

1. నితని. 2. మీకుఁ. 3. బోక పాడియే, ధాత్త్రిఁ. 4. భూజనుల్. 5. ములు దాల్చి యొనరఁ జేరోలగం బుండఁ గలదె. 6. నోడి పాఱినఁ. 7. తెగువకుం జొచ్చి తిరు.

ధంబున వివిధవ్యూహంబు లగుబహుయోధ[1]యూథంబులు గురిసినయనేకాస్త్ర
శస్త్రంబులు నానాప్రకారంబులఁ [2]గుప్పంగూరలుగాఁ దొరఁగినం బెరిగిన శౌర్య
సంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్యధుర్యనిరతిశయరయభరిత[3]కర
యుగళుం డయి రథరథ్యసారథిస్వాంగంబులు కాచికొని తనతోడంబుట్టువుల
ప్రతిన లూహించి యొండుచేయ నొల్లక సపరివారంబుగా ధార్తరాష్ట్రుల
భంగపెట్టం దలంచి యింద్రదైవత్యంబును సత్యసంపాదనంబును నరాతి
సైన్యదైన్యసంపాదనంబును నగుసమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. 207

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగఁ, దలలు మెడలుఁ [4]జక్క నిలువకొఱగ
నెల్లవారు [5]నెఱుక నెడలి చొక్కి నిద్రాతిశయము గూరినట్టు లైరి. 208

వ. అప్పుడు పాండవోత్తముం డుత్తరమాటలు తలంచి యుత్తరుం గనుంగొని. 209

సీ. ఇక్కురుసైన్యంబు చొక్కు దక్కకమున్న, గ్రక్కునఁ జనుము రారాజు ద్రోణ
తనయుండుఁ జుట్టినతలచుట్లు నల్లని, యవి సూతపుత్త్రు శిరోంబరంబు
[6]పచ్చనియది కుంభభవ కృపాచార్యుల, యుష్ణీషములు వెల్ల లుఱక నీవు
తెమ్మింతవట్టును దేవనదీసూనుఁ, డియ్యస్త్రమునకు మా తెఱుఁగుఁ గాన

ఆ. నతఁడు తెలిసియుండు నాతనిదెస పోకు, మనిన మత్స్యరాజతనయుఁ డెలమి
తొలఁక నొగలఁ బగ్గములు గట్టి చని వాని, నెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును.

వ. ఈరథబృందముల యిఱుకటంబు వెడలి నిలుత మని కదలినం గిరీటిం దాఁకి
కురుపితామహుండు శరవర్షంబులు కురిసిన. 211

క. ఆతనిరథ్యంబులఁ దత్సూతుని నొప్పించి సాంద్రసునిశితబాణ
వ్రాతంబు మేన నించి పృథాతనయుఁడు నిలిపి వెడలె దర్పో[7]జ్జ్వలుఁ డై. 212

వ. [8]ఇవ్విధంబున నరదంబులయిఱుకంటంబు గడచి యెడఁ గలుగ నిలిచి [9]రాహు
నిగ్రహనిరాసభాసురుం డగుభానుండునుం బోలె వెలుంగుచున్నంత బలం
బులు తెలిసిన. 213

ఆ. కౌరవేశ్వరుండు కను విచ్చి దిక్కులు, కలయఁ జూచి పార్థుఁ గాంచి కడఁగి
యదరఁ జూచుటయును నమరనదీసూతుఁ, డతని కిట్టు లనియె నల్ల నగుచు. 214

క. ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహా
క్రాంతంబులయ్యెఁ బని తెగుఁ, గౌంతేయుఁడు చొరఁడుగాని క్రౌర్యంబునకున్.

క. మెడ యొఱగఁ జేతికైదువు, వడ నిను నీవెఱుఁగ కున్నభంగి గనియుఁ గ
వ్వడి యూరకుండు నటె చెప్పెదుకొలఁదియె వానికరుణపెంపు కుమారా. 216

వ. అతండు మనప్రాణంబులపై రానొల్లక నిలిచిన మనమింతట నిలుచుట కార్యంబు.

---

1. యూథంబులు గవిసి యనేకాస్త్ర. 2. గుప్పఁగూరుగాఁ దొరఁగించినం. 3. భుజయుగళుం.
4. గాళ్లు. 5. నెఱుక యె(లె)డలి. 6. పచ్చన కుంభసంభవ. 7. ద్ధతుఁ డై. 8. ఇత్తెఱంగున.
9. రాహుగ్రహణ.

ఉ. మోహనబాణపాతమున[1]ముం దలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి చేయఁడే మనల నందఱ నొక్కట మార్గణాగ్నికిన్. 218

వ. కావున. 219

క. మనదేశమునకుఁ బోదము, మన [2]మల్లన తెరువు వట్టి మత్స్యవిభునిగో
ధనముఁ గొని యతఁడు ప్రీతిం, జనుఁ గాకటు మనకు నంతచల మేమిటికిన్. 220

దుర్యోధనుఁడు పరాజితుం డై మరలి తనపురమునకుఁ బోవుట

వ. అని చెప్పిన పితామహుహితవచనంబు లాకర్ణించి సంగ్రామా[3]తికాముండును గోపాటోపఘూర్ణమానమానసుండు నగు నమ్మానవేశ్వరుండు నిట్టూర్పు[4]నిగిడించి యుద్రేకంబు తక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం బగు [5]నర్జునాననంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున శౌర్యంబు చాలించి భీష్మవాక్య ప్రకారంబు చేసి రిట్లందఱు ముందర తమవచ్చినవంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు చెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమి బిరుదులతోఁడి గొడుగులును నడియాలంబులతోడి సిడంబులును వైపించుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయి వచ్చెద నని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి వీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు డుల్చి యతనికిం జెప్పినవాఁడై యఖర్వబాహాగర్వనిర్వహణంబు మెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగుచుండఁ గౌరవవీరు లతనిం దేఱి చూడను జాలక చని రతండును జూపఱం దోలి నిలిచిన [6]మదపుటేనుంగుచందంబున నిలిచి విరాటతనయున కిట్లనియె. 221

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుంగు, పెంట లయ్యె రాజుఁ బెద్దదొరలుఁ
జీర లొలువఁ బడిరి సిగ్గఱి బిరుదులు, వైచి రింక మగుడ వలదె మనకు. 222

క. హయములు మరల్పు మీతల్లియు బంధులు నెడలు సంచలింప గుములుగ గ
ట్టి యెదురుచూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ బోవలయున్. 223

వ. అనిన నతండు రథంబు [7]మగిడించినం జని చని. 224

తే. కాలుతక్కువ [8]వారలు కలయఁ జెదరి వెనుకఁబడి పోవనెడఁ దన్నుఁ గని భయమునఁ
బ్రాణదానంబు వేడినఁ బార్థుఁ డభయ, హస్త మిచ్చుచు దయ పెనుపారఁ బలుకు.

వ. ఇట్లు నానావిధదీనదశాదందహ్యమానులగు కృపణులం దనకృపామృతంబునం దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవుచుండ

---

1. ముంచిన లజ్జ. 2. మియ్యెడ మసల నేల మత్స్య. 3. మాతీతకాముండును. 4. నిగుడించి. 5. నర్జునాననంబు. 6. మదము నేనుంగుచందం. 7. మగుడించినం. 8. గలవారు.

ధనంజయుండు భూమింజయుం జూచి. 226

ఆ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ, దెచ్చు టెల్ల నీయుదీర్ణబాహు
బలముకాఁగ నీవు పలుకుము వెలిఁబుచ్చ్చుటుడుగు మధిపుపాల నొండు తెఱఁగు.

క. అనవుడు నీచేసినయీ,పని నాచేఁగాక యునికి పతి యెఱుఁగఁడొకో
జనులు నిజము చేయుదురే, నిను నెఱిఁగింపకయ చెప్ప నేర్తునె పొసఁగన్. 228

వ. అని యుత్తరుండు మఱియును. 229

క. నీ[1]వలచినయప్పుడ ధా,త్రీవల్లభుఁ డెఱుఁగునట్టి తెఱఁగు నడపెదఁ
దేవేంద్రపుత్త్ర యే నన,గా వేఱొక[2]పేరు కలదె కార్యము నడపన్. 230

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాది సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు చేయించి యెప్పటిసింహపతాక రథంబున బంధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుం డయి వచ్చునట్లుగాఁ జేసి తొంటిచందంబునం దలచీర యలవరించుకొని సారథి యై సవ్యసాచి నొగ లెక్క నట్టిసమయంబునఁ బురందరాది బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును బాండుప్రముఖ రాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తు లయి సముచితవిషయంబు లయినమాట లాడుచు నిజనివాసంబుల కరిగి రట నరుండు నుత్తరు నాలోకించి నీవిజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చు మనిన నతం డది తెఱంగుగాఁ గైకొని యట్ల చేయ నిట్లు నిరూఢంబుగాఁ బట్టణంబునకుం జనుచుండ నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పితవాహినీపరివృతుం డై నగరంబు చొత్తెంచి. 231

తే. మందిరాభ్యంతరమున కానందలీలఁ, బాండుపుత్త్రులుఁ దక్కటిబంధుజనులుఁ
దానుఁ జని విప్రులును వనితా[3]జనంబు, నేస లోలుక సింహాసనాసీనుఁ డయ్యె. 232

వ. ఇవ్విధంబునం దనవిజయంబుం గొనియాడ వచ్చినవారి నెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు బెరసినబలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథింగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాదవేదనాదోదూయమానమానసుం డగుచు మంత్రుల మొగంబు చూచి యి ట్లనియె. 233

విరాటుఁ డుత్తరుఁడు కురుసైన్యంబు గెలువఁ బోవుట విని చింతించుట

చ. అసమున మీఁ దెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం

---

1. వలసిన. 2. మాట పట్టు గలదె; వేఱొక్కఁడనె తలఁపఁ గార్య. 3. గణంబు.

బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాఁడు కౌరవసేన యేడ యొం
టి సనుట యేడ నాకిది కడిందివిచారము పుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు వేగమ పంపుఁడు చాలునట్లుగన్. 234

చ. అనుటయుఁ గంకుఁ డి ట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున నిట వీరికిన్ జయ మవున్ వెఱ పేటికి నీకు నుత్తరుం
డన నొకరు[1]డు నాకుము బృహన్నల సారథి కాన గెల్చు న
య్యనిమిషకోటినైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్. 235

చ. అన వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల ని
ట్లను మఱియున్ విరాటుఁడు రణావనియందుఁ ద్రిగర్తసేనచే
ననయము నొచ్చినట్టిజను లందఱుఁ దక్కఁగ [2]నేటుఁ బోటుఁ దాఁ
కని ఘనయోధకోటి చనఁగా వలయున్ [3]బలుమై రయంబునన్. 236

క. చని యక్కుమారుఁ డే మయ్యెనొ యత్తెఱఁ గెఱిఁగి మనకు నెయిదించుట పు
ట్టినకార్యమునకుఁ దగియెడు, పని యట విధి[4]గెలువ వసమె బ్రహ్మకునైనన్. 237

వ. అనుచు నుత్తలపడు నయ్యవసరంబున నుత్తరుండు పుత్తెంచినగోపాలురు పఱతెంచి
యతనిం గాంచి. 238

చ. కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు నుదగ్రత వచ్చుచు నున్నవాఁడు త
త్తురగరథధ్వజాలి నొక తుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే
పురి [5]నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ వచ్చితి మేము నావుడున్. 239

తే. అంతరంగంబు నిండి రెండలువులందు
వెడలుసంతోషపూరంబువిధము తోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు కడలుకొనుచు
గండఫలకముకురములతోఁ గ్రమ్ముదేర. 240

క. ఏమేమీ యని గోపస్తోమమునుఁ బలుమాఱు నడుగుచున్ మెయి పొంగన్
భూమీశుఁ డప్పుడు మంత్రుల,మోములు కనుఁగొని సగర్వమున ని ట్లనియెన్.

శా. వీటన్ వీధుల నెల్ల నేనుఁగులపై విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరజయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహితక్షోణీసురవ్రాతమున్
ఘోటస్యందన[6]వారణప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. 242

క. ఉత్తమకన్యాజనములు, నుత్తరయును గంధమాల్యయుక్తముగఁ గుమా

1. దనాకుమ; డు కాకల. 2. నాటుఁ బోటు. 3. బలు (పై) వై. 4. గడవ వశమె (నగునె) బ్రహ్మాదులకున్. 5. కెఱిఁగింపుఁ. 6. హస్తిసైన్యతతులం; చారణప్రతతులం.

రోత్తము నెదుర్కొనం దగు, న త్తెఱంగున సంఘటింపుఁ డభిరామముగాన్. 243

వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిప్పించి కంకు నాలోకించి నెత్తం బొక పలక యాడుదమే యని యుబ్బుమై మాటగాఁ బలికిన నతండు నీవు [1]సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు సైరంధ్రిం గనుంగొని సారెలు తెమ్మని పనిచి పలక ముందటికిఁ దిగిచికొనుచు నిందు ర మ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదం బాడుట యెంత లెస్స యనుచుం జేరి యాడం దొడంగు నప్పుడు మఱియు ని ట్లనియె. 244

ఆ. జూద మాడి ధర్మసూనుఁడు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు
కాఁగ నొడ్డి యాడి కాఱియఁ బడఁడె య, ట్లగుట దీనితోడి[2]యర్థి కీడు. 245

వ. అని పలికి యాడుచుండు సమయంబున. 246

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబుమై ని ట్లనుం
గురుసైన్యంబుల ముట్టి గెల్చి మొలిమిక్ గోవర్గముం దెచ్చు ను
త్తరుబాహాబలశౌర్య[3]సారము లుదాత్తంబుల్ గదే గోఁగదు నె
వ్వరు నెక్కాలము నిట్టు చేసిరె కులైశ్వర్యం బహార్యంబుగన్. 247

వ. అనిన విని కంకుం డతని కి ట్లనియె. 248

చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యమహోగ్రయోధవి
స్ఫురణము నోర్వఁ జాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడ జయించెనేని వసుధావర యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ బ్రసిద్ధికి నెక్కఁడె యాతఁ డొక్కఁడున్. 249

తే. అనినఁ గటకటఁబడి యిట్టు లాడు టెల్ల, నతనివిజయము సంధియమనుట కాదె
యింతవట్టును సైరించి తివు కాన, యింక నీమాట లుడుగుము కంకభట్ట. 250

వ. అనుచు విరాటుండు కటంబు లదరఁ గన్నులఁ గెంపు కదురఁ బలుక చప్పుడగ్గలంబుగా నాడుచున్న సరకు సేయక యుధిష్ఠిరుండు వెండియు ని ట్లనియె. 251

చ. కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల రథంబుపయిం బరవాహినీభయం
కరభుజసారముల్ మెఱయఁ గాఁ దఱి[4]గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేలినిరతుం డయి దుర్దమలీల నుండఁగన్. 252

వ. అనిన విని సక్రోధహాసోల్లాసవికృతాననుం డై మత్స్యమహీనాథుఁడు. 253

ఉ. వింతలు చాల నీవలన వింటిమిగాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల నెవ్వరిఁ జూడమె పైరివీరదు
ర్దాంతభుజావిలాస మలవం దెగి పోరుల నస్త్రశస్త్రవి

1. సుమాణంబున. 2. దధిప కీడుఁ. 3. సంపద. 4. గాంచి మహోగ్రవిక్రమో.

క్రాంతిఁ గడంగువారి నని కన్నుల నిప్పులు రాలు చుండఁగన్. 254

క. నాకొడుకు[1]పోటుమాటలు, నీకేటికిఁ బొసఁగ నాడ నేరవు మౌర్ఖ్యో
ద్రేకమునఁ బలుకు చుండుట, మాకు సహింపంగ రాదు మానుము విప్రా. 255

క. అనినం జలమునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టు లనియె దరహాసం బా
ననమున ముసుఁగువడఁగ న,జ్జననాయకుతోడ[2]ని ట్లశంకితభంగిన్. 256

ఉ. ఆహవకేళి వేడుక బృహన్నలచిత్తమునం[3]దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీపసుల[4]నొక్కఁడుఁ దక్కక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గా వలయుఁ దప్పదు[5]నాపలు కట్ల చూడుమీ. 257

క. అని యంతట నిలువక య,మ్మనుజేశ్వరు మొగముఁ జూచి మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం, బనుపు బృహన్నలజయంబు భవ్యవిచారా. 258

విరాటుండు కంకుని సారెగొని వ్రేయుట

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ, బడఁగ యెత్తునురగ[6]పాలురేఖ
నెనయ [7]చేతిసారెఁ గొని వ్రేసెఁ బతి వేషి,గడనయుఁడుగు మన్న నుఁడుగవనుచు.

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక కదురనిహృదయంబుతోడం బాంచాలిదెసం జూడ్కి మలఁగ నూరకుండె నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేటుగంటిం దొరఁగురుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువ నున్న కనకకలశంబుజలంబులం గరతలంబు తడిపికొని తుడుచు నప్పుడు మత్స్యమహీవల్లభుం డీశోణితంబు పైచీరం బట్టుటకుఁ గతంబేమి యని తన్నడిగిన నతని కిట్లనియె. 260

తే. విమలవంశంబునను బుణ్యవృత్తమునను, వఱలునీతనిరక్తంబు వసుమతీశ
ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగె నన్ని,[8]వర్షములుగల్గు నిం దనావర్షభయము.

వ. అని చెప్పి యుత్తమద్విజలోహితపాతం బెట్టునుం గీడు కావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్భంగిం జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం దొరఁగం దుడుచు చుండె నంత నట నుత్తరు నెదుర్కొనం బోయి. 262

క. మంగళతూర్యరవములు చెలంగఁగ మౌక్తికవిమిశ్ర[9]లలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు,ణ్యాంగనలును భద్రవాక్చయంబులతోడన్. 263

ఉ. అత్తఱిఁ గన్యకాజనసహస్రముఁ [10]దానును జేరి వేడ్కమై
నుత్తరచందనార్ద్రకుసుమోత్కరముల్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు దండడి చల్లెఁ గిరీటిమీఁద న

---

1. నోపు. 2. ఁడగ నశంకితబుద్ధిన్; డఁగ నశంకితభంగిన్; 3. దలిర్చినన్. 4. నొక్కటి త్రిక్కక యుండ. 5. నావచనంబు జూడుమీ. 6. ఫాలరేఖ. 7. చేత. 8. వర్షములగు ననావృష్టి వలని భయము. 9. లాజాక్షత. 10. గొల్వఁగ.

య్యుత్తరుపైఁ బ్రమోదకలనోత్కటసంభ్రమసంభృతంబుగన్. 264

ఉ. తక్కటివారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచుం
మ్రొక్కుచు నాదటం దనదుమోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్త్రుఁ డ
[1]య్యెక్కుడుమాట కోరువక యి ట్లను సర్వజనంబుతోఁ దగన్. 265

చ. కురుబలముం జయించుటయు గోవులఁ దెచ్చుటయుం బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన చూవె నిజం బిది నాక యేల యె
వ్వరికిని [2]నెవ్వరిం గెలువ వచ్చున యిట్టిసహాయసంపదం
[3]బొరయక యున్న మీ కెఱుఁగఁబోలునె నాబ్రదు కెట్టిభంగియో. 266

వ. అని సారథ్యప్రశంసాప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుం జనుదెంచి రాజమందిరద్వారంబుఁ జేరు నవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెలుఁగు విన్నవించిన నారథికసారథులం జూచువేడ్క మనంబు వేగిరపెట్టడు నయ్యిరువుర నిర్యోఢకుం జయ్యనఁ దోడితెమ్మను విభుని పలుకులు విని ధర్మతనయుండు ప్రతీహారితో నల్లన యి ట్లనియె. 267

క. ఇన్నిత్తురు కనుఁగొనిన బృహన్నల కోపించు నన్ను నతిభక్తిమెయిం
మన్నించుఁ గాన రాజం, దన్ను విచారింప కేమి [4]తప్పుఁ దలఁచునో. 268

వ. ఇది లెస్సగాఁ దురుసునంతకుఁ దదీయప్రవేశం బించుకవడి వారింపుము పదంపడి రా నిత్తు గాని యంతకు నుత్తరుం డొక్కరుండును వచ్చునట్లుగాఁ జేయుము. 269

క. అని చెప్పి హర్షసంభ్రమమున నజ్జననాయకుండు మునుఁగుఁడు సదియే
మని యడుగఁ దలంపమిఁ దన, [5]కను వై కార్యము ఘటించి యతనిం బుచ్చెన్. 270

చ. అతఁడును బార్థు నిల్పి వినయంబున నుత్తరుఁ దోడితెచ్చినం
బితృచరణాంబుజంబులకుఁ బ్రీతిమెయిం బ్రణమిల్లె నాతఁ డా
పతియును జిక్కఁ జేర్చి గనుపాటెసుమేనును హర్షబాష్పసం
ప్లుత మగునాననంబు నయి పుత్త్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు కౌఁగిటన్. 271

వ. ఇవ్విధంబున నాలింగితుం డయి భూమింజయుండు పునఃపునఃప్రణామంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి మొగంబుగంటి చూచి యిది యేమి యని యడిగిన. 272

క. ఏ [6]నీవిజయము పొగడఁగఁ, దా నప్పుడు పేడిఁ బొగడె దానం గోపం
బూనిన సైరింపక నా, చే నడిచితి సారెఁ గొని విశృంఖలవృత్తిన్. 273

---

1. య్యెక్కువమాట. 2. గెల్వవచ్చునె ధనువంబుగ నిట్టి; నెవ్విధిం గెలువవచ్చునె.
3. బొరయఁగఁ గన్న. 4. తప్పఁ. 5. కను వగు. 6. నీజయంబు.

క. [1]అని పతి పలికిన విని నెమ్మనమున భయసంభ్రమములు మల్లడిగొన న
మ్మనుజేంద్రనందనుం డి, ట్లను నత్యాదరము మెఱయ నాతనితోడన్. 274

తే. తప్పు చేసితి [2]రిట్టులు తగునె వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము
గైకొనవలయుఁ గా కిట్లు కాదు కూడ, దని నిషేధించు టొప్పునె మనుజనాథ.

వ. అని మఱియును. 276

క. సవినయముగఁ బ్రార్థింపుఁడు, పవిత్రచారిత్రు లైనపరమద్విజు లి
ట్లపమతు లై కోపించిన, నవనీశుల కేల కల్గు నాయువు సిరియున్. 277

వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడికొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడు తెరువువాఁడు గాఁ డిది యొక్క ప్రొద్దు[3]కీడున నయ్యెం గాని యని తాను రాజు దెసఁ బ్రసన్నుం డగుట తెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన నమ్మహీవల్లభుండు సంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచిన యాబృహన్నలఁ నాదరించి నిజనందను నాలోకించి యి ట్లనియె. 278

విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడుం బళు
త్రాణపరాయణత్వమున [4]దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ కురియఁ బార్థివుఁ డుర్వెను దన్ని చూడ న
క్షీణజవంబునం గవియుసేనకు మార్కొన నగ్గలించితే. 279

ఉ. బాసట లేదు క్రొవ్వడర బంటుతనంబునఁ దాఁకి తేనియుం
బాసినచోట వాయుఁ బెఱపట్టులవీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొకమోహర [5]మమ్ముల మ్రగ్గనేని నా
సాసల నొక్కరుండ యనునాగ్రహవృత్తి బలంబు పైఁ బడున్. 280

ఆ. ఒకఁడు పరశురాము నోర్చినవాఁ డొక్కరుండు ధనువునకు గురుండు తాన
హారువరమునఁ బుట్టి యక్షీణబలవిక్రమముల నొక్కఁ డొప్పు మాఱు లేక.

ఉ. తక్కటివారలుం సురలు దైత్యులనైనను బోర గెల్చువా
రక్కురుసేన మేటిమగ లాధృతరాష్ట్రతనూజు లాజ నొ
క్కొక్కఁడ ధాత్రియంతయును నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ
వెక్కటి దాఁకి నొవ్వకయు నెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా. 282

ఉ. గోవులు నెట్టు లాఁగితి వకుంఠితవిక్రముఁ డైన రాజరా
జేవిధి మానభంగమున కెల్లను నోర్చి పలాయమానుఁ డై
నీవిజయంబు సైఁచి ఘననిందకు నియ్యకొనంగఁ జాలెఁ బు

1. అని యిట్లు నృపతి పలికిన, మన; అని పలికిన విని తన; నెమ్మన. 2. రీరిట్లు. 3. కారణంబున; గుణంబున. 4. దర్పమెలర్పఁగ జే(ర్చి)రి యుల్లస. 5. మిమ్ముల మ్రొగ్గనేని.

త్రా వెఱఁ గయ్యెడుఁ గ్రణవిధం బఖిలం[1]బు నెఱుంగఁ జెప్పుమా. 283

చ. అనవుడు నాతఁ డి ట్లనియె నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మనదైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాగ నర్హ మగుచందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం
డని ననుఁ గాచెఁ గౌరవుల నంతఱ గెల్చి మరల్చె గోవులన్. 284

వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285

తే. ధూళి పెల్లుగ నెనయంగ నేల గోడి, వడఁగఁ జనుమూఁకఁ గని వడవడ వడంకి
పాఱు తేరంగ నమ్మహాభాగుఁ డప్పు, డోడ కోడకు మని నన్నుఁ గూడవచ్చి. 286

వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే నతని యాజ్ఞకు మిగుల
కుండితి. 287

ఉ. కౌరవసేన గోగణముఁ గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానక యుపాంతమునం దొలఁగించి వేగ నా
తే రట తోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబుదు
ర్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెల్చె నార్చుచున్. 288

ఆ. చెదరకుండఁ బసులఁ బొదివి యించుకమేర, యిక్కడరుగుదెంచి యొలమి[2]మగిడి
కడచి పోవుచున్న కౌరవపతి ముట్ట, నడరినంత సేన లతనిఁ గూడె. 289

మ. కురురాజుఁ సబలంబుగాఁ గవిసినఁ ఘోరాహవం బయ్యె నం
దరదంబుల్ నుఱు మయ్యె నశ్వములు ను గ్గయ్యెం గరివ్రాతముల్
ధర దంతంబుల యాఁతగా నొఱగె నుద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ లిట్టినయట్లు కూలెఁ గలయం దద్బాణపాతంబులన్. 290

క. శత్రుంతపాదు లగునృప, పుత్రులుఁ బేరు గలయోధపుంగవులును ద
చ్చిత్రశరనిహతి సంగర, [3]ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ దడవై యుండున్. 291

తే. మొనలు తెరలినఁ గర్ణుండు ముంచి తాఁక
నమ్మహావీరుఁ డాతని[4]తమ్ముఁ జంపి
హరుల నొప్పించి సూతు నో నాడ నేసి
యంగముల బాణములు నించి యతనిఁ బఱపె. 292

క. గురుఁడు తలపడిన నతఁ డ,చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ జిక్కువఱిచి త
ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ, దెరలిచి భీష్మునకుఁగవిసె దృఢరభసమునన్.

మ. అతనిం దీవ్రశరంబులం బొదివి నానాస్త్రంబు లేసెఁ నదీ
సుతుఁడుం దత్సమయంబునం [5]గినిసి యాశూరుండు చాపంబు ద్రుం

1. బును మాకుఁ జెప్పుమా. 2. మగుడి. 3. ధాత్రిం బడి రెన్నఁ జూడఁ దడ.
4. యనుజుఁ. 5. గదిసి.

చి తదీయాంగము నొంచిన౯ వివశుఁ డై చేడ్పడ్డచో సూతుఁ [1]డు
ద్ధతభీతిం వోలఁగంగఁ దోలె రథముం దత్ప్రాణరక్షార్థి యై. 294

క. తమతమబలములతో ని, ట్లమితభుజావీర్యు లైనయారథికవరుల్
క్రమమునఁ దలపడి యోడిన, సమరవిహారమునఁ దనివి సనక యతండున్. 295

మ. ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దుర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి సేర్చికొని యుద్యద్విక్రమం బొప్ప బం
ధురసంరంభత నున్నఁ జూచి [2]బలవద్దోస్తంభలీలాభయం
కరరేఖావలమానచాపుఁ డయి వీఁకం దాఁకె నాసేనతోన్. 296

క. కౌరవపతియనుజన్ముల, దూరమున౯ విశిఖ[3]నిహతిఁ దోలఁగ జడియుచుం
జేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కదిసి నరపతి *సేసెన్. 297

తే. రాజు నొచ్చిన విఱిగిరి రథికవరులు, విభుఁడు తోడన [4]తిరిగె నవ్వీరుఁ డపుడు
[5]త్రోలి యాచిక్కుమూఁకలతోడఁ గూడ, [6]నతని దవ్వుల నడవికి నడిచి మగిడె.

వ. ఇది యమ్మహాపురుషుచేసినవిధం బనిన విని యచ్చెరు వంది విరాటుండు. 299

ఆ. ఆతఁ డెవ్వఁడొక్కొ యమ్మహాత్మునిఁ గనుం,గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప
నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తిసం,యుక్తి నెపుడుఁ గొలిచి యుండ వలయు. 300

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ, డిచ్చోటికి నేల రాఁడొ యిప్పు డనుఁడుఁ దా
నచ్చట నంతర్హితుఁ డై, యిచ్చుఁ జనియెఁ దోఁచు నేఁటియెల్లిటిలోనన్. 301

ఉ. దేవకుమా[7]రకుండ యగుఁ దేజముచందము చూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడినయంతియ కాదు నాకు సం
భావన చేయువత్సలతభంగులఁ దా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు గల్గుట తెల్లముచేసె నెంతయున్. 302

వ. అని చెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం జేసె నట్టిసమయంబునఁ
గౌంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పైచీరచెఱఁగునం బొదివికొని ధనం
జయునిఁ జక్కం జూడక యుండె విరాటుండు కిరీటిపరాక్రమంబు క్రమంబున
నిట్లు తన తనయునివలన వినియునుం దెలియక యెప్పటి నపుంసకత్వబుద్ధితోడన
సంభావించి పోవం బనిచిన బృహన్నలయును జతురంబుగాఁ బలికి తిదియ
తెలుపుతెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యొఱంగింపకుండునది యని
వైరాటితో నల్లన చెప్పుచుం జనియె నజ్జననాయకుండును గంకునిం బొమ్మని
యుచితపరివార[8]వృతుం డయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని
యరిగి సుధేష్ణాసందర్శనసమాచరణంబు నడపి యతం డడుగఁ ద్రిగర్తపతి
నోర్చినతెఱం గెఱింగించె నట్ల నరుండు నాట్యశాలకుం బోయి. 303

---

1. దుద్ధతభీతిం. 2. ప్రచల. 3. తతులఁ; పంక్తిఁ. *నొంచెన్. 4. సరిగె. 5. దోలఁబడి (దోడువిడి). 6. దవ్వుదవ్వుల నతనినిఁ దగిలి మగి (గు) డె. 7. రుఁ డాతఁ డగుఁ. 8. పరివృతుం.

—◎ అర్జునుఁడు త్తరకు భీష్మపాత్రికలుగాఁ గురువీరులశిరోంబరంబు లిచ్చుట ◎—

తే. చెలులుఁ దానును నుత్తర యెలమిఁ దన్నుఁ
గాంచుట[1]యుఁ బ్రీతి యెసలార గారవించి
బొమ్మపాత్రిక లడిగితి కొమ్మ యిందఁ
మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చినయంబరములు. 304

వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జనభోజనంబులు సలిపి ధర్మతనయునివాస*ంబునం దేకాంతస్థలంబునం దా రేవురును ద్రౌపదియును గూడఁబడునట్టి తెఱంగు సంఘటించి సమాగమసముచితప్రకారంబు నడపి గోగ్రహ నివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్యవిదితం బైనయనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కి ట్లనియె. 305

క. మొగ మొప్పదు నా దెస నీ, జగతీనాథునకు నే విచారించియునుం
దగ దీనికిఁ గారణ మిది, యగు నని యేర్పఱుప నేర [2]నయ్యెద నెట్లున్. 306

వ. అనినఁ విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 307

క. ఒం డేమియు లేదు విరా[3]టుం డాత్మతనూజుఁ బొగడుడును దుర్దమహో
ద్దండత కల్గుబృహన్నల, యుండఁ గొఱఁత యేమి పగఱ నోర్చుట కంటెన్. 308

ఆ. అనినఁ జేడిఁ [4]బొగడె దని యవివేకి యై, కోప మడర సారె గొని యతండు
వ్రేసె నెత్తు రపుడు వెడలఁ బోయినఁ జీరఁ, గప్పికొంటి నీవు కాన కుండ. 309

క. అని చెప్పి గంటి చూపిన, ననిలతనూభవుఁడు కనలి యాదుష్టాత్మున్
దనయాదిబంధుయుతముగ, ననిచెద జముప్రోలి కనియె నంగము పొంగన్. 310

వ. కిరీటియుం గోపించి. 311

క. తనకొలఁది యెఱుంగనియి, మ్మనుజాధము నిపుడ పట్టి మర్దింపక త
క్కినఁ గాదు వీనిరాజ్యము, నిను నంతయుఁ జేరు గా కనియె ధర్మజుతోన్. 312

చ. అనవుడు నాతఁ డిట్టు లను నక్కట యింతకు ముంద రేమియున్
మనల నెఱుంగఁ డవ్విభునిమాటునఁ బూనిక దీర్చికొంటి మా
తని కొఱ[5]యొగ్గు చేత యుచితం బె యెఱింగెడునట్లు కాఁగఁ బో
యినఁ గనియున్ [6]దురుద్ధతి వహించినఁ జూతముగాక పిమ్మటన్. 313

వ. అని పలికి వారల [7]కందు మాన్పి యిది యట్ల కాక యొుండు తగునే యనుచుఁ దక్కినవారిదెసయుం గనుంగొనిన నెల్ల వారు నుపశమించిరి తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి [8]వారందఱు విరాటుకొలువుకూటంబునకుం బోయి బయలు మెఱసి యుండువారుగా నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం

1. యును బ్రియంబున. *స్థలంబునం. 2. నయ్యెడ. 3. టుండు దన తనూజుఁ. 4. బొగడి తని. 5. కీడు. 6. మహోద్ధతి సహిం. 7. కుందు. 8. తారంద.

గృతస్నాను లయి పాండుసూనులు సమయవిహితాచారంబులు నడపి యుచిత ప్రకారంబున. 314

క. తెలుపు లగుచీరలను బూఁ,తలఁ బుష్పముల నొప్పి రాజతనయానుగుణో జ్జ్వలమాననీయవేషము, లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్. 315

క. చని ధర్మసుతుఁడు సింహా,సనమున భీమాదు లాత్మసముచితరుచిరా సనముల సభాస్థలిం గయి,కొని పంచాగ్నులునుబోలెఁ గూర్చున్నంతన్. 316

తే. వేడ్కఁదోడి పూసి కట్టి యవ్విరటుఁ డుత్తరుండు తోఁ జనుదేరఁ గొల్వుండుబుద్ధి నచటి కేతెంచి కని విస్మయంబు [1]నొంది, యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టు లనియె.

క. ఇది యేమి కంక నీ వు,న్మదవృత్తిని శంక తక్కి [2]నాగద్దియపైఁ బదిలంబుగఁ గూర్చుండితి, వదియును గా కిపుడు డిగ వహంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు చేసి సంక్రందననందనుం డతని కి ట్లనియె. 319

సీ. నడిదివియలు సేసె నగరికి మాణిక్య,మకుటముల్ పూనినమనుజపతులఁ దగునాజ్ఞ [3]సూయాణముగ నొనరించె మం,చిగ నేలనాలుగు[4]చెఱఁగులకును బ్రిత్థిజనుల సచేతనత్యాగధ్వ,జములుగా నన్ని[5]దేశములఁ బఱపె దిక్కులన్నింటను దెలుపారుపూఁత గా,వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు

తే. రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రతశాలి[6]పాండు రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ,రాజు సుమ్ము మత్స్యావనీరమణ యితఁడు. 320

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు చేసె [7]వి ద్యాతిశయార్థి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు ద్ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ డార్యనికాయ[8]సంతత ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

### అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించుట

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబునం బెనంగొన నితండు ధర్మతనయుండ యేని భీమార్జుననకులసహదేవులుం బాంచాలియు [9]వేరి యని యడిగినఁ గవ్వడి యి ట్లనియె. 322

చ. వలలుఁ డనంగ నీనగరవంటలవాఁ డయి నిల్చివేడ్కకుం బులిఁ గరిఁ గేసరిం దొడరి పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ ల్లుర విఱుచుం గడంగి ప్రబలుం డనఁగాఁ జరియించు చుండు వి చ్చలవిడి భీముఁ డీతఁ డవిషహ్యపరాక్రమదుర్దముం డనిన్. 323

1. దోఁప. 2. మాగద్దియ. 3. చెల్లించె ధర్మైకనిరతి మచ్చిగ. 4. చెఱఁగులందు. 5. దేశముల నిలిపె, దిక్కుల నన్నింట. 6. పాండు, రాజవంశపయోనిధిరాజు; వంశజలనిధి పూర్ణచైత్యా తుఁడు, రాజవరుఁడు మత్స్య. 7. వీర్యాతిశయర్థి. 8. సమ్మతఖ్యాత. 9. ఏరి.

తే. బకమహాసురు [1]నిర్జించి బ్రాహ్మణులకుఁ
[2]బ్రీతిఁ గావించెఁ గిమ్మీరుపే రడంచి
వనము నిష్కంటకము చేసె ఘను హిడింబుఁ
గూల్చి యాతని చెలియలిఁ గొనియె నితఁడు. 324

క. నీమెచ్చువారువంబులఁ, దా [3]మచ్చిగ నరయు నిత్యతాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక, నామము ధరియించె నితఁడు నకులుం డధిపా. 325

క. శత్రునృపకాలకూటము, మిత్రామృతవృష్టి బుధసమీహిత[4]సిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి, పాత్ర మితఁడు మాద్రితొలుతపట్టి [5]నరేంద్రా. 326

క. నీపాలికి వచ్చి నిఖిల, గోపాలకముఖ్యవృత్తిఁ గొలువు పడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య, క్ష్మాపాలక మెలఁగు వీఁడె సహదేవుండున్. 327

క. సుకుమారమానసుఁడు గొం,తికిఁ [6]బ్రాణము ప్రాణ మితఁడు జేతోగణ్యం
[7]డకుటిలుఁడు రాజనీతి, ప్రకారసంవేది వంశపావనుఁ[8]డు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవులం గ్రమంబునం జూపి చెప్పి మఱియు
ని ట్లనియె. 329

క. విను సైరంధ్రీవేషం,బున మాలిని యనఁగఁ బరఁగి పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం,దనకడ మెలఁగుసతి ద్రుపదతనయ మహీశా. 330

క. ఆచపలాక్షికిఁగా మన, [9]కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహ
స్యోచితవిధమున గంధ,ర్వాచరణము పేర భీముఁ డతిభీమముగాన్. 331

### విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్రచ్ఛన్నుఁడై వచ్చి కన్నియలకు నెల్లను నృత్తగీత
వాద్యనైపుణ మనవద్యశిక్షావిధి, నలవరించుచు బృహన్నల యనంగఁ
బరఁగునీతండు బీభత్సుండు సు మ్మని, చూపి యమ్మత్స్యరాజునకుఁ జెప్పి
వెండియుఁ బలుకు నాఖండలు నోడించి, ఖాండవ మేర్చె నాతండు తన్ను

తే. గారవించిన నెక్కటి కాలకేయ, వర్గములఁ బరిమార్చె నివాతకవచ
సంఘములనోర్చెఁ గంధర్వసమితి గెలిచి, ధార్త[10]రాష్ట్రాగ్రజుని చెఱఁదలఁగెనితఁడు.

వ. అన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందేహావేశంబు
వినయసంభ్రమంబులు నిగుడ నీ కునికిం జేసి చిక్కువడి యున్న నిజజనకునకు
నర్జునుం జూపి యుత్తరుం డి ట్లనియె. 333

తే. ఈతఁ డింతకు మీకుఁ ద న్నెఱుఁగఁ జెప్ప

1. మర్దించి. 2. బ్రియము గావించి. 3. మెచ్చుగ. 4. సిద్ధ; బుద్ధి. 5. నృపాలా. 6. బ్రాణం బితఁడు మిగుల; బ్రాణము దలఁప నితఁడు. 7. దకుటిలమతి నృపనీతి. 8. డధిపా. 9. కీచక తతిఁ బట్టి. 10. రాష్ట్రుని విడిపించెఁ దగ నితండు.

వలవ దని నియమించినఁ దెలియఁ బలుక
నలికి యొకదేవసన్నిభుం డంటిఁ గాని
నిన్ను నంతయుఁ దాఁ గదా నిర్వహించె. 335

చ. ఒకరుఁడ తాను భీతి వెగ [1]డొందెడు రెండవనన్ను నెట్టకే
లకు [2]దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు చూడ దా
నికి [3]మదిశంక లేమి మహనీయపరాక్రముఁ డైనయాకిరీ
టికిఁ జనుఁ గాక యివ్విధము దెప్పర మన్యుల కోర్వ వచ్చునే. 336

చ. తమ నెఱిఁగించి యల్ల నుచితప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ జొన్ప నేను భ్రమదంబున [4]నప్పటి కియ్యకొంటి లో
కముసమరంబులట్ల యని కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁ జేత భర మై తుదిఁ బల్మఱు నోహటించితిన్. 337

క. మొగ మోడఁ డితఁడు కౌరవ, జగతీ[5]శుఁడు విఱిగినపుడు జవమున వెనుకం
దగిలి యిది జూద మాడఁగ, నగునెడగా [6]దఱుమ వలయు ననియె నతనితోన్.

ఆ. అనిన [7]నతఁడు వెఱపు నత్యాదరంబును, సంతసంబు మానసమున బెరయ
నవయవముల సంభ్రమావేశ మేర్పడ, గారవమున విజయుఁ గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ, తనయాగ్రజుపాదపీఠతలమున ఫాలం
[8]బును బొందఁ జాఁగి మ్రొక్కి య,తనికౌఁగిలి పడసె సమ్మదము తళుకొత్తన్. 340

ఆ. ప్రీతి [9]నలుమడింప భీమునిఁ గవల నా,లింగనంబు సేసి యంగకములఁ
బులక లెగయఁ గేలు తల మోడ్చి ధర్మజు, నాననమున [10]దృష్టి యడర నిలిపె.

ఉ. అత్తఱి లేచి వచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు [11]తగ వొందఁగ నప్పుడ పిల్చి బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్రసచివోత్కరసోదరవర్గపుత్రకో
దాత్తభటాదియోగ్యుల ముదంబునఁ బాండవదర్శనార్థ మై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగా ధర్మతనయసేవాతత్పరుం డై తదనుమతి సముచిత రుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుధేష్ణ కెఱింగింపం బనిచి పాంచాలిం దగినతెఱంగున గారవించునట్లు కావించె నట్టి యెడ ధనంజయుం డతని కిట్లనియె. 343

తే. చాల దుస్తర మైనయజ్ఞాతవాస, వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త, వృత్తి నేము నిర్భయుల మై యిందులట్లు.

వ. అనిన విని విరాటుం డతని కిట్లనియె. 345

---

1. డొందఁగ రెండవయేను; డొందెడు రెండవు నేను. 2. ననుఁ దేర్చు. 3. మది లెక్కలేమి; శంకలేక. 4. నప్పని. 5. పలి. 6. దరుగు మనియె నాతనితోడన్. 7. విరటుఁడపుడు న. 8. బను వొంద. 9. యినుమడింప. 10. దృష్టు లడర నిలిచె. 11. నలు వొప్పఁగ.

ఉ. ఏనన వేఱ యొక్కఁడనె యి ట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశవాసములఁ గాఱియ కోర్చి యడంగి యుండి మీ
పూనిక దీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి నను నొందుట కాదె సురేంద్రనందనా. 346

వ. అని పలికి ధర్మనందనుం జూచి. 347

చ. ధరణియుఁ బట్టణంబు హయదంతిరథంబులు గోవులుఁ భటో
త్కరము నమాత్యవర్గమును గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భర[1]మున నేనుఁ బుత్త్రులును [2]బంధులుఁ దమ్ములుఁ గొల్చి యుండెదం
గరిపురి కెత్తునట్టిపని కల్గిన నోపిన యంత [3]సేసెదన్. 348

చ. అన విని యుత్తరుండు తగ నజ్జనపాలకుతోడ ని ట్లను
న్మన కొకరాజ్యముం గలదె నన్నును నిన్నును నిన్న మొన్న వీ
రనితరసాధ్యశత్త్రువిజయంబునఁ గాచినయప్డు కల్గఁ జే
సినయది తక్క దాని మఱి చెప్పఁగ నేటికి నింతవింతఁగన్. 349

వ. [4]అది సిద్ధం బట్ల నెల్లుం గాక యించుకవిశేషంబు కల[5]దు వినుము. 350

చ. సవినయవృత్తిఁ గొల్వ మిట చన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిసిననిప్పులట్ల యధికం బగు తేజము [6]తోఁప కున్కి న
ట్టివిధముసాపరాధతను డెందము లూఱటఁ బొంది యుండ నే
రవు మన కట్లు గానఁ దగఁ బ్రార్థన చేయుట యుక్త మిత్తఱిన్. 351

వ. అదియునుం గాక. 352

క. ధనవర్గంబులు వీ రిచ్చినయవి య ట్లగుట వేడ్క చేయవు తగనూ
తన మగుకానిక యీవలయును వే తోడ్తేరఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్. 353

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్త్రుల మొకంబు చూచి కుమారిక నలంకరించుకొని తెం డని నియోగించిన వారును బ్రియంబునం జని తత్కార్యశ్రవణసంప్రీత యగు సుధేష్ణ యనుమతం[7]బున. 354

క. పదనికి రాఁ బులు గడిగిన, మదనాస్త్రము రేఖ కలిగి మానినిమెయి చె
న్నొదవఁ గయిసేసి రప్పుడు, ముదితాజనములు ప్రమోదమున లలితముగన్. 355

విరాటునిమంత్త్రు లుత్తరను బాండవులయొద్దకుఁ దోడ్తెచ్చుట

వ. ఇట్లు శృంగారంబు చేసినయమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికలతోడి గొడుగు పట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు తోడ్తేర ధారాధరనికర మనోహార యగు పర్జన్యలక్ష్మియుం బోలె వచ్చు చున్నం గని విరాటుం డెదురు వోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని పాండవా

1. తను. 2. బంధుబు నిప్పుడుఁ; నుం దగఁ. 3. దీర్చెదన్. 4. ఇది. 5. దవధరింపుము.
6. దాఁచి యున్కి నిట్టి. 7. బు నొందిన.

గ్రజు నగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివారంబుగా దండప్రణా
మంబు చేసి చేతులు మొగిడ్చి యి ట్లనియె. 356

క. ఎఱుఁగమి [1]చీఁకటి నీపెద్దఱికంబు తలంప నేమితప్పు కలిగినఁ
మఱచి దయఁ జూడు [2]మి ట్లం,దఱు నీకుం బనులు చేయఁ దగుదురు వీరల్. 357

వ. [3]అని నిజానుజతనూజులం జూపి మఱియును. 358

క. ఇమ్ముద్దియ నర్జునునకు, ని మ్మాపని బంధుజనుల కిందఱకుఁ గడుఁ
సమ్మత మెల్లప్రజకు నే, నిమ్మెయి [4]నినుఁ జేరి బ్రతుకు టిష్టం బధిపా. 359

క. అని పలికిన విని కుంతీతనయాగ్రజుఁ డింద్రసుతువదన మాలోకిం
చిన నాతఁ డిట్టు లను న, మ్మనుజేంద్రుఁడు వినుచునుండ మత్స్యాధిపుతోన్.

క. ఈకన్నియఁ గోడలిఁగాఁ, గైకొనియెదఁ గాని యిది తగ [5]దుచితవృత్తిఁ
నాకడన యబల మెలఁగుట, లోకము శంకించు నన్ను లోలాత్మునిఁగాన్. 361

వ. అదియునుంగాక నృత్తగీతాదులయెడ నిక్కోమలికి గురుండ నైన నాకు నివ్వి
ధంబు ధర్మంబు కాదు కావున. 362

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళాదక్షుం డుదారుండు కా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీసరోజాననన్. 363

వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంతసంతుష్టాంతరంగుం డై. 364

తే. అర్జునునివియ్య మనియెడునంతకంటెఁ, గడవఁ బెంపు నా కెయ్యది కార్యనిశ్చ
యంబు ధర్మతనూభవుం డానతిచ్చు, వాఁడు మన మెల్లఁగావించువార మదియు.

ఆ. [6]అనుఁడు నతనికిట్టు లనుఁ బాండవాగ్రజుం, డింద్రతనయుఁడుచిత మెఱిఁగిపలికె
నిట్లు చేయువార మిప్పుడు చుట్టాల, కెల్లఁ జెప్పి పుచ్చుఁ డీశుభంబు. 366

వ. అని నిశ్చయించి పలికిన విరాటుండును గౌరవాన్వయసంబంధంబున మాత్స్య
వంశంబు పావనం బయ్యె నని పలుకుచు ధర్మజభీమార్జుననకులసహదేవులకుఁ
గ్రమంబున నుత్తరఁ బ్రణామంబు చేయించిన వారు దీవించి యంతఃపుర
గమనంబునకు ననుజ్ఞ సేయ నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సమయసము
చితపరివార[7]వృత యై యరిగిన యనంతరంబ మౌహూర్తికుల రావించి లగ్న
నిరూపణంబు చేసి యాదవపాంచాలాదిబంధుజనంబుల నెల్లఁ బెండ్లికిం బిలువ
రెండు తెఱంగులవారును గాలరులం బనిచి రజాతశత్రుండును విరటు గారవించి
తా రతనిపాల నజ్ఞాతవాసంబు సుఖవృత్తి నడపికొనుట వాక్రుచ్చి పలికి యతని

---

1. నిం కిట నీ పెద్దఱికంబుఁ దలంచి యేమిదప్పు. 2. మి ట్లం, దఱమును నీపనుపు సేయఁ దగు దుము తలఁపఁ. 3. అని నిజతనూజం జూపి యి ట్లనియె; అని పలికి యక్కన్నియం జూపి మఱి యును. 4. మిముఁ. 5. దుశిష్యగతిఁ; దు శిశువృత్తిఁ. 6. అనిన. 7. పరివృత.

గుణంబులు గొనియాడి నీవు మాకు వాసుదేవునట్లు కాక సామాన్యబంధుడవే యని సంభావించి వినయసంభృతుం డగునతనిం దిగిచి పునఃపునరాలింగనంబు చేసిన నతండును ససంభ్రమ[1]పరిజనసముపనీయమానంబు లగు నానావిధోపకరణంబులం గాంగేయుల వివిధోపచారంబు లాచరించి మహార్హ మజ్జనభోజనంబులు నడపె నంత నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుం జనిచని నడుమ విడిసిన యెడం గర్ణశకునిదుర్మంత్రంబుపట్టి గాంగేయునివచనంబు లప్రమాణంబులు చేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతనిపాలికి దూతం బుత్తెంచిన వాఁడు నేతెంచి కాంచి యిట్లనియె. 367

తే. [2]వాలి యజ్ఞాత వాససంవత్సరంబు, నిండ కుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు తప్పె నీ వెఱిఁగి దీని, కేది తగు నది చేయుము మేదినీశ. 368

వ. అని పునర్వనవాసకరణంబు తోఁప నాడిన నవ్వి యధిష్ఠితసత్యవ్రతుం డయిన యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 369

క. నిండె సమయాబ్దములు నిం, కొం డన లే దిపుడ చని సుయోధనుతో భీ
ష్ముండును గురుఁడును వినఁగా, [3]నిండె నిండె ననుము నిండె నిక్కంబునకున్. 370

చ. అని తగఁ జెప్పి పుచ్చఁ జని యాతఁడు తప్పక చెప్పె నంతయున్
విని ధృతరాష్ట్రసూనుఁడు వివేకవిహీనత నాఁటిరాత్రి కొ
ల్వున గురుభీష్మకర్ణకృపులుం దనతమ్ములు నుండ ధర్మనం
దనునకు దూతఁ బుచ్చినవిధంబు ప్రకాశము చేయ కిట్లనున్. 371

ఆ. మనము మోసపోయి యనిమిషపతిసూతి, తోడఁ బొడిచితిమి యదోషవృత్తి
నతఁడు సమయకాల మంతయుఁ గడచిన, వచ్చెనో యెఱుంగవలయు నిజము. 372

క. అనిన విని యెట్టిమాటలు, వినువారలు నగరె యేను విబ్బచ్చుఁడు వ
చ్చినయపుడ తెలుపనే వల, దనుమానము సమయకాల మట మును కడచెన్. 373

క. అనవుడు భీష్మునిపలుకులు, విని యందఱు సమ్మతించి [4]వెరవిఁడియే ఫ
ల్గునుఁ డనిరి పతియుఁ బురికిం, జనియెను మఱునాఁడు విరళసైన్యంబులతోన్. 374

### శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడవచ్చుట

వ. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్షునికి ప్రసమస్తసాధనంబులుఁ బూజాపూర్వకంబుగాఁ దెచ్చుకొని యుపప్లావ్యంబున వసియించి మత్స్యమహీనాథుండు పంపు సేయం బెంపు మిగిలి పౌరజానపద (సమానీత) నానావిధోపహారంబులు కైకొనుచు బహురత్నంబులకు భాజనంబులై మహనీయవిభూతి శోభిల్లుచున్నంత వాసుదేవుండు బలభద్రపురస్సరంబుగా సాత్యకిసమేతుండై సుభద్రాభిమన్యులం దోడ్కొని కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండును

1. సముచితపరి. 2. సాగి యజ్ఞాతవాస వత్సరదినములు, నిండ కుండంగఁబార్థుండు నిన్న బయలు. 3. నిండె ననుము నిండె ననుము నిక్కం. 4. వీఱిఁడి.

సాంబుండును యుయుధానుండును రుక్మిండును నక్రూరుండును నింద్రసేనాది
పాండవసారథులును రథారూఢు లై కొల్చి రా మఱియు ననేకయాదవకుమా
రులును గరితురగస్యందననిబిడంబు లగుబలంబులతోడ నిరుకెలంకుల నడవం
జనుదెంచి. 375

తే. భవ్యవిభవంబుతో నుపప్లావ్యపురము, చొచ్చిసంభ్రమమునఁ బాండుసుతులుతనకు
నెదురు వచ్చిన నాశ్లేష మెసక మెసఁగఁ, దత్సమాగమయోగ్య[1]విధంబు నడపె.

వ. బలదేవప్రముఖులకును దదీయసందర్శనసముచితసమాచారంబు లొనర్చి సుభద్రాభి
మన్యులం బాంచాలిపాలికిం గొనిపోవ నభ్యంతరజనంబుల నియోగించి. 377

క. లలిత[2]మణిమయవిభూషణ,ములు రుచిరాంబరములును [3]బ్రమోద మెదల ని
ట్టలముగ హరి కుంతీపు,త్రుల కెల్లను నిచ్చి పిదప [4]ద్రౌపది కిచ్చెన్. 378

వ. ఇట్లు కట్ట నిచ్చి వేఱు వేఱ రథకరితురగదాసదాసీజనంబుల నొసంగి పద్మనాభుండు
పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరాచుచుండె దదనంతరంబ. 379

సీ. ద్రుపదభూవిభుఁడు పుత్రులుఁ దానుఁ జతురంగ,బలములతో వచ్చి పాండుసుతులఁ
గాంచి వారలు తన్నుఁ గరము సంప్రీతిమై, గారవింపఁగ నుండెఁ గాశిరాజు
శైబ్యుండుఁ బదపడి సైన్యసమే[5]తులై, చనుదెంచి ధర్మనందనునిచేయు
సత్కారముల గాఢసమ్మదంబునఁ బొంది, రవ్విరాటుండును నంతవట్టు

తే. వారలకుఁ దత్తదుచితప్రకారములఁ బ్రి
యంబుఁ దలకొన సంవిధానంబు చేసె
మఱియు బహుదేశములబంధుమాన్యమిత్ర
వర్గముల వేడ్కఁ బెండ్లికి వచ్చెఁ గలయ. 380

వ. ఇవ్విధంబున రెండుతెఱంగులచుట్టంబులు నైనభూపతులు తమతమ విభవంబులు
మెఱసి వచ్చి యుండ విరాటుండు పురంబున నుత్సవంబు సాటించిన. 381

క. [6]కలువడములు మణితోరణ,ములుఁ గట్టిరి క్రముకకాండ[7]మోచాస్తంభం
బులు నాటిరి కుంకుమమునఁ, గలియ నలికి ముగ్గు లిడిరి కర్పూరములన్. 382

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు వివాహో
త్సవమాధవలక్ష్మికి లలితవనం బై యెలమి కలిమితావల మయ్యెన్. 383

ఉ. తాను సుదేష్ణయుఁ సుతులుఁ దమ్ములు బంధులు గంధమాల్యనా
నానవరత్నభూషణమనఃప్రియమాంగలికప్రసాధనా
నూనవిభూతి మత్స్యవిభుఁ డుజ్జ్వలలీల వహించి భూమిదే
[8]వానయనాదికృత్యపరు లైనజనంబుల గారవించుచున్. 384

1. వర్తనము. 2. ములగుమణిభూషణ. 3. బ్రమోదం బెద; బ్రమోదమెడఁద ని, ట్లల
4. ద్రుపదజ కి. 5. తుఁడై. 6. కలువడఁగులు. 7. మోచాస్కంధం. 8. వాసనయాది.

వ. గరువంపుసంభ్రమంబులతోడ నిజమందిరంబునందు. 385

సీ. [1]అమలరత్నప్రదీపావలి మెఱుఁగిడఁ, బనిచి మణిస్తంభపంక్తిఁ గ్రొత్త
జిగి దళుకొత్తునట్లుగఁ దొడయించి వి,చిత్రవితానముల్ చెలువు మిగులఁ
గట్టించి నూత్నముక్తాదామములతోడఁ, గుసుమమాలిక లెడఁ గ్రుచ్చి వ్రేలఁ
గీలింప నియమించి కేవలమంగళ,భూరుహపల్లవతోరణములు

తే. సంఘటింప నియోగించి చందనమునఁ, బరిణయాగార మలుకంగఁ బాణియాణి
గలుగుముత్తియముల మ్రుగ్గుగా నొనర్పఁ, జతురపుణ్యాంగనాజనతతిఁ *బొనర్చె.

క. వైదికలౌకికవిధిసం,పాదితవివిధార్థవస్తుభరితత్వమునన్
వేదిక పొలు పగునట్లుగ, మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్. 387

క. ఉత్తర నలంకరింప ను,దాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పు గలచెలి,కత్తియలం [2]బుచ్చెఁ బ్రీతి కడలుకొనంగన్. 388

## అభిమన్యుని వివాహమహోత్సవము

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుం డగు మత్స్యమహీనాథుండు మహాహుతిర్త్వికాదిశిష్టజనులు పరివేష్టింపనుండి లగ్నం బాసన్నం బగుచు వచ్చె నని ధర్మతనయున కెఱింగింపంబనిచిన నతండు ననుజతనుజసహితంబుగా నలంకృతుం డై వివిధప్రసాధనశోభితు లగు సమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు చేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరుగల వారువంబులను [3]మట్టుపుదట్టంబు చేసికొని మణిగణంబులు నంబరనికరంబులు పుష్పపుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ గల యోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత నడవ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వందిజనవాక్యసంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటుమందిరంబున కేతెంచి శంఖజయఘంటాపణవాదినిక్వణంబులతోడ నెదుర్కొని చల్లు సేసలు గైకొనుచుం జొత్తెంచిన. 389

క. విరటుఁడు సంభ్రమమును నా,దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా
పరుఁ డై సమయసముచితా,చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 390

తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు, పుణ్యకర్మపరంపరఁ బూని నడప
[4]నర్థిఁ గృష్ణయుధిష్ఠిరపార్థమత్స్య,వరులు తెరయొద్ద నవ్వధూవరుల నిలిపి. 391

వ. సాంవత్సరికదత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యంబులు చెలంగ నత్తెర
యెత్తించిన. 392

ఉ. పీనులఁ దియ్య మెక్క మును [5]విన్కిఁ బరస్పరరాగవృత్తి లో
నూనినఁ జూచువేడుకల నువ్విళు లూరెడునెమ్మనంబు ల

---

1. అతుల. * సమర్చె. 2. బనిచెఁ. 3. మట్టంపువస్తువులు విస్తరిల్లఁ బుణ్యాంగనాజనంబులు క్రంత నడప. 4. పరఁగ. 5. విన్నవిధంబులఁ జిత్తవృత్తి లో.

చ్చోచి నొకయింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. 393

వ. అన్యోన్యావలోకనంబు చేయునప్పుడు. 394

సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱె, తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు
సుందరీరత్నంబుచూపు మనో*రము, నడుగులయొప్పుపై నల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁ దీవఁ, గలయంగఁ బలుమఱు మెలఁగు చుండు
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జోఁకి మగిడివచ్చు

తే. నొండొరువులలేఁజెమటల నూని [1]వ్రేఁగు,పడినచాడ్పున నవయవభంగులందుఁ
దగిలి [2]మఱపునఁ దడయు నిద్దఱవిశాల, నయనదీప్తులు [3]నెఱుకున బయలుపడఁగ.

వ. తదనంతరంబ. 396

తే. ఒండొరులదోయిళుల నినుపొందఁ జేయు, నక్షత్రప్రకరంబు లన్యోన్యమస్త
కములఁబోసిరి మందారకల్పలతలు, [4]విరులుగమియ నొండొంటిపైఁ గురియునట్లు.

చ. లలితతనూవిలాసముల లజ్జకతంబునఁ జేసి మున్ను వి
చ్చలవిడిఁ [5]బట్టఁగా వెరవు చాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు పోయునెడలం దగ వొందిన నూలుకొల్పి [6]యి
మ్ములఁ బచరింతు రొండొరులమోహనమూర్తులపై వధూవరుల్. 398

తే. చిత్తమునఁ గాఢరాగంబుచేతఁ జూపు, తెఱఁగుతోఁపఁ గెంపారెడు [7]తీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర,హించెఁ బల్లవాలంబిమత్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 400

క. పెనుఁగుదుట నిడినమాత్రం,బును నవమాలికయుఁబోలెఁ బొలుపొందె వతం
డును నమ్ముగ్ధయు నేకా,సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్. 401

సీ. కోర్కులు గెడఁగూడుకొని పార [8]మెద్దంగఁ, జిత్తంబు లూఱటఁ జిగురులొత్తఁ
బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు,[9]మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దఱి వేచి చనఁ బోయి తడఁబడి [10]మార్గతి, పడి చూపు లాదట బయలు[11]పఱుపఁ
జెమటలతావులు తమలోనఁ గలసి వే,ఱొక్కసౌరభ మయి చొక్కు చేయ

తే. గాఢసంస్పర్శభంగులు కలుగునట్టి, హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము [12]పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు.

వ. ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణం
బులు రుచిరాంబరంబులుఁ గర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ దాంబూలంబుల
తోడిపళ్లెరంబులుఁ బచరించి పాండవులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురో

---

* హరు. 1. వ్రేఁక. 2. మఱువునఁ దడయు. 3. నెఱుకలు బయలు. 4. విరులగమియు; విరులగములు. 5. బర్వఁగా. 6. యి, మ్ములఁబరఁగింతు. 7. మెఱుఁగుఁబోఁడి. 8. మెద్దునఁ; మేదినఁ. 9. మేనుల మవ్వంబు. 10. మార్పడి; మార్గడి. 11. పఱఁగఁ. 12. పెన్నింట బొరిఁబొరిఁ, పెన్నిట్ట లుమబోలి.

హితప్రకరంబునకుం గట్టనిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధానంబు లంతఃపురవర్తులైనయర్హజనంబులచేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజసప్తశతియును లోకోత్తరతురంగదశసహస్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనంబు లక్షయు మఱియు నానాప్రకారంబు లగుధనంబులు నరణం బిచ్చె నమ్మహనీయమహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగనలవలనను నృత్తగీతాదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను వినూత్నరత్నమయభూషణాది [1]దీప్తవేషవిరాజమాను లగు కుమారులచతురపరిహాసాదివిలాసంబులవలనను బ్రభూతవిభవవిభ్రాజితు లగు రాజసూనులమాననీయగరిమలలితవిహారవిశేషంబులవలనను బాంచాలయాదవకేకయాదిబాంధవసుహితమహిమాంచితసంచరణంబులవలనను నానందనిష్యంది పాండునందనసౌహార్దంబువలనను [2]మత్స్యమనుజపతిమందిరంబు పరమసంపద్భరితంబై యుండె నని చెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు. 403

క. కుంతీనందను లట్లత్యంతవిభవ మెసఁగఁ బరిణయము చేసి సుహృ
త్సంతోషోజ్జ్వలు లై తగ నంతర మెబ్బంగి నడచి రనవుడుఁ బ్రీతిన్. 404

చ. అమృతమయాత్మ భక్తి[3]సుగమాసుభవోజ్జ్వలదివ్యవర్త్మ ష
ట్సనుయుగతాను భావ పురుష[4]త్రయతావివృతస్వభావ ని
ర్మమహృదయైకవాస మునిరంజననిత్యవిలాస దోషసం
గమవినికర్తనా పరమగౌరవధుర్యపదప్రవర్తనా. 405

క. దుర్వహపటుతాపత్రయ, నిర్వాపణ[5]కరణ బోధనిర్మలజనహృ
త్పర్వాచరణ మహాసుర, [6]గర్వాపహరత్వసంప్రకాశైకరణా. 406

మాలిని.—నిగమకుసుమగంధోన్మేషభూతాభిధానా
సుగుణవిగుణలీలా [7]సౌమ్యసాక్షిత్వనానా
జగ[8]దవనవిధానస్థైర్యదత్తావధానా
నగశరధినివాసానంద[9]సంస్తూయమానా. 407

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

విరాటపర్వము సమాప్తము.

---

1. దీప్తివిశేషవిరాజమాను. 2. మత్స్యనగరంబు. 3. నిగమా. 4. త్రయతానృతనిస్స్వభావ. 5. నిపుణ. 6. గర్వాపహతత్వసంప్రకాశమూర్తీ; గర్వహరణతత్వసంప్రకాశనకరు (ర) ణా. 7. సామ్య (స్వామ్య) 8. దవనవిధాన. 9. సంస్తూయమానా; సంధార్యమాణా.

శ్రీరస్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము — ప్రథమాశ్వాసము

గౌరీ[1]పల్లవపుట
యోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ
యోగీంద్రసంతతాంత
[2]ర్యాగపరీపాకరూప హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ఎలమి నభిమన్యు పెండిలి యివ్విధమునఁ, జేసి యుల్లాసలక్ష్మి కై నేసి మత్స్య
మనుజపతియన్వయంబు పావనముచేసి, దినచతుష్టయానంతరమునఁ బ్రియమున. 3

వ. ధర్మతనయుండు తమ్ములుం గొడుకులుం [3]బరివేష్టించి యుండ విశాలరమణీయం
బగువిరాటుకొలువుకూటంబున కరిగి యుండు. 4

క. విరటుఁడుఁ బాంచాలుండును, హరియును రాముండు వారియనుజతనూజుల్
పరిణయసమాగతాఖిల, ధరణీశులు [4]బలిసి యుండఁ దద్దయు నెమ్మిన్. 5

వ. ఉన్నసమయంబున సభాసదులైనమానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణయుధిష్ఠి
రులతో సంభాషణంబులు చేయుచుండఁ బాండవకార్యార్థి యై కృష్ణుండు
తదీయవచనంబులు వారించి వారలఁ గలయం గనుంగొని యిట్లనియె. 6

మ. కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయు లాత్మీయరా
జ్యపదభ్రంశముఁ బొంది [5]సత్యనిరతిన్ శక్తాత్ము లై యుండియుం
గుపితస్వాంతులు గాక తత్సమయసంక్షోభంబు గా కుండఁగా
విపినావాసము గూఢచర్యమును గావింపం దలం పొప్పదే. 7

ఆ. తలఁచినట్లు వ్రతముసలిపి యమ్మాడ్కిఁ బం,డ్రెండువత్సరములు పాండవేయు
లకట క్రూరసత్త్వయాతుధానావళి,తోడఁ గాననమునఁ గూడి మనరె. 8

---

1. వల్లభపటు. 2. ర్యాగమబరిపాకరూప; ర్యాగమపరిపాకరూఢ. 3. బరివేష్టించి చనుదేర విశాల. 4. గొలిచియుండఁ; బలసి కొలువఁ. 5. ధర్మనిరతిన్ సత్యాత్ము లై.

క. పదపడి దుస్తర మగునీ, పదు[1]మూఁడగు నేఁడు కడవఁ బడుట యరిది త
మ్మెదు[2]రెఱుఁగమికై యాపద, లొదవిన సైరించి రిట్టియునికియుఁ గలదే. 9

క. [3]మీరలు ధర్మజువర్తన, గౌరవ మెఱుఁగుదుర కాదె కావున నాగాం
ధారీతనూభవులకును, వీరలకును [4]హితమ కా వివేకప్రౌఢిన్. 10

తే. ధర్మమార్గంబు [5]తప్పక తలఁపుఁ డొక్క, తెఱఁగు ధర్మువు తప్పి యుధిష్ఠిరుండు
పడయ నొడఁబడఁ డయ్యింద్రపదవి యైన, నుచితగతి నెంత పడసిన నుల్లసిల్లు.

వ. కావునఁ బాండవులకుఁ బితృధనం బగు రాజ్యంబు [6]కపటద్యూతంబున దుర్యోధనుం డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్నపదం బగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం [7]గీడురోయమియు నీరెండు తెఱంగుల వారికిం బంచి [8]కుడువం దగుటయుం దలపోసి తగినకార్యంబు చెప్ప [9]నర్హుల రేనును నాకన్నంత చెప్పెద వినుండు. 12

క. కుంతీతనయులు సమయము,[10]శాంతత్వమె నడపి తమభుజాబలమును దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁగింతు మనుచు నున్నవారు[11]కినుకెడఁ గదురన్.

క. వీరితలం పెఱిఁగిన గాం,ధారీతనయుఁడు సుహృద్విధానముఁ [12]గూర్పం
బోరఁ బరిమార్తుఁ గొంచెపు, వారై యున్నాఁడన యని యవశ్యముఁ గడఁకన్.

క. [13]అలఘుబలవిక్రమోదాత్తుల కైనను [14]బలము లేక దోర్గర్వముమై
గెలువఁగ వశమె సహాయము, [15]కలిమి ననంతంబు లగుపగఱసైన్యములన్. 15

క. కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ బ్రోవగు నిమ్మై
నావీరలు నీవీరలు, దేవాసురులట్ల యనికిఁ దెగుదురు కడిమిన్. 16

వ. [16]ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచినతలం పక్కడివారి చిత్తవృత్తి యెట్టిదగుట యెఱుంగ మెదిరిమతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప నేర వగునే కావున నియ్యవసరంబునఁ దగిన మానిసి నందులకుం బుచ్చవలయు దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపా లిచ్చిన [17]మే లగుఁ గాక తక్కిన నప్పటికిఁ బోలిన

---

1. మూఁడవయేఁడు. 2. తెఱుఁగకుండ నాపద, లొదవఁగఁ జరియించి రిట్టి. 3. ఆరయ. 4. హితముగా. 5. దప్పఁగఁ దలఁపఁ డొక్క, తెఱఁగు సైకొనిసేయు యుధి (మూలవిపర్యస్తము), 6. కపటంబున. 7. గీడుసేయ రోయమి. 8. కుడువందగుపొం దగుటయుం. 9. నర్హుల రేము నాయెఱింగినంత; నర్హుల రైనను నాకన్నంత. 10. సాంతంబుగ. 11. గినుకెడఁ. 12. గూర్పం. 13. అలఘుతర. 14. దోడు; దళము లేక దోర్దర్పముచే. 15. కలిమిన గెలువంగ నగుపగఱ; కలిమి ననంతంబులుగ పగఱ గెల్వ నగుక్. 16. ఇదియొక్కతెఱంగునం దోఁచినతలం; ఇది యిక్కడికార్యంబునకుఁ దోఁచిన తెఱం; ఇది యిక్కడి తెఱంగునం దోఁచినతలం పక్కడి వారిచిత్తవృత్తి యెద్దియేని యెఱుంగక కార్యంబు నిశ్చయింప నగునె; వృత్తి యట్టిదయగుటయు నెఱుంగుదుమె; మెదిరితలం పెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప నేర నగునే. 17. మే లట్లు గాక తక్కినప్పటికిఁ.

పని చూచుకొందమని పలికిన విని బలదేవుం డియ్యకొని రాజలోకంబు నాలో
కించి యిట్లనియె. 17

క. హరివాక్యము వింటిరె [1]యిది, యిరుతెఱఁగులజనములకును హితమును ధర్మో
త్తరమును నై యున్నది *యీ, వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్. 18

చ. తమసగపాలు కోలుపడి దానిన యిప్పుడు కోరువీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున సంతస మంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు దాన నపాయము లేక యుండుఁ గో
ప ముడిగి వీరు చేయుదురు బాంధవ మిజ్జగముం బ్రియం[2]పడున్. 19

వ. కావున [3]నిక్కార్యం బెడ సేయక యొక్కరుం బనుప వలయు వాఁడునుం జని
యభిమతంబు సాధించు నప్పుడు. 20

ఆ. మాటపాం దెఱింగి [4]యోటమై నల్లన, చేరి కౌరవేంద్రుచిత్తవృత్తి
కనుగుణంబు కాఁగ నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ దెఱఁగుపడదు.

వ. అది యెట్లనిన ధర్మనందనుం డతనియుద్ధతికిం [5]బుయిలోడి మెయివడి గలనడవడిం
బ్రవర్తిల్లు చుండియు జూదంబువెంట మోసపోయి తోడరి చిక్కనంబడియె
నదియును నతం డక్షవిద్యాపాటవంబు తనకు మిగుల లేమిం జేసియు బంధుజనం
బులు తన్ను వారించుటయుఁ దా నాసట మాని గాంధారరాజు నియమించినం
దత్కళాకౌశలంబునఁ బరిణతుండు కావున నాశకుని యాడి యుధిష్ఠిరుం డోడిన
యొడ్డిమియు [6]గెలుచుచు వచ్చి నట్లగుట నాతనియందును గొఱంత లేదిత్తెఱం
గున వార లధర్మపరు లని [7]నిందింప రాకునికి కారణంబుగా వీరలువుచ్చిన మానిసి
వినయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు ననిన సాత్యకి కోపించి
యి ట్లనియె. 22

సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁ గూడ దని చెప్పుట

ఆ. ఇట్టు లాడఁ దగునె యిది నీక పోలు ని, న్నే మనంగ నేర్తు నిత్తెఱంగు
పాడి కాఁగఁ బూని పలుకంగఁ [8]జెవి యొడ్డి, యాదరించువారి నందుఁ గాక. 23

క. వేడుక పుట్టిన జూదం, బాడెనె ధర్మజుఁడు వార లందఱుఁ [9]దమలోఁ
గూడికొని పిలిచి బలిమిన, యాడి కపటజయము గొనుట యది తగ వగునే. 24

క. ధర్మతనూభవుదెస దుష్కర్మము రూపించి సభ నొకండును మైమైఁ
బేర్మి చెడక పో నేర్చునె, ధార్మికు లిం [10]కెట్టివారు తథ్యం బరయన్. 25

చ. పలికినచందముల్ నెఱపి పైతృక మై చను[11]రాజ్యభాగ మి

1. యది *యే, వెరవున. 2. పడక్. 3. నిక్కార్యంబున కెడ. 4. యోట లే కల్లన.
5. బుయిలోట గలుగునడవడిం బ్రవర్తిల్లుచుం. 6. గెలుచుచు వచ్చె. 7. నిషేధింప రాకునికి.
8. జెవులొడ్డి; జెవి యొగ్గి, యాలకించువారి. 9. సభలోఁ. 10. కేటివారు. 11. సాత్మభాగ.

ష్ములఁ బడయం దలంచి బలముం జలముం గాన నేఱపం గడంగువీ
రలు నొరు వేఁడఁ బోదురె యరాతులు సాధుల మెత్తురే రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ బోలునె యొండొక రాజధర్మముల్. 26

తే. సముచితము లగుమాటలఁ జక్కఁబడక, తక్కనే నుక్కివుం డగుధార్తరాష్ట్రుఁ
డ్రూరశరముల నేనియ్యకొలుపువాఁడ, [1]నవనికొంతేయులకు నిచ్చునట్లుఁగాఁగ.

క. భీమార్జునులకు రణమున, నేమగలును [2]బ్రతియె వీరు నేనును సైన్యో
ద్దాముల మై నడచిన నే, భూమీశులు నెదిరి బ్రదికి పోవంగలరే. 28

ఆ. కవలవారుఁ గొడుకుగమియుఁ బాంచాలవర్గంబు వృష్ణివరులుఁ గడఁగిరేని
నొక్కమాత్రలోన నువ్వెత్తు గొనరె దుర్యోధనాదిశతము [3]నుద్ధవిడిన. 29

క. ఈమత్స్యపతి [4]సహాయము, గా మాకుం దీర్ప రానికార్యము కలదే
సామాద్యుపాయపరుఁ డు[5]ద్దామభుజాబలయుతుం డితఁడు కేవలుఁడే. 30

క. నామతమునఁ గార్యము సం, గ్రామము [6]చేయుటయ యిట్లు గా కీలోనన్
సామవచనంబు లక్కఱ, భూమీశ్వరు[7]తోడ నాడఁ బుచ్చెదరేనిన్. 31

ఉ. దైన్యము తక్క దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
[8]జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొండ మ
న్యోన్యవిరుద్ధఘోషణము లాడినఁ దత్ఫల మాతఁ [9]డందెడున్. 32

వ. అనిన ద్రుపదుం డిది పోలు బలదేవు [10]మాట మాట కాదు బలపరాక్రమవంతుం డును సహాయసంపన్నుండును దుష్టాత్ముండును నైనదుర్యోధనుండు ప్రియవచనంబుల [11]రాజ్యంబుపాలిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు యుద్ధంబునంగాని చక్కం బడఁ డని పలికి మఱియు నిట్లనియె. 33

క. మృదుభాషణముల దుర్జన,హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె యొ
ల్లిదముగఁ గొని యంతంతకు, మద మెక్కుంగాక దురభిమానము పేర్మిన్. 34

వ. అదియునుం గాక. 35

తే. కూటకై ద్రోణభీష్ములు కుమతి యనక
యనుసరింతురు ధృతరాష్ట్రుఁడును దనూజు
తృష్ణ నూనినవాఁడు రాధేయుఁబోఁటి
తులువ లెల్లను [12]నతని సద్బుద్ధి యండ్రు. 36

వ. కావున నతండు దుర్వినీతుం డై యుండు నెల్లభంగుల సంగరంబు కాఁ గల

1. నరసి. 2. సరియె వీరు నేమును శౌర్యో. 3. నుద్దవడి (ని) న. 4. సహాయుఁడు, గా. 5. ద్దామయశోబలయుతుం. 6. సేయుటయ యట్లు; సేయుటయు లెస్స యటు గాకున్నన్, సామ వచనములు నక్కఱ. 7. తోడఁ జెప్పఁ. 8. జన్యవిభుండు; జన్యుఁడు ధర్మనందనుఁడు. 9. డొందె డున్. 10. మాటలు పాడిగావు; మాట పాటిగాదు. 11. వీరికి రాజ్యంబు. 12. వాని.

యది యీసమయంబున బలంబులం గూర్చికొని పిలువం దగురాజులం[1]బిలిచి పుచ్చవలయు సుయోధనుండును దోడుతోసపడి [2]పుచ్చు నుచితపరు లగునరపతులు తొలుతఁ జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయం జూతురు మనము వేసఁ గల కాలముల వేగంబ పుచ్చి శల్యకేకయధృష్టకేతుజరాసంధతనయప్రభృతులయిన భూపతులకును వారివారిబంధుమిత్రజనంబులకును నెఱింగించి పుచ్చుట కార్యం బిది నాకుం బోలినతెఱం గని పలికి తనకెలన సముచితాసనంబున నున్న విప్రవరుం జూపి. 37

క. ఇతఁడు మదీయాగ్రపురో,హితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్
ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు, చతురవచన రచనఁ గఱపి సంప్రీతిమెయిన్. 38

ఉ. ఆతనిసమ్ముఖంబునఁ దదగ్రతనూజుకడన్ [3]మయున్నదీ
జాతునిసన్నిధిం గలశసంభవునొద్దఁ గ్రమోచితంబుగా
నీ తెఱఁ గిట్టు లాడు మని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా
నీతిమెయిం దగం బలుక [4]నెయ్యము లాభముఁ బెంపుఁ జొప్పడున్. 39

వ. అనిన వాసుదేవుండు పాంచాలపతివచనంబు లుచితంబు లయి యున్న యవి యిబ్భంగిన చేయవలయు నని పలికి మఱియు ని ట్లనియె. 40

క. [5]కౌరవులకుఁ బాండవులకు, నారయ నే నొక్కరూప యట్లగుటఁ దగన్
వారును వీరును దమతమ, [6]నేరిమి మయిధరణి యేలి నెగడఁగఁ జూతున్. 41

తే. [7]పెండ్లి కని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ, నేఁగుదెంచితి మిన్నాళ్లు [8]నెల్లయొప్పి
దములఁ జూచితి మియ్యెడఁ, దడవు గాఁగ,నిలువఁదీఱదు పోయి రావలయు మాకు.

వ. అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మాకెల్లవారికి గురుస్థానంబు మీమాట యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబుచేయు మిమ్ము శాంతనవుండునుం గొని యాడు మీయందు ద్రోణ[9]కృపాచార్యులు సఖ్యంబు పాటింతు రట్లగుటం జేసి.

తే. పాండవార్థమై యొక్కరుఁ బనుప మీక,భరము మీపలు కందఱపలుకు మీరు
తెఱఁగుపఱుపంగ[10]మిగిలి యుద్రేకు లైన,వార[11]చెపువారు విపులవిచార[12]విభవ.

క. పొందైన లెస్స[13]విరసపుఁ, గ్రం దయ్యెడుచంద మైన రాజుల నెల్లన్
ముందర రావించి క్రమం,బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్. 45

క. మీపనుపున రాజ్యముపా, లీపాండుతనూభవులకు నీకున్న [14]భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టికొనదే వారిన్. 46

చ. అని గమనోన్ముఖుం డయి మురాంతకుఁ డాద్రుపదుండు ధర్మనం

1. బిలువం బంచి యుద్ధసన్నద్ధుల మయి యుండ వలయు. 2. పిలిచి పుచ్చు నుచిత; పిలువం బుచ్చు నుచిత. 3. వియన్నదీ. 4. నెయ్యము తియ్యము. 5. కౌరవులును బాండవులును, నారయ నా కొక్కరూప. 6. నేరుపుమెయి. 7. పెండ్లికిని బిల్వ. 8. నెలమి యొప్పి. 9. కృపాదులు. 10. బూని; మీఱి. 11. చెప్పుదురు. 12. హృదయ. 13. విసరపుఁ; వీరపుఁ; కయ్యపుఁ. 14. జయా.

దనుఁడు వృకోదరాదు లగుతమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప హాలాయుధప్రభృతియాదవలోకము తోడ రా ముదం
బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వలవైభవంబునన్. 47

వ. వివాహమహోత్సవంబునకు వచ్చిన తక్కటి రాజులును సంగ్రామసన్నాహంబు
నకై తమ తమ పురంబులకుం జనిరి తదనంతరంబ. 48

క. సమరమునకుఁ దగునుద్యోగమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు మ
త్స్యమహీనాథుఁడు [1]సన్నాహము చేసెఁ ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్.

వ. ఇట్లు సన్నద్ధులై [2]వెలివీడు విడిసి తమకు ననురక్తులైనరాజులపాలికిం దగు
దూతలం [3]బుచ్చి రట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనబంధు
మిత్రగణంబైనరాజలోకంబు నెల్ల రావించిన. 50

క. ఇభతురగస్యందనగతి, రథసంబునఁ బృథివి యద్రువ రాఁ దొడఁగిరి భూ
విభుల నలుదిక్కులను లోకభయంకరలీల నుభయకటకంబులకున్. 51

### ద్రుపదుఁడు తనపురోహితుని దుర్యోధనుకడకు దూతఁగాఁ బంపుట

వ. అట్టిసమయంబున నజాతశత్రునసుమతి వడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుం
డైనతనపురోహితుం గురుపతిపాలికిఁ [4]బుచ్చువాఁడై యతని రావించి. 52

క. హితుఁడవు మతిమంతుండవు, చతురవచనకోవిదుఁడవు [5]సమయజ్ఞుఁడ వు
న్నతవంశవర్ధనుఁడ విం,గితవేదివి నెచ్చెలివి సుకృతి వ ట్లగుటన్. 53

తే. నాకుఁ గర్తవ్య మగుపని నీకుఁ జేయఁ, దగవు కావున నెల్లవిధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్రు పాలి కరిగి, నేర్పు పాటించి కార్యంబు తీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు ని ట్లనియె. 55

క. విను కొడుకు కొన్న వేఁదుఱు, కొని [6]కొట్టినతిండికాఁడు కుటిలుం డతఁడా
జనపతిచందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు దది య ట్లుండెన్. 56

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి
నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన
యుచిత మాడిన నందుఁ బో టొడ్డి యున్న
దొరలభృతులమనములు తిరుగఁబడవె. 57

క. గురుభీష్మాదుల మనములు, దురములకుం జొరక యుండ దుర్యోధనుఁ డా
తురుఁడై యొడఁబఱుపఁగ ని, ప్పరుసున నెర వైన ఱిచ్చవడు బల మెల్లన్. 58

ఉ. పాండుతనూభవుల్ పడినపాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం
బండితవృద్ధసజ్జనులపాలికిఁ బోయి కులోచితంబు గా
కుండుట చూపి చెప్పుచుఁ బ్రియోక్తులఁ దక్కటివారి [7]నిట్లు మే

1. సన్నాహము చేసెను. 2. వెడలి వీడు (వడసి) విడిచి. 3. బనిచి రంత. 4. బనుచు.
5. సర్వజ్ఞుఁడ వున్నతవంశవర్తనుఁ. 6. క్రొవ్వినతీఁటుకాఁడు; కుజనుం డతఁ. 7. కెల్ల.

లొండొకచంద మొప్ప దని యుల్లములం దలపోయఁ జేయుచున్. 59

వ. మఱియు సమస్తజనంబులమనం[1]బులు నిక్కడ వ్రాలునట్టియుపాయంబు లెన్నిగల వన్నియు నయ్యైతగవులమై నాచరించుచుఁ జరియింపునది యిచ్చట విరాటు కొలువుకూటంబునం బుట్టినకృష్ణాదులసంవాదంబు తెఱంగును మనయెఱింగిన యదియె తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేశోలాభంబుం గావించుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్రధార్తరాష్ట్ర గాంగేయ విదురగురు[2]కృపాదులకడ కరిగి నానాఁటికి వారివారిచిత్తంబుల తెఱం గెఱింగి ప్రవర్తింపుము దైవగతిం జేసి [3]నీయొడ్డినసూత్రంబునకు సుయోధనుం డొడం బడియె నేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధం బగు దాన నజాతశత్రుం డును బ్రీతుం డగుఁ బోయి రమ్మని నిశ్చయంబు చేసిన నమ్మహీసురవరుండు. 60

క. మును పాంచాలవిభుని వీడ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం
గని [4]యనుమతుఁ డై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్.

వ. అంత నక్కడ దుర్యోధనుండు సకలరాజన్యసాహాయ్యంబుగా గోపాలదేవుపాలికి దూతం బుచ్చుట తగ వగునే యని విచారించి. 62

క. గౌరవమెయిఁ దాన కతిపయ, పరిజనసహాయముగ నరిగెఁ [5]బటుతురగగతి
స్ఫురణానుమోదలీలాభరితుఁ డగుచు వేగిరంపుఁబయనములఁ దగన్. 63

వ. చని తదీయపురప్రవేశంబు చేసె నాదివసంబున ధనంజయుండును గోవిందుం గాన వచ్చె నట్టియెడ. 64

తే. అతఁడు పవడింప మునుకౌరవాధినాథుఁ, డరిగి తలయంపిదెస నున్నతాసనమున
నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ, జని వినమ్రుఁ డై నిలుచుండె సవ్యసాచి.

వ. అంత. 66

క. మేలుకని కృష్ణుఁ డర్జును, నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త
త్కాలోచిత [7]బహుమతిమైఁ, జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్.

వ. తదనంతరంబ. 68

ఉ. వారలఁ జూచి కేశవుఁడు వచ్చినకార్యము చెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము [8]చేయువగన్ సహాయముం
గోరి [9]భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చినబాంధవంబునన్. 69

క. ము న్నేను గాన వచ్చితి, నిన్ను సుజను లైనవారు నెమ్మిని మునుమున్

---

1. బులుం బ్రియోక్తుల నిక్కడ. 2. కృపాదులయిండ్ల. 3. నీయాడిన. 4. యందఱు వేడుకతో. 5. జటుతరగతి వి, స్ఫురణానుమోదలీలా, పరిణతుఁ డయి. 6. నున్నపదంపడి కా(లి)ల్లకడకుఁ; బదపడి కాల్కడ కొయ్య నొయ్యఁ. 7. బహుగతి; కృతమతి మై, చాలఁ. 8. సేయునెడన్; సేయఁ దగన్; సేయ నుపాశ్రయంబునన్. 9. భవత్ప్రకాశ; భవత్ప్రసాదమునకుం.

[1]గన్నం దగఁ గైకొండ్రు స,మున్నతసౌజన్యసారయుతుఁడవు నీవున్. 70

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు కావలయు ననిన వాసుదేవుం డి ట్లనియె. 71

ఉ. నీవిట మున్న వచ్చి [2]తిది నిక్కము పార్థునిఁ దొల్తఁ గాంచితిం
గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగఁ దోడుపాటు స
ద్భావము [3]దీనికిం దెఱఁగు తప్పక యుండఁగ నేర్పరించెద
స్నీవల పెట్టు లట్లు తగ నీవును నీతఁడుఁ గోరికొం డొగిన్. 72

క. నాపాటియ పదివేవురు, గోపాలురు కలరు సమరకోపదబాహా
టోపాభిరామమూర్తులు, చాపాద్యాయుధకళావిశారదచిత్తుల్. 73

క. నారాయణాభిధానులు, వారలు కయ్యంబు [4]చేయువా రొక్కెడ నే
నూరక నిరాయుధవ్యా,పారతమై నుండువాఁడఁ బరమాప్తుఁడ నై. 74

క. వా రొకతల యే నొకతల, యీ రెండుతెఱంగులందు నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుడు తొలితొలి, కోరికొనఁగ బాలునికిఁ దగుం బాడిమెయిన్. 75

అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట

క. అని పలికి హరి కిరీటిం, గనుఁగొని [5]కొండొకవు నీవు కావున నీకుఁ
మును కోరఁ బాడి యనవుడు, విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించికొనినయట్లు కాఁగఁ
దలఁచి చెన్ను [6]మీఱి బలముఁ గైకొని, చనియెఁ బ్రీతి రామసదనమునకు.

వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యో
ధనునకు బలదేవుం డి ట్లనియె. 78

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్లఁ గూడఁబడి యుండఁగ నా
సభ నీకై యేఁ బలికితి, నిభపురమున మాట పుట్ట[7]దే యావు వినన్. 79

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు పలికిన
నవి కృష్ణునకుఁ బ్రియంబు లై యుండె న ట్లగు[8]టం జేసి. 80

తే. అతనిఁ బాసి యొక్కింత ప్రొద్దైన నిలువఁ, జాలమియుమూలముగ విరసంపుమాట
లాడ నొల్లమి నేమియు ననక యంత, నుండి యొకనిశ్చయమ్ముమై నున్నవాఁడ.

వ. అది యెయ్యది యంటేని. 82

క. మీరును వారును జలమునఁ, బోరెడునెడ [9]నెద్ది యెట్లు పోయిన నెఱి నే
నూరక యుండుదుఁ దో డె,వ్వారికిఁ బో నింత నిక్కువం బెబ్బంగిన్. 83

వ. అనిన విని దుర్యోధనుండు దానికియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని

---

1. గన్నంతనె కైకొం. 2. తది. 3. తోడ నెంతయును దప్పక; దీనికిం దగవు తప్పక నెంతుగ నేర్పరించెదన్. 4. సేయు వలను గలరు నే; సేయు వా రొక్కెడ నే 5. కొండికవు. 6. మిగిలి దళ ములఁ. 7. జె (ది) ట్టిపు వినన్. 8. ట యొఱింగి. 9. నెవ్వ రెట్లు; నెవరివంకఁ బో

వాసుదేవు నామంత్రణంబు చేసి కృతవర్మపాలికిం జని యాతం డక్షౌహిణీతోడం దన్నుం గలయ వచ్చువాఁడయి యూఱడం బలికినఁ బ్రియం బంది నిజపురంబున కరిగెఁ దదనంతరంబ కృష్ణుం డర్జునున కి ట్లనియె. 84

క. నారాయణగోపాలుర, భూరిపరాక్రములఁ గురువిభుఁడు కొన సంగ్రా
మారంభరహితు నన్నుం, గోరికొనుట నీకు మే [1]లగునె తలపోయన్. 85

క. [2]అనుటయు నాతఁడు హరి కి, ట్లను నేను రణంబునకు [3]సహాయుం బొల్లన్
విను సుప్రసిద్ధుఁడవు నీ, వని చేసినఁ బేరు నీక యగు నెప్పాటన్. 86

వ. నీ కెదురై జయంబు గొనరా దట్లగుటం జేసి విజయమూలం బగునీతోడును వలయు నీవు సమరంబు చేయ [4]కునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరి కొంటి నని చెప్పి మఱియు ని ట్లనియె. 87

క. సారథ్యం బొనరింపు మ,పారకృపాలీల నెల్లభంగుల [5]నా కీ
గౌరవమును జిరకాలము, కోరినయది దీని నిమ్ము గుణరత్ననిధీ. 88

క. అనినఁ గిరీటికి హరి యి,ట్లను నీ దగుకోర్కి దీర్చుటది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు [6]నసమయుద్ధక్రీడన్. 89

క. అని యూఱడించి నరుఁ దో,డ్కొని ధర్మతనూజునొద్దకుం బ్రియ మెసఁగం
జనుదెంచెం గార్యాలో,చనమును దగఁ జేయు బుద్ధి శౌరి కడంకన్. 90

వ. అంత నట శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమరసహాయకత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుం డై యతండును బుత్రమిత్రసమేతంబుగా నానాసేనాతిసంకులంబుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణంబుల నడచుసమయంబున. 91

దుర్యోధనుండు శల్యసహాయ్యంబు కోరుట

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు, దక్షు లగువా ర్తజనములఁ దత్క్షణంబ
మద్రనాథునిచని యెడుమార్గమునకుఁ, బుచ్చి యెడనెడ నతులవిభూతి మెఱయ.

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ, నొప్పారి తను వగుచప్పరములుఁ
[7]బరపైనచెలువంబు గరగరికయుఁ దియ్య, తెలినీరుఁ గలిగినదీర్ఘికలును
[8]బొడవైనమువ్వంచఁ బొలుచునట్లుగ నేను,గులకు గుఱ్ఱములకుఁ గొట్టములును
ముందర బయలైనచందంబుఁ జతురాభి,[9]మతమైనయాస్థానమండపములు

ఆ. బియ్యములును నేయుఁ బెరుఁగును గూరగా,యలును వంటకట్టియలును గడ్డి
[10]కవణములును బెల్లుగా నొడఁ గూర్చి ని,గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె. 93

---

1. లౌనో. 2. అనవుడు. 3. సహాయత యొల్లన్, విను నీవు సుప్రసిద్ధుఁడ, వని. 4. కునికియు ప్రియం. 5. ననిశీ, గౌరవమునఁ. 6. నతుల. 7. బరవులై చెలువంబు. 8. బొడవు నై; బొడవులై మువ్వంచఁ. 9. మతము లౌ నాస్థాన. 10. ఖాణములును.

వ. ఇవ్విధంబున విడిదలపయనంపుసంపదలు పొంపిరివోవం దనకు సమకట్టినసమస్త
వస్తువులయవై కల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుం డై నిజపరిజనంబులం
జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకు
లైనయుధిష్ఠిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాద
దానంబున కర్హు లని పలుకునవసరంబున నట మున్న పలుదెఱంగులఁ బనులు
చేయుచున్న తనపల్లాయనంబువారిలోఁ గలసి మఱువడి యున్న కౌరవేశ్వరుం
డమ్మాటలు విని యతనికిఁ బొడచూప నిదియ సమయం బని సముచిత ప్రకారం
బునఁ దన్నెఱింగించికొని వినయంబునఁ గనిన నతండును సంభ్రమంబునం
గాఢాలింగనంబు చేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్మునుద్యోగం
బున నయ్యెం గావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు కోరు
మిచ్చెద ననిన గాంధారీనందనుండు పరమానందంబునం బొంది యి ట్లనియె. 94

క. సత్యసరస్వతి వగు [1]మా, చిత్యవిశారదము నీదుచిత్తము [2]నియమౌ
దాత్త్యంబు మెఱయ నాకు న, మాత్యుఁడ వై పూని నడపు మత్సైన్యంబున్. 95

ఆ. తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తి యుక్తిఁ జాల
నీవు నన్ను [3]మాననీయుండవు గాఁగ న, నుగ్రహించి తగఁ బరిగ్రహింపు. 96

చ. అనవుడు శల్యుఁ డియ్యకొని యట్టిద కాదె విభేద [4]వృత్తి నా
మనమున లేదు పాండవసమాజము మీరును నొక్కరూప కా
వున నిది లెస్సమాట తగవుం దలపోయఁగ మున్ను ప్రీతిఁ గాం
చిన నిను నెమ్మిఁ గూడుటయ చేయుదు [5]నిట్టుల యెల్లభంగులన్. 97

ఉ. దానఁ గొఱంత లేదభిమతం బిది కాకయుఁ గర్గనేనియుం
బూని యొనర్తు నన్నుఁ గురుపుంగవుఁ [6]డెంతయుఁ బొంగి నీవు స
మ్మానము చేసి నా కిటు లమాత్యుఁడ వైన [7]పదంబుకంటె మే
లై నుతి కెక్కుకోర్కి యెటు లారసి [8]చూచిన నొండు కల్గునే. 98

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు. 99

క. చను నీవు హస్తినగరం, బున కేనును బాండుభూపపుత్రులఁ బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలఁ జూడ వలయుఁ బోయెద [9]ననినన్. 100

ఆ. అట్లు కాక వేగ మట వోయి మరలుండు, వరము మఱవ కుండవలయు మిమ్ముఁ
జేరి నెగడువాఁడఁ గారుణ్యమున నిట, నరసి యుండుఁ డనియెఁ గురువిభుండు.

వ. అనవుడు. 102

క. దరహాసముతో మద్రే, శ్వరుఁ డాలింగనము చేసి సందియపడ కీ

1. దా, చిత్య. 2. నీయౌదాత్త్యంబు. 3. మాననీయునిఁ గాఁగ; మాననీయుఁ గాఁగ ననుగ్ర, హించి తగఁ బరిగ్రహింపవలయు. 4. బుద్ధి. 5. నిట్టు లనేకభంగులన్. 6. డెంతయుఁ బ్రీతిఁ బొంగి. 7. వరంబుకంటె. 8. చూచినఁ గల్గ నేర్చునే. 9. ననుడున్.

వరుగు మని పలికె నాతఁడు, కరిపురికిం జనియె మది వికాసముఁ బొందన్. 103

శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని [1]స్కంధావారంబు వెలియం జొచ్చి ధర్మనందను[2]నివాసంబున కరిగిన నతండు తమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభిమన్యుప్రభృతిపుత్రవర్గంబును నెదురు వచ్చి కృత[3]ప్రణాములై తోడ్కొనిపోయి కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన సర్వంబును గుశలసంపన్నంబ యని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బునరాలింగనంబు చేసి యి ట్లనియె. 104

క. జనరహితం బగువనమున, ననుజన్ములు ద్రుపదభూవరాత్మజయును నీ
వును నింతకాల మలయక, [4]యునికి కడుం దుష్కరము మహోదాత్తమతీ. 105

ఆ. దానికంటె నరిది తలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగభాసమాను
[5]లైనమీకు మీదయాసూనృతాదుల, పెంపుమిమ్ముఁ గడవఁ బెట్టు కున్నె. 106

క. ఇమ్మహి యెల్లను [6]నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర నీ
విమ్మెయి నిప్పు డఖిలదురి,తమ్ములుఁ గడచుటకు సమ్మదమ్మునఁ బొదలెన్. 107

వ. అని యుచితసంభాషణంబులు చేసి దుర్యోధనుండు తన్నుం గాంచినవిధంబును నతండు ప్రార్థించిన తెఱంగును దానికిఁదానియ్యకొనుటయునుం జెప్పిన ధర్మనందనుం డతని కి ట్లనియె. 108

తే. మేలు చేసితి [7]రొక్కఁగి మెచ్చి వారి, కోర్కి తీర్చుట పెద్దలగుణము కాదె
[8]ఇది మదీయచిత్తమునకు హర్షకరము, తివిగి యొక్కటి వేఁడెద నవధరింపు. 109

వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు [9]చేయువాఁ డై యున్నవాఁడు కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండు నీ యిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీర కాని యక్కడం దక్కొరుండు లేఁడు కావున నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు కర్తవ్యంబు గాఁగలయది సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక [10]మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠింపవలయు నని యభ్యర్థించిన సమ్మతించి శల్యుం డి ట్లనియె. 110

క. అగు నిది [11]పోలును నాకుం, దగ వట్టిద కర్ణునకు రథంబు కడప నీ

---

1. పాండవస్కంధా. 2. నావాసంబునకుం జనిన. 3. ప్రణాముండై. 4. యుని కిది దుష్కరము కడు మహోదాత్తమతిగ. 5. లైనయట్టి మీదయాసుకృతాదుల; లైనమీకు మీదయాసుకృతాదుల. 6. నీ దగు, నుమ్మలికకుఁ (జాలనోర్చి యుర్వీవర). 7. రొక్కరు మెచ్చి (రొక్కరుమెచ్చ) వారి; రొక్కని మెచ్చి వాని. 8. యది మదీయచిత్తమునకు నర్మమశమ, యైన నొక్కటి వేఁడెద నవధరింపు. 9. సేయుచున్నవాఁడు. 10. ప్రార్థనం బంగీకరించి యెల్ల. 11. పోలున నాకుం, దగు నట్టిద.

వగు దని కోరినకౌరవ, జగతీశ్వరుప్రార్థనంబుఁ [1]జలుపఁగ వలయున్. 111

క. కర్ణునిసారథి నై నను నిర్ణయమున కేను పార్థునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్. 112

తే. దర్పమును దేజమును మాయఁ [2]దలరఁ బలికి, చిక్కుపఱచిన నేయంగఁ జేతులాడ
కునికి రాధాతనూజు నర్జునుఁడు తీవ్ర, బహుళబాణపరంపరపాలు పఱుచు. 113

చ. ఇది యొకఁ డేల నీవు మది నెయ్యది కోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల [3]నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన నెంతయుఁ బక్షము [4]చేయు నక్కటా
యదియునుగాక [5]మీాపడినయాపద లెవ్వరి నొవ్వఁ జేయవే. 114

ఆ. ఇట్లు పడితి ననుచు [6]నెద నీవు వగవకు, గారవమున నీమనోరథమ్ము
ఫలము పొందు నెల్లభంగుల దేవత, లయినఁ బడుదు రొక్కయవసరమున. 115

క. వాసవుఁడు తొల్లి నిజకాం,తాసహితము కాఁగ నధికదైన్యము పొందెన్
మీాసంపద పెద్దయె విధి, చేసినగతిఁ [7]బడక యుండ శివునకు వశమే. 116

వ. అనిన విని ధర్మనందనుం డింద్రుండు శచీసమేతంబుగా [8]నట్టిదురవస్థ [9]యేమికార
ణంబున నెత్తెఱంగున ననుభవించె నని యడిగిన మద్రపతి తొల్లింటి యితిహాసంబు
చెప్పెద విను మని యిట్లనియె దేవతలయందు మాన్యుం డై త్వష్ట యను పేరం
బరఁగువాఁడు వాసవునకుం గీడు తలంచి మూఁడుతలలవాని నొక్కని సృజియించి
విశ్వరూపనామధేయుం జేసిన నతం డింద్రపదవిం గోరి ఘోరతపంబు చేయుచున్న
దానికి భయం బంది నిలింపపతి యప్సరస్స్త్రీలఁ దత్తపోభంగంబు చేయుం డని
నియమించి పంచిన. 117

క. వారివిలాసంబులను వి,హారముల విలోకనముల నాలాపములన్
మార [10]వికారం బొతనిఁ, జేరద యన్నాకపతియు [11]సిగ్గిదఁ గదురన్. 118

తే. [12]తలరి యమ్మునిఁ దెగఁజూచి ధర్మరహితుఁ
డగుట యెవ్వరు నెఱుఁగని యట్లు కాఁగ
నేఁడుకాలంబు గడపిన నెఱిఁగి భూత
గణము లాక్రోశ మొనరింపఁగా నతండు. 119

వ. తనదుష్కర్మంబు ప్రకటం బగుటకు రోసి యొక్కవిషమవ్రతం బాచరించి
సముద్రతరుధరణీస్త్రీజనంబులయందు బ్రహ్మహత్య విభాగించి పెట్టి నిజకల్మషంబుఁ
బాపికొని మునిగణసేవితుం డయి సముల్లాసంబునం బొంది [13]యునికికిఁ ద్వష్ట
కోపించి. 120

---

1. (స) జలుపఁగ వలయున్. 2. దనర. 3. నొచ్చె. 4. సేయ నక్కటా; సేయు నల్లవో.
5. మీాపడినయక్కటా. 6. నెడదను వగుపకు. 7. బడయకుండ. 8. నెట్టి. 9. నేమికారణం.
10. వికాసం. 11. సిగ్గిడఁ. 12. తలఁకి. 13. యునికిం గని త్వష్ట.

తే. అనపరాధుఁ దపోనిధి [1]నధికశాంతి, యుక్తుఁ జంపినపాపాత్ము నుఱక పట్టి
మ్రింగఁజాలెడువాని నుత్తుంగదేహు, నేను సృజియింతు జూడుఁడీ యాక్షణంబ.

చ. అనుచుఁ గడంగి నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి వేలిమిం
[2]దనయు సృజించి లోకవిదితంబుగ వృత్రసమాఖ్య యిచ్చి మ
ద్వినుతతపోబలంబునఁ బ్రదీపితతేజుఁడవై జయింపు నీ
వని నియమించి పంచె నమరాధిపుతో [3]సమరంబు చేయఁగన్. 122

ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు చేయుట

చ. పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున [4]నేచి వాసవుం
డని కెదురేఁగుదెంచె [5]నిటు లద్భుతసంగరమైనచోట న
య్యనిమిషనాథుఁ బట్టుకొని [6]యంగద వృత్రుఁడు మ్రింగె దేవత
ల్మనమున బెగ్గలింపఁగఁ జలంబు బలంబును జూపి యుగ్రుఁడై. 123

వ. ఇట్లు మ్రింగినం ద్రిదశగణంబులు తత్క్షణంబ యాదైత్యునకు నావులించునట్టి యాలస్యం బావహించిన. 124

తే. అసురనాథుండు నలసత [7]యడర నీల్గి, యావులించిన [8]నత్తఱి నమరవిభుఁడు
తనశరీరంబు సంకుచితంబు చేసి, కడు జవంబునఁ గుప్పించి వెడల నుఱికె. 125

క. [9]వెలలి బలరిపుఁడు చలమునఁ, గలహమునకుఁ జొచ్చె వృత్రుఘనబాహుబలం
బలవికి మీఱెను దండ్రి వి, మలతపమునఁ జేసి సురలమనములు [10]తలఁకన్. 126

వ. [11]ఇట్లధికబలుండైన వృత్రు నాటోపంబు సహింపం జాలక సురపతి తెరలి మరలి పఱచి మందరగిరిశిఖరంబున కరిగినం గనుకనిం జని యనిమిషు లతనిం గూడుకొని వృత్రవధోపాయంబు విచారించునెడ నవ్వాసవుండును దనమనంబున నిశ్చయించి.

క. హరిఁ గాంచి యతని చెప్పిన, పరమోపాయంబు చేసి బ్రదుకుద మనినన్
సుర లదియ కర్జ మని య, మ్మురమర్దనుకడకుఁ జనిరి మునులుం దారున్. 128

వ. ఇట్లు దివిజానీకంబును మునిలోకంబును బాకశాసనుం బురస్కరించుకొని. 129

మ. చని యాదైత్యు తెఱంగు చెప్పి యతులోత్సాహంబుమై నెప్పుదుర్
దనుజవ్రాతము త్రుళ్లడంచి దివిజేంద్రశ్రీవిలాసంబు పెం
పునఁ బొందించుట నీకు నైజము గదా భూతేశ ఘోరారిమ
ర్దనసంక్రీడ యొనర్పు లోకముల కత్యంతప్రమోదంబు [12]గాన్. 130

క. [13]అనిన విని యొకటి చెప్పెద, వినుఁ డాతనితోడ నమరవిభునకుఁ దగఁ బొం

---

1. నధికశక్తి. 2. దనుజు. 3. నని సేయఁ బోవఁగన్. 4. దేర్చి. 5. నటు లద్భుత. 6. యప్పుడు వృత్రుఁడు; యద్దనుజేంద్రుఁడు మ్రింగె. 7. యడరి. 8. యాతని యమర. 9. వెలువడి శక్రుఁడు; బలారి; యింద్రుఁడు చలమున. 10. కలఁగన్. 11. ఇట్లధికబలుం. 12. నన్. 13. అనుటయుఁ గేశవుఁ డిట్లను.

దొనరింపఁ డొక్కసమయంబున [1]నడఁకువఁ గులిశధారఁ బొందెద నేనున్. 131

వ. మదీయతేజోవిశేషంబున నప్పురుహూతున కుత్సాహంబు సంభవింపఁ గల దది యప్పు డనాయాసంబునఁ బగతు వధియింప నగు నని గదాధరుం డూఱడిలం బలికిన బలసూదనప్రముఖనిఖిలసురలోకంబును సంతసిల్లి మగిడి వచ్చి వృత్రుకడకు మునిజనంబులం బుచ్చిన వారును జని యతని కి ట్లనిరి. 132

క. భుజబల [2]దుర్జయుఁ డింద్రుం, డజయ్యుఁడవు నీవు నీకు [3]నతనికి మీలో
విజయము దక్కదు మీ రేచి జగంబులు నొవ్వ రణము చేయఁగ నేలా. 133

క. [4]మైత్రీసౌఖ్యముఁ బోలునె, శాత్రవ మెమ్మెయిఁ దలంప శక్రశ్రీకిం
బాత్రమ వై [5]యింపుగఁ దన్మిత్రుఁడ వగు మిదియ మేలు [6]మీయిద్దఱకున్.

వ. అనవుడు వృత్రాసురుండు తేజంబువాసికి నాసపడియెడుమాయిరువురకు సఖ్యంబు సమకూర నేర్చునే యనుటయు నమ్మునులు సత్పురుషసాంగత్యంబు సంభవించినం జేయమి నీతికాదు మహేంద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు కావున నతనితోడిచుట్టఱికంబు మే లనిన నొడంబడి యతండు వారల కి ట్లనియె. 135

క. ఏ నొక్క తెఱఁగు చెప్పెద, దానిం గా దనక చేసి తగ మీరలు సం
ధానము దృఢముగఁ జేయుం, డానాకేశునకు నాకు నధికప్రీతిన్. 136

వ. అది యెయ్యది యనిన నార్ద్రంబగుదానను శుష్కంబైనసాధనంబునను దరువునం బాషాణంబున శస్త్రాస్త్రంబుల దివంబున రాత్రియందును నేను వధ్యుండఁ గాకుండ వలయు ననిన వారును దానికి నొడంబడి యవ్వరంబు లొసంగి వృత్రవజ్రధరులకు మిత్రభావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగిరి సురనాథుండు సుఖం బుండి పెద్దకాలంబునకుం దన మనంబునఁ బాయనివైరంబు సైరింపం జాలక దామోదరునిపూనికయు మునిజనంబు చేసినసంధివిధంబును నిరూపించి రిపుం [7]బరిభవింప రంధ్రాన్వేషణంబు చేయుచుండి యొక్కనాఁడు. 137

చ. జలనిధితీరభూమిఁ దనశత్రుఁ గనుంగొని వీని నిప్డు దో
ర్బల మెసఁగంగ నాదుభిదురంబునఁ ద్రుంచెద రాత్రి కాదు తాఁ
దలఁప దివంబు కా దిది యుదగ్రపరాక్రమయోగ్యసంధ్య నా
యలవుఁ జలంబుఁ జూప నెప మైతగుసాధన మెద్ది కల్గునో. 138

క. అని తలఁచుచు నచ్చట నొక, వననిధిఫేనంబుఁ జూచి వాసవుఁ డార్ద్రం
బును శుష్కంబునుగా దిది, యనుచుం గులిశమునఁ గూర్చి యధికరయమునన్.

తే. దాన వృత్రుని [8]వ్రేయ నత్తఱి మురారి
యందుఁ దగ సంక్రమించి యయ్యసురఁ జంపె

---

1. దేఁకువఁ గులిశ. 2. దుర్దముఁ. 3. నతనికి ననిలో. 4. వృత్రా. 5. యొప్పుగఁ ద, న్మిత్రుఁడ. 6. మీకిద్ద. 7. బరిమార్చుటకు. 8. వైవ.

జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ
నఖిలలోకంబులకు మోద మావహిల్లె. 140

వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుఁడు నిజపురంబునకుం జనియె మఱియును భూతసంఘం బిట్లు బ్రహ్మహత్య చేయం దగునే యని యతని నిందించినం బ్రభుత్వసంపద చెడుటయు. 141

ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగి యుండె
నమరు లెల్లఁ గలఁగి యన్యోన్యపీడన,భయముఁ బొంది కూడఁబాఱె తమకు. 142

క. కావలి యై సురరాజ్య, శ్రీపాలింపంగఁ దగువిశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డని చని, యావిభుఁ గని తారు మునులు నతనికి నెమ్మిన్.

దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట

వ. పాకశాసనుతెఱం గెఱింగించి యిట్లనిరి. 144

క. ర మ్మింద్రపదవి చేకొని, మమ్మెల్లను [1]నరయు మనిన మానవపతి నా
కమ్మహిమకుఁ దగుమాహాత్మ్యమ్ము గలదె నన్ను నేల యలఁచెద రనినన్. 145

వ. అంత నిలువక యత్యంత ప్రార్థనంబు చేసి. 146

క. యమవరుణాది త్రిదశులు, తమతమశక్తిప్రభావదర్పంబులు భూ
రమణునకుఁ బంచి యిచ్చిరి, ప్రమోద మెసఁగంగ మునిసభామధ్యమునన్. 147

వ. ఇవ్విధంబున నిచ్చి యధికబలసమన్వితుం గావించి తోడ్కొని పోయి పూజ్యం బగు దివిజరాజ్యంబున కభిషిక్తుం జేసిన నతండును బరమధర్మపరుం డై కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాదిసమస్తదేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చికొని మహానుభావుం డై దివ్యమునిసేవ్యుం బైనయద్దేవేంద్రపదంబు చేకొని తుంబురునారదాది[2]వినోదపాత్రంబులును రంభాద్యప్సరోగణంబులుం గొలువ నభిమతభోగంబు లనుభవించుచు మదంబు మిగిలి మన్మథాధీనుం డై వర్తిల్లుసమయంబున నొక్కనాఁడు. 148

తే. మహితలావణ్యమున నసమాన యనఁగఁ
జనినపౌలోమి యానహుషునకు నయన
మార్గగోచర యగుటయు మదనబాణ
భిన్నహృదయుఁ డై ధృతిఁ బాయఁ బెట్టి యతఁడు. 149

క. సురలోక రాజ్య[3]పదవిఁ, గరిమంబున నున్ననన్నుఁ గనవుం బరమా
దరలీలఁ [4]జతుర యగు నీ, సరసిజముఖి [5]రామి యేమిచందమొ తలఁపన్. 150

క. అని యప్పొలఁతిం [6]బిలిపించిన నదియును భయము నొంది శీఘ్రము దేవేజ్యుని[7]సదనమునకు శరణం, బనుచుం జనుటయును వాసవాచార్యుండును. 151

---

1. బ్రోవు. 2. వీణానాదంబులం దేలుచు వినోదపాత్రంబులగు రంభా. 3. పదవీ, గరిమం. 4. జతురముగ నీ. 5. రామి కేమి. 6. బిలుపిం. 7. చరణములకు శరణం.

వ. పరమాదరంబున నద్దేవిని గారవించి నిన్ను నహుషుదుర్వినయంబుఁ జొరయకుండ నరయువాఁడ నాఖండలుండు నాయత్నంబున నవశ్యంబును దడయక వచ్చు ననియూఱడించిన. 152

క. అది యెల్ల నెఱిఁగి కోపం, బొదవఁగ నహుషుండు గురున కుచితమె యే న
య్యుదితం [1]బిలిపింపఁగఁ దన, సదనంబున[2] నునుచు టనియె సంక్షుభితుండై. 153

చ. అనుడు మునీంద్రులుం సురలు నక్కట నీమహనీయగౌరవం
బునకుఁ బరాంగనం గవయుబుద్ధి [3]జనించుట యీడు కాదు నా
విని మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా
సనుఁ డెడఁ గోరుచోఁ గఱప జాలర మీ రది యెట్లు చెప్పుడా. 154

వ. అనుచు నతండును గడుఁ గోపించిన భయంబుఁ గొని వార లాపౌలోమి నతని పాలికిం దోడ్కొని వచ్చువారై పూని బృహస్పతికడకుం జని యద్దేవియు వినుచుండ ని ట్లనిరి. 155

క. నహుషుఁడు మహేంద్రపదవీ, సహితుఁడు శచికిఁ వరింపఁ జను నాతని లో
కహితంబు గాఁగఁ బుచ్చుము, మహాత్మ [4]తచ్చిత్తమున యమర్షం బడఁగన్. 156

క. అనవుడు శోకం బడరఁగ, ననిమిషగురుఁ జూచి యిట్టు లను శచి [5]యటు పు
చ్చిన దూఱు గాదె నను శుచి, యని మీకోనియాడు టెల్ల ననృతముగాదె. 157

వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బురుహూతపురోహితుండు. 158

క. నహుషుండు పనుచువాఁ డటె, విహితానుష్ఠానపరులు వీ రటె [6]తా లో
కహితం బటె యిది మనకుం, మహనీయమ కాక యెట్లు మానఁగ వచ్చున్. 159

వ. అని యుల్లసం బాడి యనిమిషులను ఋషులను జూచి యి ట్లనియె. 160

తే. శరణు చొచ్చిన రక్షింపఁ జాలి యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు తప్పఁ
బుణ్యకర్మంబు [7]లఫలతఁ బొందు ననఁడె, కమలగర్భుండు తొల్లి జగద్ధితముగ. 161

వ. అని యనురూపాలాపంబుల నిషేధింప వార లట్లేనిఁ గర్తవ్యం బెయ్యది యూహింపు మనిన నద్దేవి నహుషు[8]కడకుం జని సముచితంబుగాఁ దదీయ సాంగత్యంబున కెడ పలికికొని వచ్చునది యంతమీఁదఁ మనపుంగవులుం బురందరున కభ్యుదయం బగు తెఱం గాచరించువార మనుటయు నాచస్పతి వచనంబులకు సంతసించి సురసంయమిసంఘంబు లరిగినయనంతరంబ, 162

క. పౌలోమియు నానహుషుని, పాలికిఁ జనుటయు నతండు భావజవికృతి
వ్యాలోలమానసుం డయి, లీలా[9]సంభావనాలలితముఖుఁ డయ్యెన్. 163

---

1. బిలువింపఁగఁ. 2. నునుచుడనియె (వ్రాఁతప్రతులు ఒక్కింటిలో భావార్థకటవర్ణమునకు మాఱుగా డువర్ణకమే కానవయ్యెడి). 3. జనించుట కాదు కీడు. 4. నీ చిత్త. 5. యిటు (ఇం, చిన) దూఱు గాదె. 6. పో. 7. విఫలతఁ. 8. పాలికిం. 9. రసభావనా.

వ. అట్టియెడ. 164

ఉ. అల్లన యింతి యి ట్లనియె నారసి వాసవుకల్మి [1]లేమియుం
దెల్లముగా నెఱింగికొని తేఁకువ లే కిట వచ్చు టొప్పు నా
యుల్లము శంకితం బగుచునుండఁగ వేగిరపాటు మేలె నీ
వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. 165

వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ పలికికొని యింద్రాణియు మగుడం జనుదెంచె నమరగణంబును మునిజనసహితంబుగా విష్ణుదేవుపాలికి రహస్యవృత్తిం బోయి జిష్ణుని దురితంబు పాపుటఁ గోరిన శౌరి కరుణాయత్తచిత్తుం డై.

క. హయమేధంబున నాకుం, బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో
దయమగు నాపుడు వారలు, రయమునఁ జని రందఱుం బురందరుకడకున్. 167

ఇంద్రుండు నహుషుతేజోవిశేషంబు చూచి మఱుఁగువడుట

క. చని యతని నశ్వమేధంబునఁ గల్మషరహితుఁ జేయఁ బురుహూతుండుం
దనపురికి నరిగి నహుషుం, గని తత్తేజోవిశేషకంపితుఁ డయ్యెన్. 168

వ. ఇట్లు వృత్రారి తన బ్రహ్మహత్య పాయుటయే కాని నహుషు నంతబలంబు లేమిం జేసి భయాకులితచిత్తుం డై. 169

క. ఎందేనిఁ జనియె నాతని, సుందరియును నెమ్మనమున శోకోద్రేకం
బొంది పురందరుఁ డరిగిన, కందువ [2]యే నిప్పు డెట్లు గాంతునొ యనుచున్. 170

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధిదేవత [3]నీసత్యంబువలనం గను దని చెప్పి యనంతరంబ సాకార యై పొడసూపినఁ బౌలోమి నీ వెవ్వర వని యడిగిన నదియును భవ[4]త్పాతివ్రత్యసత్యశౌచంబులకుఁ బ్రియం బంది వచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీకుం బాకశాసనుం జూపెద రమ్మని తోడ్కొని హిమవంతంబు నుత్తరంబున మంజుమంతం బను మహాశైలంబున కరిగి దాని యందు శతయోజనవిస్తీర్ణం బైన యొక్క సరోవరంబు చొచ్చి యచ్చట నుల్లసిల్లు పంచవర్ణకమనీయంబు లగు కమలంబులలో నొక్క నాళంబు భేదించి ముందటఁ బ్రవేశించె నింద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతిం[5]గన్నంత నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు. 171

క. పతిసన్నిధి పడసి మహాద్భుత మందెడు శచి తదీయపూర్వసుకర్మ
స్తుతి చేయుచు నిలిచిన నతఁ, డతివం గని [6]సంభృతాదరాత్ముం డగుచున్. 172

ఉ. ఇచ్చట నేను నిల్చు టిది యెట్టు లెఱింగితి నన్నుఁ గాన నీ
వచ్చినకార్య మేమి యనవద్యగుణోత్తర చెప్పు నావుడుం

---

1. లేమియేఁ. 2. యే నెప్పు డెట్లు గాంతున. 3. నీసత్యంబువలన నీమగనిం గను దని. 4. పాతివ్రత్యశౌచం. 5. గనుపించి యంత నయ్యుపశ్రుతి. 6. యపుడు సంభృతాత్ముం.

బొంచెము లేక యానహుషుపోయినపోకలు [1]దానికిం దగం
జెచ్చెరఁ గాలయాపనము చేసినభంగియుఁ జెప్పె దేవియున్. 173

వ. చెప్పి యుపశ్రుతితెఱంగును నతని కెఱింగించి దేవా నీ వి త్తెఱం బ్రకాశుండ వై
భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షింపక తక్కిన
నుక్కివుం డగు నతని పాపనిశ్చయంబున నాపద వచ్చు ననిన విని వల్లభకు దివిజ
వల్లభుం డి ట్లనియె. 174

క. ఆనహుషుబాహుగర్వ మ్మనూనం బై యున్నయది సముజ్జ్వల[2]మునిస
న్మానప్రవృద్ధ మగుటను, దానం గాలంబు వేచెదను జయమునకున్. 175

చ. తఱి యగునంతకుఁ రిపునుదగ్రత సైచుట నీతి నీవు నా
కఱపినయట్ల చేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దల[3]పోఁతయ కల్గెనేనిః గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడ వై చను దెమ్మను [4]మంతఁ దీఱెడున్. 176

ఆ. [5]అనిన నట్ల కాక యని [6]పతి వీడ్కొని, యింతి నహుషుపాలి కేఁగుదెంచె
నతఁడు తమక మడర [7]నద్దేవిఁ బెద్దయు, నాదరించి యిష్ట మడుగుటయును. 177

వ. ఇంద్రాణియు ని ట్లనియె మన నిరూపించినసమయంబునకుఁ గొండొకతడవు కలదు
కాలం బగుటయు నిన్ను వరియించెద నీవు మహామునివాహనుండవు కా వలయు
నది నాకుఁ బ్రియంబు నీకు ననన్యసామాన్యం బైనయానంబు తేజోవిశేషకరం
బగు ననిన నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుం డై. 178

ఆ. ఏను దక్క నొరుల కెవ్వరి కైన న, వ్వాహనంబు నెక్క వశమె నీకు
సమ్మదంబు కాఁగ సప్తర్షిగణము నా, యందలంబు మోవ నరుగుదెంతు. 179

క. అని వనితఁ బంచి [8]యప్పుడ, మునులం బిలిపించి మౌర్ఖ్యమునఁ దనకుఁ వా
హనముగఁ జేసి యొకింతయు, ననుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. 180

క. చని పౌలోమియు సురగురుఁ, గని నహుషుఁడు వేచి యున్నకాలం బెడ లే
దనిమిషనాథున కిత్తెఱి, ననుగ్రహము చేయవలయు నవహితబుద్ధిన్. 181

వ. శరణాగత నైన నన్ను రక్షింపు మనిన నతం డి ట్లనియె. 182

క. ఆనహుషువలన నాపద, రా నీ నాతనికి నాతురత కావింపం
బూని యొనర్చెద వేలిమి, దానను ముని [9]వాహనత గతస్థైర్యుఁ డగున్. 183

క. వెరవున నీపతియునికియు, నరసెద నని యూఱడించి యప్పుడ వైశ్వా
నరు నర్చితుఁ జేసి పురందరు తెఱఁగుం జెప్పి యతనిఁ [10]దడవం బనిచెన్. 184

---

1. ఁదాను దానికిం; వానికిం దగం. 2. మునిస, న్మాన ప్రవిష్ట; ప్రయుక్త. 3. పోయఁగఁ గల్గె నేని. 4. నంతఁ దీఱెడున్. 5. అంత. 6. పల్కి వీడ్కొని. 7. నద్దేవిఁ గని పెద్ద యాదరించి. 8. యప్పుడు. 9. యానమున గతైశ్వర్యుఁ డగున్. 10. దడవఁగఁ బుచ్చెన్.

## అగ్ని దేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట

వ. వనిచిన వహ్నియు వనితారూపంబునం జని మనోగతి యగుటం జేసి సర్వదిశలును భూమ్యంతరిక్షంబులును గిరివిపినంబులును గొండొక సేపునకుం గలయం జూచి సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి వాచస్పతికి నత్తెఱం గెఱింగించి నాకు జలంబులు ప్రవేశింపరామి నంద పరికింప నేర నైతి నప్పులవలన నగ్నియు బ్రాహ్మణులవలన క్షత్త్రియజాతియు నశ్మంబులవలన లోహంబును నుద్భవించె వాని వాఁడిమి యెల్లయెడలనుం జెల్లుఁ దమతమజన్మస్థానంబులయం దడంగుం గావున నీళ్లు నాకు సంక్షయంబు చేయుట సుప్రసిద్ధం బనిన విని యనిమిషగురుండు హవ్యవాహను నత్యంతగౌరవంబునం గనుంగొని. 185

మ. సకలస్థావరజంగమంబులు భవత్సాన్నిధ్యమాత్రంబునన్
వికసిల్లుం గ్రతువైభవంబులుఁ జతుర్వేదంబులున్ నీవ పా
వక నీయంద [1]జలంబులుం గలిగె విశ్వవ్యాప్తిమై నున్న నీ
కొకచో టెట్టు లగమ్య మయ్యె నిను నీ వూహింపు మెం పారఁగన్. 186

ఉ. ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం
[2]గాని విశంకతన్ సలిలగామిని కమ్మనినం గృశానుఁడుం
బూనిక నేఁగి వారినిధి[3]భూరినదీసరసీతటాకసం
తానము రోయుచుం జని శతక్రతుఁ డున్న సరోవరంబునన్. 187

ఉ. అంబురుహంబులం గలయ నారసి [4]చొచ్చి యొకండు నాళసూ
త్రంబున నున్న యింద్రుఁ గని రాగమునన్ గురునొద్ద కగ్ని శీ
ఘ్రంబున నేఁగుదెంచి తనకన్న తెఱం గెఱిఁగింప నాతఁ డు
ల్లంబున నుల్లసిల్లి సురలన్ మునులం దగఁ గూర్చి క్రక్కునన్. 188

మ. దివిజాధీశ్వరుపాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁ డై
వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి వరిష్ఠం బగునీదుకృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహిం
[5]పవు నీ కేమి కొఱంత వృత్రవధ యేపాపంబు [6]రూపింపుచున్. 189

క. శరనిధిఫేనంబున నా, హరి పొంది జగద్విరోధి యగువృత్త్రునిఁ దాఁ
బరిమార్ప నీకు విజయము, దొరకొనియెం గాక [7]దీన దోసము గలదే. 190

వ. అని సముచితంబుగా సంబోధించినగురునిసంభాషితంబుల నిర్ధోషితుం డయి నిజరూపంబు వహించి సకలసుమనోమునిసహితంబుగా నతని సంభావించి జంభారి కర్తవ్యం బెయ్యది యని యడిగిన నాచార్యుం డితం డెఱింగినను విస్పష్టం

---

1. జగంబులుం. 2. గాన నశంకతన్. 3. పూర్ణసరిత్సరసీతటాక. 4. యం దొకపద్మనాళసూ; చూచి యొకండు నాళసూ. 5. పవ నీకేమి. 6. రూపింపఁగన్. 7. నీకు.

బుగా నహుషువృత్తాంతంబంతయు వివరించెదంగాక యని తలంచి యి ట్లనియె.

క. నాఁ డట్లు నీవు నీ దగు, పోఁడిమి చెడి యడఁగుటయును భువనంబుల కె
వ్వాఁడును రక్షకుఁ [1]డయ్యెడు, వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్.

ఉ. ఒండొరుచేతఁ బీడ పడ నోపక రక్షకుఁ డైనవాని నా
ఖండలతుల్యు నేమిగతిఁ గాంతుమొకో యను చున్న చోట ను
ద్దండబలైకరక్ష్యము శతక్రతురాజ్యము దాని నేల న
న్యుండు సమర్థుఁడే యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. 193

వ. అట్టిసమయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుకడకుం జనిమనంబుల మనుజుం డనునను మానంబు తక్కి యతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన నతండును దాను హీనబలుండ నని శంకించినం దమతమ తేజంబుల యంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన. 194

క. మహనీయభవత్పదవీ, మహితుం డై నహుషుఁ డేచి మదమున ధర్మ
స్పృహ తక్కి తన్ను నిప్పుడు, వహియింపఁగ సమ్మునీంద్రవర్గముఁ బనిచెన్. 195

ఆ. ఇదియ కాదు మఱియు నెన్నియు దుర్విన,యములు కలవు వాని [2]కలసి నిన్ను
వెదక వచ్చితిమి వివేకహీనుం డగు, నతనిఁ జెఱుప [3]నిప్పు డవసరంబు. 196

వ. అది[4]యెట్లంటేని వినుము నాఁడు హరిపంపునం జేసినయశ్వమేధంబుననీవపగతకల్మషుండ వైనను నహుషునకుఁ దేజోహాని లేమిం జేసి యతని నాక్రమింపరాదయ్యె నిప్పుడు మహామునులు నధఃకరించి యతండు నిస్తేజుండై యున్న వాఁడు కావున నీచేతం జెడు న ట్లగుటయుం దురగమేధఫలపరిపాకంబ యింక నుత్సాహంబు చేయు మను చున్నసమయంబున యమవరుణకుబేరులు సోమసహితంబుగా నరుగు దెంచి పురందరుం గాంచిన నతండు ప్రియంబంది యప్పటి కార్యంబు తెఱంగు వారల కెఱింగించి తగిన సంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి దృష్టివిషయ దుస్సహుం డైననహుషు గెలుచునుపాయంబు విచారించు నవసరంబున.

క. [5]కష్టుం డగునానహుషుఁడు, నష్టాత్మకుఁ డయ్యె దివిజనాయక నీయు
త్కృష్టచరితమున సురలకుఁ, దుష్టిగ నిజరాజ్యసంగతుఁడ వగు మనుచున్. 198

క. మునివరుఁడై నయగస్త్యుఁడు, చను దెంచిన శతముఖుండు సమ్మతి నుచితా
సనమిడి యర్ఘ్యముఁబాద్యము, నొనరిచి యిట్లనియె[6]సవినయోక్తి నతనితోన్.

ఆ. అధికవిభవ మెసఁగ నసమానశక్తిప, నాథుఁ డగుచు నున్ననహుషుఁ డిప్పు

---

1. డై తగు. 2. నరసి (కలికి) నిన్ను. 3. నిదియ యవసరంబు. 4. యట్లుండె వినుము. 5. దుష్టాత్ముండగునహు; దుష్టుండగునాసహు. ఈపద్యము తర్వాత 'వ. ప్రార్థించి దీవించి రంత' అని యొక వచనము సందర్భమంతగాఁ బొసఁగలేదు. 6. సవినయోక్తులతోడన్; వినయయుక్తి నతనితోన్.

డేమికతన భాగ్యహీనుఁ డై యుజ్జ్వల, శ్రీతొలంగె మునివరేణ్య చెపుమ. 200

అగస్త్యుఁ డింద్రునకు నహుషభ్రష్టతఁ దెలుపుట

వ. అనిన విని యమ్మునీంద్రుం [1]డి ట్లనియె నన్నహుషుని మోచి వేసరు చున్నమును లతనికడ గోష్ఠీవినోదంబుల నుండి బ్రాహ్మణంబు లయిన [2]మంత్రంబులు గోసం ప్రోక్షణంబునందుఁ జెప్పఁబడి యుండు నవి నీకుఁ బ్రమాణభూతంబు లగునే యని యడిగినం బాపనిశ్చయుం డై యతం డమ్మంత్రంబులు ప్రమాణంబులుగా వనిన నే నమ్మాట నిషేధించి పూర్వాచార్యులచేత నభినందితంబు లగుమంత్రం బులు నిందించుట యజ్ఞానం బని వివాదంబు చేసిన నతండు కోపించి మదీయ మస్తకంబు దన్నిన నతనిం గనుంగొని పుణ్యహీనుండును [3]దేజోహానిదీనుండును నగుట యుపలక్షించి నీవు పూజనీయు లయినమహామునుల నిన్ను వహింపం బని చితి వారలు కొనియాడుమంత్రంబులు గర్హించి తదియునుంగాక నన్ను నవ మానించితి కావున నింద్రపదభ్రష్టుండ వై బహుసంవత్సరంబులు భూలోకంబున [4]నురగరూపంబున నుండు మని శాపం బిచ్చి పదంపడి యనుగ్రహించి భవదీయ వంశజాతుం డయి యజాతశత్రుం డను పెంపు కలిగి యుధిష్ఠిరనామధేయుం డైన యొక్క సత్పురుషునిసందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు పడ యువాఁడ వనినఁ దత్క్షణంబ. 201

క. స్వర్గ[5]పరిభ్రష్టుం డై, దుర్గతికిం [6]బోయె నతఁడు దుష్టాత్ములకున్<br>దౌర్గత్యము సుజనులకు న, నర్గళసద్గతియు నగుట యరుదే యెందున్. 202

మ. అనినన్ దేవతలుం దపోధనులు [7]నత్యానందముం బొంది రా<br>[8]మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల న<br>య్యనురాగంబు [9]చరాచరంబులకు హృద్యం బయ్యె సర్వాప్సరో<br>జనముం గౌశికుఁ గాన వచ్చె సుభగై[10]శ్వర్యంబు శోభిల్లఁగన్. 203

వ. తదనంతరంబ. 204

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ గిన్నరసిద్ధసాధ్యులున్<br>దేవగురుండుఁ[11]దోన చనుదేరఁగ వైభవ ముల్లసిల్లనై<br>రావణదంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డాశచీ<br>దేవియుఁ దాను మోదమునఁ దేలి రభీష్టవినోదలీలలన్. 205

వ. ఇవ్విధంబున మహానుభావుం డగునమ్మహేంద్రుండు. 206

క. ఆజ్ఞాభంగంబయినం, బ్రాజ్ఞేతరునట్లు దుఃఖపడి యుండఁడె తా<br>నజ్ఞాతవాసమును గా, లజ్ఞతఁ [12]జలుపండె యన్యులకు వగ పేలా. 207

---

1. డమరవరునకి ట్లనియె. 2. మంత్రంబులం గొన్నిసంప్రోక్షణంబునం. 3. దేజోహీనుండును. 4. నురగంబ వై యుండు. 5. పద. 6. జనియె నతఁడు. 7. నిత్యా. 8. మునిఁ గీర్తించె. 9. చరాచరేంద్రులకు. 10. శ్వర్యం బవార్యంబుగన్. 11. దోడనరుదేరఁగ. 12. జేయండె.

క. కావున మీపడినయర,ణ్యావాసక్లేశమునకు నజ్ఞాతవిధిన్
[1]సేవకుల రైనదానికి, నోవకుఁడి మీరు లఘుమనోవృత్తుల రై. 208

వ. అని యిట్లు చెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని. 209

ఉ. కౌరవనాథుఁ డానహుషుకై వడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁ డై జయము చేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్. 210

వ. అని పలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 211

క. సౌఖ్యంబులు పొందు జగ,త్ప్రఖ్యాతులుఁ జెందుఁ దగఁ బురందరవిజయో
పాఖ్యానము విన్నను ద,ద్వ్యాఖ్యానము చేసినన్ జనావళి కనఘా. 212

క. మోహారము నడచుచుండఁగ, నీహరివిజయంబు [2]వినుననేంద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం,దేహం బించుకయు లేదు ధీరవిచారా. 213

వ. అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి [3]మహానుభావా భవదీయ [4]భాషణశ్రవణంబునఁ జిత్తంబు కలంక తేఱె నని సంభావించి యతనికి సముచితంబు లగుమజ్జనభోజనంబు [5]లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు [6]నుద్యోగించిన. 214

ఆ. అతని ననుప నేఁగి [7]యధికసంప్రీతి నే,తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు
రణములోన మీరు రాధేయుఁ బలుకుట, మఱవకుండ వలయు మమ్ముఁ దలఁచి.

క. అనుటయు మద్రేశ్వరుఁ డా,తని నూఱడఁ బలికి గాఢ[8]తరముగ నాలిం
గన మొనరించి చనియె హా,స్తినగరికి బలమ్ముతో నతిత్వరితగతిన్. 216

వ. అట్టి యవసరంబున. 217

మ. సకలారాతిభయంకరుం డగుచు నుత్సాహంబు పాటించి నే
లకు వ్రేఁగయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొకయక్షౌహిణితోడఁ బాండవబలం బుల్లాసముం బొంద సా
త్యకి బాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢి[9]సంరూఢుఁ డై. 218

వ. అంతం జేదిపతి యగుధృష్టకేతుండును జరాసంధనందనుం డగుసహదేవుండును [10]జెఱొక్కయక్షౌహిణితోడం జనుదెంచిరి సహోదరు లేవు రగు కేకయపతులు నేకాక్షౌహిణీసమేతు లై యేఁగుదెంచిరి తదనంతరంబ. 219

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు, [11]దడములఁ గరిఘటల [12]భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, కడువేడుకఁ దోడుసూపెఁ గౌంతేయులకున్.220

---

1. సేవకు లైనను దానికి. 2. విని. 3. మహాభాగా. 4. భాషణంబులఁ జిత్తంబు కలంకదీఱె. 5. లొనఁగూర్చి. 6. నుద్యోగించి కదలిన. 7. యతిశయప్రీతి. 8. తమముగ. 9. సంధిల్లఁగన్. 10. నొక్కొక్క. 11. దళము. 12. పటు.

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజ
సమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొకయక్షౌహిణి యొడ్డ
నంబు దీర్చి. 221

క. చిందములనెత్రోతఁ బగతుర, డెందంబులతోడ దిక్తటీసంధులు నం
దంద పగులంగఁ గుంతీ,నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు చూపెన్. 222

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలు[1]దెసల నుండి వచ్చినబలం బొక్కయక్షౌహిణికిం
గలిగి యొప్పె. 223

క. ఏడక్షౌహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతికుతూహలవృత్తిన్. 224

వ. ఇవ్విధంబునం గూడి పెరిగి యుధిష్ఠిరుసైన్యంబు కయ్యంబునకుం గాలు ద్రవ్వుచు
నుండె నంత నక్కడం [2]కిరాతకాంచనసైన్యనిచయంబులం గూర్చికొని సమరంబు
నకు నమరి యొక్కయక్షౌహిణి గల భగదత్తుండు సుయోధనుం గలసె భూరి
పరాక్రముం డయినభూరిశ్రవుండును మహాబలుం డయిన శల్యుండును నేకా
క్షౌహిణీసమేతంబుగా [3]నేతెంచిరి వారలయట్ల సన్నద్ధుఁ డై కాంభోజనాథుం
డైనసుదక్షిణుం డను యవనేశ్వరుండును వచ్చె న ట్లెఱంగున సమకట్టి జయద్రథ
ప్రముఖు లైనసింధుసౌవీరనరపతు లరుగుదెంచిరి మాహిష్మతీపతి యగునీలుండు
యాదవవీరుం డగుకృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగు విందానువిందు
లిరువురునుంగా నిన్నలువురు నొక్కొక్క యక్షౌహిణితోడఁ జనుదెంచిరి మఱి
యునుం బలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁడక్షౌహిణులకుం గలిగె
ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకండక్షౌహిణు లయ్యె నట్టి
యెడ. 225

క. సవరణల నొప్పి యనిఁ బాం,డవబలముల మాఱొక్కనం గడంగుచు నత్యు
త్సవమునఁ బేర్చినసేనల, కవకాశము లేదు విడియ హాస్తిపురమునన్. 226

క. నానాముఖముల విడియం, గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా
[4]సేనలదొరలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధికహర్షం బెసఁగన్. 227

వ. ఇ ట్లెఱంగునం గురుజాంగలంబున రోహితకారణ్యంబున మరుదేశంబున నహి
చ్ఛత్త్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున
[5]విచ్చలవిడి విడిసి ధనధాన్యాదిసమస్తవస్తువులకలిమిం జేసి [6]యొలమి మిగిలి
యున్నంత. 228

1. దేశంబుల. 2. కిరాతనిచయంబులం; కిరాతకాంచనజననిచయం; కిరాతయవనపుళింద
నిచయంబులం. 3. నేఁగుదెంచిరి వారలయట్ల సన్నద్ధు లై కాంభోజనాథుం డైన సుదక్షిణుండును
యవనేశ్వరుండును నొక్క యక్షౌహిణితోడ వచ్చి రట్లెఱంగున. 4. సేనకు దొరలకు. 5. విడిదల
సి. 6. యొలమి గలిగి.

క. పాంచాలమహీవల్లభు, పంచినభూదేవుఁ డుచితభంగి నరిగి కే
లెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం, గాంచి కృపద్రోణవిదురగంగాసుతులన్. 229

వ. వారివారిమందిరంబులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి యొక్కనాఁ డక్కౌరవేశ్వరుపేరోలగంబున సమస్తసేనాపతులం గలయం గనుంగొని యి ట్లనియె. 230

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులు సహోదరు, లగుటయు వారలయాత్మజులకుఁ
దమతమతండ్రులధనములు గైకొనఁ, దగుటయు మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె యట్లుండెఁ దొల్లింటిచందంబును మనకుఁ దెల్లంబ కాదె
ప్రాణగొడ్డము లగుపనులు వారలఁ [1]దీర్పఁ, దలఁచినఁ బుణ్యంబుకలిమిఁ జేసి

తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్య
[2]కొనియె నీపెద్దరాజు నే మనఁగ నేర్తు. 231

శా. నారీరత్నము నట్లు తెచ్చి సభలోన న్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగఁ జేయుటయు [3]లచ్చిం బుచ్చికోలుం మహో
గ్రారణ్యస్థలి నిల్వఁ బంచుటయు [4]దైన్యవ్యక్తిమెసల్కుల్
సైరింపం జనుపాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే. 232

క. వీరలవృత్తముఁ బాండుకు,మారులవర్తనము తెఱఁగు మాత్సర్యము లే
కారసి ధృతరాష్ట్రునకుం, గారవమున బుద్ధి చెప్పఁగాఁ దగు మీకున్. 233

తే. పాండవులు కౌరవులతోడిపగకు నొల్ల, రఖిలభూప్రజానాశన మగుటఁ జేసి
వార లస దని తలఁపంగ వలవ దధిక, ధర్మపరు లైనకతమునఁ [5]దగవు నడచె.

వ. అందుఁ గూడినవి యే డక్షౌహిణు లిందుఁ [6]గూడినవి పదునొకం డక్షౌహిణు లని తలంతు రేని వినుండు. 235

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁ డయినసాత్యకియు మహో
గ్రాహవభూమి సహస్రా,క్షౌహిణు ల ట్లగుట మీరు చూడరె యొందున్. 236

క. [7]గాండీవధన్వునాహవ, పాండిత్యముఁ [8]దలఁప నతని ఖండనమున మా
ర్కొండు నని యొకఁడు కడఁగుట, కొండం గని తగరు తాఁకఁ గోరుట గాదే.

క. ఆబీభత్సునిభూరిభు, జాబలమును దుర్నివారశౌర్యము శరవి
ద్యాబహుళతయును బందికి,నై బవరముఁ జేసినట్టిహరుఁడ యెఱుంగున్. 233

వ. అదియునుం గాక. 239

---

1. దేర్పఁ దలఁచినఁ. 2. కొనిన యా. 3. లక్ష్మిం 4. దైన్యావృత్తి; దైన్యవ్యాప్తి. 5. దగవె. 6. గలవి. 7. గాండీవధరుని యాహవ. 8. దలఁప కతని.

మ. వివిధోపాయపరాయణుండు రిపుదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణకళాప్రావీణ్యగణ్యుండు ధై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిలవిద్యాజాలసంవేది మా
ధవుఁ [1]డాదిక్కఁటె పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే. 240

ఆ. అదను తప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ, బిలువఁబంచి హితముఁ బ్రియము రెండు
పక్షములకు నగుట [2]పాటించి తగవుమైఁ, గొంతభూమి యిచ్చి కూడి మనుఁడు.

చ. [3]అనవుడు భీష్ముఁ డి ట్లనియె నక్కట భాగ్యము కాదె పాండునం
దను లోకయాపదం బడక ధర్మగతిం దగ నందఱుఁ సుహృ
జ్జనులను గృష్ణునిం గలసి సమ్మద మొందుటయుం బ్రశాంతిమై
మనముల నీసు తక్కి మృదుమార్గము పట్టుటయుం దలంపఁ[4]గన్. 242

క. [5]నీవాక్యము విప్రస్వా,భావికమై యిట్లు శ్రుతికిఁ బరుషం బైనన్
భావింపఁ గార్యమున యం, దేవిధమున సభకు నింతయిష్టం బగునే. 243

చ. సమయము యీఁడి పాండవు లశక్తులచాడ్పున [6]నిందు నాఁడు బ
న్నమువడి చన్నదైన్యము వనంబునఁ బడ్డ విషాదవేదనా
శ్రమము విరాటువీట లఘుసంచరణంబున దాఁగి యున్నదుః
ఖమును జగం బెఱుంగదె యకల్మషులం బఱుపంగఁ బాడియే. 244

క. పితృధన మగుపా లుచిత, స్థితి వారల కిచ్చి నిర్విశేషుం డై యీ
పతి లోకము మెచ్చఁగ [7]నిజ, సుతునివహామునట్ల వారిఁ జూడఁగ వలయున్.

వ. అట్లుం గాక. 246

చ. [8]కడవఁగ జూద మాడి [9]యవుఁ గా దన నేరక సత్యభాషణం
బెడలిన వచ్చుధర్మగతిహీనత కోర్వక రాజ్యహీనతం
బడుటకు నోర్చి ధర్మజుఁడు పంచిన సైరణ చేసెఁ గాక క
వ్వడి[10]నెఱిగిన్క కెట్టి మగవారలు నోర్తురె [11]యిజ్జగంబులన్. 247

వ. అనిన విని కర్ణుండు కనలి యి ట్లనియె. 248

క. జనులెల్ల నెఱింగిన[12]యీ, పని యేటికి నుగ్గడింపఁ బలుమఱు దుర్యో
ధనునకయి శకుని జూదం,బున మేదిని [13]గెలిచె ధర్మపుత్త్రుం డోడెన్. 249

ఆ. దీన నేమితప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి
తండ్రిపాలు మాకుఁ దగు నంచు[14]నడియరి, తనము చేసి రాక తప్పు కాక. 250

క. విరటుఁడు ద్రుపదుఁడుఁ దోడుగ, బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం
గురుపతియు వెఱచి యిచ్చునె, ధరలోఁ జక్కఁసగ మిట్టి తగవులు కలవే. 251

---

1. డాదిక్కఁట. 2. భావించి. 3. అన విని. 4. గాక. 5. ఈవాక్యము. 6. నుండి. 7. దన. 8. కదు. 9. యెటుఁగా దన. 10. నెఱిగిన్క. 11. యేజగంబులన్; ముజ్జగంబులన్. 12. దీ, పని. 13. మేదినిఁ గొనియె. 14. నది వెట్టి; గడుసరి.

వ. అనిన గాంగేయుండు కటకటంబడి కర్ణున కి ట్లనియె. 252

ఉ. చిక్కనిపోటుమానిసి విసీ వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడుమాట లాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ [1]యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నే
[2]డిక్కడఁ బల్కులన్ గెలిచె దీ వతనిన్ మనరాజు కొల్వునన్. 253

క. నరుఁ [3]డాలవెనుక వచ్చినఁ, గురురా జడుగంగ నీవు గురుఁడును గృపుఁడున్
గురుసుతుఁడు వినఁగ వారల, చిరసమయము తెగుట యేను జెప్పనె తెలియన్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయుభక్తి
ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము
తోఁపఁ [4]దా నిట్టు లనియె నా ద్రుపదమనుజ
పతి పురోహితుతోడ [5]సంభ్రమము లేక. 255

ఉ. [6]మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా
రించి సమస్త భూప్రజకుఁ బ్రీతిగ బిడ్డలపాలి కిప్పు పు
త్తెంచెద సౌమ్యు నొక్కరు మదీయమనోగతి వారిఁ గూడి వ
ర్తించుతెఱంగు గైకొనుట తెల్లము కౌరవ[7]జాతి కెంతయున్. 256

తే. నీవు మున్నేఁగు మని యతనికి విభూష, ణాంబరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి
[8]వీడుకొలిచ్చి పుచ్చిన విప్రవరుఁడు, పాండుజనపాల తనయులపాలి కరిగె. 257

వ. ఇట్లు చని వారలం గని యతండు సముచిత సంభాషణంబులఁ దన పోయివచ్చిన కార్యంబుతెఱం గెఱింగించె నిట ధృతరాష్ట్రుండును బుత్రమిత్ర [9]వృద్ధామాత్యసహితంబుగా నాస్థానాసీనుం డయి యుండి సంజయు రావించి యతని కి ట్లనియె. 258

తే. పాండు నరపాలసుతు లుపప్లావ్యమునకు
వచ్చి యున్నారు నీ వేఁగి వాసుదేవ
సహితముగ వారిఁ గని తద్విషాద మేమి
భంగి [10]మాను నమ్మెయిఁ దగఁ బలుకవలయు. 259

ధృతరాష్ట్రుఁడు సంజయుఁ బాండవుల యొద్దకుఁ బంపుట

క. మీయయ్య మీరు వనవా, సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం, డై యిట పుత్తెంచె నన్ను ననుమీ మొదలన్.

వ. అని చెప్పి చుట్ల నున్న వారలతో ని ట్లనియె. 261

---

1. నూర్వురన్. 2. డెక్కుడు పల్కులన్; మాటలన్ గెలిచె దీవును వేడుక రాజు కొల్వునన్. 3. డాలమునకు. 4. గా. 5. సంభ్రమ మెసఁగ; సంభ్రమము దలఁక; సంప్రీతి మెయిన. 6. మంచిద నేము. 7. జాతికింతకున్; కంతకున్. 8. వీడుకొలుపునఁ బుచ్చిన విప్ర...వీడుకొల్పిన నప్పు డవ్విప్రవరుఁడు, పాండురాజ తనూజుల. 9. భృత్యామాత్య. 10. బాయు.

క. దుర్యోధనుండు కార్యా,కార్యజ్ఞుఁడు కామి నిట్టి కలఁక గలిగెఁ గా
కార్యులు దృఢధైర్యులు రణ,ధుర్యులు నగు పాండుసుతులు దోషా[1]న్వితులే.

క. క్షీరోదకవృత్తి మనము, వారలునుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్
వారిడుములఁ బడఁ దగియెదు, వారే పితృభాగ మేలు[2]వారలు కారే. 263

ఆ. మనల నింక నమ్మ రన్యాత్ము లన్యాయ, పరులు గర్వులనుచుఁ బాండుసుతులు
కూడి మనుట కియ్యకొన నేర రైనను, ధర్మజుండు కలఁడు తగవు నడప. 264

వ. అని పలికి వెండియు. 265

మ. మన కీ కుండఁగ వచ్చునే మనము దుర్మానంబు [3]పాటించి యొ
ప్పని కార్యంబులు పట్టి వారికిఁ దగం బా లీక [4]గర్వంబు లా
డిన నిక్కం బగునల్ల నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ
ష్ణుని సారథ్యము నై జగత్త్రితయ సం[5]క్షోభంబు కాకుండునే. 266

తే. అలఘుగదఁ [6]బూంచికొని భీముఁ డతి రయమునఁ
గురుకుమారులపై దీవ్ర[7]కోప మెసఁగఁ
గవియు టాత్మ భావించినఁ గంప మడరు
నిక్క మెవ్వరు మార్కొని నిలుచువారు. 267

సీ. కవ [8]లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు, ద్రుపదుఁ డల్పుండె తత్సుతులు బాహు
[9]గర్వసమగ్రులు కారె విరాటుండు, నాతని తమ్ములు నాత్మజులును
నసదులే సాత్యకి యలఁతుఁడె బోయెదు,వాఁడె వృష్ణికుమారవరు లనేకు
లట్టి యోధులు పోర [10]నరవాయి గొందురే, పాండ్యుండుఁ గేకయపతులు నాది

తే. రైన బంధులు మిత్రులు నగ్గలికలఁ, గొఱఁతవడియెడువారె యందఱును గెల్వ
నోపినను రుద్రునకు నైన నోర్వరాని, ధర్మపుత్రు కోపమునకుఁ దలఁక వలదె.

వ. అని పలికి సంజయు దిక్కు మొగం బై యెల్లవారును విన ని ట్లనియె. 269

తే. నీవు ధర్మజుపాలికి నెమ్మి [11]నరుగు, మతఁడు పేరోలగం బున్న యవసరమునఁ
గాన్పు మతనికి ననుజవర్గంబునకును, బంధులకు నింపు పుట్టంగఁ బలుకు మచట.

తే. నెయ్యము [12]పాటించి కడుం, దియ్య మెసఁగ నలుక [13]లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపు లోనుగ, నయ్యమనం బనుఁడు మాను నట్టి తెఱఁగు[14]గాన్.

సంజయుఁ డుపప్లావ్యంబున నున్న పాండవులయొద్దకు వచ్చుట

వ. [15]శాంతి ప్రకారంబునం గార్యంబు నడపి యెక్కటి యై మనుట యొడఁగూర్చి
రమ్ము రథం బెక్కి పొమ్మని తగిన తెఱంగున వీడ్కొలిపిన సంజయుండునుం

---

1. క్షమకులే. 2. వారల కారే. 3. నం జేసె. 4. దర్పంబు. 5. క్షోభంబు సంధిల్ల (వాటిల్ల) దే. 6. బుచ్చికొని. 7. కోప మడర. 8. లగ్రజులకంటెఁ గడు బెట్టిదులు కారె 9. గర్వసమృద్ధులు. 10. నరువాయిగొండ్రె యా. 11. నరిగి యతని. 12. పాటించిన మదిం; పాటించి తగం. 13. లెల్లఁ దెగునట్టులుగా; లెల్లఁ దీఱెడునటుగాఁ. 14. నన్. 15. శాంతిప్రకారంబు నడపి.

జని యుపప్లావ్యంబు సొచ్చి మాధవుమందిరంబున కరిగి యభ్యంతరవినోదంబుల నరసహితుం డై యున్న యన్నారాయణునకుం దన రాక యెఱింగించి పుచ్చి తగఁ బ్రవేశించి భయభక్తివినయ[1]సంభ్రమంబులు మెఱయ వారలం గాంచి యమ్మహాత్ము లిరువుర సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీతచేతస్కుం డై మఱునాఁడు ధర్మతనయు నొడ్డోలగం బున్న సమయంబు వేచి సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతండుం బ్రియపూర్వకంబుగా నాదరించి తన సమీపంబున నునిచికొనినం గొలిచి యుండి యతని కి ట్లనియె. 272

తే. [2]భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁ బడసి నాదు
చూడ్కి చరితార్థ మయ్యె న స్తోకపుణ్య
ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథుఁ
[3]డిందు మీయున్కి విని ప్రియ మెసక మెసఁగ. 273

క. అనుజులు నీవును ద్రోవది,యును బుత్రచయంబు నున్న యోగక్షేమం
బున కెఱఁ గారయఁ బుత్తెం,చె నితాంతస్నేహపూర్ణచేతోవృత్తిన్. 274

వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 275

క. ఆరాజు మాదెసం గల, కారుణ్యముకతమునను సుఖంబున ని ట్లు
న్నారము నినుఁ బుత్తెంచినఁ, గారవమున నాదుమది వికాసముఁ బొందెన్. 276

క. అమ్మనుజేశ్వరునకు నే,మమ్మే పుత్రకులు సుఖులె మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెద రే నగ,[4]రమ్ముల భూములను శుభపరంపర కలదే. 277

సీ. ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును, సుఖ మున్నవారె సుశ్లోకుఁ డైన
భీష్ముండు కుశలియే పెద్దతనం బిచ్చి, యాతనిఁ గౌరవు [5]లనుసరించి
మెలఁగుదురే బ్రాహ్మణులకు మన్నన గల్గి, యుండునే యే మర్థి నొసఁగినట్టి
వృత్తులు చెల్లునే [6]యొత్తొరు వొండుల,వలనఁ బుట్టదు కదా కలఁకులందుఁ

తే. బుట్టినప్పుడు గాండీవి భుజబలంబు, తలఁతురే భీమసేనుగదావిహార
ముగ్గడింతురె కవలు మహోగ్రరిపుల,భూము లంతంత కొత్తుట పొగడఁబడునె.

మ. ఒకనాఁడా తమముందటం బలుమఱున్ హోరాటమై నేల యొ
త్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లంబుగాఁ జూచి పాం
డుకుమారాళి నుతింప కుండుదురె యాటోపంబునన్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటిచరిత్రం బాత్మలం బాయునే. 279

క. వినుము మనము మధ్యస్థుల, మని నన్నును నెదిరి సంజయా యిట ము న్నె

1. సంభ్రమంబులు మనంబునఁ బెనంగొన. 2. భాగ్యమునఁ గాదె నినుఁ జూడఁబడసి నాదు. 3. డిచట మీయున్కి. 4. రమ్మున జనులను; రమ్మున రాష్ట్రమున. 5. లాదరించి. 6 యొత్తుదు నొరువుల; యొత్తురు వొడ్డుల.

వ్వనికిని మానముఁ బ్రాణంబును దగఁ దక్కించుకొనఁగఁ బోలునె చెపుమా.

క. దుర్యోధనునింటం దగు, కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా
తుర్యంబు మెఱయుకర్ణుని, యార్యత్వము చెల్లుచున్నయదియే నెమ్మిన్. 231

వ. అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజునొద్ద నవినీతులు నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు మఱియు వివిధప్రకా[1]రులు నయి చెరసి యుండుదురు వా రొక ళ్లొకళ్ల మాటలం బోయెదు[2]వారు కారు కావున వారి నంత యనం బని లేదు నావిన్నపంబు చిత్తగింపుము. 282

క. పొం దొందఁగఁ దలఁచితి నీ, విందుశిశిర మైనవిమలహృదయంబున వా
రందఱకును సేమం బిట, ముందర లేకున్న నేఁడు మొదలుగఁ గలుగున్. 233

క. ధృతరాష్ట్రభూపతికి వృద్ధతకతమునఁ జిత్త మొకవిధము కామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడిదు మనస్కృతి పిదపం బుట్టి యిపుడు శాంతుం డయ్యెన్.

తే. ఇట్టిచందంబు లెల్లను నీవు పుణ్య, చిత్తవృత్తి[4]మై సైఁచినఁ జెల్లి వచ్చు
నీయజాతశత్రుత్వంబు నిఖిలలోక, విశ్రుతముకాదె ధర్మప్రవీణహృదయ. 235

చ. జగముల నెల్లెడన్ దురితసంతమసంబు జయింపఁ గోరి పా
ల్పఁగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుషసత్తము లై చనుజీవనంబు లెం
నగునుతు లైన మాన్యురె పదంపడి యాయువు శ్రీయు నొల్లరే. 236

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మాఁగొనునప్పు డాత్మలన్
నెక్కొని మోములం [5]బొడమ నెవ్వఁగ[6]తోడజనంబు లిట్టిచో సం
దక్కట భీముఁ డైన మనయర్జునుఁ డైనను మాద్రిపుత్త్రులం
దొక్కరుఁ డైన నీపగఱ నుక్కడఁగింపరె[7]యొక్కప్రేల్మిడిన్. 287

క. వా రొకయాగ్రహవృత్తిం, గూరి [8]యధర్మంబుచేఁతకుం జాలరు దు
ర్వారబలు లయ్యుఁ బాండుకుమారులు శాంతాత్ము లండ్రు [9]మనుజాధీశా. 288

క. నలువురు తమ్ములు భవదాప్తులుఁ గృష్ణుఁడు వినుచు నుండ భూవర నీ కేఁ
గొలువునను విన్నవింపం, బలుకులు కల వవధరింపు పరిపాటిమెయిన్. 289

చ. అనవుడు వీరె తమ్ములును నాప్తులుఁ గృష్ణుఁడు [10]పేరె తక్కఁ గొ
ల్వునఁ గలయట్టిసర్వజనులున్ వినుచుండెద రయ్య నిన్ను నే
మనుమని పంచెఁ జెప్పు మది యంతయు నేర్పడ నన్న ధర్మనం
దనుగరువంపుఁబల్కులవిధంబునకున్ మదిలోన [11]నుల్కుచున్. 290

ఆ. సంజయుండు కృష్ణు సద్భక్తి నీక్షించి, పవనపుత్త్రుఁ బార్థుఁ గవల ద్రుపద

---

1. రంబులఁ జెరసి. 2. వా రట్లు గావున. 3. ద మనస్కృత. 4. సహించినఁ; సైరించిఁన 5. బొదువు. 6. తోడిజనంబు లిట్టిచో, నక్కట. 7. యందు రెల్లెడన్; చూడ నెల్లెడన్ 8. యధర్మంబు చెయుటకుం. 9. మహీజను లెల్లన్. 10. పేఁడె. 11. నల్కుచున్.

తనయు సవినయమునఁ గనుఁగొని ప్రీతిఁ బాంచాలు మత్స్యధరణిపాలుఁ జూచి.

వ. సావధానుల రై వినుం డని పలికి యుధిష్ఠిరు దెసకు మోడ్పుఁగేలు [1]నిగిడించి యి ట్లనియె. 292

ఉ. శాంతతఁ బొంది కార్యము దెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ [2]దేఱి న న్నిటఁ బ్రియంబునఁ బంచెడునప్డు నాకుఁ దే
[3]రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె ని
ట్లింత ఘటించెఁ బొందు [4]మన మీపదనం దెలి వొందఁగాఁ దగున్. 293

క. చులుకని కార్యము చేయం, దలఁచుట మీయట్టిసర్వధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధుఁ లగు, పెద్దలకుం దగ వగునె యెవ్విధంబునఁ [5]జూడన్. 294

ఆ. మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు మీ, సత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రు కతనఁ బొందె నింతయుఁ బాపంగ, నీవ నేర్తు [6]కార్యనిపుణహృదయ. 295

చ. అఖిలజనక్షయం బయి జయాపజయంబులు రెంటనుం దుదిన్
సుఖములు కానియీపనికిఁ జొత్తురె యుత్తము లట్లుఁ గాక యా
నిఖిలసుఖంబు లేమిటికి నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ [7]జంపితయేని దయాపయోనిధీ. 296

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టినమంట లాకొలఁదియోధుల సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేర పుగ్ర[8]రణశోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల కైనను నొల్లవుగాక చివ్వకున్. 297

వ. మఱియు నక్కడ. 298

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసుయోధనునిపాలివ యండ్రు నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్ [9]సుతు లజేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వశంబె జయింపగ వారి నేరికిన్. 299

ఆ. అధిప యిట్టి మీకు నన్యోన్యకలహంబు, నాకుఁ జూడ మేలనంగ రాదు
రెండుపక్షములకుఁ బ్రియము హితంబును, నాత్మఁ గోరువారి నడిగి చూడు. 300

వ. అని పలికి సూతనందనుండు కొలువు కలయం గనుంగొని. 301

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం
దక్కటిమిత్రబాంధవహితప్రియమంత్రివయస్యకోటికిన్
మ్రుక్కుచు విన్నవించెద నసూయలు తక్కి యనుజ్ఞ సేయుఁడీ

---

1. మొగిడించి. 2. దీఱ 3. రెంతయుఁ దాన యిచ్చి ప్రియ మేర్పడ. 4. మన మీవలనం; మన కీపవనం. 5. దలఁపన్. 6. ధర్మ. 7. జంపుదమేని. 8. సుతశోభితుఁ; రణకోవిదుఁ. 9. గల రజేయులు.

యిక్కరుణాకరుఁ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్. 302

వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజు వదనంబునం జూడ్కి నిలిపి దేవా యుపశమించుట లెస్స [1]యిమ్మెయికిం గురుపితామహాదులును సంతసిల్లు నాతనికి మతం బయిన తెఱంగు సర్వలోకసమ్మతం బగు నన విని ధర్మనందనుం డి ట్లనియె. 303

ఉ. నెయ్యము తప్ప నొం డొకటి నీచెవి సోఁకనె నాదుపల్కులం
దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి [2]నల్కెదు నీవు మాకుఁ దాఁ
గయ్యము తక్క మన్కి తగు కార్యము కాదొకొ పోరితంబు లే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁ గైనను నొల్లక యొండు చేయునే. 304

క. జనులకు నెల్లను బథ్యము, లనఁగా ధర్మానుగతము లగు నవఁ బొగడం
జనుపనులు చేయుభీమార్జునులే దుష్కర్మమునకు రోయనివారల్. 305

క. మది సుఖముఁ గోరి దుఃఖం, బొదవం గల కార్యములకు నుత్సాహము చే
యుచు రొప్పనితృష్ణం బడి, చదు రేమియు లేనియట్టిజను లాతురు లై. 306

ఆ. యోగ్య[3]తృష్ణదాయ లుచితంపుఁగోలఁదిమై, నడచినట్టివారు బెడిదములకు
నంత చొత్తు రెట్లు సంతాపకారుల, కాక [4]వెనఁకువలు సుఖంబు లగునె. 307

వ. భోగంబులు వలదా యని తలంతు మేని. 308

తే. వస్త్రమాల్యానులేపనావసర[5]ములును, జతురతూర్యత్రయంబుల సమయములును
నేము వెలిగాఁగ మాతండ్రి [6]కించునెట్లు, పుత్త్రులన పట్టి మమ్మేల పోవఁ ద్రోచు.

వ. అయినను నొక మాట చెప్పెద సమచిత్తుఁడ వై విను మని యి ట్లనియె. 310

క. [7]తానైన నపుడు వక్రుం, డై నీతిపథంబు విడిచె నక్కట పతి మ
మ్మేనను జక్కని తెరువునఁ, బూని నడపుఁ డనుచు నిపుడు బుద్ధులు చెప్పెన్. 3.1

క. ఎదిరిం దమయట్టులకా, మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక మాకుం[8]గుదు మిం
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన [9]మనసుపొందు చక్కంబడునే. 312

వ. అని చూపి చెప్పి వెండియు. 313

ఉ. సంపద తక్క యుండఁగ నశక్తు లనం[10]జనుమమ్ముఁ బిల్చి [11]పూ
జింపగ నంత బేలె పతి చెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల వచ్చి రిత్త కా
రింపక మాను మాతనిచరిత్రము నీకును మాకు వింతయే. 314

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొనునె యెన్నఁ డైనను గొడుకుఁ

1. యిమ్మెయిం. 2. నల్కెదు మీరు వారితో మాకుఁ గాఁ. 3. తృష్ణఁ దగిలి యనుచితంపుఁ బోఁడిమై. 4. వెనఁకువల సుఖంబు గలదె. 5. ములను. 6. యిచ్చు నెట్లు. 7. తానైనఁ బుత్త్రునకు వశుఁ, డై నీతి. 8. గుడ మిం, డిదె మీకు. 9. మనముపొందు; మనసుకుందు. 10. దగు. 11. పూజింప నతండు బేలె.

మగంటిమి కలఁడనియెడు[1]న,మ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగినయేనిన్.

క. జూదపుసిరి యాసపడం, గా దని విదురుండు చెప్పఁ గా నప్పుడు క
ర్ణాదులపలుకులు విని పలి, యాదరణము చేయ కున్న [2]నంతన తీరున్. 316

క. ధృతరాష్ట్రుం డిటమీఁదను, సుతులును శకునియును సూతసుతుఁడును దను నే
గతి నడపించిరి వారల, మతము యనుష్ఠించుఁ గాక మరలంబడునే. 317

క. కార్యము తెలఁ గిట్టిది నీ, వార్యచరితమునకుఁ జొచ్చి యాఁడెదు నీ కా
దుర్యోధనునవినయ మని,వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో. 318

క. చక్రధరు లెక్కగొనఁడు ప,రాక్రమనిధి యర్జునునకు రాధేయభుజా
విక్రమ మెదురుగఁ గొని ని,ర్వక్రముఁ జేసికొనువాఁడు రాజ్యం బెల్లన్. 319

వ. అని పలికి వెడవెడ యలుక పొడమిన మఱియు ని ట్లనియె. 320

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ [3]దారు మున్నెఱుఁగరే పో రెట్లుఁ గయ్యంబు లా
శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం జా వేఁడి మార్కొందు రిం
తె పో తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే. 321

క. మును మమ్ముఁ బొగడి పసపడి, యని వారల గెలువ నరిది యని పొత్తుగఁ జె
ప్పినమాటకు నే నొడఁబడ, విను సంజయ పక్షపాతవృ[4]త్తి విడువుమీ. 322

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంద్వంబుమాఁడ్కిం [5]దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బి ట్టుబ్బి మూర్ఛిల్ల కుండన్. 323

వ. కావున. 324

చ. రణముల వారలన్ గెలువ రా దనుపల్కు లటుండ నిమ్ము స
ద్గుణుఁడవు నీవు వచ్చితి ప్రకోపశమంబుగఁ బల్క తింక సై
రణ దగఁ జేయువారము పరాభవ మొందియు [6]మున్ను వారిదు
ర్గుణములు సైఁచు టీవు నొకకొంత[7]యెఱుంగుదు వింతయేటికిన్. 325

ఉ. ఇంకను నట్లకాఁ దలఁపు మే మొకకీడునకుం దొడంగ మా
శంకలు తక్క మయ్య కు విచారము కల్గినయేని బాంధవం
బంకుర [8]మొత్త మావలన నక్కటికం బొలయంగ మమ్ము నే
[9]వంకకుఁ బోవ నీక గరువంబు జగంబు ప్రశంస చేయఁగన్. 326

క. రం డని పిలువఁ బనిచి పొ, లిం డని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం

1. నె, మ్మిగఁ. 2. యంతన తీరెన్. 3. దాను మున్నెఱుఁగఁడే పో రెట్లుఁ. 4. త్తిక. విడుమీ. 5. దఱిమిడి కవ లుద్యద్గతిం. 6. మున్న. 7. యెఱుంగుద యింత. 8. మొత్తు. 9. వంకకు వ్రాల నీక.

పొందెను వేఱొకపట్టణ, మొందెను మాకిచ్చి [1]యుచును టుచితము కాదే. 327

ఉ. నా విని సంజయుండు నరనాథున కిట్లను నెట్టితప్పులుం
బోవఁగఁ ద్రోచి తొలిమియ పూనుదు కావున నిన్ని మాట లి
ట్లేపు వినంగ నాడియును నేఁ దనివోవక విన్నవించెదన్
నీవిధవం బహింసయు ననింద్యచరిత్రము కాక [2]యన్యమే. 328

క. పాలిక కౌరవులు దుశ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను, మే లగు భిక్షాన్న మైన మానడవడికిన్. 329

వ. అది యెట్లంటేని. 330

సీ. రాజసూయమహాధ్వరం బట్లు నడపి సద్ద్విజులకు సురలకుఁ దృప్తిఁ జేసి
శాంతియు దాంతియు సకలలోకంబులఁ, బొగడొంద [3]బ్రదికినపుణ్యమూర్తి
విట్టినీచరితం[4]బు హింసాకళంకిత, మగు నెంత [5]యొప్పదు నవియుఁ గాక
దుర్నయవృత్తి [6]దుర్ధ్యాతంబు పుట్టించి, యంతలు చేసినయట్టివారి
తే. నేల గర్వంబు చెల్లంగ నిచ్చి జగము, *చేతఁ దిట్టులు పడునట్లు చేసి పోయి
తెల యడవుల నిమ్మయి నిషమ కుడిచి, తేల తొల్మియ ధనముగా నింతవడితి. 331

క. తుదిఁ బోయి క్రూరకర్మాస్పద మగు [7]తెఱఁగునకుఁ జొచ్చి బంధుల గురులన్
వెదకి వధియించుసౌఖ్యం, బది యేటికి నార్యనింద్య మస్థిర మరయన్. 332

తే. అల్పులకు మ్రింగఁ [8]జేఁదైన హాలహాలము
భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ
నీలగళు [9]నెన్ని ని న్నెన్నఁ బోలు నట్టి
నీవు చాలినఁ గా కేల నెగడుఁ జేయ. 333

చ. అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీపలికినట్టిద ధర్మువు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మములై చెడుఁ గొన్ని ధర్మవ
ర్తనములు కాక తోఁచి తుది ధర్మములై చనుఁ గొన్ని [10]కర్మముల్. 334

వ. కావున నన్ను దూఱఁ దలంచితేని నాచేయునది [11]ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము కోపంబు నివారింపం దగు నహింసయు నుత్తమధర్మం బగు నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగుపాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱుచుట ధర్మం బని పెద్దలచేత విందు మది యట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మం బవుంగా దని నీవ చెప్ప మట్లుంగాక [12]యిదికర్తవ్యం బిది యకర్త

---

1. యుచుచు. 2. యల్ప మే. 3. జేసిన. 4. బహింసా. 5. యొప్పెడు. 6. దుర్ధ్యాతంబు ప్రకటించి. *చేతఁ బుర్వ్వంగఁ బడునట్లు. 7. విధమునఁ జరించి; తెఱఁగునకుఁ దొడరి; దొడఁగి. 8. బెల్లైన. 9. నెన్ని యెన్నంగఁ; నెన్ని యెన్నినఁ. 10. కర్మవుల్; ధర్మముల్. 11. యధర్మం బని నిరూపించి. 12. కర్తవ్యంబిది యని మనల.

వ్యం బని మనల శాసింప వాసుదేవుండు కలండు మనకీ వితర్కం బేటికి నితండు ధర్మాధర్మవిదులకు గురుండు కార్యాకార్య నిరూపకులకు శిక్షకుం డుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం డితని పంపునం గాదె యదు భోజాంధక వృష్ణి సంజయ కేకయ ప్రభృతిభూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది విశేషించి మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థములకు మూలం బగుట నితని వచనం బవశ్యంబు నలంఘనీయం బనిన విని జనార్దనుండు సంజయున కి ట్లనియె. 335

ఉ. పాండు తనూజకోటికి శుభం బెడఁ గోరుదు [1]నెప్డు నాంబికే
యుండును బుత్రపౌత్ర మహిమోజ్జ్వలుఁ డక్కట చేటు మేలె యం
చుండుదు నట్లుఁ గాక తెలివొందిన యతం డిట [2]వీరిఁ దేర్పఁగా
నింకమనంబుతోఁ బనిచె ని న్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336

ఆ. నీవు సుచితవృత్తి నెయ్యంబు ధర్మంబు, వినయ మొప్పఁ దెలిపి వీరు శాంతిఁ
బొందునట్టిభంగిఁ బొసఁగఁ బల్కుటయును, [3]నాకు సమ్మదం బొనర్చె నిప్పుడు. 337

ఆ. అనఘ యిట్టు లంతయును దలఁపం గడు, నెనసినట్టు లుండె నేని వింట
పాండవాగ్రజన్ముపలుకుల చందంబు, చూడ సంధి లేనిచొప్పు తోఁచె. 338

క. అది యట్టిద సంధానము, తుది నెమ్మెయిఁ [4]గల్గు నెట్లు దుర్యోధనుఁ డు
న్మదుఁడు ధృతరాష్ట్ర భూవిభు, హృదయంబు తెఱంగుఁ గొంతయెఱుఁగుదుముకదా.

క. ఆరాజు చేయునెయ్యము, గారామును జెప్పె దీవు కడుఁదీవులు గా
వీరు తమపాలు పడయక, నేరిమి [5]మాటలన తీర నేర్తురె చెప్పుమా. 340

ఉ. వీరలు పెద్ద ద్రవ్వ [6]కోకవెంట నోడంబడి లేఁటి శాంతులై
కౌరవకోటిఁ గూడి మనఁ గా [7]మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవుఁ గాదె జగంబున [8]పాడిఁ దండ్రి పా
లి రని తెంపు చేసి పయి నెత్తిన నెత్తిరి గాక ద్రోహమే. 341

క. విను మవమానము పడి యి, [9]ట్లునికిఁ బడయుతొగడఁకంటె నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యె ట్లయి,నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 342

వ. సంగ్రామంబు రాజులకు ధర్మం బన్వం గా దని నీవ చెప్పు మని యుధిష్ఠిరుండు ని న్నడిగెఁ గదా ద్విజాతులకు యజనయాజనాదికర్మకరణ విభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారు కాని వేఁడుకొనువారు కా రని చెప్పుట సకల లోకప్రసిద్ధంబు సర్వవర్ణాశ్రమ ధర్మపరిపాలనంబు చేయునట్టి రాజులు తార నిజధర్మంబు వదలుదు రా యదియునుం గాక పాడితోఁ [10]యార్జనంబునం దమకుఁ గల కలిమి యనుభవించుచు సత్పథంబున నడచు చుండఁ ద

1. నేను. 2. వీరిఁ దీర్పఁగా; కెల్వఁగా. 3. దగఁగ నాకు సమ్మదం బొనర్చె. 4. గలుగ నేర్చు; గల్గునట్లు. 5. మాటలకుఁ దీర; దేఱ. 6. రోకవెంట. 7. మదిఁ దేఱుట. 8. (పాటియంమ;) మాకుఁ దండ్రి. 9. ట్లునికిఁ (నగు పొగడ్తకంటె) బడయు పొగడుకంటె. 10. యార్జవంబునం.

మ్మీరు లన్యాయంబు చేసిన యప్పటికిం [1]గదా యాశస్త్రాస్త్రధర్మంబు లింద్రాదు
లగు పెద్దలు కావించిరి నీ చెప్పెడి ధర్మంబులు కౌరవులకుం జెప్పవలవదా వారలు
గదా మీఁదెఱుంగక కొఱఁతనులుకు లై చెడుతెరువునం బోయెద వా రని
పలికి మఱియు ని ట్లనియె. 343

క. నెట్టన సభలో [2]వేవుర, కట్టెదుర నరాతితనము గా కెంతయు వా
రెట్టి తులువలో ద్రౌపది, [3]నట్టల పఱిచెడిదె జూద మాడరె యెందున్. 344

వ. అనవుడు సంజయుండు దేవా నీ చిత్తంబున నిడి దీని నింత కొనియాడినఁ గర్జం
బొడఁగూడునే యనిన వాసుదేవుం డి ట్లనియె. 345

ఉ. అత్తఱి భీష్మ ముఖ్యు లగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూర కుండిరి మహీశ్వరు చిత్త మెఱుంగ కున్కిఁ బా
నొత్తి కుమారులం గినియ నోపఁడ యక్కట మాన్పఁ గన్న నా
చిత్తము కాదు లోకముల చిత్తము లెల్లను సంతసింపవే. 346

ఉ. [4]తిట్టులఁ బోయి యక్కొఱలువు తేఁకువ వారలలోని కింతిఁ బా
నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా
నెట్టు సహించె మామ సతియేడ్పు ఱెలుంగున కెట్టు లోర్చె నీ
పట్టున నేమ మారయఁగఁ బంచుట కెట్టులు [5]నేర్చెఁ గ్రమ్మఱన్. 347

చ. ఇది తగ దంచు నడ్డపడు నింతకు నేరక సభ్యు లందఱుం
మది మఱగొన్న యట్టియెడ మానినికిం దనుఁ దాన కాచికో
లొదవిన దానఁ జేసి సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్
బ్రదికిరిగాక యయ్యెడను రాచకుమారుల [6]కోర్చునట్టిదే. 343

వ. సంజయా వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ గర్ణుండు.

క. లే రిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నుం
వారిజలోచన నీపైఁ, గూరిమి కలమగని వెదకికొను మొరు ననఁడే. 350

క. నరునకు నది వాఙ్మయ మగు, శర మై హృదయంబు నాటి చలియింపక దు
ర్భర వేదనఁ జేయంగాఁ, జిరకాలము తచ్చికిత్స చేసెనె చెపుమా. 351

వ. మఱియు దుశ్శాసనుండు వీరలందఱును గొడ్డువోయినవారలు పౌరుషంబు గల
మానిసి యిందెవ్వం డనియె నతని చెప్పినట్ల పెద్దకాలంబేని వీరల గొడ్డువోయిరి
కాక వీరిదెస వారికి నేమి ఫలించె నెండియుఁ దత్సమయంబునఁ బుట్టినమాట
లుగ్గడించునట్టివి కా వీ సంధికార్యం బత్యంతదుర్ఘటంబు దీని ఘటియింపం
జేయుట యశక్యం బని తలంచెద నయినను, 352

1. గదా యీ సర్వవర్ణాశ్రమ ధర్మపరిపాలనంబు చేయు శస్త్రాస్త్రంబు లింద్రాదులగు; ... శస్త్రాస్త్రకర్మంబు. 2. వేవుర. 3. నట్టులు పఱచెడిదె జూ;నట్టు పఱిచి రొరులు జూద. 4. తిట్లనుఁ బోక. 5. లొనర్చెఁ గ్రమ్మఱన్. 6. కోర్వ వచ్చునే.

సీ. పాండవేయులఁ దగం బ్రార్థించి యందుల, కక్కట యే నైన నరుగుదెంచి
కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు, పాలుచేసిన మృత్యుపాశములకుఁ
దప్పరే వారలు తగవును నేర్పును, నామీఁద నిలుచుట నాకుఁ గీడె
నన్ను మన్నింతు రన్యాయంబు చొరనినా,మాటకుఁ [1]దా రొడఁబాటు లేక
తే. యుండుదురె [2]కేరడము లాడు చుండి రేనిఁ
[3]గవియుపాండవబాణాగ్ని కాదు సువ్వె
తమ్ముఁ దపలోభ మనుచిచ్చు దరికొనంగఁ
దెగినవా రయి పోదు రింతియ తలంప. 353

వ. అని పలికి వెండియు ని ట్లనియె. 354

ఆ. రోషమయమహాతరువు సుయోధనుఁ డుప,స్కంధ మందులోనఁ గర్ణుఁ[4]డ లరు
గొమ్మ సౌబలుండు కుసుమఫలములు దు,శ్శాసనుండు మూలశక్తి తండ్రి. 355

ఆ. ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘన,స్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను భూసురులును వేప,ములుఁ దదీయ మైనమూలచయము. 356

క. ఈ రెంటియందు నరసి య,సారం బిది గాఢసారసహితం బిది నా
నేర వలయు నదియును గా, కేరూపం బయ్యె[5]నేని నీ నేమిటికిన్. 357

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము కుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహ మైనవనమున్ మర్దింతు రెండున్ వనా
వృతవృత్తంబులు కానిసింహములకున్ వేగంబ చేటొందుఁ గా
న తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నున్కికిన్. 358

క. పరిచారకులై యుండుదు, రరివర్గవ్యతికరమున కగుదురు వీరిన్
సరిఁ దనకొడుకుల మెలపిన, తెరువున మెలగింప వలదె ధృతరాష్ట్రునకున్. 359

క. ఏ నీపనికై వచ్చెదఁ, దా నొప్పఁ దలంచె నొండె దప్పం దలఁచెన్
దానన సెగడెద మే మ,మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్. 360

వ. అనిన విని సంజయుండు ధర్మతనయుం గనుంగొని యట్లయినను గడు లెస్సగదా
దేవా నావచ్చిన కార్యంబు సఫలంబయ్యెఁ బనివినియెద నని వాసుదేవునకు నట్ల
విన్నవించి భీమార్జుననకులసహదేవసాత్యకిద్రుపదవిరాటుల నీక్షించి మీయందఱ
చేత ననుజ్ఞాతుండన కదా పోయివచ్చెద నాయాడిన మాటలయం దేమియుం
దగనిచుట్టివి లేవు కదా యనుటయుఁ బాండవాగ్రజుం డతని కి ట్లనియె. 361

ఆ. పోయి వత్తుకాక యీయున్న యందఱు, విననగ నాడి తీవు విశదభంగి
నొక్కమాటయైన నుచితంబు కానిది, కలదె [6]యిట్లనంగ వలయు నెట్లు. 362

క. ఎదు రున్నరూపు పలుకఁగఁ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్ణయమును బె

---

1. వా రొడఁ. 2. కోఱడము; గారడము లాడు. 3. గదిసిపాండవ; గవయుపాండవ.
4. డరయఁ. 5. నేమి. 6. యెట్లనంగ వలయు నిన్ను.

ట్టిదమును బెంపును నగుపలు, కొదవదు నీనాలుకకు నయోన్నత యెపుడున్.

క. నీ వొండె విదురుఁ డొండెను, గా వలయుం గాక యిట్టికార్యంబులకుఁ
రా వేఱ కలరె తగువా, రివినయము నేర్పుఁ గలదె యితరుల కెందున్. 364

చ. అరిగినయప్డు పెద్ద లగునందలివిప్రుల నెల్లఁ గాంచి యా
దరమున వారిసేమ ముచితంబుగ నారసి వెండి కాన్పుమీ
గురునిఁ బితామహుం గృపునిఁ గూర్తురు వారలు నాకు నానమ
స్కరణముగాఁగ [1]వారి కధికప్రియభక్తి నమస్కరింపుమీ. 365

సీ. మాతండ్రిఁ గని యేను బ్రీతి మ్రొక్కుటఁ గాఁగ, దండప్రణామంబు దగ నొనర్పు
దుర్వృత్తిఁ [2]బోరయునాదుర్యోధనుని సేమ, మడిగితి నని చెప్పు మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడునాదుస్సేనుని, కుశల మారయుము తక్కను గుమార
వర్గంబు నెల్లను వనితాజనంబుల, నుచితంపుమై సుఖ మునికి యడుగు

ఆ. విదురు శల్యుఁ గాంచి వినయంబు తోఁపంగ, నాదు ద్రోణతనయు నక్క చేర్చి
కొంతి ననుము బాహ్లికుని సోమదత్తు భూ, రిశ్రవసునిఁ దలఁచి ప్రియము నెఱపు.

వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగు భూపతులను గృతవర్మను గర్ణ శకుని సైంధవప్రభృతులను దక్కటి రాజలోకనంబును గయ్యంబునకుఁ దోడు వచ్చిన సకలదేశాధీశులనుం గని యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకం [3]దగు ప్రణామవినయబాంధవమైత్రీ[4]వాత్సల్యంబులకు నయ్యైప్రకారంబుల మద్వచనంబులుగాఁ బలికి యుచితంబు మెయి నుపచరింపుము. 367

క. దాసీదాసజనములకు, దాసీనము కాక యుండఁ దడయక యే మి
త్రాసంగ మొంది శత్రుని, రాసం బొనరించి తమ్ము నరసెద ననుమీ. 368

క. పోయినమొగమున నచ్చటఁ, జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ బిదపం
మాయయ్య పెద్దకొలువున, వాయోడక యి ట్లనంగవలయుం జుమ్మీ. 369

చ. అనఘ భవద్బలంబునన యాపద యించుక లేక పాండునం
దనులు నిజాప్తబంధుసహితంబు [5]సుఖస్థితి నున్నవారు త
జ్జనకునిరాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370

ఉ. ఇప్పు డుపేక్ష సేసి కృప [6]యేమియు లేక విహీన[7]వృత్తి హా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె యింతట సంతసింప రా
[8]దిప్పుడు నంతకంత నట యెక్కుడు కోరినఁ జాల కుండదే
యొప్పదె కూడి మన్కి మన కొప్పనివారలయుక్కు తక్కఁగన్. 371

1. నందుఁ గల సభ్యుల కెల్ల. 2. బోరయని. 3. దగు నవ్విధంబునం బ్రణామ. 4. వాత్సల్యంబు లగునయ్యై. 5. సుఖంబున. 6. యించుక. 7. వృత్తిఁదా, రొ. 8. దిప్పుడు నంత కంత కట (క) రొ.

వ. అని [1]తదవసరంబునం బితామహుతో నిట్లనుము. 372

చ. అడఁగఁగ నీక శంతనుని యన్వయముం గలిగించి తీవ యి
ప్పుడు [2]తగ నీమతంబునన పాం దొడఁ[3]గూడఁగఁ జేర్చి పౌత్రులన్
సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం
బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే 373

వ. అని పలికి వెండియు. 374

క. ఇంతలు పుట్టినచోటను, శంతనునందన యహీనశాంతిపరుం డై
కౌంతేయాగ్రజుఁ డాలము, పొంతం బో నొల్లఁ డనుము బుధు లియ్యకొనన్. 375

సీ. ఆసమయంబున నచ్చటివా రెల్ల, వినునట్లుగా సుయోధనునితోడ
బాహుబలాఢ్యుల బలవిహీనులక్రియ, వెడలంగ నడచిన వెత్తితనము
నత్యంతచిరకాల మడవులఁ గొండల, బాధలఁ బెట్టిన[4]పరుసఁదనము
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ, దల పట్టి యీడ్చినతులువతనము

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ దథ్యమీవు, కురుకుమారుల నని ద్రుంగికొనకుమొరల
సొమ్మునకు నాసపడఁ దగ దిమ్ము వారి, పాలు వారలతోఁ గూడి బ్రదుకుమనుము.

వ. ఏము కలహంబు ఒల్లక పొందు గోరుట తనకు మేలు తనమనంబున దరికొను తృష్ణానలం బార్ప నోరు [5]లడ్డంబు చొరమిం జేసి యొన బుద్ధి చెప్ప వలసెఁ దన యొద్దం గలయోధవీరు లెయ్యెడల లేమి తెల్లం బయినను మాకుఁ జేదోడు ధర్మంబు కల దదియునుం గాక యఖిలలోకసేవితుం డైనకృష్ణుండు పెనుఁబ్రాపు కావునఁ దమకు మమ్ము[6]గెలువం గొలఁది కా దది యట్లుండె నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును దారును మదీయప్రార్థనాభంగంబు చేయక నాదగు శాంతియు దాంతియుఁ జెల్లించి నన్నలజడిఁ బెట్టక పోరితం బుడిగి తమతమధనంబులు కుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం దక్కటి బుద్ధిమంతులకును సంతోషం బగుఁ బెద్ద యీనోపఁ డయ్యెనేనిఁ గుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును జాలుఁ గాదేని మఱియు నెందేని నొక్కటి యగునట్లుగాఁ దనతోఁడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతియగు నట్లయినను నిందలి యందలి బంధుమిత్రసహాయజనంబులు కలసి నవ్వుచుం దెగడుచు నునికి మనమనంబులకుఁ బ్రియంబు చేయుఁ గురుపాంచాల యాదవ మాత్స్యులు పరస్పరప్రీతిసంపాదకత్వసంపన్ను లై బ్రదుకుట నాకుం గోర్కి యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు మనిన విని దేవా నీయానతిచ్చిన మార్గం బంతయు నడపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకును నెట్లు ప్రియం బట్లు చేయువాఁడ కాక యనుచుం బ్రణామంబు

1. తదనంతరంబునం. 2. దగు. 3. కూడఁగఁ జేసి; బిల్చి. 4. పందతనము. 5. లెవ్వరు లేమిం జేసి. 6. గెలువరా దది.

చేసిన సంజయునకు ధనంజయుం డిట్లనియె. 377

క. బాలసఖుండవు [1]నాకును, నీ లెస్సఁదనంబు నేము నీతి విడిచి దు
శ్శీలుర మగుటయు శైశవ, లీల మొదలు కాఁగ మును తెలియదే నీకున్. 378

మ. బలమత్త్యాకృతి యైనభీముఁ డనుశుంభత్కుంభిసంరంభముల్
నిలిపెన్ నాఁడును నంకుశం బయి; తుదిన్ నేఁడుం దదుద్రేకముల్
మలుగం జేయ నజాతశత్రునికృపా[2]మాధుర్యంబు చాలంగ వా
రల కేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా. 379

వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచిత ప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులు చేయించి మణిభూషణచిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె నని చెప్పిన. 380

క. విని యత్యంతకుతూహల,మునఁ బొదలుచు సంజయుండు మున్నెచ్చోటికిం
జనియెను నెవ్వరితో నే, మనియెను విన వలతు మునిజనాధిప చెప్పుమా. 381

వ. అని యడిగిన. 382

ఉ. భూరికృపానుషంగ మునిపుంగవచిత్తసరోజభృంగ సం
సారదవప్రవర్ష సురసంస్తుతదివ్యగుణప్రకర్ష దో
స్సారనిరస్తదైత్య[3]శమశాలిమనస్స్థితనిత్య లోకని
స్తారకశీల [4]నిర్వృతివిశాల నిరంజన పాపభంజనా. 383

క. శ్రుతిమౌళిరత్నమూర్తీ, శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ
రతిపతిహితాహితాక్షా, సతతసమాచరితభక్తజనసంరక్షా. 384

మాలిని. సదయవిమలదృష్టీ సంశ్రి[5]తాశీఃప్రవృష్టీ
హృదయ[6]కమలవాసా యుద్ధమాయావిలాసా
విదిత[7]నిఖిలభూతీ విశ్వ[8]రక్షాత్తహేతీ
సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా. 385

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1. మాకును. 2. మాధ్యంబు. 3. దమ. 4. వృత్తిసువి. 5. తక్షీరవృష్టీ. 6. విమలభాసా హేయమాయా; హేతుమాయా. 7. నిఖిలభాతీ. 8. రక్షార్థ.

శ్రీ ర స్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము

విస్తారక[1]రణకరు
ణా వేశోదారశశ్వదమలాకారా
భావవికారవిదూర శు
భావహనామ ప్రకార హరిహరనాథా. 1

**సంజయుండు ధర్మజుని సంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ జెప్పుట**

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున వీడ్కొని సూతనందనుండు పవనజవనంబు లగునరదంబుతురంగంబులం దఱిమి ప్రొద్దు గ్రుంకునంతకుం గరిపురి చొచ్చి నగరి కరిగి యంతఃపురంబున నున్నధృతరాష్ట్రునకుం దనరాక యెఱింగించి పుచ్చి యతనిం గాంచి యడుగుల కెఱఁగిన నమ్మహీవరుండును నత్యాదరంబున నెత్తి సమీపంబున నునిచినం గొలిచియుండి చేతులు [2]మోడ్చి యి ట్లనియె. 2

ఉ. దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ నా
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు మీకు [3]నమస్కరించె సం
భావన [4]చేసె నా కిచటిబంధుల నెల్లఁ [5]దలంచె మీసుఖ
శ్రీవిభవంబులుఁ సుతులనేమము న న్నడిగెం బ్రసన్నుఁడై. 3

తే. అనుఁడు ధృతరాష్ట్రుఁ డిట్లను నయ్యజాత
శత్రునకు నేమమే యనుజన్ము లెల్ల
సుఖులె బంధులు భృత్యులు సఖులు మంత్రి
వరులు సంప్రీతి [6]మెయి నున్నవారె యచట. 4

వ. అనిన సంజయుం డి ట్లనియె. 5

క. వా రెల్లను భవదీయ, స్ఫారబలము కారణముగ సౌఖ్యంబున ను
న్నార మని పలుకుదురు నిజ, మారయఁగా నట్ల కాదె యది జననాథా. 6

---

1. వరకరు; సత్కరు. 2. మొగిచి. 3. మస్కరించి. 4. సేసి. 5. దలంచి. 6. సుఖ మున్న.

క. ధర్మజునకు భోగంబులు, ధర్మువునఁ ద్రెంపు గావు ధర్మంబులలో
నిర్మలబుద్ధి నహింసకుఁ, గూర్మి గడుం గలఁ డతండు కురువంశనిధీ. 7

ఉ. మానుషశక్తి యొల్లఁడు సమంచితదైవము యాఁడి యుండు నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ
[1]సూనువశంబ కాని యొకచొప్పుఁ దలంపవు కర్ణసౌబలా
ధీనము కార్యనిశ్చయము తెల్లము నీమత మొప్ప దేమియున్. 8

ఆ. ఆలుబిడ్డ లేనియట్టి త్రిమ్మరి యగు, కొయ్యఁ గాక కుదుటఁ గూడు వెట్టి
కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి చూతురయ్య. 9

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠితతేజుల నెందు [2]నిమ్మెయిం
జెడుతెరు వైనచోఁ దగవు చెప్పక యొప్పరికించి చూతురే
పుడమిజనంబు లెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నున్కి నో
చ్చెదుమది యొప్పదుం జెవులు చీములు కట్టెడుఁ గౌరవేశ్వరా. 10

చ. చలమున దుస్ససేనుఁడును [3]సౌబలుఁడుం మిముఁ బట్టి [4]యార్చ బొ
మ్మల క్రియ నాడుచుండుదురు మానక నీవు సుయోధనుండుఁ దా
రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చి రేని నీ
చలము బలంబునుం గులముఁ [5]జక్కుగఁ జేయరె యొక్క ప్రేల్మిడిన్. 11

క. వినుము యుధిష్ఠిరుసైరణ, మనవారలు [6]వెఱపుగా సమర్థింతురు డీ
[7]కొనఁగం దగరే కొండం, గని యొంటమి పెట్టినట్లు కౌరవనాథా. 12

క. అనుజులకు నడ్డపడి యే, మినిఁ జేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగా కీ
పును సాదు రేఁగెనేని, న్నినుఁ దలపొలమునన కాని నిలువదు సుమ్మీ. 13

చ. [8]అనయము పుట్టె జూదమున *యప్పుడ యెంతయుఁ [9]జిచ్చు పెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్ప వచ్చునే. 14

చ. అనయము నొచ్చుచున్న యవి యంగము లెల్లను [10]వేగ వచ్చుట
న్మనము వశంబు కాదు జననాయక ప్రొద్దును బోయె నిప్పుడేఁ
బనివిని రేపు పుత్రులును బంధులు నాప్తులు నీవు నేర్పడం
విన మనకార్య మంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్. 15

ఆ. అనిన నట్ల కాక యని సంజయుని వీడు, కొలిపి కొంత ప్రొద్దు కురువిభుండు
కార్యచింత మునిఁగి కంచుకి నొక్కరుఁ, బిలిచి వేగ విదురుఁ బిలువు మనియె. 16

1. సూనుమతంబె కాని. 2. నెవ్వరుం. 3. సైంధవుఁడుం. 4. యాట. 5. జక్కుగఁ. 6. వెఱపు గాఁగ మదిఁ దలఁతురు డీ. 7. కొనఁగాఁ దగ రని వ్రాసిన; కొనఁ బగరు వెనుకదీసిన. 8. అనలము. *నప్పుడ. 9. జిక్కు పెట్టి ని. 10. తేర వచ్చుటన్.

వ. వాఁడు సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన నమ్మహీవరుం డత్యా
దరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కిట్లనియె. 17

ఆ. పాండురాజసుతులపాలికిఁ జని యిప్డు, సంజయుండు వచ్చి సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱి నాకు రే పచ్చటి, పనులు చెప్పువాఁడ ననుచుఁ జనియె. 18

క. అప్పటనుంచియు నెవ్వగఁ, గప్పికొనినఁ జిత్తవృత్తిఁ గలఁగెడు మేనుః
నిప్పులఁ బొరలినయట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. 19

వ. అనిన విదురుం డిట్లనియె. 20

క. బలవంతుఁడు పైనెత్తిన, బలహీనుఁడు ధనముఁగోలుపడినయతఁడు ము
చ్చిల వేచువాఁడు కామా,కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. 21

క. ఇక్కొఱగాములలోపల, నొక్కటి నీచిత్తవృత్తి నొందెనొ యొరు సొ
మ్మెక్కటిఁ గుడువఁ దలంచితొ, నిక్కము కత మేమి[1]చెప్పుము నిద్ర చెడుటకున్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ
ధర్మసుతుమాటచొప్పెవ్విధంబొ యెఱుఁగ
కునికిఁ జేసి చింతిల్లితి నోపు దీవు
తెలియఁ జెప్పి నాయలమట [2]మలుగఁ జేయ. 23

చ. అనవుడు నిట్లనుః విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయుః గురుండుఁ [3]గాఁ
డె నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృత[4]సత్యుఁడు శాంతమూర్తి స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు కీడు పల్కునే. 24

ఆ. నీవుఁ గొడుకు వారి [5]నెఱిలేక పఱిచితి, రదియ చాలు నుచిత మైనపాలు
పంచి యిండు పిల్లిపట్టిన[6]యీారువు, చేసి యున్న నేల[7]చెల్ల నేర్చు. 25

వ. మీారు శకునికర్ణదుశ్శాసనులమీాఁద రాజ్యభారంబు పెట్టికొని యుండుదు రిది
తుదిముట్ట నేర దెట్లంకేని. 26

క. తముఁ దా రెఱుఁగుట వేగపడమి తాలిమి విడుపు గలుగుటయు లేనిప్రభు
త్వముఁ గలదె వారియం దీసుమానుషము లోకఁడుఁ బట్టి చూడం గలఁడే. 27

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కమ తండ్రి వని తగవు నమ్మి చాల సైరించి యున్నవాఁ
డది నీవ యెఱుంగు దనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 28

తే. సంజయునిచేతఁ గార్యంబుచంద మెల్లి
[8]యొఱిఁగి మన కెద్ది చేయంగఁ దెఱఁగు దానిఁ
బనిచి చేయింపు మిపుడు నామనము తల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29

---

1. యిట్లు. 2. దలఁగఁజేయు. 3. వింటె. 4. సత్యుఁడు; శౌర్యుఁడు; చిత్తుఁడు. 5 నెఱుఁ
గక పఱిచితి. 6. యీాలువు. 7. చెల్లి వచ్చు. 8. ఎఱిఁగి చేయఁగఁ దగునెఱఁ గెద్ది దాని.

వ. నీవు ధర్మాధర్మవిందుఁడవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం బొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లుగా భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిఁగొల్పు మనిన విదురుం డిట్లనియె. 30

క. జనులకు నోడంబా టగువిధమున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ
దని యొకనికలిమి [1]కులుకక, మనుజులతోఁ బొందిపొసఁగి మను టొప్పు నృపా.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవకయునికియును దురభిమానము [2]ని
ర్వ్యాపారత్వము ననునివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 32

క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని, పాలసుఁ డాఫలము లాసపడుఁ [3]మనుజేంద్రా. 33

క. నెమ్మి గలవారి నొల్లరు, తమ్మొల్లనివారివెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి [4]తొడరుదు, రిమ్మెయిఁగనియట్టివార లిభపురనాథా. 34

క. ధనమును విద్యయు వంశం,బును [5]దుర్మతులకు మదంబుఁ [6]బొనరించును స
జ్జనులైనవారి కడఁకువ,యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. 35

క. అరిదివిలుకానియుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జనునే
ర్పరియైనవాని[7]నీతి, స్ఫురణము పగరాజు నతనిభూమిం జెఱుచున్. 36

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి[8]నాల్గింటఁగడువశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు,విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కండ్రు నిద్రఁ గూరినయెడ మే
ల్కనియునికియుఁ గార్యాలో,చనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్.

క. నడవడి యనుమున్నిటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా
నొడఁగూడు ననిన సత్యముఁ, గడచినగుణ మింక నొండు కలదే యరయన్. 39

క. క్షమియించువారిఁ గని చా,లమి పెట్టుదు రైనను దలంప ననూన
క్షమయ కడు మెఱయుతోడ వృ,త్తమరూపము కోరువారు తాల్తురు దానిన్.

క. పురుషుండు రెండు[9]తెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగ బరఁగుఁ దా నెయ్యెడలం
బరుసములు పలుక కునికిఁ, దురితంబులు పొరయుపనులు తొఱఁగుటకతన్.

తే. చెల్లి యుండియు సైరణ చేయునతఁడుఁ, [10]బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి[11]నిచ్చునతండుఁ బుణ్య, పురుషులని చెప్పి రార్యులు కురువరేణ్య.

ఆ. పాడి తప్పకుండఁ బడయుసొమ్ములకు న,పాత్రములకు నీఁగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ నెట్టన రెండు వి,ధములఁ గీడు తొడరు ధరణినాథ. 43

---

1. కలుకుచు; కలరుచు. 2. దు,ర్వ్యాపారత్వము. 3. ఓ నరేంద్రా. 4. తొడగుదు 5. దుర్మదులకు. 6. బొదలించును. 7. రీతి. 8. నాల్గింటిఁ. 39 వ పద్యమునకు వెనుక 'వ. అని మఱియు ధృతరాష్ట్రునకు విదురుం డిట్లనియె' నని యొక వచన మున్నది. 9. గుణముల. 10. బీదవడియును. 11. బుట్టినతండుఁ బుణ్య, చరితు లని.

తే. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత, యనెడుసప్తవ్యసనములఁ జనదు తగుల.

తే. తగినవేషంబు తనుఁ దానపొగడుకొనమి, నొచ్చియును గీడుపలుకమి యిచ్చివగవ
కునికి తనకెంత నడవకయున్నఁ బఠము, దప్పకుండుట నడవడి [1]కొప్పు చేయు. 45

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాదంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం
తలవారితోన తగు నధికుల హీనులతోడ [2]నైనఁ గొఱగా దధిపా. 46

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకు నైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ నృపాల 47

క. తను లోకము కొనియాడఁగ, విని చుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక,యును దన దెసఁ దోఁప నీక [3]యుడుపుచు వచ్చున్. 48

వ. ఇట్టిచందంబులు ధర్మనందనునకుం గల వని పలికి విదురుం డది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి యిప్పుడుపేక్షించి వారలు వెలి నుండ నూర కుండం దగునే [4]తగుపాలిచ్చి వారి రావించి నీకొడుకులతోడివారింగా నడపుట యుచితంబు మీరును వారును నొక్కటియైయున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రా దనిన నమ్మాటలు వెడవెడ యాఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 49

తే. హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగుదీవ, ధర్మసుతుచందమును విదితంబు నీకు
నట్లుకావున నెఱిఁగింపు మఖిలకార్య, [5]జాతమును జిత్తతాపోపశమము కాఁగ.

క. అనుడు విదురుఁ డాతని కి, ట్లను నిమ్మెయి నిన్ను నొత్తి యడిగినఁ జెప్పం
జను నున్న రూపు చెప్పెద, విను మవధానంబుతోడ విమలవిచారా. 51

ఉ. దక్కెను రాజ్య మంచు నకటా యిటు తమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది యెట్లరుగుం విను మీను లోలతం
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగిన[6]చాడ్పు చూవె యి
ట్లుక్కివుఁ డైననీకొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే. 52

క. అన విని నిరుత్తరుం డయి, మనుజేంద్రుఁడు కొంతసేపు మ్రాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహానిం, దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్. 53

క. ఇందాఁక నీదుపలుకుల, [7]డెందము తాపంబు కొంత డిందుపడియె నా

---

1. కొప్పఁ జేయుం. 2. దొడరఁ. 3. యుండుగుచు. 4. తగువారి నునిచి వారి రావించి. 5. సరవియును. 6. యట్లు చూవె యి, ట్లుక్కున నీసుతుండు తన యుల్లము నన్నిటు లొప్పఁ గూర్చునే;...నుల్లమునం దిటు లోరఁ గూరునే; యుల్లము నన్నిటులాడఁగూడునే. 7. డెందంబకలంకు.

కుం దగ నయానయంబుల, చందంబులు చెప్పుచుండు సౌజన్యనిధీ. 54

వ. అనిన విని విదురుం డి ట్లనియె. 55

ఆ. [1]తనియఁ బండ కుండ మును గోసికొనఁ జవి, చేటుకాదు విత్తుచేటుఁ గలుగుఁ
[2]బక్వమైనఁ గోసిన ఫల మించుఁ జెడదు[3]పే,జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 56

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ [4]దేఁటి
పువ్వుఁదేనియఁ గొనియెడుపోల్కి నెదురు
కంద కుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొద లంటఁ బొడువఁ జనదు. 57

క. [5]పరులధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడున,న్నరుఁడు తెవులు లేనివేదనం బడు నధిపా. 58

క. ఎదిరికి హితమును [6]బ్రియమును, మది కింపును గాఁగఁ బలుకు[7]మాటలు పెక్కై
యొదవినను లెస్స[8]యటుగా, కిది యది యన కూర కునికి యెంతయు నొప్పున్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును, బలుకుబడిన కాన పొసఁగఁ బలుకఁగ వలయున్. 60

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగినమ్రానఁ జిగురు పొడమఁ బలుకులం
జెడఁ దునిసినకార్యంబు ని,గుడ నేరదు వినవ నెట్టుఁ గురువంశనిధీ. 61

క. తనువున విఱిగినయలుఁగుల, ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురత౯
మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా.

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు నీకొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
[9]పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచు నుండఁగ నీవు దానికి౯
స్రుక్కక వించు నుండెదనురూపమె నీ కిది కౌరవేశ్వరా. 63

ఆ. చేటుకాల మైనఁ జెట్టమాటలు నెఱి, గాని తెరువు పట్టుకర్జములును
[10]దగినయట్లు తోఁచుఁ దగియెడునవి యవి,నీతు లని మనంబు నిశ్చయించు. 64

వ. నీబుద్ధి పాండవులతోడివిరోధంబునెడ మరలంబడమి పాపం బింతియ కాక యేమి చేయుదము మనకులంబునం దేజోధైర్యధార్మికత్వాదిగుణంబుల గరిష్ఠుం డయిన యుధిష్ఠిరుఁడు నీసిరికి వెలి యై య ట్లుండుట తగ వగునే నీపెద్దతనంబు చూచి సైరణ పాటించి యున్నవాఁ డనిన విదురుదిక్కు మొగం బై ధృతరాష్ట్రుండు నీ చెప్పిననీతివాక్యంబుల నామనంబు తనివోవ దింకను జెప్పు మనవుడు నతండు వెండియు ని ట్లనియె. 65

---

1. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి. 2. బక్వ మైనఁ గోయ ఫల మిచ్చుఁ. 3. ని,జంబుఁ. 4. వెండి. 5. ఒరుల. 6. నిజమును. 7. మాటలు దగఁ బె క్కొదవినను. 8. లేదా, యిది. 9. పెక్కువిధంబులం గణఁగి ప్రేలు. 10. దగవులట్ల.

ఆ. సకలపుణ్య[1]కర్మచయమును నొకదెస, వినుము పాడి తప్ప కునికి యొక్క-
దిక్కు దీని శ్రుతులు తెలిపెడు నెడఁ బాడి, కలిమి యొందుఁ బెద్ద[2]గా నుతించె. 66

తే. పాడి కలిగిన నిహలోకఫలము లెల్లఁ, జేరుటయ కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్యలోకంబు గల్గునండ్రు.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుం
డును నంగిరసుం డను విప్రునికొడుకు సుధన్వుండును దమతమప్రాణంబు లొడ్డుగా
నొడ్డి యొక్క ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి తన్నడిగిన నితండు
కొడుకు కితండు లాఁతి యని తలంపక మధ్యస్థుం డై సుధన్వు గెలిపించి యతని
చేత నిజతనయునిజీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రతికించెం గావున
నీవును ధర్మంబు విడువక యధర్మోపేతు లైన నీకొడుకుల వలని పక్షపాతంబు
విడిచి తెఱంగు చేయుము వారును నాపద లేక బ్రదుకుదురు నీకును [3]శోకంబు
లేక తక్కు నని చెప్పి మఱియు. 68

క. పాపంబులు కర్జము లని, యేపునఁ జేయంగ నవియు నింపగు ధర్మ
వ్యాపారంబు లకార్యము, లై పరిణతిఁ బొందె నేని నట్టుల చెల్లున్. 69

చ. అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సముచితధర్మము పల్కరేని న
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము [4]లేదయేనిఁ దాఁ
బదిలపు నిక్కమే యొకనెపం బిడుచొప్పగు నేని భూవరా. 7)

ఉ. నీతిపథంబునన్ బ్రదుక[5]నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతము లై కరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైనభారవహజీవనముల్ తలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యు లైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. 71

ఆ. కయ్యమునక యెపుడుఁ గాలుద్రువ్వుదురు నీ, పుత్రు లెల్ల సూతపుత్రుఁ డాది
యగు తదీయమంత్రు లంతకు ముందర, బిరుదు లీవు నీతి తెరువు చొరవు. 72

క. పాండవులు శౌర్య మొల్లర, ఖండిత[6]నీతిప్రకారకార్యము మెచ్చె
యుండుదు రెదు [7]రేచినఁ దుది, మండుదు రార్పంగ రాదు మఱి యెవ్వరికిన్.

క. తమతండ్రిభంగి నీకును, సముచిత మగుభక్తి చేసి సజ్జన[8]నుతమా
ర్గమున నడచువారల [9]నీ, వమలమతిం గన్నకొడుకుల ట్లరయఁ దగున్. 74

వ. అని పలికి మఱియు ని ట్లనియె. 75

క. కారణము లేకయును నుప, కారపరత్వమున నొరుల కార్యంబులకున్

---

1. కర్మసంచయ మొక. 2. గానిపించె. 3. శోకంబుఁ గాక. 4. లేనిదేని; గాక వేనిఁ; లేనిరీతిఁ
5. నేర్చినసత్త. 6. విక్రములు నీతి కార్యము మేలై. 7. రేచినఁ. 8. మతమా. 9. నీ, దమలమతిన్.

[1]వారనియలజడిఁ బడియెడు, వారల మూ యేఁగడయు వారికి నధిపా. 76

చ. ఒకరుని చేతి ప్రోఁపును దమున్నతిప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడం దగుసంపద నొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు చేసినకృతఘ్ననిపీనుఁగు నైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా. 77

వ. కావునఁ గృతము దలంపమి కీడు పాండురాజు నీకుం బరమభక్తుండు పాండవులునుం తేజోలాభంబులు కావించిన వారలు వారల నాదరింపు మని చెప్పి వెండియు ని ట్లనియె. 78

ఆ. బ్రదుకు చేటు పొగడువడుట మాఱొందుట
యాగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగుసౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కింత యేల వగవ నధిప. 79

క. వగ బలము తఱుఁగు రూపఱు, వగచిన మతి తప్పుఁ దెవులు వచ్చును దూఱున్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ, బగతురకును వగచు టుడుగు పార్థివముఖ్యా.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డి ట్లనియె. 81

క. రిత్తయుపచారముల నేఁ జుత్తముఁ డగుధర్మతనయు నుడికించితి దు
ర్వృత్తు లగుసుతులకును, మిత్తి యగుం బోర వగలు మిగులక యున్నే. 82

వ. నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపు నట్టిది యెయ్యది దాని నెఱింగింపు మనిన విదురుం డి ట్లనియె. 83

తే. నియతతపమును నింద్రియనిగ్రహంబు, [2]భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వానియన్నింటికంటె మేలైనశాంతి, కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర.

వ. అని వెండియు. 85

క. జ్ఞాతుల[3]పూరితమును గో,వ్రాతము నాక్రమము విప్రవర్గము చనవున్
నాతులకారించుటయును, బ్రీతిం జన నిచ్చునతనిపెం పొప్పు నృపా. 86

క. అకమికొని యొండొరులఁ బ్రోఁపులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొంది బహుజ్ఞా
తులు నెమ్మిఁ గూడి తామర, కొలనికి శ్రీయట్ల సిరికిఁ బట్టగుదు రజ్జ్వలులై. 87

చ కరితురగాదిఘట్టనయుఁ గాలియు నొంపదె యొంటి నున్నయ
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం
బొరయునె యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యులట్లుగా
కెరవయి నిల్చినం [4]గలని కెల్లిద మై పఱివోదు రెంతయున్. 88

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై [5]పొదలిన నెదిరికి

1. దా రలజడిఁబడి తిరిగెడు. 2. భూరిదయయును. 3. పోరితమును. 4. బయల కెల్లిదమై 5. పొరలిన.

నజయ్యు లగుదురు పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వన
వాసంబునం గుందినకౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం [1]బిచ్చి నిలుపుట
నీకొడుకులకు నిలుపు కావించుట యగు నని చెప్పి మఱియు ని ట్లనుఁ బ్రియ
వాదు లెందును గల రప్రియం బగుం గాకేమి యని తథ్యంబు పలుకువారు లేరు
జూదంబునప్పు డే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక తథ్యంబు పలికితి నది నీకు
రుచియింపక రోగికిఁ బథ్యాహారంబు తలకంటగించిన ట్లయ్యె నైన నిప్పుడుం
జెప్పెద వినుము కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున
మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు చేయు చందంబున
సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితి నేఁడు కార్యంబు ముట్ట
వచ్చినం [2]దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు తల్లడించెదవు కులంబునకై యొకనిఁ
దొఱంగుటయ నీతి యని పెద్దలు చెప్పుదురు దుర్నయపరుండై సద్బుద్ధి చెప్ప
వినం డేని మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగు నది యట్లుండె సంపద
సహాయంబు నపేక్షించి యుండు సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు నిట్లివి
యొకటొకటి పొందునం గాని సిద్ధింపవు కావున నీసంపద పాండవులకును వారి
సహాయత్వంబు నీకునుం బ్రియం బొనరింప నొండొరులు కలయుట మేలు గాక
మనలావు వెలిచేయుట లెస్సయగునే కురువంశనిస్తారకు లగు భీష్మయుధిష్ఠిరులును
నవక్రవిక్రము లగు కర్ణార్జునులును బ్రహ్మాపథాము లగు భీమదుర్యోధనులును
శస్త్రాస్త్రపారగు లగు నభిమన్యులక్ష్మణ ప్రభృతి కుమారులును శాపానుగ్రహ
సమర్థు లగు ద్రోణద్రుపదాది పరమాప్తులును వారివారిబంధుమిత్రజనంబులును
నొక్క మొగంబై నీపనుపు చేయుచు నయవిక్రమంబు లప్రతిహతంబులై నడవం
బృథివి శాసింప భవదీయవిభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న
నెంత యొప్పగునో యటు విచారింపుము పాండవులు ధీరమతులై వైర మెత్తక
యూరక తొలంగి యుండిరేని యుఁ గతిపయదినంబులలోఁ జీకాకుపడి చెడుం గాక
గాంధారీనందనుచేత వసుంధరాపరిపాలనభారంబు నిర్వహింపం బడునే యనిన
విని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 89

తే. నీవు చెప్పినమాటలు నిర్మలములు, నిపుణసమ్మతములు రాజనీతిమార్గ
బోధకంబులు నైనను బుత్త్రు విడువ, నోప ధర్మో జయతి యని యుండువాఁడ. 90

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె దేవా జ్ఞాతులు గుణహీను లైనను విడువం
దగ దనిన సకలగుణసంపన్ను లై భవత్ప్రసాదంబు కోరుచున్న కౌంతేయులఁ
దిగవిడువం [3]దగునే యేను నీకు హితంబు కోరెడువాఁడ నని నిశ్చయించి
నాబుద్ధి వినుము వారల జీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను
నొడంబఱిచి యేర్పఱిచి తెఱంగు పఱిచిన లెస్స యని చూచెద నతని విడువ

---

1. బిచ్చి నడపుట. 2. దోఁక నీరుముట్టి తల్ల. 3. దగ వగునే.

వలయు నని చెప్పితినే నీ [1]వెనుకువం బశ్చాత్తాపంబు పుట్టు దాని కప్పుడు ప్రతీ
కారంబు లేదు కావున నెల్లభంగుల నిష్కర్షించి పాండవులతోడ సంధి చేయు
వలయు నట్లుం గాక. 91

క. తమలోనిపాళ్ల [2]కుంగా, సమరము చేసినను గాని చాః జనదె శరీ
రము లాధివ్యాధిజరా, సమన్వితము లగుటఁ జేటు సహజంబరయన్. 92

చ. గజతురగాదిసంపదలుఁ గాంతలతోడివిహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలనచేయుక్రమంబుఁ బోరులన్
విజయముఁ బొంది పేర్పుటయు విస్ఫురితాభరణానులేపవ
స్త్రజనితవైభవంబుఁ గలరాజులుఁ బోయిర కాక నిల్చిరే. 93

క. కావునఁ జెవికిం జేఁదగు, నీవాక్యము విననఁగఁ జాలి తేని నిహాపర
శ్రీవిభవములకుఁ గీర్తికి, దావల మై [3]వలయు టింత తథ్యము సుమ్మీ. 94

క. తగ నీలో నూహింపుము, దిగవిడువకు ధర్మతనయు దృఢమతి వై పొం
దగుచందము గొడుకులకుం, బ్రెగడలకుం జెప్పి తీప్ప పెం పేర్పడఁగన్. 95

ఆ. అనిన నాంబికేయుఁ డను నీదుపలుకులఁ, గలఁక [4]దేఱి బుద్ధి తెలివి నొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్జము ధర్మమును యశంబు లాభమును దలంప. 96

చ. అనుడు ముదంబు నమ్మిడియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తినూ
ల్కొనియె సుయోధనుం గని యకుంఠితనిశ్చయ మై యతండు వ్రా
లినదెస వ్రాల కుండిన బలే మముబోఁటులకుం బ్రియం బగున్. 97

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి. 98

క. దైవంబ నేర్పుఁ గా కిటు, పోవఁగ నే నేర్తు నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు, దైవము పౌరుషముకంటె ధరణీనాథా. 99

వ. అనిన విదురునకు వైచిత్రవీర్యుం డి ట్లనియె. 100

తే. ధర్మపథమును నీతితత్త్వంబు తెరువు, నిర్మలము లగుపలుకుల నీవు నాకుఁ
దెలియఁ జెప్పితి పరమార్థదృష్టి యెట్టి, వాక్యములఁ గల్గుఁ జెప్పుము వాని ననఘ.

సనత్సుజాతుండు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబుఁ జెప్పుట

వ. అని యడిగిన విదురుం డతని కి ట్లనియె నాకుఁ దోఁచినయన్నియు నానేర్చినట్లు నీ
కెఱింగించితి నత్యంతగుహ్యంబు లగునర్థంబులు పురాణుం డయ్యును గుమారుం
డగుసనత్సుజాతుండు తెలుపనోపుం గాని యిటమీఁద నాకుం దెలియ దనిన
ధృతరాష్ట్రుం డమ్మునీంద్రుండు నాకెంతవవ్వు నీవ యవియునుం జెప్పు మనిన
నేను శూద్రయోనిజాతుండ వేదాంతవేద్యంబులగునర్థంబులు నా కగోచరంబు

1. వెనుకం. 2. కును సమ, రము చేసినఁ గాని చావు రాఁ జనదె. 3. వలయు దింత. 4. దీ ఱె.

లమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు
నతండు తెలుపం జాలు ననిన ధృతరాష్ట్రుం డతికుతూహలుం డై. 102

ఆ. మనకు నిప్పు డతనిఁ గనుతెఱం[1]గెయ్యది, యగుటయును నెఱుంగ ననిన విదురుఁ
డధికభక్తిఁ దలఁచె నాత్మలో [2]నాశ్రిత,వత్సలత్వనిధి సనత్సుజాతు. 103

వ. అట్లు తలంచుటయును దివ్యజ్ఞానమాననీయుం డగునమ్మునివరేణ్యుండాక్షణం [3]బ
పొడసూపిన విదురుం డతనిఁ జచ్చుట యుగ్గడించుచు వినయంబున నతని నెదు
ర్కొని దండనమస్కారంబు లాచరించి యున్నతాసనం బిడి యర్ఘ్యపాద్యంబు
లిచ్చి ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసి యున్న
ధృతరాష్ట్రు నతనికిం జూపి విదురుం డి ట్లనియె. 104

క. దేవా దేవరకృప నీ, భూవల్లభుఁ డమలతత్త్వబోధక మై శో
ఖ్యావహ మగువాక్యచయముఁ, దా వినఁ గోరుటయు[4]మిమ్ముఁదలఁచితి భక్తిన్.

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి గురుసమాశ్రితు లగువార
లెద్దానివలన సుఖదుఃఖంబులు లాభాలాభంబులుఁ బ్రియద్వేషంబులు నాదిగాఁ
గలద్వంద్వంబులం బడక బ్రదుకుదు రట్టిపరమార్థోపదేశంబున నితనిం గృతా
ర్థునిం గావించి రక్షింప వలయు నని ప్రార్థించినం బార్థివుండును దదనురూపంబు
లగునాలాపంబుల నారాధించినం బ్రసన్నుం డై సనత్సుజాతుం డధ్యాత్మ
విషయంబు లగువివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబు
లగునర్థంబులు సమర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె
నదియెల్ల వివరించుచు హృదయపుష్కరకలితం బగుపరతత్త్వంబు ప్రసా
దించునట్టి గూఢోక్తులను గ్రహించుచుండ నెట్టకేలకుఁ బ్రభాతం బగుటయు
ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు చేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె
నట్టిసమయంబున. 106

### ప్రాతఃకాలవర్ణనము

తే. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు, కంది యొంతయుఁ జెలు వేదెఁ జందురుండు. 107

క. కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి వానిపదవి [5]తొలఁగినం
దమకున్ నిలువఁగఁ దగ దను, క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్. 108

ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు చాఁచి చూడ్కులం
జిత్తములున్ నిగిడ్చి తమచెందెడునిక్కలు రోసి యింపు త
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చు [6]కాయ్వులం

---

1. గెయ్యది, యనుటయును నెఱుంగ దనుచు విదురుఁ;...యనినఁ గాంచు వాఁడ ననుచు విదురుఁ. 2. శాశ్వత, వత్సలత్వ. 3. బ ప్రత్యక్షం బై పొడసూపిన. 4. నాత్మఁ. 5. దొలఁగినన్. 6. చెయ్వులన్; కాన్పులన్.

జిత్తజకేళిఁ దేలి విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్. 109

మ. మునుసౌరభ్యము [1]నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు ల
ల్లన మ్రోల్కి వెడలంగ రేకులు సముల్లాసంబునన్ [2]బింక మె
క్క నయం [3]బెక్కుచు గ్రద్దపొం దెడలి వీఁకం గేసరంబుల్ కడ
ల్కొనఁ దోడ్తో [4]మధు పుచ్చి పేరెలమిఁ [5]బొల్పుం జెందె నంభోజముల్. 110

చ. వెడవెడ నిద్రవొంది కను విచ్చినపాంథులమీఁద దాడివోఁ
దడఁబడ నొండొరుం బిలుచు దర్పకుసంపుబలంబులో నివు
ల్కుడుకరణిం జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనంబులం
దెడనెడఁ [6]బల్కఁ గూయ సొగి[7]యింపుగ మ్రోయఁగఁ దద్విరావముల్. 111

సీ. పద్మపరాగంబుఁ [8]బరఁగించు నసఁబోద, యంబుకాంతికిఁ జెలువంబు మిగులఁ
బరువంబు తప్పినవిరుల రాలుచుఁ దరుచయము చుక్కలు లేనిచదలఁ జెనసు
నరవిరి నెత్తావి నడరించు సుప్పిద్ర, వికచకైరవసౌరభవితతి పొదల
సెలఁగ చీఁకటియెఱకలనెఱఁ దీర్చు జక్కవలు చందోయి కేఁకలు దొనర్ప

ఆ. [9]వెలుఁగువాలుదివియల నల్ల నల్లార్చు, సోఁకి గండ్లయందుఁ జొచ్చి సుడిసి
తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలమిఁగ, గొనకొనఁ బొలుచు నవలఁ బ్రొమ. 112

ఆ. అంత నుదయశైల మను నశోకద్రుమ, సమితియందుఁ గాంతిచారుభంగి
[10]నెఱయ విరిసి తొలుత నెగసినయుజ్జ్వల, స్తబక మనఁగ బద్మసఖుఁడు పొడిచె.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడుచేవ్రుఁల, జలుల కాంతికి నును మెఱుఁగు పెట్టి
ధరణిజగుల్మలతావితానముపల్లవములకుఁ [11]గట్టెఱ్ఱవన్నె యొసఁగి
యరుణాంబుజంబులయంతర్దళంబుల, తళతళ యనుజిగి దళముకొల్పి
చక్రవాకద్వయసంతతియెఱకలఁ, గొమరారు కెంజాయఁ గ్రొత్త చేసి

ఆ. తనదుబాలబింబ మనుపమేయప్రభాపటలజటిలగగన[12]భాగ మగుచు
నుల్లసిల్లి జగము లెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు. 114

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు తత్కాలోచితాచారంబులు నిర్వర్తించి తగుతెఱంగున నలంకృతుండయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ గుంభసంభవకృపకృతవర్మాశ్వత్థామకర్ణాదు లగువారలును భీష్మవిదురబాహ్లికసోమదత్తభూరిశ్రవసప్రభృతు లగుబంధుజనులును దుర్యోధనదుశ్శాసనప్రముఖు లగుకుమారులును లోనుగాఁ గలసమస్తపరిజనంబులును వచ్చి బలసి యుండి రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిట నిలిచి పణిహారుల

---

1. నివ్వటిల్ల సుమనో. 2. బిక్క మెక్క. 3. బెక్కుచుఁ గ్రందె (దండు) పొం దెరలి వీఁగం. 4. మధు పుచ్చి. 5. బొల్పొందెన్ సరోజాతముల్. 6. బల్కఁ గూయ. 7. యింపుఁగ. 8. బచరించు. 9. తెల్లవాఱుచున్న దివియ లల్లార్చుచు. 10. నెఱయ మెఱసి. 11. కట్టెఱ్ఱకుఁ బన్ను వొసఁగి. 12. భాగుఁడగుచు.

వలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచితప్రదేశంబునఁ గూర్చుండి తన మాటలు వినుటకుఁ జిడిముడిపడుచున్న కొలువుఁ గలయం గనుంగొని యి ట్లనియె.

### సంజయుండు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు చెప్పుట

తే. పాండురాజతనూజులపాలి కర్థి, నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి నాతండు మైత్రి మెఱయఁ, గౌరవ్యుల సేమ మెల్లఁ [1]బేర్వేర నడిగె.

వ. మఱియుం దగువారల నెల్ల నయ్యైయుచితోక్తిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె నేనును భూనాథుండు గఱపిన తెఱంగునఁ గొఱంత లేకుండ బంధుత్వంబునకు వలయు మాటలాడితిఁ బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబు లింతయొప్పునే యని యగ్గించిన ధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పిన పలుకులు నతండు వానికి నెల్లను త్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి ధృతరాష్ట్రునకుఁ బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించిన వచనంబులు ధర్మనందను పలుకుల సంపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు ని ట్లనియె. 117

తే. ఏ నుపప్లావ్యపురమున కేఁగి తొలుత, వాసుదేవార్జునులఁ గంటి వారు [2]నీతి
పథము తప్పనిమాటలు బలిమిఁ దోఁచు, నట్లుగా నాడి రవి వినుం [3]డాదరించి. 118

వ. అనిన విని ధృతరాష్ట్రుం డవ్వాసుదేవుచిత్తం బె ట్లతం డేమనియె నని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 119

ఉ. తానును సత్యభామయును ద్రౌపదియున్ నరుఁడున్ రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై సుతులుఁ జేరనిచెందనియట్టిచోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె న
న్నా నలినోదరుండు హృదయంబున నీదెసఁ గూర్మి యెట్టిదో. 120

వ. ఏనును దత్ప్రకారంబు పడిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటం జేసి కంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి వినీతవేషుండ నై పోవునప్పుడు కృష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితు లై యొక్కసెజ్జన యున్నవారు కృష్ణుండు పవ్వళించి యుండి చాఁచిన చరణంబులు తొడలపై నిడికొని యర్జునుండు కూర్చున్నవాఁడు సత్యభామయుం బాంచాలియు గద్దియలపై నున్నవారు సవినయంబుగా నేనును దండప్రణామంబు చేసిన నన్నాదరించి కృష్ణుని చేసన్న నర్జునుఁ డనుపునం గనకరత్నమయం బగు నతని పాదపీఠం బతండు ప్రేల్చిన కాళ్లు దిగిచికొని నిద్దఱుముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గది

---

1. వేర్వేర నడిగె. 2. ప్రీతి, పథము. 3. డాదరమున.

యుంచి నీలవర్ణులు బాహాబలమదభరితులును నయి [1]యేనుఁగుదోయియుంబోలె నున్న యమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దద నంతరంబ భయంబునుం బుట్టె నట్టియెడ. 121

క. ఈయిరువురుఁ బంచినపని, చేయుదు రట ధర్మజునకుఁ జేకుఱునిలఁ
వేయది యతనిం దొడరుట, వేయేటికి జముని శిరము వ్రేయుట కాదే. 122

వ. అని తలంచుచుండ నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయోగించునట్టి యన్నపానంబులను దమకుఁ గట్టఁదగినట్టివస్త్రంబులను దాము తొడుగునట్టి భూష ణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిన నేనును నాపోయినకార్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వారిజోదరుం డిట్లనియె. 123

సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుండు చెప్పినమాట లెఱింగించుట

తే. వినుము సంజయ ధృతరాష్ట్రవిభుని పెద్ద
కొలువునందుఁ బత్పుత్రులు గురుఁడు కృపుఁడు
నాపగానందనుఁడు మొదలైనసకల
జనులు వినుచుండఁగా నిట్లు లనుము నీవు. 124

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లల, నగ్ని పుట్టినట్టి దయ్యె మీకు
నార్ప వెరవు లేదు నేర్పుమై నింకఁ గావింపవలయుపనులు వినుఁడు మీరు. 125

వ. *అవి యెవ్వి యంటేని. 126

సీ. కలయట్టివివిధార్థములు నశేషంబుగఁ, దగ నొసంగుండు సత్పాత్రములకుఁ
చెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి, సత్కరింపుఁడు సంతసం బెలర్ప
నిచ్ఛానుగుణముల నింద్రియసుఖముల, ననుభవింపుఁడు హృదయంబు లలర
నాండ్రను బిడ్డల నయ్యెవిధంబుల, గారవింపుఁడు [2]ప్రియపూరితముగ

తే. మఱియు నెవ్వరిచిత్తమె త్తెఱఁగునందు, వాటమై యుండునదియెల్ల వలయునట్లు
చేసి విహరింపుఁ డిం కెడచేయ [3]కనికి, నడవుఁ డఱచేతఁ బ్రాణంబు లిడి కడంగి.

వ. అని చెప్పు మింత యేమిటి కంటేని. 128

ఉ. ఎందును నెవ్వరుం బడనియొంత[4]యుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్ననన్ను గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ రానియప్పుఁబో
లెం దలపోయ వ్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడుం మదిన్. 129

తే. ఇట్టియేఁ దేరు గడపంగ నెందు నుతికి, నెక్కుగాండీవ మెత్తెఱ నెక్కువెట్టి
రెండుదొనలును బూని కిరీటి యనికి, వచ్చు నేఁ డెల్లి యెందుఁ బోవచ్చుమీకు.

---

1. యేనికదోయి. *ఈవచనము కొన్నిప్రతులయందు గానుపించదు. 2. ప్రియపూర్వకముగ.
3. కనికి. 4. యుఁ గష్టపుఁబాటు; నికృష్టపుఁబాటు.

వ. అని పలుకునప్పటివారియొత్తికోలును నీకొడుకునిజపాపమియునుం దలంచి భయంబందితి నిక్కంబు వారల నెఱుంగంబు భీష్మద్రోణులప్రాపును గర్ణు గర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెను ననిన విని ధృతరాష్ట్రుం డర్జునుం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 131

క. నరుఁ డలుక [1]పొడమియును సుస్థిరుఁడై తనయొజ్జసెరల[2]చెలువునఁ గెందా
మరలం దెగడెడుకన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా. 132

ఆ. ఆసుయోధనుండు నతనికిఁ బోడ్పడ, నరుగు దెంచినట్టి [3]ధరణినాథ
చయము వినుచు నుండ సంజయ నావచనములు గాఁగ [4]నీ వనంగ వలయు. 133

ఉ. పాండునియగ్రనందనుఁడు పాలడుగం దగ నీఁడయేని మా
కొండన నేల మే లడి సుయోధనుఁ డింతకుమున్న పెక్కులు
[5]ద్దండతఁ దాను చేసినవిధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁగాక యేనును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్. 134

క. మాయిరువురతోఁ గయ్యము, చేయ నతం డియ్యకొనిన సిద్ధించెన కా
దే యుచితచరితుఁ డగుఁ గాం, తేయాగ్రజుకార్య మట్టితెఱఁ గొప్పఁ గదా. 135

క. వనవాసంబున భూశయ్యను ధర్మజుఁ డున్నయట్టియాయాసము పో
వునె యంపశయ్య దుర్యోధనుఁడు రణక్షోణిఁ బడక [6]తక్కినయేనిన్. 136

ఉ. సూనృత మూఁది బన్నములు చూడక లోన నడంచి నట్టికో
[7]పానల మెండి యున్ననిబిడాటవిపైఁ బచరించుతీవ్రదా
వానలుఁ బోలి క్షాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని యుధిష్ఠిరుఁ సరకుఁ గాఁ గొన రాధృతరాష్ట్రనందనుల్. 137

మ. గద సారించుచు నంత్య[8]కాలవిచలత్కాలాకృతిన్ భీముఁ డు
న్మదమాతంగచయంబు నుగ్గుగ లసన్నానారథవ్రాతముల్
చదియన్ భూరిహయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుఁ డై
కదియం [9]జూచి బలే సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్. 138

సీ. కోల్పులి వీఁకమై గొందగొని లేళ్లకు, నుఱుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టి,దంబుగ వీఁచుచందమున నడరి
కసిమసంగినమారి కడఁగి జీవులమీఁద, నుగ్రతఁ గవియున ట్లురవడించి
యాఁకొన్నలయరుద్రుఁ డాగ్రహంబున జగ,త్ప్రచయంబు ముట్టెడుభంగిఁ బొదివి

---

1. వాఁడిమి కడు. 2. చెలువుగఁ. 3. యవనినాథ. 4. ని ట్లనంగవలయు. 5. ద్దండత నాచరించె భుజదర్పము నేత్రమజూపి యాతఁ డో, క్కండఁ కులక్షయంబునకుఁ గారణమయ్యెడు దప్పదయ్యె నీ, వొం డననేల యాబిరుదు నోపిన యంతయుఁ దీర్చు నేర్పుగాన్. ఇ ట్లీపద్యము పంచపాదిగఁ గన్పట్టుచున్నది. 6. తక్కిన నెందున్; నెట్లున్. 7. పానలుఁ డెండియున్న. 8. కాలవిలసత్కాలాకృతిన్. 9. జూచి కదా.

తే. నకులుఁడును పవనజుఁడు సాత్యకియు నాసుభద్రకొడుకును నెదిరినబలమునెల్ల
చెదరఁ జెదర బడల్పడఁ [1]బెల్లుసావఁ, జేయఁ గని కౌరవులు సంధి చేయువారు. 139

ఉ. చిత్తము లుల్లసిల్ల [2]నరసింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువుమాడ్కి నరాతిబలంబు ముట్టి యను
ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్రు లేవురున్
నెత్తురనీరఁ దేల్చిన ననిం గని మీనృపుఁ డల్కఁ దీఱెడిన్. 140

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహాజిం బ్రాణముల్ దాఁప కు
జ్జ్వలులై తో నడవన్ విరాటుఁడును బాంచాలుండు [3]నేపారి సే
నలయుద్రేకము రౌద్రముం బెనుప నానాహేతిఘోరంబుగాఁ
దలపడ్డం గని కాక స్రుక్కుదురె గాంధారీసుతుల్ మాటలన్. 141

చ. తఱిమి శిఖండి తమ్మరులు తాఁకఁగ నెవ్వరిదిక్కుఁ జూడ కే
డ్తెఱఁ దనపూన్కిపై మనము ధీరత నిల్పి రథంబు [4]బల్విడిం
బఱపి కురుక్షితీశుఁ డను[5]బ్రహ్మకు వేయను నిండ భీష్ముపై
గుఱికొనఁ గాక మాకు నగ మూరక యిత్తురె మీరు మేదినిన్. 142

శా. విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ విల్లంద మై యుండ న
స్మద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు కడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట కేల తక్కెదరు మీ రుగ్రాహవక్రీడకున్. 143

సీ. గాండీవగుణరవం బొండొండ చెలఁగంగ, శరపరంపర లాకసంబు గప్పఁ
బ్రతివిశిఖములు ఖండితము లై రాలంగ, నెదిరి సైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబు లై యవ,యవభేద మెఱుఁ గనియట్లుఁ గాఁగఁ
[6]దునిసిన నెత్తురు నెనరును నెమ్ములు, నెఱచియుఁ గండలు నెనసి సమర

తే. తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళ
హరులు శోభిల్ల నొగలపై హరి యొలర్ప
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁ గని కాని [7]కానఁడు రాజరాజు. 144

శా. బాలక్రీడమహాసురప్రకరమున్ భంజింపఁడే యొప్పుడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే యట్టిశౌ
ర్యాలంకారు మహాత్ముఁ డా నరకు నేయం [8]దచ్యుతున్ మమ్మతం
డేలా కైకొను నాసుయోధనునియం [9]దె గ్గది యూహింపఁగన్. 145

---

1. బెల్లువడఁగ; బెల్లగిల్లఁ. 2. ఘన; వర; నర; సింహ. 3. నే పారు. 4. బగ్విడిం, బఱపి. 5. బ్రహ్మకు నూరును. 6. దునిసి నెత్తురు గ్రొవ్వు మెదడును. 7. మానఁడు; పాలిఁడు. 8. దుర్మదున్. 9. ద గ్గేమి; దేనితి యూహింపఁగాన్.

వ. ఏము పితామహగురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయరాజ్యభాగం
బునకై తొడరి కయ్యంబు చేయువారము కౌరవులకుం బూని యెవ్వరు మాతోఁ
బెనంగినను వారిశస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము
పండ్రెండు వత్సరంబులు వనంబున నమ్మెయి నిడుమలం బడి జనపదంబునం బదు
మూఁడగునేఁ డజ్ఞాతవాసాయాసం బ ట్లనుభవించి వచ్చి మాతండ్రి పాలికిం
బెనంగువ మ్మునింద్రాదిసురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువా
రై రేని ధర్మంబుకంటె నధర్మము బలవంతం బైనయది యగు నింతియ కాని
మాచేయునట్టిది కీడైనది గా దేము వాసుదేవుని మున్నిడికొని నడతుము
కావున నీయుద్ధంబునం జయంబు మాకు సిద్ధంబ యెల్లభంగులం గర్ణసహితంబుగా
గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట తప్పదు గాండీవంబు తివి
యకయును గుడుసువడియుండు బాణంబులు తమయంతన తూణీరంబుల వెడలెడుఁ
దొలూడ్చుమహాసాగంబునుంబోలెఁ గరవాలంబు తాన [1]యొఱవెడలికి నిగుడు
చున్న యది కావున మా కవశ్యంబును సంగరంబు సంభవింపుఁ బాశుపతాది
దివ్యశరంబులం గురుపక్షప్రజాక్షయంబు చేసి శాంతిం బొందెదము సూతనందనా
నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురు
వృద్ధుం డగుబాహ్లికుండును బితామహుం డగుభీష్ముండును గురుం డగుకుంభ
సంభవుండును శిక్షకుం డగుకృపాచార్యుండును గురుపుత్త్రుం డగునశ్వత్థామయు
సద్బుద్ధి యగువిదురుండును ధర్మాచరణకుల్యుం డగుశల్యుండును నెయ్యది నిశ్చ
యించి పలికి రది యయ్యెడు సుయోధనాదు లాయుష్మంతు లగువార కాక యని
పలికె నని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కి ట్లనియె.

సీ. నలినగర్భుఁడు పెద్దకొలువున నున్నెడ, సురపతిప్రముఖులచూడ్కి యెల్ల
మెఱయు తేజంబున మిఱుమిట్లు గొన నిద్ద, ఱచ్చట నొరసికొం చరుగఁ జూచి
వీ రెవ్వ రిమ్మెయి మీ రుండ నరకు చే,యనియట్లు పోయెదునట్టివార
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి, ట్లనియె నాచతురాస్యుఁ డాదరమునఁ
తే. దపము పెంపును బలశౌర్యదర్పములును, గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు
రేయుగంబుల నరుఁడు నారాయణుండు, ననఁ బ్రసిద్ధి నెక్కినమునులు సుమ్ము. 147

వ. అని పలికి వెండియు. 148

క. అనిమిష[2]హితము దనుజనా,శనమును చేయుదు రధర్మసంగ్రామము క
ల్గినచోట ధర్మపరు లగు, జనముల గెలిపింతు రధికసంరంభమునన్. 149

వ. దేవాసురయుద్ధంబు నప్పు డింద్రుండు పోయి వీరి నారాధించి తో డడిగినం
జనుదెంచి పౌలోమకాలకేయాదు లగున నేకదైత్యదానవులం జంపి యింద్రునకు

1. యొఱవెలికి. 2. జయము.

విజయంబు గావించి రది మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగి యుండుదు
రిది యొక్క తేజంబ రెండు తెఱంగులై వెలుంగుచుండు నని చెప్పె వినోదార్థంబు
జన్మాంతరంబు నొందినయమ్మహాత్ములు గదా యీయర్జునుండును వాసుదేవుండును
నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు పొడిచి నివాతకవచుల నఱువది
వేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు చేసె వాసుదేవపరాక్రమంబు కంసనరకా
సురప్రముఖనిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు కాదె తెలియ విను మున్న
రూపు చెప్పెద. 150

క. ఆయిరువురు [1]నొకతల యై, యాయోధనమునకు నడచునట్టిద యేనిఁ
వేయేల మనమకా దెదుర్పరై యేడ్తెఱఁ దాఁక హరునకైనను వశమే. 151

క. సారథియు రథియు నై యొక, తేరం గృష్ణు లతిఘోర[2]తేజస్స్ఫార
స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత పాటించి చూచి [3]తెలిసెదవు బలే. 152

వ. అనుచు నాసుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు ని ట్లనియె. 153

క. మఱి నామాట కొంకింతయు, [4]బెదర వకార్యంబునందుఁ బ్రియము[5]కలిగి యుం
డుదు కౌరవులకుఁ గాలము, తుదిరో కా కిట్టిగర్వితుని నే మందున్. 154

తే. [6]హితము లగునాదువచనంబు లిపుడు వినని, వాఁడవై తేని నప్పుడు వారు పడిరి
వీరు పడి రనుపలుకులు విందు గాక, శకుని కర్ణదుశ్శాసనుల్ సమ్మతింప. 155

వ. దుష్టకష్టనికృష్టాత్ము లగునిమ్ముగ్వురుఁ జెప్పెడుబుద్ధులు కాని యొండు విన నొల్ల
వేమి చేయ వచ్చు నని పలికినం [7]గానీనుండు కనలి గాంగేయున కి ట్లనియె. 156

ఆ. ఇట్టు లాడఁ దగునె యే నేమి చేసితిఁ, గొలిచి కుడుచుపాడి నలవుఁ జలముఁ
బలుకు లెందు నెగ్గపలికిఁ బుత్త్రులకును, మనుమలకు హితంబ యొనర నడతు.

క. కానితెఱఁ గైన నింతటి, మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న
న్నీనెఱి తప్పినమాటలు, నీనోరఁ వెడలఁ దగునె నిండినసభలోన్. 158

వ. అనిన విని భీష్ముండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 159

### భీష్ముఁడు కర్ణుని దుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట

తే. ఒకట నైనను వారియం దొకరిలోని
[8]చిదురపాలును బోలండు సిగ్గు లేక
పాండవుల గెల్తు నే నని పలుకుచుండు
వీనిరజ్జులు [9]తులువలు విండ్రు తగిలి. 160

క. మగఁటిమి వారికి వీఁ డెదుర్పగ నమ్మి[10]సుయోధనుఁడు విరోధము గొని స
ర్వగుణాఢ్యులు బలవంతులు, నగుపాండునృపాలసుతుల నవమానించెన్. 161

---

1. నొకతలఁపున. 2. తేజోవిభవ. 3. తెలిసెద నీవుఁ. 4. బెదరవు కార్యంబు. 5. గలి గియుం, డదు కౌరవులకు. 6. హితముగల నాదు. 7. గానీనుండు కటకటం బడి గాంగే. 8. చిఱుత వానిని. 9. తులువలు వినుచు నుండ్రు. 10. సుయోధనుండు రోషము గొని.

ఉ. ఒక్కఁడొకం డనేక [1]విధయుద్ధజయంబులు గొన్నవారు వా
రెక్కడ నేమి చేసె నితఁ డీతనితమ్మునిఁ గూల నేసి యు
క్కెక్కిన పార్థుపైఁ గవిసెనే [2]పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ[3]గోల్పడె ఘోషయాత్రలోన్. 162

వ. ఈదురాత్ముండు కర్జం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలరిమాటలాడు చుండు నీవునుం గైకొని వినుచుండుదువు మేలు కాక యనిన భీష్మపలుకులు విని ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె. 163

శా. శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు కాఁడె య
త్యంతహితంబు లీపలుకు లాహవ మొప్పదు ధర్మసూతితోఁ
బొంతము మేలు దేవపతిపుత్త్రుఁడు సంజయు[4]తోడ నాడిన
ట్లంతకు నోపు మీకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్. 164

ఆ. శరశరాసనములు [5]ధరియింప రెట్టు లెవ్వరును మగతనంబు [6]వలనుఁ గలిగి
కయ్యమున జయంబు గైకొన రే యొరు, లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె.

క. మనవీటన కా దయ్యర్జునునకు [7]సరివింటివానిఁ జూడఁగ లోకం
బున నెందు లేమి తెల్లం, బనుమానము లేదు తోడర నగునే వానిన్. 166

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు చేసిన భీష్మద్రోణులపలుకు లాదరింపక వారికి సదుత్తరంబు లీక వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలనివార్త లడుగుటకు సంజయుదిక్కు మొగం బైనం జూచి కురుపక్షవీరు లంచటుఁ బ్రాణంబులదెస నిరాశులై యుండి రమ్మహీపతి సంజయునితో ని ట్లనియె. 167

తే. ధర్మపుత్త్రున కిక్కడితలఁపుభంగి, యెట్టు[8]లుండు నీసైన్యంబు లెల్లఁ గూడి
యునికివినియె నే యెవ్వరిఁగొనియతండు, కౌరవులమీఁదనెత్తి[9]రాఁగలుగువాఁడు.

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి యెచ్చువడి మూర్ఛ పోయినచందంబున డెందంబు మొగుడం జేష్టలు తక్కి యుండి కొండొకసేపునకుఁ జిత్తం బొక్కింత చేసికొని యక్కటా యీభూపాలుం డింతజేల యగునే యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁ డింత యెఱుంగనివాఁ డెంత చెప్పినను దెలియ నేర్చునే యితనిభంగి యిట్టి దనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల యే నింక నే మనువాఁడ నైనను న న్నడిగినమాటకుం దగిన మాఱుమాట పలుకవలయున కాదె యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె. 169

---

1. విధయుద్ధములందు జయంబు గొన్నవా. 2. పసినా. 3. గొల్వఁడె. 4. తోడ నాడె నెం, తంతకు. 5. ధరియింప రెవ్వరు, మగతనంబు దలఁప మిగులఁ గలిగి. 6. వలన మిగిలి. 7. బ్రతివింటి వానిఁ జూపఁగ లోకం,బున లేమి నాకు దెల్లం. 8. విందుల సైన్యంబు లెల్లఁ. 9. రాఁగలఁడు (గడఁగు) వాఁడు.

చ. వినుము నరేంద్ర పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు మీరు తమయయ్యసగంబును భూమి యీక త
క్కిన మఱి కాని మున్న రొకకీడుఁ దలంపఁడు మీబలంబు నె
ల్లను మదిఁ జేకొం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్. 170

వ. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితేని నీ యెఱుంగనివార లం
దెవ్వరు కల రవధరింపుము. 171

మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిం గీ
చకనిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్. 172

వ. మఱియును. 173

మ. అట మిన్నందిన[1]యట్టి వానిపొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్న ఫల్గునుభుజాగర్వంబు [2]లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకునె వీఁపు చక్క నయి నిల్చుం గాక మీసైన్యముల్. 174

తే. నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలముల ముట్టికొనఁగఁ
దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేఁటాడుభంగి కాదె.

తే. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు
నుక్కుతునియలు కారె మి మ్మక్కుమార
వరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మ
పుత్త్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు. 176

వ. అని చెప్పి వెండియు ని ట్లనియె. 177

క. వృష్ణికుమారోత్తముఁ డా, కృష్ణునితమ్ముండు సాత్యకియు దవదహనా
త్యుష్ణ[3]ప్రతాపమూర్తులు, కృష్ణాసోదరులు తలఁపఁ గేవలులె నృపా. 178

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు, మహితవిక్రముఁడగుమత్స్యవిభుఁడు
నధికధైర్యాన్వితు లతని[4]తమ్ము లుదగ్ర, తేజస్కులైనతదీయసుతులు
నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు, కేకయపతులునక్షీణబాహు
శక్తి[5]యుక్తులు జరాసంధసూనుఁడు సహ, దేవుండు నా[6]జయత్సేనవిభుఁడు
తే. వినుము శిశుపాలతనయులు వీరధనులు, ధృష్టకేతుండు వృషభుండుఁ దీవ్రరణవి
నోది యదుభర్త చేకితానుండు దర్ప, ఘనుఁడు శైబ్యనృపాలుండుఁ [7]గలరు కాదె.

---

1. యాతవాని. 2. లెక్కించు నంతట; లెక్కింత మంతట; లెక్కింపు మంతట; రెట్టించు, నంతటి. 3. ప్రకారమూర్తులు; ప్రతాపదీప్తులు. 4. తమ్ములు నుగ్ర. 5. యుక్తుఁడు. 6. జయత్సేన వరుఁడు. 7. గలర కాదె.

క. వీరెల్లఁ బాండురాజుకు,మారులపాటునకుఁ [1]గుందుమనములతోడన్
వారిపగ తీర్పఁ గడఁగెదు, వారల కా కందు లాఁతివారుం గలరే. 180

వ. భీమసేనుసూనుండు ఘటోత్కచుండు తండ్రికంటెను లావును బీరంబునుం గల
వాఁడు మాయాబలంబున మన బలంబు నెల్లం గలంచు మఱియును దూర్పన
నుత్తరంబునం గలుగు నరనాయకులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చిచ్చయి
ననుం బిడికిటింత మనుచున్నవా రదియునుం గాక. 181

క. సకలభువనములు నఱచేఁ,తికిఁ దేరం జాలునట్టిధీమంతుఁడు దే
వకికొడుకు కలఁడు ధర్మజు,నికి నాతం డెత్తి రాక నిలుచునె యధిపా. 1ᵹ2

వ. అని చెప్పిన సూతపుత్రునకు నంబికాపుత్రుం డి ట్లనియె. 183

ధృతరాష్ట్రుఁడు భీమసేనాదుల పరాక్రమంబు దలంచి దుఃఖించుట

క. వారిదెస నీవు చెప్పిన, యారథికులు ప్రబలు లగుదు రందఱు నైనన్
వారెల్లను నొకతల య,మ్మారుతి యొకతల బల[2]ప్రమాణము చూడన్. 184

ఉ. భీముఁ దలఁచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు రే
[3]లేమియు నిద్ర రా దతని నేత్రజుమార్కొనఁ జాలునట్టివాఁ
డిమొన లేఁ డతం డలుక నెత్తినయాగద కాలదండము
ద్దామ[4]విలాసుఁ డై కురుకదంబములో [5]విహరింప కుండునే. 185

తే. చిఱుతనాఁడును వాఁడు నాశిశుఁ బోఁడు, వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి
వానిచేఁ బీడ పడియును మాన రదియ,కాదె యీభేదమున కెల్లఁ గారణంబు.

క. సమరమున [6]దైత్యదానవ, సమితియు నాతని కెదుర్పఁ జాలదు భుజయు
ద్ధమున జరాసంధుని నొక, నిమిషంబునఁ జంపె నొరులు నిలుతురె యెదురన్.

మ. బొమ లల్లార్చ ముడివడ్డ రౌద్ర [7]రస ముప్పొంగం దనర్చన్ భుజా
గ్రము లిం దెవ్వఁడు నాకు మా ఱనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల దు
ర్దమలీలం [8]గవియంగ భీముఁ గని ధైర్యం బేది కౌరవ్యసై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటు లై నామోమునన్ వ్రేలెడిన్. 188

క. కరవాలము గద మొద లగు, పరికర మేమియును లేక బాహుబలమునం
గరిగతి నడరినను వృకో,దరునకు నొకఁ డెదుర నిలిచి [9]తలపడువాఁడే. 189

తే. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగుభీముఁ గడవనీఁద
వశమె నాపుత్రులకు విధివశము పొంది, యెదిరిఁదమ్మును నెఱుఁగరు మదముకతన.

క. చిచ్చునకుఁ దోడు కరువలి, వచ్చుగతిన్ భీముదుర్నివారవిహారం
బచ్చుపడఁగఁ బ్రాపై వి,వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్. 191

వ. సంజయా వినుము నీ కున్నరూపు చెప్పెద. 192

---

1. గందుమనముల. 2. ప్రమాణము లందున్. 3. యేమియు. 4. విహారుఁడై. 5. వసి యింపకుండునే. 6. దేవదానవ. 7. రసమాపూర్తిం. 8. గదియంగ. 9. తప్పెడువాఁడే.

క. ఆయర్జునుమగఁటిమి కెన, యేయుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే
నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁ డోపు రిత్త చెప్పెడువాఁడే. 193

ఉ. [1]ఎక్కటిగాండివంబు నుతి కెక్కి వెలుంగుట మీఁదఁ గేశవుం
డక్కజ మైన తేజ మది యాసపడండు తనంత నర్జునుం
డొక్కఁడ వైరిసేనలకు [2]నొట్టినయంత ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రపువేఁడిమి కోర్వ వచ్చునే. 194

క. దివిజదనుజసహితము లగు, భువనము లన్నిట మహేంద్ర[3]పుత్త్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం, దవులం బడఁ డెందు నత్యుదగ్రబలమునన్. 195

వ. అని పలికి వెండియు. 196

క. [4]కురుసేనఁ గదా గెలుచుట, కరము భరం బర్జునునకు గాండీవమునం
బెరిఁగిన యస్త్రములమంటల, దరికొని [5]తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ. 197

వ. భీమార్జునులకోలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు రెఱిం
గియు మానుషంబు పాటించి సేనమొగంబున నిలుతురు కీర్తి వట్టి ప్రాణంబులు
విడుతు రింతియ కాని చేయునది లే[6]దదియునుం గాక పౌత్త్రు లగుటయు శిష్యు
లగుటయు గాంగేయునకు గురునకు సామాన్యం బగుటం జేసి రెండు తెఱంగుల
వారికి వీ రొక్కరూప మనకడ నున్న తప్పునకు మనముందట నిలువవలయు నను
నింతమాత్రకుం గా వీరల కింత వలసె నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి
చెప్పను నియమింపనుం జాల మొదల విదురుం డే మని చాటి చెప్పె నది యంత
యుం బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికిం జేటు [7]మూఁడుట తోఁచు
చుండు మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ
డింత చేసెఁ గాల[8]పర్యాయంబునఁ గౌరవులకుఁ గడవ రాని యవస్థ వచ్చె సంజయా
నే నేమి చేయుదు నెందుఁ జొత్తు నెద్ది తెరు వెవ్వరు శరణంబు వా రిరువురుఁ గల
యంతటన పోయెనే వినుమని మఱియు నిట్లనియె. 198

చ. అనుజులు నట్టివార ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
టెను బలవంతు లాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయ[9]వివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు చేసికొను దానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్. 199

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టిధర్మపుత్త్రు నాక్రమింప
మనము తలఁచు టెల్ల మంటలో మిడుత లు,దగ్రవృత్తిఁ జుఱుకఁ దలఁచునట్లు 200

---

1. ఎక్కుడి (డ). 2. నొడ్డినమంట. 3. పుత్త్రుఁడు సమరో,త్సవలీలః. 4. కురుసేనలఁ దా గెలుచుట. 5. తెగటార్చునట్టిదయ. 6. దదియుచు బ్భ్రాతు, లగు. 7. మూఁడుటకుం జూచు చుండు. 8. విపర్యయంబున. 9. వివేకదానముల.

వ. కావునఁ బాండవులతోడిభండనంబునఁ గులక్షయం బగుట తప్పదు శాంతిఁబొందుటయ మేలు మనవారల కది ప్రియం బగునేని దానికిఁ దగిన యత్నంబు చేసెద ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 201

క. దేవర యానతిచ్చిన, యీ వాక్యము లెస్స నాఁడు నీవ యుపేక్షం
బో విడిచితి వింకను నీ,చే వత్తురు వారు వీరిచే టొప్పుదురే. 202

వ. అది యెట్లంటేని. 203

క. వారు దెస లొత్తికొనియు ధ,రారాజ్యం బిచ్చి [1]పోయి రా పోరా తా
రారణ్యపీడఁ బడియును, రారాజుం జెఱుకుఁ బాపరా మన మెఱుఁగన్. 204

వ. అట్టియెడ నైనను. 205

క. రావించి తగవుమై సం,భావింపవ కాక నాఁడ పాండవు లలుకం
బో విడువరె మిగులుదురే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారెన్. 206

దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యంబు చెప్పుట

వ. అనిన విని దుర్యోధనుండు తండ్రి కిట్లనియె. 207

చ. అడవులఁ గొండలం బడి మహాపద [2]రూపఱి చన్న వారి ని
ప్పుడు కొని వచ్చి కృష్ణుఁ[3]డొకప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చినం
బొడుతురె పాండునందనులు భూవర యేటికి నింతభీతి [4]మా
కడిమియు లావు నీ వసదుగా గణుతింపకు గెల్తు మెమ్మెయిన్. 208

తే. పరశురాముని గెలిచినబల్లిదుండు, భీష్ముఁ డవనీశ లీతని పేరు వినినఁ
బాఱు చుండుట యెఱుఁగవే పాండుపుత్రు, లనఁగ నెంతటివా రితం డలిగెనేని.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, లపరిమిత[5]భుజాబలాఢ్యు లాహవకేళీ
నిపుణు లజేయులు వీరలు, కుపితాత్మకు లైన మాఱుకొనునే హరుఁడున్. 210

క. ఈశ్వరవరజనితుఁడు హరి, దశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ డీ, యశ్వత్థామ కలుగ మన కని వెఱ పేలా. 211

ఆ. సహజకుండలుండు శౌర్యధుర్యుఁడు సము,దీర్ణబాహుబలుఁడు కర్ణుఁ డిందుఁ
గలఁడు వీని కెదురు కలఁ[6]డని యెన్నుమా, ధర్మపుత్రుపాల ధరణినాథ. 212

క. వినుము నరేశ్వర కర్ణుని, పెనుపు మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను, గొనుమని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్.

వ. వీర లాధర్మపుత్రాదులచేతనకా దెవ్వరిచేతనుం జెడమి తెల్లంబు బాహ్లీక సోమదత్త భూరిశ్రవశ్శల్య సింధురాజ గాంధారరాజప్రభృతి మహావీరులు వీరల కంటెను శక్తిసమగ్రులు తక్కటిరాజలోకంబును సహాయులై వచ్చిన వివిధదేశాధీశులును నాతోడిసుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికమై నగ్గి నైన నులు

1. పోయిరో పోరో. 2. రూపఱుచున్నవారి. 3. డొకప్రాపుగఁ. 4. మా కడిఁదియు. 5. మహానుభావు లాహత. 6. డెవ్వఁ డెన్నుమా.

కను సముద్రంబైన నీఁదను దెంపు సేసి పొంపిరివోవు చున్నవారు కావునఁ
బాండవులకు మాదిక్కుఁ దేఱి చూడనుం గొలంది గా దనుమానింపకు మిట్లునుం
గాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడువచ్చినవారును
విచ్చిపోయి భృత్యులును విరక్తులై వారిక పోటుమానుసులును బంధుమిత్రసహా
యులును బ్రజానురాగంబునుం గలిగినట్టిదైన నది ప్రాప్తకాలం బింతియ కాని
యే మింక వారియడుగు లొత్తను బాఱి పోవనుం జాల మెల్లభంగుల [1]సమ
రంబు చేయుదుము తలపెట్టిన నాతలంచినట్లొండె వాసుదేవుండు తలంచినట్లొండె
నయ్యెడు నెట్టైన మే లింతవట్టును నిర్ణయం బని పలికి మఱియు ని ట్లనియె. 214

తే. కులములోఁ దలవం పగుకూడు కుడువఁ, బంపఁ జూచెద వొకళులఁ బఱతురట్టి
వారు పైనెత్తి వచ్చినఁ బోరి కోప, [2]మఱిన ధృతిచేట కాక పొందగునె చెపుమ.

క. నీవు బలిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిఱిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నే మన నేర్తున్. 216

తే. [3]భీమసేనుని నీ వింత పెద్ద చేసి, పెక్కుభంగులఁ జెప్పి[4]తి యుక్కు కలఁడు
గదకు నేర్చునం చెంతయు బెదరెదతఁడు, నన్నుఁ బోలమి యెఱుఁగవే నరవరేణ్య.

మ. గద నాతో సరి మూఁడులోకములఁ నేఁ గానం జలం బెత్తి యు
న్నదుఁ డాభీముఁడు నన్నునిం దొడరిన న్వజ్రప్రహారంబు వె
ట్టిదమై తాఁకినఁ గూలుపర్వతముమాడ్కిం గుంభినిం గూల వ్రే
సెద నా కోర్కి కదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్. 218

ఆ. అతఁడు పడిన వెండి యానేనఁ గొత్తలల, సేయ నొకఁడు లేమి సిద్ధ మింత
యెఱిఁగి వెఱచి కాదె యేన్నాళ్లులైనను, [5]దఱుకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు.

వ. అర్జునుండు కలం డని తలంచితి వేని. 220

తే. కర్ణుపడసినయాశక్తిఁ గలుగఁ బోర, బ్రదుక వచ్చునె నరునకు నదియుఁగాక
యతని భీష్మాదిరథికులయతులితాప్ర, మేయదివ్యబాణంబులు మ్రింగి కొనవె. 221

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణచిత్రసేనాదులగు నీకొడుకు లొకం
డొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్కమొగంబై త్రోచి
నడచిన సవ్యసాచి యొక్కరుండ కాఁడు పాండవుల నెల్ల నొక్కెత్తున వైచి
కొననోపుదు రట్లునుం గాక మాకు నక్షౌహిణులు పదునొకండు వారికి నేడక్షౌ
హిణులు మాసైన్యంబు సారవంతంబు వారిబలంబు నిస్సారంబు వారు మమ్మె
వ్విధంబున జయింప నోపుదు రీయెక్కువ తక్కువలు విచారింపక [6]వలవని వెఱపు

1. సంగరంబు. 2. మఱిన. 3. భీమసేనుని నెంతయుఁ బెద్దఁ జేసి. 4. త ట్లుక్కు గలఁడు.
5. దఱుఁ బోలు. 6. వలువని.

కట్టికొని ముకుఱ్ఱారి వగచు చున్నవాఁడవు నిన్ను వగవ కుండ నుడుపం జాల
నుంతియకాని తక్కెల్లపనులకుం జాలుదు మని పలికి సంజయుదెసఁ గనుంగొని
సుయోధనుం డి ట్లనియె. 222

క. నానాదేశంబులఁబలు, మానుసులం గూర్చికొని సమత్సరబుద్ధిం
[1]దానే మనియెడు నయ్యమ, సూనుం డాతని తెఱంగు చూతము చెపుమా. 223

వ. అనిన విని సంజయుం డి ట్లనియె. 224

### సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట

ఉ. ఆతఁడు ఖండనం బనిన [2]నార్చిన మూరెఁడు పేర్చు నెంతయుం
బ్రీతి వహించి తమ్ము లొక పెండ్లికిఁ బో యెడునట్లు యున్న వా
రా తెఱి వెందునుం గలదె యంచలినాయకు లెవ్వ రొక్కొ మా
చేతులఁదీఁట పుత్తు [3]మనుచి త్తమ కాని చలింప రేమియున్. 225

తే. నరునిపాశుపతాదిబాణముల పెంపు
భీముగదసొంపు నమ్మి యుద్ధామలీలఁ
జెలఁగి వెఱ పేది యక్కడబలము [4]ముసురు
కవిసి యెపుడుఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వ. 226

క. నావుడు నిది యా సంజయు, కైవారము చేసె దీవు కౌంతేయుల వా
రేవి రణసాధనమ్ములు, గా వెఱవక నడచువారు కౌరవులపయిన్. 227

వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జునదివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవ
దత్తంబుల మహానుభావంబులు వేఱు వేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమ నకుల
సహదేవుల యరదంబులు తురంగాదిపరికరంబు లిట్టిట్టివని యేర్పడం బలికి విరాట
ద్రుపదాదులకు వలయు నుపకరణంబులు కొఱంత లేమియు నెఱింగించిన ధృత
రాష్ట్రుం డిందుఁ గలబలుమానిసు లెవ్వరికి నసాధ్యులు వీరి సాధించు తెఱం
గూహించిరే యని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 228

సీ. గంగాసుతుండు శిఖండిపా లతనికిఁ, బ్రాపు మత్స్యేశ్వరుబలము కుంభ
భవుఁడు ధృష్టద్యుమ్నుపా లతనికిఁ దోడు,పడు ద్రౌపదీపుత్రపంచకంబు
రారాజుఁ దమ్ములు మారుతిపాలు కు,మారు లందఱు నభిమన్యుపాలు
శకునిసైంధవులు నశ్వత్థామకర్ణులు, త క్కొరుచేఁ బోనిదండిమగలు

ఆ. సవ్యసాచిపాలు సాత్యకిపా లక్కృత,వర్మ చేకితానవసుమతీశు
పాలు సోమదత్తుఁ డాలంబునకు నిట్లు, నిశ్చయించి రచట నృపవరేణ్య. 229

క. నకులుఁడు సహదేవుండును, శకుని నులూకాదిసుతుల సారస్వతులం
బ్రకటబలు లైన కాళింగకులను సమయించువారు కౌరవనాథా. 230

---

1. దానే మనియెడు. 2. నార్చుచు; నార్చియు మూరెఁడు లేచు. 3. మను చింతయు కాని తలంప రేమియున్. 4. మసరు, కవిసి యిపుడు కయ్యమునకు.

క. కేకయులు మనలఁ గలసిన, కేకయుల జయించువారు కృతపుణ్యుఁడు సు
శ్లోకుఁడు ధర్మతనూజుఁడు, లోకోత్తరు [1]శల్యుఁ డా గెలుచువాఁ డధిపా. 231

వ. అట్టి పలుకుల సమయంబున నచ్చోటఁ గొందఱు జనంబులు ధర్మనందను నుద్దేశించి. 232

క. ఇతఁ డెక్కడ మద్రమహీపతి యెక్కడ నితని కతఁడు పాటియె యనుచుం
బ్రతివచనంబుల శల్యుని, యతిబలశౌర్యములు వారి కాతఁడ చెప్పెన్. 233

వ. ఇట్లుఁ గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు పడిరి వారికి వార చాలి యుండు [2]వారని రివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొఱంత లేనితెగువం దేజరిల్లు చున్నవారు నీకు నీకొడుకునకు నెయ్యది కర్జంబై తోఁచె నదియ చేయుం డనిన విని విచిత్రవీర్యతనయుం డి ట్లనియె. 234

క. నాకొడుకుల కెక్కుడిబ్రదు, కేకొలఁదిఁ దలంప నిప్పు డెన్నిన వీరా
నీకంబు నోర్వవచ్చునె, [3]యీకూడినసైనికులకు నే మనువాఁడన్. 235

క. రాజు యుధిష్ఠిరుఁడై హరి, తా జయ [4]మొదఁగూర్ప నున్నఁ దత్సైన్యము రా
రా జిట్లు సరకుసేయమి, నాజన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ. 236

క. నా కుడుప నేల వశమగు, నీ కూడినభూపతులకు నింతియ కాలం
బై కడ చన్నది సంజయ, నీ కీవగ పేల యింక నిలుపుము పలుకుల్. 237

వ. అనిన విని దుర్యోధనుండు నిజజనకునితో ని ట్లనియె. 238

ఉ. ఏమును బాండునందనులు నేకకులంబునఁ బుట్టి యొక్కచో
నేమొకఁ డైనఁ జేసి కెడ నెప్డు చరించినయట్టివార ము
ద్దామబలంబు శౌర్యమును దర్పము వారిక కల్గి వార సం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు కల్గెడున్. 239

ఉ. వారిని వారివారి నిటు వర్ణన చేసెదు గాని మమ్ము మా
వారిఁ దలంప విప్పుడమి వారికిఁ బాయను [5]మాకు నంతయుం
జేరను ముక్ సృజించె విధి సిద్ధము దీని నొకండు మాన్పఁగా
నేరఁ డకారణంబ మది [6]నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్. 240

వ. అనిన విని సూతనందనునకు నంబికానందనుం డి ట్లను నా[7]కొడు కున్మత్తప్రలాపంబులు చేయు చున్నవాఁ డింతియ కాని సత్యధర్మనయపరాక్రమసహాయసంపన్నులైనపాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను బ్రబలుం డయినను బెనఁకువ కీడ కాక మే లగునే యది య ట్లుండె నొక్కటి యడిగెద సంజయా చెప్పుము. 241

1. శల్యు ననిని గెలుచు. 2. వార మని పూని రివ్వి; వారని పూని పలికి రివ్వి. 3. యీకౌరవసైనికులకు. 4. మొదఁగూర్పఁ గడఁగు. 5. మమ్ము. 6. నెవ్వగ పేటికిఁ. 7. కొడుకు రిత్త ప్రతాపంబులు వల్కు చున్నవాఁడు; ప్రలాపంబుల వల్కు చున్నవాఁడు.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన [1]నుల్లికుట్టుమాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో. 242

క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డే వెరవుమాట నైనను, నే వోసినయగ్నిభంగి [2]నిగుడం జేయున్. 243

వ. అతండు ధర్మతనయుతో ని ట్లను గాంగేయకుంభసంభవాది మహావీరక్రూర సత్త్వబహుళంబును గరిఘటాగిరికదంబకలితంబును దురంగనికరతరంగపరంపరాఘోరంబు నగుకౌరవసేనాసముద్రంబునకు నే నొక్కఁ చెలియలికట్టనై నిలిచెద ననవుడు నయ్యుధిష్ఠిరుండు నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే యెట్లును సంగరంబున మ మ్ముద్ధరింపు మనియె నిట్లు కొనియాడిన నాతండు నాదెసం గనుంగొని సంజయా మీవారల కెల్లనుం దెలియం జెప్పు మీశ్వరాదిదేవతలు సమకట్టినసవరణ గల యజ్ఞునుచేత నిర్మింపంబడినయుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగుదుర కాదె మనుష్యు లతని కెంతపెద్ద [3]యిట్టిజెట్టి వెన్నుఁ దన్ని చూడఁ గలవాఁడు కావున మముబోం ట్లల్లఁ బోక పెనంగినం బోరు భరం బైనం బ్రాణంబులపై వచ్చు నంతకంటెను బరమదయాపరుం డైన పాండవాగ్రజుమఱువు చొచ్చి బ్రదుకుం డను మంత యంతలు తప్పులు చేసితి మని తలంక వలవ దెంతలు చేసినను గాంతేయపూర్వజుండు శాంతిసుధానిధి యగుటం జేసి శరణు చొచ్చినం గాచు నని పలికె ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కి ట్లనియె. 244

క. పరిజనులకు నీకును ని, ద్ధరలోన సగంబు చాలుఁ దక్కటిసగముం
గర ముచితంబుగఁ బాండవ, వరుఁ డగుధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్. 245

## ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి చేయుం మని చెప్పుట

చ. పెనఁకువ [4]నాక యేల మన పెద్దల కెవ్వరి కియ్యకోలుఁ గా
దనుచితవృత్తి కాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులుఁ
గొనకొని పోరికిం జొర రకుంఠితతేజుఁడు ధర్మపుత్రుఁ డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగుఁ గౌరవ[5]జాతి కెంతయున్. 246

వ. అని వెండియు. 247

క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ
నిర్ణయమె మే లనఁగ నీ, కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్. 248

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డి ట్లనియె. 249

క. నీచెప్పెడిపెద్దలు ద్రోణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా
రై చేరనివారిం గొని, యే చక్కం బెట్టువాఁడ నేఁ బాండవులన్. 250

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ

---

1. నుల్కుపట్టుమాటలఁ. 2. నెగడం. 3. యెట్టిజెట్టి. 4. నాకకాదు. 5. జాతి కింతకున్.

క్రోధజ్వాలల సార్తు నొందఁ డొకఁడు [1]నాకుం దోడె నీ వింక నా
బాధం బెట్టకు వాఁడిసూది మొన మోవం జాలునంతైన నే
నీధాత్రీతల మీను వారలకు [2]నాకే లింతసేగిం బడన్. 251

వ. అనిన గాంధారీవల్లభుం డతని కి ట్లనియె. 252

ఆ. నీకు నంత వగవ నీపొవు తెరువునఁ, బోవువారిఁ గాఁగఁ జూని యున్న
వారి కెల్ల నేను వగచెదఁ గయ్యంబు, వలవ[3]దుడుగు మయ్య చలముకొనక.

చ. ఉభయబలంబులుం బొగడ నుగ్రత భీముఁడు విస్ఫురద్గదా
రభస మెలర్పఁ గుంభములు [4]వ్రయ్యఁగ వ్రేసిన నెత్తు రొల్కఁగా
నిభములపిండు కావిసెలయేఱులతోడినగంబులట్లు సం
క్షుభితము లై పయిం బఱవఁ జూచి తలంచెదు నాదువాక్యముల్. 254

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబులు నొక్కమాత్ర నే
ర్పెఱ నుఱుమాడినం బుడమిఁ ద్రెళ్లిన నీదగుసైన్య మంతయున్
నఱకినఁ బడ్డఘోరవిపినంబువిధంబున నున్నఁ జూచి య
త్తఱి నయినం దలంపు [5]ముచితం బగునావచనంబుఁ బుత్రకా. 255

వ. అని పలికి యతనివలనం బలుకుఁ గానక మనంబు [6]మరలం బెట్టికొని కొడుకులు జయింప నోపుదురొకో యనునాస సంజయుదిక్కు మొగంబు చేసి పాండవ కౌరవపక్షంబులం గలవారి నడుగుచుం గొలందులు తలపోయుచు నాతని వచనంబులం దనవిచారంబులను బలాబలంబులు నిశ్చయించి పాండవేయు లెక్కుడవుట యెఱుంగుచుఁ గ్రమ్మఱ నాసూతపుత్రుతో లెక్కలు [7]వెట్టుచుం బోలించుచుఁ బెద్ద ప్రొద్దు వితర్కించి కౌంతేయులశక్తి దేవశక్తియు గాంధారేయులశక్తి మనుష్యశక్తిగాఁ దెలిసినవాఁ డై యంబికానందనుండు నిజనందనునితో ని ట్లనియె. 256

క. నరుఁ డగ్నిదేవుఁ దనకును, వరదునిఁ గాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు
స్ఫురణం బాదిగఁ గలసంగరపరికర మెల్ల నతఁడు కావించె [8]దయన్. 257

వ. అదియునుం గాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వినులును వారలకుఁ బాండురాజుతోడివారలు వారి నొకకీడునం బొరయకుండ రక్షింతురు కావున భీష్మద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి తెల్లంబు. 258

క. దేవత లేటికిఁ బార్థుఁడు, దేవసముఁడు కాఁడె వాఁడు దివిజులచేతం
బోవనిదైత్యులఁ జంపఁడె, యీవును నీవారు నతని నెఱుఁగరె చెప్పుమా. 259

వ. కౌరవులకు వచ్చినయిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లేదెన్నిభంగులం జూచినఁ గయ్యం బుడుగుటయ మనకుం గర్తవ్యం బై యున్న

---

1. నాకుం బ్రాపె. 2. నాకే లంతసేగిం. 3. దుడగ వయ్య చలము మాని. 4. వ్రయ్యఁగ మోదిన. 5. ముచితంబుగ. 6. మొగుడం. 7. వెట్టుచుఁ జాలించుచుఁ. 8. దగన్.

యఁడి యుపశమింప వయ్యు దీర్ఘవైరంబు వలవ దనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె.

క. దేవత లర్జునునకుఁ దో, డై వత్తు రనంగ వలవ దది యె ట్లనినన్
దేవత్వము రాగద్వే, షావేశము లేమిఁ గాదె యైనది మొదలన్. 261

వ. కావున వా రొకళ్లవారంగా రట్లుం గాక పక్షపాతు లై వ్రాని వత్తురయేని నది దేవత్వంబు కా దట్టిదేవత్వంబున నర్జునుండును సురక్షితుండు కానేరఁడు నీకు నాపనికిఁ జింత వలవ దని పలికి వెండియు ని ట్లనుఁ బెఱిగి వచ్చుకార్చిచ్చు నుడుపను బాషాణవర్షంబు వారింపను మహావాయువు నిలుపను నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడపింపను నాసేన నడచునప్పుడు వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు సింహశరభశార్దూలభూతభేతాళాదిక్రూరసత్త్వసంరంభస్తంభనప్రకారం బెఱుంగుదు మిత్రశత్రువిషయంబు లైనశుభాశుభంబులు వలయుభంగి నావహింప నేర్తు మఱియు నానావిధసిద్ధి[1]ప్రదంబు లగుమంత్రధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు నీచెప్పినయగ్నిప్రముఖదేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ వారికి నాకుం బోలె మహానుభావంబు కలిగినఁ బదుమూఁడు వత్సరంబు లబ్భంగి నిష్ఫలం బడుదురె వినుము చెప్పెద.

దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబు చెప్పుట

క. ఏ నలిగిన వారిని సుర, లైనను రక్షింప నోప రమరు లలిగినం
బూని చెడ కుండఁ గాతును, మానవు లోక[2]సరకె నాకు మనుజాధీశా. 263

తే. గర్వమున నాడుమాటలు కాఁ దలంప, వలవ దిది యెల్ల నిక్కంబు వసుమతీశ
నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన, నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెప్పుమ. 264

వ. ధర్మతనయాదిపాండవేయులును ద్రుపదాదిపాంచాలురును విరాటాదిమాత్స్యులును వాసుదేవాదియాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్యప్రముఖనిఖిలదండనాయకులును నాబారింబడి మున్నీరుచొచ్చినయేఱుల చందంబున నడంగిపోవుట యవధరించెదు గాక వారెల్లఁ దేజోధైర్యపరాక్రమోపాయవిచారవివేకంబుల నాయొత్తువత్తురె పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్రవిషయంబుగా నేమేమి యెఱుంగుదు రంతంత నేర్తు రదియెల్ల నెఱుంగుదు నంతయు నేర్తు నని పలికి యందఱు వెఱఁగుపడి యుండం దాను సంజయుతోఁ సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవులచెస మాట లాడుచుండఁ గర్ణుఁడు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా ని ట్లనియె. 265

క. గురునలుక నాకు నస్త్ర, స్ఫురణ మెడలె నండ్రు జనులు బొం కది వ్రాజా
పరత మెయి నమ్మునీశ్వరు, కరుణఁ [3]గొఱలి మగుడఁ బడయఁ గాంచితిఁ బ్రీతిన్.

1. ప్రకరణంబు లగు. 2. సరియె. 3. వడసి.

ఉ. కావున నస్త్రశస్త్రము లఖండితసంపద [1]నొంది యుండు దే
వావలి కైన నన్నుఁ జెనయంగ భర మేఁ గలుగంగ నర్జునుం
డే విడిపించు మేదినిఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా
నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్. 267

శా. గాంగేయాదులు [2]నీకడన్ నిలిచి వేడ్కం జూడఁ గా సర్వసే
నాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగ నీ కేను వీఁ
కం గౌంతేయులఁ దాఁకి తత్తనువు లుగ్రస్ఫారబాణాలిఁ గూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్. 268

వ. అనిన విని యినునందనునకు మందాకినీనందనుం డి ట్లనియె. 269

క. కాలుఁడు ప్రేరేపఁగ నిటు, ప్రేలినయంతటన నిన్నుఁ బెద్దగఁ దలఁపం
బోలునె మాకును నుడుగుము, చాలుదు నీ వెల్లపనులు సాధింపంగన్. 270

ఉ. కూలెడువారె పాండవులు ఘోరపుఁబోర నొకండొకండ యీ
చాలెడువార లెల్ల మును చావఁ గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదు రింతియ కాక నోరిచే
తల వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా. 271

తే. దివిజపతి నీకు నిచ్చిన[3]తీవ్రశక్తి
చేతఁ గవ్వడి పడు నని[4]చూతు వేని
వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యెఁ
దునియ లయ్యెను బోడి యయ్యెఁ దొరఁగు ధరణి. 272

క. సర్పముఖశరము కల దను, దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు హరి పెం
వేర్పడఁగ నదియ కా దట, తీర్పవలయువాని నెల్లఁ దీర్చు నరునకై. 273

వ. అని పలికి ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 274

క. జ్ఞాతులు తమలోఁ బొందినఁ, [5]జేతోమోదమున వెలిఁగి చెలువొందుదు ర
న్నీతిం బాసిన విగతవిభూతిం గడకొఱవులట్ల [6]పొగయుదు రధిపా. 275

వ. కావునఁ దమలో విరోధం బొప్పదు సంభాషణసహభోజనాదిసత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతులైన జ్ఞాతు లిహపరార్థసాధకు లగుదు రని చెప్పి వెండియు. 276

క. విను మే నొకశైలమునకు, మును భూసురవర్గసహితముగ నొకపనికిం
జనునెడఁ జన రానితటంబున నొకజుం డుండె దానిఁ బొగడిరి తజ్జ్ఞుల్. 277

తే. దీనితేనియఁ బ్రాచీనమానవులకు

---

1. నొంది యుండఁ దే. 2. నాకడఁ. 3. దివ్యశక్తి. 4. చెప్పెదేని. 5. చేతోమోదంబు గలిగి. 6. పొలయుదు.

జరయు రుజయును డప్పియుఁ జావుఁ గలుగ
దనఁగఁ గొందఱు బోయలు విని కడంగి
యుఱక మొఱకులై [1]చఱిఁ బడ నుఱికి రపుడు. 278

వ. ఇట్లుఱికి మృతిం బొంది రట్లపోలె నవినీతులైన నీకొడుకులు పుడమియెల్లను దార యేలుటీపుఁ జూచెదరు కాని తమపాలిసిపోవుటం గానరు వీర లర్జునుతోడం బెనంగి [2]మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుంగాక సమబలులైనసుం గయ్యంబునఁ గదా వీ రౌదురు వా రౌదు రనవచ్చు నది యేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయు నీకుం గర్తవ్యం బనిన బాహ్లికుండు ధార్తరాష్ట్రున కిట్లనియె. 279

క. కనుబ్రమసిన తెరువరి తన, కనపాయం బైనమార్గ మరసి తగ నెఱిం
గినవారు చెప్పఁగాఁ గై, కొననికరణిఁ దగినవెంటకుం జొర వకటా. 280

వ. అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కిట్లనియె. 281

మ. కొడుకా యే నెటు లట్లు బాహ్లికుఁడు నీకుం గూర్చు భీష్ముండు నీ
యెడ సస్నేహుండు వీరిమాట విను మే మీమువ్వురుఁ మన్ననల్
పడయంగాఁ దగునట్టివారము నినుం బ్రార్థించెదఁ ధర్మజుఁ
విడువంగాఁ దగ దిమ్ము వారలకు నుర్విం బాలు నెమ్మిం దగన్. 282

క. అనినను వెండియు నొడఁబా, టునకుఁ జొరనిదానికిం గొడుకుతోడఁ గడుం
గినిసి ధరణీశ్వరుం డి, ట్లనుఁ గొలువున నున్న [3]వార లందఱు వినఁగన్. 283

తే. [4]బవరములు కావె విఱిగిన బార చాఁప, వచ్చునే యొక్కరుండ వివ్వచ్చుఁ డడరి
పసుల [5]బెట్టించునపుడు నీబలము విఱుగ, దయ్యెనే నీవుఁ గర్ణుండు నచట లేరె.

వ. అని రాధేయుదిక్కు మొగంబై మఱియు ని ట్లనియె. 285

ఆ. నాఁటికొలఁది కాదు నారాయణుఁడు నొగ, లెక్కఁ గెలన భీముఁ డేచి నడవ
ననుజతనుజసహితుఁ డై వచ్చువివ్వచ్చు, మార్కొనంగ వశమె మనకుఁ గర్ణ 286

చ. [6]బలమును దర్పముఁ మెఱయ బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనం గడఁగు టొప్పెడు[7]తెం పగుఁ జచ్చి శుద్ధుఁడై
పలుకులు మాన్పు భృత్యుఁ డను[8]పాటి దలంచెద విట్లు మేలె య
చ్చలమున నీసుయోధనునిచావున కోర్చుటఁ గాదె యెంతయున్. 287

వ. అనిన విని కానీనుండు సంక్షుభితమానసుం డై యిది యెల్ల ని ట్లయ్యె నిట్లుం గాక [9]తక్కినయది య ట్లుండె నదీసూనుండు నన్ను [10]నిరాకరించి పలికిన పలుకుల ఫలం బనుభవించుం గాక యని యతని నుద్దేశించి యి ట్లనియె. 288

1. చఱి దిగ నఱికి రపుడు; చఱిలోని కుఱికి రపుడు. 2. తమ. 3. రాజు లందఱు. 4. బరవసము గాదె. 5. బట్టించు. 6. బలిమియుం. 7. తెంపున. 8. పాడి. 9. తక్కినపప్పుటి కది యట్లుండె. 10. నిరాకరించిన ఫలం.

### కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్న్యాసంబు చేయుట

తే. నీకు నాలావుతోడ్పాటు లేక యుండ, వలయు నీ తెగునంతకుఁ గలన నిలువ
నాయుధంబులు విడిచితి నంతమీఁద, [1]మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ. 289

వ. అని శస్త్రసన్న్యాసంబు చేసి కొలువున నిలువనొల్లక దిగ్గన లేచి పోయె నట్టియెడ
శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో ని ట్లనియె. 290

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును బాస యిచ్చి యెన్నఁడు బొంకం
డింతటిమానిసి యలిగినఁ, గౌంతేయుల కెట్లు బ్రదుకఁ గా వచ్చు ననిన్. 291

క. అని వెండియు నిట్లను నాతని మాటల కెట్లు [2]కడఁగి ధర్మతనయుతో
నని చేయక తక్కవు నీ, వనుమానము పాయఁ జూడు మతనిని నన్నున్. 292

వ ఏను బాహ్లీక ద్రోణప్రముఖులు కనుంగొనుచుండఁ బ్రతిపక్షుల ననేకసహస్రం
బుల సమయించెదఁ బిదప రాధేయు రణంబునుం జూచెదవు గాక యనిన విని
దుర్యోధనుండు కర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితా
మహుతో ని ట్లనియె. 293

చ. ఎఱిఁగి యెఱింగియుండె మది నేది యెఱుంగక యుండె నెవ్వ నం
దఱు వినఁ బాండునందనులు దర్పితులై యని గెల్తు రందు ముం
దఱ నిను బాహ్లికుం గురునిఁ దక్కటివారిని నమ్మి యేను నే
డ్తెఱ నని చేయఁ బూనితిఁ గడింది [3]మగంటిమి తోడు చాలదే. 294

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరు లేల సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యనర్గళవిక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయ మెల్ల నిట్టి [4]దవినీతియొ నీతియొ చూడుమీ [5]తుదిన్. 295

క. అనుపలుకులకు విషాదముఁ, దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు తననందను నే
మనియుం బలుకఁగ జాలక, [6]వెనుఁబాటున నిట్టు లనియె విదురునితోడన్. 296

తే. మృత్యుపాశోప[7]హతుఁ డయ్యె మీఁదు లేక
సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ
డకట నాశంబుఁ బొందువాఁ డయ్యె మనకు
నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ. 297

వ. అనిన విని విదురుం డతని కి ట్లను మనవారలు మున్న దుర్బలులు తమలోనం
బెనంకువ లయి విరసవచనంబు లాడుచు నింతలు పుట్టించుట యిది యర్జునునకుఁ
గార్యం బింతియకాక యే మనువారము వారలు బంధుమిత్రసహాయులుం
దారును నొక్క తలంపువారలయి యున్నవారు వలవని యూఁవెంగలిమాటలు

---

1. నిలిచి బల. 2. ధర్మతనయుతోడన్. 3. మగంటిమి యుల్ల సిల్లదే. 4. ద యనీతియొ.
5. తటిన్. 6. వినఁబాటున. 7. నిహతుఁ డై మీఁ దెఱుఁగక.

విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయం దగుపని
వేఱొండు కలుగునే యని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయు చెప్పిన కార్యవచ
నంబులకొంత వినంగలవాఁడై యతని దిక్కు మొగంబు చేసి. 298

క. మును వరుసతోడఁ దన[1]తలఁచినయన్నియు నీవు వినఁగఁ జెప్పి తగవుమై
నిను వీడుకొల్పునెడ నర్జునుఁడే మని నిశ్చయించెఁ జూతము చెప్పుమా. 299

క. అని యడిగిన సంజయుఁ డిట్లను[2]ఁ దుదిఁ బార్థుండు నిశ్చయము చేసి సుయో
ధనుతో[3]నిందలిపెద్దలు, వినఁగా నను మన్నపలుకు వినుము నరేంద్రా. 300

మ. కురువంశోత్తముఁ డైనధర్మజుఁడు నాకుం దండ్రిపాలీఁ దగున్
ధరలో సామని తాన పల్క వినియున్ దర్పంబుమై నీక త
క్కిరయేనిం [4]జటులాస్త్రదీయవిశిఖాగ్నిజ్వాలలం దాహుతుల్
వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి [5]నైశ్వర్యం బవార్యంబుగన్. 301

వ. అని పలికి కౌఁగిలించుకొని భూషణాంబరాదికమనీయవస్తువు లొసంగిన నేనునుం
బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు
నెఱింగింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడ
చెవులం బెట్టె ధృతరాష్ట్రుండును ఱెచ్చువడి యూర కుండె నప్పు డయ్యిరువుర
పాలను సంజయుం డొక్కరుండు తక్క నయ్యాస్థానంబున నున్న సమస్తజనంబు
లును దిగ్గన లేచి తమ తమ నివాసంబులకుం బోయిరి తదనంతరంబ. 302

క. తనుజవశవర్తి యగునమ్మనుజేంద్రుఁడు తనసుతుండు మర్దింపఁగ నో
పునొ యనిఁ బాండుతనూజుల, ననుమతి [6]సంజయునితోడ నాడె దురాశన్. 303

సీ. ఈరెండు [7]వీళులతారతమ్యంబులు, నెఱుఁగుదు పోరైన నెవ్వరోర్తు
రిది నిశ్చయింతమే యొందు నుపాయంబుఁ, బౌరుషంబును గలవారు కలరు
చూతము చెప్పు మన్న సూతనందనుఁడు నన్నడిగెద వే నొంటి యడుగవలదు
మీయయ్య సాత్యవతేయుఁ [8]డీయెడకు వేంచేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు
తే. [9]పిలువఁ బంపు గాంధారి వారలు వినీతి, రతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞచిత్తు
లుల్లమున నీకసూయాదు లొదవనేని, [10]వ్రాని మాన్పంగ నేర్తురు మానవేంద్ర.

### కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట

వ. అనిన విని యంబికానందనుం డట్ల కాక యని యొకకంచుకిం బిలిచి వానిం బుచ్చి
గాంధారి రావించి [11]సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమహామునిం దలం
చిన దివ్యబోధమహనీయుం డైనయామహాత్ముండు విజయం చేయుటయు నందఱు

---

1. వలచిన. 2. మదిఁ. 3. నందఱు పెద్దలు. 4. జటులాస్త్రశస్త్రవిశిఖా. 5. నైశ్వర్యంబుతోఁ గూడఁగాన్. 6. సంజయున కిట్టు లనియె దురాశన్. 7. వీళ్లుల; వీడుల. 8. డిందులకు వేఁ. 9. పిలువఁ బంపుము గాంధారిఁ బ్రియముతోడ, నిశ్చయింతురు ధర్మవి (సు) నీతు లగుచు, నుల్లమున. 10. వాని మాన్పం; దాని మాన్పం. 11. భక్తి.

దండప్రణామంబులు చేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం
బూజించి యున్న సమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు చేయకమున్న
యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయుల చిత్తవృత్తులు తాన యెఱింగినవాఁ
డగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కి ట్లనియె. 30్

క. నీవు సమస్తము నెఱుఁగుదు, కావున [1]నీకూర కుండఁ గాఁ దగదు ధరి
త్రీవల్లభుఁ డడిగినపని, యీవిధ మని తెలియఁ బలుకు మేను వినంగన్. 306

వ. అనినఁ బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 307

క. ఆసేనకు నీసేనకు, వాసి యడిగెదీవు నన్ను వసుదేవసుతుం
డాసేనఁ గలఁడు తత్సము, నీసేనం జూపుమా నరేశ్వర నాకున్. 308

వ. వాసుదేవుం డెట్టివాఁ డని యడిగెదేనిం జెప్పెద. 309

చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు భంగముల్
బగయు లలాటలోచనుఁడు [2]పాపఁగఁ బేర్చిన యట్టిబాణు నొ
క్కగడియలోన గర్వ మడఁగం బఱిమార్చె సురేంద్రకల్పకం
బు గరములీలఁ దెచ్చె హరిభూరిపరాక్రమ మప్రసిద్ధమే. 310

ఆ. అధికదుష్కరంబు లైనకార్యంబులు, క్రీడవోలెఁ [3]జేయుఁ గేశవుండు
విను మతండు పార్థు నెనసి [4]యేకార్థుఁ డై, యుండుఁ బూర్వభవసఖుండు కాన.

వ. అట్టి వాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వసమరసాధనం
బులయందును సూక్ష్మరూప [5]వ్యాపియై నిలిచి వారికి విజయం బొసంగుచుండు
నని చెప్పి మఱియు ని ట్లనియె. 312

క. పలుమఱుఁ [6]బాండుతనూజుల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బది యేఁ
దెలియం బలికెద వారికి, బలమును సత్వంబు హరియ పార్థివముఖ్యా. 313

వ. హరి మహత్త్వంబు విన్నవించెద నవధరింపుము. 314

క. ఒకతల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల యైనన్
సకలము నసార మాతం, డొకరుని సారంబ చాల నుత్కృష్ట మగున్. 315

క. తలఁపునన వాసుదేవుఁడు, కలిగింపను నిలుప నడఁపఁ గా నోపు జగం
బుల మఱియును గ్రీడార్థము, పలు [7]పోకలఁ బుచ్చుచుండుఁ బౌరవనాథా. 316

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పరఁగు నెక్కడఁ గలుగుం
జక్కటి నిలుచుం గృష్ణుం, డక్కడ నతఁ డున్నకడన యగు జయ మధిపా. 317

సీ. పురుషోత్తముం డెల్లభువనంబులును దాన, యఖిలభూతాత్మకుం డై విహార
లీల విచేష్టించు నీలోకముల మాయ, తొట్టి యొక్కొక్కమరి పుట్టి పెరిఁగి
కర్మానుచరణముల్ గైకొని వర్తించు, శిష్టరక్షణమును దుష్టనిగ్ర

---

1. నీ వూరకుండఁగాఁ జనదు. 2. ప్రాపుగ నేర్చిన. 3. జేసెఁ గేశవుండు. 4. యేకాత్ముఁ డై.
5. వ్యాప్తియై. 6. కుంతీపుత్త్రుల. 7. పోకలఁ బోవుచుండుఁ.

హంబును దనపను లగుటఁ బాండవుల నెపం బిడుకొని ధర్మబాహ్యు లైన

తే. సీతనూజుల [1]నిక్కమ నిగ్రహింపఁ, దలఁచినాఁ డమ్మహాత్ముండు [2]తథ్య మతని
నిట్టిచందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ, రాశ్రయింతురు బ్రదుకుదు రట్టివారు.

క. అనవుడు [3]ధృతరాష్ట్రుఁడు వి,ష్ణుని నే నెఱుఁగనివిధంబునుం దెలియఁగ నీ
కని యున్న తెఱఁగుఁ జెప్పుమ,యనుటయు [4]సూతసుతుఁ డిట్టులను నాతనితోన్.

వ. విద్యయు నవిద్యయు ననఁగా రెండు గల వవిద్యాదూషితుండై తమోగ్రస్తుం డైనవాఁడు విష్ణు నెఱుంగఁడు విద్యాసంపన్నుం డెఱుంగు ననిన విద్య యను నది యెట్టిది యెద్దాన నీవాసర్వేశ్వరు నెఱింగితి దాని నవిద్య యెట్టిది దానిని జెప్పు మనుటయు నాంబికేయునకు సంజయుం డి ట్లనియె సాత్త్వికరాజసతామస వికారంబులత్రిప్పులం బడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదు దీన నే నచ్యుతు నెఱుంగుదు విద్య యిట్టిది నీకునుం దక్కొవ్వరికైనను నతని నెఱుంగుటకు నిదియ తెరు విట్టిది కానివిధం బవిద్య యని చెప్పిన నతండు నిజనందనున కి ట్లనియె. 320

క. మన కాప్తుఁడు సంజయుఁ డీ,తనియుపదేశంబు వట్టి ధర్మమున ముకుం
దుని [5]నాశ్రయింప వయ్య య,తనిఁ జొచ్చిన బ్రదుకు దీవుఁ దమ్ములుసుతులున్.

చ. అనిన సుయోధనుండు తమయయ్యకు ని ట్లను నిజ్జగంబు ల
న్నిని నొకపెట్ట మ్రింగినను నెట్టన సర్వముఁ [6]గాచె నేనియు
న్వినుము ముకుందుఁ [7]డర్జునుని నెచ్చెలి నాఁ జెవులార వించు నిం
క నతని నొక్క [8]బామునకుఁ గా ధృతిపెం పఱ నాశ్రయింతునే. 322

తే. అనిన గాంధారి కి ట్లను జనవిభుండు, సీతనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ
డుద్ధతుం డీసు[9]మాని నాబుద్ధి వినఁడు, వీఁడు చెడుఁగాని బ్రదుకంగ లేఁడుసుమ్ము.

ఉ. నావుడుఁ దల్లి యిట్టు లను నందనుతో నిది యేల యాయువుల్
శ్రీవిభవంబులున్ మము నశేషసుహృజ్జనులం దొఱంగఁగా
నీవు కడంగె దిట్టియవినీతులునుం గలరే వృకోదరుం
డై విధి చంపఁగా నొరుల కాఁగఁగ వచ్చునె యింకఁ బుత్త్రకా. 324

వ. అనియె నట్టియెడం గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రున కి ట్లనుఁ గృష్ణుండు నీకుం గూర్పు నీవుం బరమాప్తుం డైనసంజయు నతనిపాలికిం బుచ్చి తది లెస్స కార్యంబయ్యె వీఁడును నిమ్మహానుభావు మహనీయప్రభావం బున్న రూపెఱుంగు వీనిబుద్ధి విని యద్దేవు నాశ్రయింపు మతం డేకాగ్రచిత్తు లై యారాధించిన

---

1. నొక్కమై. 2. తథ్య మరయ. 3. ధృతరాష్ట్రుం డి, ట్లను; గృష్ణుని నే నెఱుంగ నగువిధమున నీ; విష్ణుని నెఱుఁగువిధంబు తెలియకున్నది తెలియం, గనియెడు తెఱంగు చెపుమా. 4. సంజయుఁడు నిట్టు లను. 5. ప్రీతి నాశ్రయింపు మ,తనిఁ బొందిన. 6. గ్రాచె నేనియున్; గ్రాఁగె నేనియున్. 7. డర్జునుని నెంచఁగ నాఁ జెవులార. 8. జామునకుఁగా. 9. మానఁడుబుద్ధి.

వారికిఁ జేరువ యగుఁ గామక్రోధోపహతులై తమతమధనంబులం దృప్తులు కాక
యన్యాయంబున వర్తించువారలకు దూరం బై యుండు నెల్లభంగుల నాతనిం
జొచ్చి బ్రదుకు మనినం బ్రసాదం బట్ల చేయుదు నని విచిత్రవీర్యనందనుండు
సూతనందనునితో నవ్వాసుదేవునామనిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి
యతనిం బొందునుపాయం బుపదేశింపవే యని యడిగిన. 325

తే. ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు టండ్రు వాసు
దేవుఁ డనుపేరి కర్థంబు తెల్ల మింత
యెఱుఁగుజనులందుఁ దగ వసియించు శుభము. 326

తే. అతనిఁ బొందునుపాయంబు నంతరంగ,నిగ్రహము కాఁగ నార్యు లనుగ్రహింతు
రోపి చిత్తవికారంబు లుడిపి యేక,బుద్ధిఁ గొలువఁ బ్రసన్నతఁ బొందు నతఁడు.

వ. నీవును బలుబుద్ధు లుడిగి గోవిందు నాశ్రయింపు మనినం బ్రజ్ఞాచక్షుం డిట్లనియె.

క. నాకు నయనేంద్రియము గతి, లే కుండుట [1]కంతవగపు లే దఖిలమనో
జ్ఞాకారుఁ డైనహరి నా,లోకింపం గానమికిఁ గలుగు వగ పెపుడున్. 329

ఉ. ఆతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండువా
రేతప మాచరించిరో యుపేంద్రుని [2]నాశ్రితవత్సలున్ విని
ర్ధూతకలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోకవి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్. 330

వ. అని పలికి పరమశాంతుం డై పారాశర్యు నుద్దేశించి దేవా యేను వాసుదేవుని
[3]శరణు చొచ్చి బ్రదుకువాఁడ ననుచుఁ గృతాంజలి యగుటయు వ్యాసమహా
మునియు నాశీర్వాదంబు చేసి యంతర్హితుం డయ్యెఁ గౌరవేశ్వరుండును దుర్యో
ధనసంజయుల నిజనివాసంబులకుం బోవం బనిచి తానును గాంధారియు నభ్యం
తరమందిరంబున కరిగి యుచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచు నుండె నని చెప్పిన
విని పదంపడి పుట్టినవిశేషంబు లెట్టి వని యడిగిన. 331

శా. నిత్యానిత్యవివేకవైభవసమున్నిద్రాంతరంగస్ఫుట
ప్రత్యక్షా పరమేశ [4]విశ్వజగదారాధ్యా [5]మహానంతచి
త్సత్యానందవిభుస్వభావమహితా [6]సంవిత్సమాధానదా
[7]ర్గత్యవ్యాహతిసం[8]ప్రవర్తనవిదగ్ధశ్రీపదాంభోరుహా. 332

క. వ్యాసాదిమునిప్రోక్తమ,హాసందర్భాప్రమేయతాగూఢగుణో
ల్లాసా నైర్గుణ్యసము, ద్భాసిరహస్యానుభావ భక్తాధీనా. 333

---

1. వతినివగపు. 2. సంశ్రితవత్సలున్. 3. మఱువు. 4. సర్వజగదా. 5. మహానందచి, త్సత్యానంత. 6. సంపత్సమా. 7. ర్గత్యావ్యా. 8. ప్రవర్ధన.

**మాలిని.—**

నమదనిమిషచూడానవ్యరత్నప్రభాసం
గమరుచిరపదాబ్జా గర్వదుర్వారదైత్యో
ద్యమబహులతమోమార్తాండదోఃక్రీడనప్ర
క్రమ [1]లలితవికాసా గాఢభక్తిప్రకాశా. 334

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందు ద్వితీయాశ్వాసము.

1. వివిధవిలాసా.

శ్రీ రస్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము—తృతీయాశ్వాసము

[1]వాగ్విభవారోగ్య
ప్రావీణ్యప్రాభవానుభావమహితస్వా
ఖ్యావహపాదస్మరణ కరు
ణావాసకటాక్షకిరణ హరిహరనాథా. 1

### శ్రీకృష్ణనిరాయబారము

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 2

తే. సంజయుఁడు తన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు తమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను వీరలను బిలువఁ బనిచి
యెల్లవారును విను చుండ నిట్టు లనియె. 3

క. మనము జనార్దనుపాలికిఁ, జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు బంధుహితగురు, జనములతో రణము కాక [2]సంప్రీతి యగున్. 4

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యతనిచేత సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివేష్టింప నొక్కపార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ నతండునుం [3]దానును సుఖాసీనుం డై యుండి యతనితో ని ట్లనియె 5

క. ఆపదఁ [4]గడవం బుట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుండు [5]నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 6

తే. సమయ మిది [6]మిత్రకార్యంబు చక్కఁ జేయ, నీకతంబున నే మవినీతుఁ డైన
యాసుయోధనుతోడిపోరాట దక్కి, యనుభవింతుము మాయంశమగుధరిత్రి.

వ. నీకు మేము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము మమ్ము దురితంబులు పొర

---

1. విభవారోగ్యశుభ. 2. సమ్మతి గలుగున్. 3. దారును సుఖాసీను లై. 4. గడువం. 5. మిమ్ముఁ జూపి. 6. మంత్రి కార్యంబు.

యకుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీపంచినయట్ల చేయం గలవాఁడ
నెయ్యది తలంపు చెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవుల
తోడం దగినమాట లాడి తెలుంగు చేయ వలయు నని ప్రార్థించి యతని నియ్య
కొలిపి యి ట్లనియె. 8

సీ. మాతండ్రి తలఁపును నాతనినందను,చందంబు నిన్న యాసంజయుండు
పలికినపలుకులఁ దెలిసెఁగదా నీకు, వారిచిత్తముభంగి వాఁ డెలుంగుఁ
బాలు పం పని యాక [1]యేలిమాటలన మ, మ్మలుక దీర్చెదను తా రధికదుష్క
రం బైనయాసమయం బేము పదుమూఁడు,వత్సరంబులు సల్పి వచ్చి యుండఁ
ఆ. గులముపాడి నడపఁ దలఁపఁడ పతి చెడఁ, దలఁచెనేనిఁ గొడుకు వలచినట్టి
వాఁడు కాన యతనివక్రత మాన్ప లేఁ, డింతకంటెఁ గలదె యెడరు మాకు. 9

క. జననియు సమస్తబాంధవ,జనములుఁ బ్రియ మంద వారి శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటిగ్గై, మనసుం దెలఁ గేది యునికి మాపౌరుషమే. 10

క. ఇచ్చుటిబంధులు నీవును, [2]నచ్చెరువడి వినుచు నుండ నయిదూళులు మా
[3]కిచ్చినను జాలు నంటిని, బొచ్చెము గా దింతవట్టు పూర్ణము సుమ్మీ. 11

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జేయం జాలఁడో [4]కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు సిరి నా కే లందునే గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నాయరయునీచుట్టాలకుం గావునన్
మోదం బందుట కల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్. 12

ఉ. అక్కట లాఁతు లైనఁ బగ తైనను జఁపన కోర నేల యొం
డొక్క తెలుంగు లేదె యది యొప్పదె బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు గణుతింపక సంపదకై వధించి దూ
[5]ఱెక్కుట దోష [6]మందుటనునీదురవస్థల కోర్వ వచ్చునే. 13

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 14

ఆ. క్షత్రధర్మ మింత కష్ట మగునె పెఱ,ధర్మ మాచరింపఁ దగ దటండ్రు
కాన శస్త్రజీవికయ తగి యున్నది, యైన వంశనాశ [7]మనభిమతము. 15

వ. అదియునుం గాక. 16

ఆ. కలహ మగుట లక్ష్మిఁ [8]గావించుఁ బ్రాణహా,నియును జేయు నింత నిక్కవంబు
పలువు రొకని కోడి పాఱుట బల్లిదు, లనవ చేతఁ జెడుటయును ఘటించు. 17

క. జయ మగునోడుదు మనుని,శ్చయ మొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హ్యా,దయపుట భేదనము చేయుఁ దథ్యం బనఘా. 18

---

1. మేలిమాటలన మ మ్మలుకలు దీర్చెద రధికదుష్క. 2. నచ్చెరువడి చూచుచుండ.
3. కిచ్చుటయె చాలు నను టది; జాలు ననుటది. 4. కాక. 5. ఱెక్కుడు. 6. మొందు నను.
7. మనభిమతము; మభిమతంబె. 8. గారించుఁ.

క. కాన సపత్న్యముఁ బెనఁకువ, [1]కానియుపాయమునఁ బగఱఁ గడతేర్చుధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం,[2]దానం జెయి నెట్టికొని యతఁడు నిద్రించున్. 19

ఆ. పగయ కలిగనేనిఁ బా మున్న యింటిలో, నున్న యట్ల కాక యూఱడిల్లి
యుండునెట్లు చిత్త [3]మొకమాటు కావున, వలవ దధికదీర్ఘవైరవృత్తి. 20

చ. పగ యడఁగించు టెంతయు శుభం బది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొద లెత్తి పోవఁ బగఁ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి [4]లేమి ధ్రువంబు కేశవా. 21

ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము తా నది యట్టు లుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము కామియుఁ గోరెద మెల్లసొమ్ములుం
బోవుటయుం గులక్షయము పుట్టుటయుఁ దెలిగాఁగ నొందుమై
నేవిధి నైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా. 22

చ. మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గు నట్టిచొ
ప్పున విదురాదిసజ్జనులబుద్ధికి తా నుచితంబుతోడిమె
ల్పునఁ [5]బరుసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. 23

చ. [6]తగవునఁ బోక రాజు బెడిగంబులు పల్కినయేని సైఁచి యొ
ప్పుగ నిలుమీ గురుత్వముఁ బ్రభుత్వమునుం గలపెద్దవారిమా
ట గొనమి యాసుయోధనుకడన్ నిలువన్ మన [7]మెల్లగారవం
బుగఁ [8]గురువృద్ధపల్కుఁ దలఁపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్. 24

మ. సుతువాఁడై వినయంబు చేకొనక యేచొప్పుం దగం [9]జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను [10]సంధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు తెంపు సేయునెడ లోకం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబు గాఁ జేయుమీ. 25

ఆ. ఇన్నిసంకటముల నిబ్బంగి నెంతయు, నొగులుచిత్తవృత్తినొప్పు దీర్ప
వెజ్జ వీవ కావె వేయేల యేగతి, నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. 26

వ. అని చెప్పి తలంచికొని వెండియు ని ట్లనియె. 27

క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్కబుద్ధి పొడమెడున్
గోవింద యతఁడు మంత్రులుఁ, [11]గావరములు చక్క వినరు కార్యవచనముల్.

తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్ము, లట్టినీచులకడకు ని న్ననుపఁ జాల

---

1. కానియుపాయంబునం బగఱఁ దీర్చు. 2. దానం జే యొడ్డుకొని యతఁడు. 3. మొక విధమైతోఁచు. 4. లేదు. 5. బరుసంబు మాని పెఱ. 6. తగవులఁ. 7. మెల్ల గౌరవం. 8. గుల వృద్ధ. 9. జేయకా. 10. సిద్ధింపంగ; సంధిల్లంగ. 11. గావలములు నవక.

నీవు సంకట[1]పడియెదు దేవపవవి, యైన నే [2]నొల్ల నొంటి యం దరుగు టుడుగు.

చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల [3]నీపలుకు తథ్యము నీతలఁపే నెఱింగితి
న్మనమున శంక దక్కుము వినఁగ వలతే విను మేను నిక్క మ
ల్గిన నచటం గలండె రణకేళికి మాఱ్కొన నొక్కఁ డేనియున్. 30

క. పనుపుము కౌరవసభ కేఁ, జను జెట్లుచు మేల యర్థసంసిద్ధి యగుఁగ
మన కొకటం బాపము రా, కునికికిఁ గత మైనపలుకు లొండెను గలుగున్. 31

వ. అని పలికిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 32

ఆ. మేలు కాక నీకుఁ బోలిన ట్లయిన నం, దరిగి యేము వారు నర్థిఁ బొంది
[4]యుండునట్లుఁ గాఁగ నొడఁబాటుఁ గావింపు, మెల్ల భంగి [5]మనకు నిదియ లెస్స.

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మియెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు, పామ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు చెప్పన్. 33

కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్నయంబు చెప్పుట

సీ. అనిన ముకుందుఁ డి ట్లనియె సంజయునిమాటలును నీ వన్నపల్కులును వింటి
నీమది ధర్మైకనిష్ఠమై నున్నది, వైరంబు విడువరు వారు ద్రోణ
భీష్ములు కల రని బిరుదు లై యున్నవా, రగునె రాజన్యుల కడఁగి కుడువ
నక్లేశవృత్తి రాజ్యముచవి గొన్నవా, రేల [6]యిత్తురు నీకుఁ బాలు చెపుము

తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు [7]దైన్యంబు పొడువు
కయ్య మరివర్గజయమునఁ గలుగు నిహప
రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ. 35

మ. గురుభీష్మాదులు చూచు చుండ సభ మీకుం గీడు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి యంత చేసియును బశ్చాత్తాపముం బొంద నో
పరు వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయుం బంధుత్వముం దక్క మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగర్వక్రౌర్యముల్ చూచినన్. 36

వ. కపటపునెత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధనదుశ్శాసన
శకునిసూతనందనులు పుయిలోట దక్కి కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గ
డింపవచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు
బలవంతుల రయి యుండియు సత్యంబు పాటించి యూరక పోక చూచి యచ్చెరు
వాటుతో నుమ్మలించు చుండిరి తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతు లై

1. పడి చేయుం దేవ. 2. నొల్ల నంటి నం దరుగఁ దగదు. 3. యీపలుకు. 4. యుండు విధము కాఁగ. 5. మాకు. 6. యిత్తురు మహిఁ బాలు చెపుమ. 7. దైన్యంబు చేయం.

మున్న చెడియుండుదురు కావున వారలం జెఱుపనుం జాలుకన క్రూరాత్ము లగు కౌరవు లెల్లవారికి వధ్యులుగా నగుదురు నీ కేల యవధ్యు లైరి పాపాత్మకు లగుహింసకులం బాముల నె ట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు. 37

క. మీ తండ్రికి భీష్మునకుం, జేతోముద మొదవ భక్తి చేయన తగు నీ
[1]కాతలకు నేనుఁ జని వి,ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 38

క. చెలులుం జుట్టులు దేశం,బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్. 39

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలినమాటలాడుటయుఁ దండ్రి యతని వారింపనేరమికిం దోడుపేడకుం డగుటయుఁ జూచి మీతొల్లింటి పాట్లునుం దలంచి యెల్లవారును వారిన గర్హింతు రింతియ కాక మనకు నొండేమి వలయు నాయోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద నవ్విధంబు [2]సిద్ధించిన మేలు కాదేని యట్లు గాక తక్కిన నచ్చోటి యుత్సాహంబు చందంబును నందుఁ జేయం గలవారి వర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయం బగువిధంబునం జనుదెంచెద. 40

తే. ఆసుయోధనుముక్కున నాలి కలుగఁ, బుడమి నీ కీను కావునఁ [3]బోర కలుగు
నేను గయ్యపుశకునంబు లెన్నియేనిఁ, గంటి నీ వనుత్సాహివి [4]కాఁగ వలదు. 41

వ. చతురంగబలంబుల నాయితంబు కావించుచు దొరలం బిలిచికొల్చికొనుచు నాలస్యంబు లేక సమరంబునకు సన్నాహంబు చేయుచుండ వలయు నని పలికిన విని వృకోదరుండు దామోదరున కిట్లనియె. 42

క. సమరంబు కలుగు ననుచును, మము [5]వెఱపింపంగ వలదు మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు, శమించు కార్యంబు నడపు సౌజన్యమునన్. 43

వ. అని వెండియు. 44

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీపం పెట్లునుం జేయఁగా
నోపం డడ్డము చెప్ప రెవ్వరును మానోద్రేకముం గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప [6]నాప్తజనులం గుందించుటం బోయిన
ట్లే పో నిత్తురు కాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ. 45

ఉ. చొచ్చిన [7]చోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు చుండు న
న్నెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశము చేటున [8]కోప కుండుటన్. 46

ఉ. పాండవకౌరవుల్ కలసి పాలును నీరును బోలె నెమ్మిమై
నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డో

---

1. కాతలఁపున కేఁ జని వి. 2. సిద్ధించెద యేని. 3. బోట కలుగు. 4. గాఁగఁ దగదు. 5. వెఱపింపంగ నేల. 6. నాత్మజనులం. 7. తోన చొచ్చి. 8. కోర్వ కుండుటన్.

క్కండ కులక్షయంబునకుఁ గారణ [1]మం ద్రది తప్పు దైన నీ
వొం డన నేల యాబిపదు నోపినయంతయుఁ [2]దీర్పు నేర్పునన్. 47

చ. తన[3]పొరిపోవునంతకు సుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశోభరితం బగుభారతాన్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు నా
యన మెయిఁ బోయి హీనగతి నైన ఘటించిన[4]నెంత యొప్పునో. 48

వ. మాకును వారికిఁ బితామహుం డగు భీష్ముండు వినుచుండ సుయోధనుతోడం
గురుకులేశ్వరుసాన్నిధ్యానంబున నావచనంబులుగా ని ట్లనుము. 49

తే. అన్నదమ్ములమై యుండి యకట [5]మనల
నొరులు తలయెత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి నీ నేల పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట [6]పోలవొక్కొ. 50

క. అని యెవ్విధమున నైనను, వనజోదర సంధి చేయ వలయుం దగ నే
మును వారును గలయుట భూ, జనులకు నెల్లను హితంబు సౌఖ్యకరంబున్. 51

చ. అనుటయుఁ బిన్న నవ్వు నగి యంబుజనాభుఁడు పల్కె నెన్నఁడున్
వినని వి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట లగ్గి చ
ల్ల నగుట భూరిభూధరము లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట యిం కిటఁ జెప్ప నేటికిన్. 52

శ్రీకృష్ణుఁడు భీమసేనుని గౌరవులతోడి యుద్ధమునకుఁ బురికొలుటు

తే. అని సహోదరు లాజి నాయాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును
గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డై నపవనజుఁ బురికొల్ప నాత్మఁ దలంచి. 53

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె. 54

ఉ. యుద్ధమువిూఁది వేడ్కయు మహోగ్రవిరోధుల [7]నల్కఁ జేయుద
ర్పోద్ధతియున్ సుయోధనునియున్నతి నైపుని యేపు రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు పల్కుట యొప్పునె కీచకాంతకా. 55

వ. అని యంత నిలువక. 56

క. వెఱ సెట్టితివియో యెన్నఁడు, నెఱుఁగనినీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ, గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్. 57

వ. దానికి దరహాసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కి ట్లనియె. 58

---

1. మం దది. 2. దేర్పు నేర్పునన్. 3. పొలిపోవు. 4. యంత యొప్పునే. 5. మనకు
6. పోల దొండు. 7. యుల్కఁ జేయు.

ఉ. బంటుతనంబు మాటలకుఁ బొఱకు పాండునృపాలుపాలు గై
కొంటయ చాలు నన్ను నృపకుంజరుపల్కులకడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును సుయోధనుచందముఁ జూపి యప్పు డే
మంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 59

క. నాకోలఁది విచారింపక, నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మెః
గాక తిరుగంగఁ బడినం, బోకే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్. 60

ఉ. నావుడు నవ్వ్వటాల కనినం బవనాత్మజ యింత యేఁటికిం
గేవల యోధవే పరులకిల్బిషముల్ తలపోయ కిమ్మెయిన్
జావడ మైనఁ జూచి యిది చందము గా దని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును [1]చేసినభంగులు నే నెఱుంగనే. 61

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 62

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యొంతయుం
బ్రార్థన చేసె దాని కనురాగము పొందితి నేను గాన యు
ద్ధార్థుల మైనమాకు నిను నాసపడం దగదే యశంబు నా
నార్థములున్ విరోధి[2]విజయంబునఁ దక్కఁగ నొంటఁ గల్గునే. 63

వ. అనవుడు. 64

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగ లై యీవచ్చుకౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్దమి ట్టెక్కి మి
మ్మే మెల్లన్ వెఱఁగంది చూచెదము గా [3]కీసారెకుం బోయి రా
[4]భీముం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెంపఱన్. 65

వ. అని పలికి యివ్వినంబున గోపాలదేవు మేలంపు మెయివడి కార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయు కా మఱుమాట లాడి యంతటఁ దని వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె. 66

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగ[5]పంక్తులు ధరంబడఁ దేరిగముల్ బడల్పడన్
డయ్యమి కివు వెక్కసపడన్ గదపండువు చేయఁ గోరునా
దయ్యమునెత్తికోలు [6]తుది దాఁకుట కాదె భుజంగభంజనా. 67

చ. అన విని దేవకీతనయుఁ డాతని కి ట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు కడిందిమగండవు నిన్నుఁ [7]దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయ మొందక దుఃఖవార్ధు లీఁ
దినము నెల్ల నిక్కొఱఁత దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ. 68

---

1. చేసినచందము లే మెఱుంగమే. 2. వినయంబునఁ దక్క నొకంట. 3. కీసారికిం. 4. భీముం డింతటి. 5. సంఘములు వ్రాలఁగఁ. 6. దుద దాఁకుట. 7. దేపగాఁ.

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁ బలికి సంధి పాటించెద నా
కది యొప్పదె [1]కాని తుదిం, గుదు రింతెకు నీవ కావె గుణరత్ననిధీ 79

అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు చెప్పుట

వ. అనిన వాసుదేవున కర్జునుం డిట్లనియె. 70

తే. చెప్పఁ గలయంతవట్టును [2]జెప్పె నీకు, నజాతశత్రుండు వింటి వీ వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు, కలవె యైనను జెప్పెదఁ గన్నయంత.

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంచున్ మున్న కై పెక్కిన
ట్టితలం బచ్యుత నీకుఁ గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాపరాదో కదే. 72

ఉ. నీ వొనరింపఁ [3]బూనినపనిం గమలోదర కీడు పుట్టునే
కా వనినట్ల యుండి యవుఁ గార్యము లట్లగుటం బ్రయత్న సం
[4]భావన సేఁత పౌరుషముపద్ధతి తత్ఫలసిద్ధి పొందు చో
దైవము తోడ్పడన్ వలయుఁ దథ్యము రెండును నీవినోదముల్. 73

ఉ. [5]వేరిమి ధర్మజుం బరిభవించినద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజనవత్సల నీ విటు లంటి వారు మ
మ్మారస మెత్తి కీడ్పఱిచి యింతలు చేసినదాస నీమదిం
గూరిననొవ్వసొంపునను గోపము పెంపునఁ గాదె యారయన్. 74

ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లు చేసినన్
దానికి నైఁప లెస్స యని దైన్యముఁ [6]బొందుట కోర్చి యమ్మెయిం
గాననభూమికిం జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ [7]గూర్పు నేర్పునన్. 75

తే. అలవిఱుఁగక ధార్తరాష్ట్రులు కడంగి, మమ్ముఁ బఱచినపాటులు మానసమునఁ
జవులఁ బెట్టినవిత్తులచంద మొంది, యంకురింపక చెడి పోయె నంబుజాక్ష. 76

వ. అమ్మొఱకుల నెమ్మెయి నయినను. 77

క. ఒడఁబఱచి [8]మాకు వారికిఁ, బుడమిసగము కాఁగఁ జేసి పొంది పొసఁగి యుం
డెడునట్టితెఱఁగు చేయుట, కడు మే లది గౌరవము సుఖంబును జేయున్. 78

క. నీ కిట్టిది చిత్తమునకు, రాకుండిన నేని వలదు రం డిమ్మెయి మీ
రీకార్యము చేయుం డని, మా కానతి యిమ్ము కంసమర్దన తెలియన్. 79

మ. హిత మిబ్భం గిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నం చేను నీ

1. కా కున్నం. 2. జెప్ప నీ. 3. బోయినపనిం. 4. భావన శాంతి పౌరు. 5. వీరలు ధర్మజుం. 6. బొందుట సూచి. 7. గూర్పు పెంపునన్. 8. మాకు నిపుడీ, పుడమి సగము చేసి పొంది (సేసి యిచ్చి) పొసఁగి మనుచు. నుం 9. కున్నదియేని; కుండినయేని; కున్నను దీని.

మతి బోధింప వలంతి నే హితము ధర్మంబుఁ విచారించి చూ
చి తగం బొమ్మని యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు
న్నతిఁ బొందం గలవార మై యునికి [1]కృష్ణా నేఁడుగా వచ్చునే. 80

వ. అనిన విని కృష్ణుండు విజయున కిట్లనియె. 81

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మేలొనర్చినం
దొరకొనునే ఫలంబు [2]తఱితోఁ దగువర్షము లేకయున్న నె
ప్పరుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు నెల్ల నా
దరణమునం బ్రసన్న మగుదైవముచేతన చూవె ఫల్గునా. 82

ఉ. కావున సంధికిం బుపకార మొనర్చెద నోపినంతయుం
దైవముచేత నే ట్లగునొ దాని నెఱుంగ సుయోధనుండు సం
భావన సేసి పా లొసఁగు[3]పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే. 83

వ. అది యెల్ల నట్లుండె నిచ్చట విరాటుపసులఁ బెట్టింప నీవు పోయిన యప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 84

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు నెల్ల [4]విధంబుల కోర్చు టట్లు గా
కిచ్చఁ [5]దలంచి యొక్క మొయి నిత్తఱిఁ బొం దగు చేతయుం దగున్. 85

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 86

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు కలుగు నేను రాజ్య
భాగ మీను సమర [6]భంగిక విక్రమ, [7]నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 87

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ కాదె యామాటల ఫలం బప్పుడ కనియు నాకష్టాత్ముండు వెంపియుఁ దెలియండు. 88

తే. ఆతనిగుణదోషముల [8]చంద మట్లు యుండె, నాకు ధర్మజుబుద్ధిన నడప వలయు
నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట, నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు. 89

చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యి ట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట రిత్త కాదు మా
మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్న య
ద్దినములభంగి కాదు కృపఁ దీవ్రతఁ గుందినచంద మయ్యెడున్. 90

క. కడవఁగ నొకళ్లు పసరము, [9]నడిచిన నొక్కళులుఁ బెయ్య నడువ వలయునే

---

1. కృష్ణా మేలు (రెండు; యొండు) గావచ్చునే. 2. తఱి బొం దగు. 3. పాటియ. 4. విధంబుల మేల యట్లు. 5. దలంప నొక్క. 6. భంగికి. 7. నియతిఁ. 8. భంగి యట్లు లుండె. 9. నడచిన మఱియొకఁడు పెయ్య.

చెడుతెరు వాకౌరవ్యుల, కడ నిలుచుం గాక [1]మనకుఁ గార్యం బేలా. 91

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ,బడ కుండుదురె నాదు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన,బలము లేడక్షౌహిణులును దొరలుఁ
బాంచాలయాదవపాండ్య కేకయమాత్స్య, లొక తెంపు నెఱుఁగకయున్నవారె
భీమార్జునులలావు[2]పెంపును నీసహా,యంబును గలుగుట కలుక రెట్లు

ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి, చెప్పి వారిఁ జక్కఁ జేయ రెట్లు
కార్య మీవు చెప్పఁగా విదురుండు వి,నంగ నెట్లు కాదనంగ వచ్చు 92

వ. అట్లుం గాక నీవు తమ పాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింపకుండ వెలువరే
నీపోయిన యప్పుడ యీకార్యంబు చక్కనగు ననిన విని సహదేవుండు వాసు
దేవున కి ట్లనియె. 93

ఉ. రక్కసమాట లాడెదవు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి గైకొనఁ గాదనక యూఁకొను చుండుట యంతకంటె మే
[3]లక్కట యిట్లు వేఁడికొన నైనను బోయెదువో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా. 94

మ. తలఁపం గూడునె యింత లేసిదొర లీదైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లోఁతిరాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం
గలదే వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డాధార్తరా
ష్ట్రులు పాలీక చలంబునం బెనఁగ నిట్లుం గూడు తీ పయ్యెనే. 95

ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం [4]బగ నాడి రేనియు
న్వారలు దాని కియ్యకొనినన్ వినుమచ్యుత యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే యుచిత మైనది కయ్యమ వంకమాట లే
నేరఁ గురుప్రవీరసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. 96

మ. తుది [5]రాజ్యమ్ముసగమ్ము గొమ్మడవియందుం బేసు వంచించియుం
బదమూఁడేఁడులు నీ వనం దిరిగి రాఁ బాలీక పోవచ్చునే
యది గాదేఁ దెగి బంట వై యులుము [6]మాయల్ వన్ను నేర్పింకఁ జె
ల్లదు సూ నీ కని యాసుయోధనుని [7]యుల్లం బుచ్చి పో నాడుమీ. 97

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁడై యితఁడు లెస్సె న్న యుండఁ బల్కెం బ్రయో
జనముం గల్గదు గౌరవంబుఁ జెడు దుశ్చారిత్రకుం డాసుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసోత్సాహంబుమై నున్నవీ

---

1. మాకుఁ గార్యం. 2. పెంపున కవుసహాయంబు. 3. అక్కడయిట్లు వేఁడికొని యైనను. 4. దగనాడి రన్నియున్. 5. రాజ్యంబును గొంచుఁ దేరడవు లందుం జేరఁగన్ బంచియున్, బదిమూఁడేఁడులు నిండె నంటి రిది (నీవనం దిరిగి) రాపాలీక పోవచ్చునే; నీవునుం దిరిగిరా పాలీకపో వచ్చునే. 6. మాయం జన్న నేఁ డింక. 7. యుల్లంబొల్లఁ బోఁ బల్కఁడీ.

రని కాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు మే లెమ్మెయిన్. 98

వ. అనిన విని రథికవరు లందఱు సహదేవుం డింత యొప్పు నాడునే సాత్యకి పలుకు లిట్లుండునే [1]తక్కటివి యెక్కుడుమాటలు పగవారి నడిగికొనం బోవుట యుచితం బఁట కయ్యంబు కర్జంబు కాదఁట భంగంబు నీఁగికొనం దగ దఁట యనునవి మొదలుగా ననేకు లనేకప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్కమ్రోఁతగాఁ జెలంగిన యెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 99

### ద్రౌపది కృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు చెప్పుట

తే. ధర్మనందనుపలుకులు తనకు హృదయతాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గద[2]కంఠి యగుచు.

ఉ. అంతలు [3]చేసి పో నడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టియాఱట మదిం బ్రియ మందె యుధిష్ఠిరుండు తా
నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి నాతఁడు నోఁచునె యన్నదమ్ములన్. 101

చ. తనమునుపడ్డ [4]బన్నములుఁ దమ్మునిపైఁ గఁటూర్మి పేర్మి నీ
జనపతి [5]సైఁప కున్నె యది సక్కన రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు కల్గిన నెఱుంగమి పెట్టరె చాలరైరి వీ
రనరొకొ నాన లేమి యని యాడరె లోకమువారు కేశవా. 102

శా. [6]పెం పేదం దమ కిట్టితక్కువలు రూపింపంగ నేలా విచా
రింపన్ వారిక మేలు సంధి *తము వారిం జూచినం దారు సా
ధింపం జాలరొ కాక పోరఁ దగ మర్దింపం దలంపేని శం
కింపం బట్టొకొ వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁ[7]గన్. 103

ఉ. [8]ఓట యొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁ గాక య
చ్చోటిన సంగరంబు లగుచొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా. 104

ఉ. ఏ నిటు లంటి నావలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు చూచి మనకార్యము మీసుజనత్వముం జెడం
గా నొకభంగి చేయక తగం గురువర్గముతోడిసంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేప్పు లేర్పడన్. 105

వ. అని మఱియు ని ట్లనియె. 106

---

1. తక్కిన యవి యేటిమాటలు. 2. కంఠ. 3. చేసె. 4. భంగములుఁ దమ్ములపైఁ. 5. సైఁప లెస్సయది. 6. పెం పేలా తమ కిట్టి. *తమ. 7. గాన్. 8. ఓటమి కింతయేనియు. 9. నసంగతంబు.

ఉ. ఆఁడుఁబోఁకయున్ ఫలము నందుటయుం గని పల్క నేరమిన్
మాఁటనోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు [1]ప్రేలెదన్ వినుఁడు కర్జము నెగ్గురు [2]గాన నల్కమై
వీఱిఁడి యైన[3]మానిసికి వెండి వివేకము కల్గ నేర్చునే. 107

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతిఁ జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్ సహజన్ముల [4]ప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. 108

వ. అట్లుంగాక 109

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు [5]నెయ్యము గారవముం దలిర్ప సం
భావన చేయు దిట్టనను [6]బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి యై పెను పొందినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగాఁ సభకు నీడ్చెఁ [7]గులాంగన లిట్లొనర్తురే. 110

ఉ. ఆసభ కేకవస్త్ర యగు నట్టిననుం గొని వచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై [8]తగుచేష్ట లేక నా
యాసలు [9]మాని చిత్రములయాకృతి [10]నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం బదియుం దలంపవే 111

చ. అరయమిఁ జేసి కోడ లన [11]కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని [12]కోటరంబు దగఁ జేయుదునో యటుఁ గాక [13]పాడిమై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా. 112

వ. అని య ట్లుగ్గడించి. 113

ఉ [14]ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెంద్రుకల్
దా [15]వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చుమహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు[16]విషాదరోషముల్
కావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్త యై. 114

వ. గోవిందుముందటం బెట్టి యి ట్లనియె. 115

క. ఇవి దుస్ససేనువ్రేళ్లం, దవిలి [17]సగము ద్రెవ్వి పోయి దక్కినయవి శౌ

---

1. సీరెదన్ వినుము. 2. గాన్పనల్క. 3. మానినికి. 4. ప్రోపు. 5. నెమ్మియుం. 6. బంకజనేత్ర. 7. గులాంగన లిట్టులోర్తురే. 8. తనుచేష్ట. 9. మాల. 10. నున్నెడ యో ముకుంద. 11. కప్పాడు గాసిగఁజేసి. 12. కోటరీకము చేయు; క్రోడీకంబుగఁజేయు. 13. పాటిమై, వర మిటు; వరవుట మోపి. 14. ఆవనజాయతేక్షణ రయంబునఁ గ్రొమ్ముడి వీడ్చి (గ్రన్ననవీడ్చి; గ్రమ్మఁగవీడ్చి). 15. వలచేతఁ బట్టి; బూన్చి. 16. విషాదవేదనల్. 17. సగము ద్రెస్సిపోయి.

[1]రవులకడఁ దీఱుమాటల, యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్. 116

సీ. ఈవెండ్రుకలు పట్టి యీడ్చినయాచేయి, తొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి [2]ధూళిఁబడియున్నఁ గని యెడు కాఱుఁగాక
[3]యలుపాలఁ బొనుపడునట్టిచిచ్చే యిది, పెనుగద వట్టినభీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ, మను[4]నొకవి ల్లెప్పుడును వహించు

ఆ. [5]కఱ్ఱివిక్రమంబుఁ గాల్పనే యిట్లు బన్నములు పడినధర్మనందనుండు
నేను రాజరాజుపీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయమైతి మేనిఁ గృష్ణ. 117

ఉ. నెట్టన యిట్టియల్కమది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును [6]గాలము దీనికి నాఱు నెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు కాచునట్టితోఁ
బుట్టువు [7]నీవుఁ దేజమునఁ బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా. 118

## శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు తుడువను బెన్నెఱివేణి ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో ని ట్లనియె. 119

ఉ. [8]మ్రుచ్చిర నేల నేఁ గలుగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడు కాఁగ జనవంద్యుఁడు [9]ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మే కొని చేసెదఁగాక వే ఱొకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు కౌరవు లుర్వి యిత్తురే. 120

క. లలనా యుడుగుము నీయే, డ్పులకొలఁదియె కురునృపాలపుత్రకళత్రం
బుల యేడ్పు లింక [10]వానిం, గలకల [11]నవ్వుచు వినంగఁ గాలం బయ్యెన్. 121

క. యమమహిషఘంటికానా, దము వినఁ గౌతూహలంబు దళుకొత్తెడుచి
త్తములు గలకౌరవుల కి, ష్టము లగునే సంధికార్య[12]శాంతవచనముల్. 122

క. మొదల విధినియతియును న, ట్టిద యందుకు పెద్ద లది ఘటింపక పో దే
మది జూచి చెప్పినను ద, ప్పదు మేరువు దిరిగెనేనిఁ బాంచాలసుతా. 123

తే. పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ, జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతు
లైనపాండుకుమారుల యధికవిభవ, మీవు చూచెదు తడవు లే దిది నిజంబు. 124

క. అని [13]యూఱడిలఁగఁ బలికిన, విని యంకిలి దేఱుచిత్తవృత్తి కలుగునం

---

1. రవులాలంబునఁ దీఱెడు, నవసరమునఁ దీర్పవలయు; దెలుపవలయు. 2. చూపఱి కందు ననియెడుకోఱుకుఁ గాక. 3. యలపోలఁ; పొలుపారఁ బోరిలో భుజశక్తితోఁ దనుబెను. 4. పేరివిల్లెప్పుడును. 5. కడిఁదివిక్రమంబు. 6. గాలము నాకిటులుండ నెన్నఁడుం. 7. తీవ్రతేజమునఁ బొల్చెఁ గడుం భయమంది యచ్యుతా. 8. ముచ్చర. 9. ధర్మసుతుండు గల్గ నీ. 10. వినుచున్. 11. నవ్వుచుఁ జెలంగఁ. 12. సాంత్వవచనముల్. 13. యూఱడించి పలి.

గన యే డ్పుడిగెం దగ ఫల్గునుఁ డీ ట్లని పలికె నపుడు గోవిందునితోన్. 125

తే. పాండవులు ధార్తరాష్ట్రులుఁ బుండరీకనేత్ర చుట్టఱికంబున నీకు నొక్క-
రూపకావునఁ [1]గోరి యేరూపునందు, నుభయపక్షంబులకుఁ జేయు[2]ముచితహితము.

క. ధర్మార్థసంగతంబుగ, ధర్మతనయుఁ జెప్పినట్లు తగఁ బల్కఁగ నా
దుర్మతులు కౌరవులు స్వ[3]త్కర్మమునకుఁ జొరక యున్న దైవమ యెఱుఁగున్.

క. అన విని కౌరవులకు మిక్కుచు హితముఁ బ్రియంబుఁ జేయఁ గోరియు కుంతీ
తనయాగ్రజుపని ధృతరాష్ట్రునికడకుం బోయెదను గడుం [4]బ్రీతిమెయిన్. 128

క. అని పలికిన హరిధర్మవచనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం
బునఁ బొంగి యట్ల చేయుము, మననిశ్చయ మిదియ దీని మఱవకు మనఘా. 129

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి నీనక్షత్రంబు రోహిణి గదా యెల్లి రేవతి నీకుఁ జంద్రతారాబలంబులు గలవు గమనంబునకు రేపకడయ మేలు పయనం బగుట లెస్స యని చెప్పిన నప్పలుకుల కతండు సగౌరవంబుగా నియ్యకొనినం బాండవాగ్రజుండు కొలువుం గలయం గనుంగొని యెల్లవారును విన [5]నది యట్ల కాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ బాంచాలియుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనిరి మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తి చేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణదానప్రముఖపూజావిశేషంబులం బ్రీతులం గావించి వారల యిచ్చునాశీర్వాదంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 130

క. మనప్రజలోఁ గరిపురికిం, జనుదేరఁగ వలయువారి సవరణతో రం
డని యేర్పడ [6]నియమింపు పయనమై యేతెమ్ము నీవు నని తగ మఱియున్. 131

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించు మానుసులునుం గుటిలబుద్ధులు కావునఁ జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింప వలయు నని చెప్పి పనిచి సమయజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన నతండును మణిగణప్రభాపటలజటిలం బగు నరదంబు పన్ని శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనం బరంగు తురంగంబులం బూన్చి [7]గరుడధ్వజం బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁ జందంబునఁ గట్టాయితం బై జనంబుల చూడ్కులకుం బండు వగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యంబులు చెలంగఁ జామరంబు లుల్లసిల్ల రథం బెక్కిన యవసరంబున యాదవపరివారంబుతో

---

1. బూని. 2. ముచితవిధము. 3. ధర్మమునకుఁ జొరక; బోరయకున్న. 4. బ్రియమొసఁగన్. 5. నిది యిట్లు కదా. 6. నియమించి; నియమింపుచు ననఘా యేతెమ్ము. 7. గరుడధ్వజంబు నిలిపి తెచ్చినఁ.

[1]నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని యాంగికంబు లైన శుభసూచ
కంబులు గైకొనుచుఁ బూర్ణకలశవృషభాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ
బుణ్యాంగనలు సేసలొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు. 132

సీ. పాండవ యాదవ పాంచాల కేకయ, పాండ్య మాత్స్యాదులు భద్రదంతి
[2]హయరథంబులతోడ నతికుతూహలమున, వచ్చినఁ గనుఁగొని వారినెల్ల
సంభావనంబుల సంభాషణంబుల, నాదరించుచుఁ దగ నల్ల నల్ల
విభవంబు మెఱయంగ విడిదలపఱి పెల్లఁ, గడచినయుత్తఱిఁ గరము శుభము

ఆ. లైనశకునములకు నందఱుఁ బ్రియ మంద, నరుగు చున్న యట్టియవసరమున
రథము రథముఁ గదియరా నిచ్చి [3]ధర్మనం,దనుఁడు నెమ్మి నిట్టు లనియె హరికి.

ఉ. వచ్చె జనార్దనుం డనినవార్తకుఁ బ్రాణము మేని కంతకుఁ
వచ్చిన సేదఁ దేఱుఁ గురువంశపవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చుటి కేఁగి పాండవుల [4]యందఱమా ఱని చెప్పి మ్రొక్కుచుఁ
[5]గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందినచిత్తమునొప్పి దీర్పుమీ. 134

చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు [6]వచ్చిన
ప్పుడు [7]తనమోము దైన్యమునఁ బొందెడునశ్రులుఁ జూచి చూచి య
ట్లొడఁబడి డించి పోవలసె నుమ్మలికమ్మున గొంతి [8]యింతకుం
బడుగయి పాలలోఁ బడినబల్లివిధంబున నుండ కుందునే. 135

క. లక్కయిలు కాలినది మొద, లక్కట మాతల్లి మాకు నై నెవ్వగతోఁ
బెక్కిడుములఁ బడు చున్నది, దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. 136

క. ఏ ననుట కాఁగ దుఃఖము, లైనవి తెగుసమయమయ్యె నని చెప్పుము మా
మేనత్త నూఱడింపుము, తా నెప్పుడు నీవు కలవు తన కను చుండున్. 137

వ. అని చెప్పి వెండియు. 138

ఆ. [9]గురుఁడు బాహ్లికాదికురువృద్ధులును సుహృ,ద్బాంధవులు నశేషధరణిపతులుఁ
బ్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా,మాదివిధుల నడపు [10]నాదుపలుకు. 139

క. పరమప్రియమున నాకై, పరిరంభణ సేసి గాఢబాంధవసాంద్రా
దరమున [11]సంభావింపు వి,దురుతో [12]మధ్యస్థుఁ డగుహితుం డతఁ డనఘా. 140

వ. అనియెఁ దదనంతరంబ యర్జునుండు. 141

చ. [13]జనులు వినంగ రాజ్యమున సాము కొనం గలవారమన్న యీ

---

1. బొడసూపిన. 2. తురగరథంబులతోఁ గూడఁగా వేగ వచ్చినఁ. 3. ధర్మజుఁ, డాదరమున నిట్టు. 4. యందలి(ఱి)సేమము చెప్పి. 5. గ్రుచ్చి కవుంగలించు. 6. వచ్చె. 7. తనమోముఁ గన్నులను జొప్పెడు. (బొడ్మెడు) నశ్రులు. 8. యెంతయుఁ, బడు గటు పాలలోఁ. 9. గురుఁడు భీష్ము డాది. 10. నాదుమారు; మాదరమున. 11. సంభాషింపు. 12. మధ్యస్థుఁడును హితుం. 13. ఘనులు వినంగ రాజ్యము సగంబుగొనం గలవార మైన నీ.

[1]జనపతి కార్యనిశ్చయము సమ్మతిఁ గైకొని చేసినన్ సుయో
ధనుఁడును దమ్ములున్ సఖులు దానికి నేమును నియ్యకొందు మొం
డనిన సపుత్రమిత్రముగ నద్దెస నందఱఁ గ్రొచ్చి పాఁతుదున్. 142

మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింతతెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ జేరెలుఁగు సొంపుం బొంద వక్త్రంబు పొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం బొంగారుసుద్బృంహిత
ధ్వని యై పొల్పుమహోగ్రసింధురముచందం బొంది యొప్పెం గడున్. 143

క. నకులసహదేవులును దా,నికి సంతస మంది యిట్లు నెయ్యము కయ్యం
బొకతెఱఁగు చేసికొని తడ,యక రమ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్. 144

### శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభాషించుట

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయు మాటలు చెప్పి యతనిఁ గౌఁగిలించికొని యథోచితప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి తక్కినవారలు నర్థంబు లగుతెఱంగుల నామంత్రితులై మరలిరి మాధవుండును బ్రయాణసర్వసంభారనిర్వాహకులం గలయం గనుంగొని తగిన సల్లాపంబులు చేసి కరినగరంబు పెందెరువుఁ గైకొని దారుకుని చతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంతసమీచీనం బైన యానంబున మనం బలరం జనిచని యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాదు లగు మహామునులం గొందఱం గని రథంబు డిగ్గి నమస్కరించి సద్భక్తితాత్పర్యంబునఁ గుశలం బడిగి మీ రిక్కడకు విజయం చేయుటకుఁ గతం బేమి చేయం గలపని యెయ్యది నా కానతిం డనిన నారాయణునకు నారదుం డి ట్లనియె. 145

సీ. అనఘ పుణ్యాత్ముఁడ వగునిన్నుఁ గనుఁగొనఁ, గౌరవసభ నీవు గారవమునఁ
బలికెడిపలుకులభంగు లాకర్ణింప, విదురభీష్మాదులు వినుతెఱంగు
నుత్తరం బిచ్చు కార్యోక్తులు నెఱుఁగంగ, వేడుక వచ్చిరి వీర లెల్ల
నని చెప్ప విని లెస్స యట్ల చేయుదురుగా, [2]కని హరి పల్కిన న్మునీంద్రు
తే. లతని దీవించి నీవు పో మ్మచటి కేము, నరుగుదెంచెద మని ప్రీతి ననుప నరిగి
యొక్కపుణ్యాశ్రమంబునయొద్ది యేట, విడిసి దివసప్రవర్తనవిధులు నడిపి. 146

వ. కమలనాభుండు కదలిపోయి సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థలంబు చేరం జనునప్పు డందలి విప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదెం డని పిలిచినం బ్రసన్నవదనుం డగుచు సమ్మర్దంబు వలవ దని పలికి విశాలరమణీయం బైన బహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారును దానును వారల గృహంబుల కరిగి యభ్యాగతపూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లు చుండె నంత నక్కడ. 147

---

1. జనపతివాక్యనిశ్చ. 2. కని పల్కినను విని యమ్ము.

తే. వార్త విని యాక్షణమ కౌరవక్షితీశ్వ
రుండు గాంగేయగురువిదురులను బుత్త్రు
సంజయునిఁ గర్ణు సైంధవు శకునిఁ బిలువఁ
[1]బనిచి తా నిట్టు లనియె నందనునితోడ. 148

వ. కృష్ణుఁడు పాండవ [2]కార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు నేఁడు కుశస్థలంబున విడిసె రే పిందు వచ్చు నని వింటి మిట్టి యాశ్చర్యంబునుం గలదే సర్వలోకాభిగమ్యుం డగు నమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి మన కింతకంటెను బెం పెయ్యది యతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట తప్ప దతనికి వలయు పూజ లాచరించుటకు సంవిధానంబు చేయుము గృహాలంకరణాది మంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు మతని చిత్తంబును నీవిభవంబును దనమీఁది ప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము. 149

క. అనిన ధృతరాష్ట్రుపలుకులు, గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్ముం
డును నౌఁగా కని దుర్యోధనుఁడుం [3]బరిచారకప్రతతిఁ బిలిపించెన. 150

వ. ఇట్లుచితపరివారంబు రావించి యతండు. 151

క. అలుకుఁడు మృగమదమున ము,గ్గులు వెట్టుఁడు కప్పురమునఁ గుంకుమమునఁ గో
డలు పూయుఁడు మణిదామక,ములు కట్టుఁడు పెద్దకూటమున సొంపారన్. 152

వ. మఱియు నగరెల్లను శోభిల్ల నలంకారంబు చేయుండు. 153

క. పెనుపుం జతురత మెఱయఁగ, మనయింటను దుస్ససేనుమందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు, చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. 154

వ. అది[4]విడిపట్టు గాఁదగియెడు పట్టని పలికి వాసుదేవుండు రేపకడయ వచ్చు నంతకు మున్న యింతయుం గావింపవలయు నని పనిచి పురంబున నుత్సవంబు చాటుం డని నియోగించి వివిధగంధమహితమాల్యంబులు సంపాదింపను మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదుపానద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరు లగు తజ్జ్ఞుల నియమించె నట్టియెడ నాంబికేయుండు విదురున కిట్లనియె. 155

ధృతరాష్ట్రుఁడు విదురుతో శ్రీకృష్ణురాక చెప్పి సంతోషించుట

క. వివిధమణిమయరథంబులు, జవనాశ్వంబులును భద్రసామజములు ర
త్నవిభూషణములు దాసీ,నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్. 156

క. మనయింట సుయోధనుగృహ,మున దుశ్శాసనునికేతమున నెయ్యది యా
తనిచూడ్కికించు నది యెల్లను గౌరవ మొప్ప నీ వలయు [5]మన కనఘా. 157

చ. అన విని యాతఁ డిట్లనియె నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కం

1. బనిచి యిట్లనెఁ దనదు నందనునితోడ. 2. కార్యార్థి యై. 3. బరివారకప్రతతిఁ బిలిపించెన్. 4. విడిపట్టు...; పట్టు గావలయు నని. 5. మన మనఘా.

ఔను హిత మైనకృత్య మొకటిం గలదే యది మేలు పాండునం
దనులకు నైదయూళ్లు లుచితస్థితి నిచ్చుట [1]కోప మన్న యు
న్కిన యిటు లోపుకల్మి ధరణీవర యేమిట వచ్చెఁ జెప్పుమా. 158

ఉ. నీతలఁ పేను గంటి నొకనేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము చేయఁగఁ జూచె దింత బే
లైతిగదే సుమేరుసదృశార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే. 159

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు, గాన జలపూర్ణమంగళకలశమునకుఁ
బాద్యమునకును కుశలసంప్రశ్నమునకు, మిగుల నొండు జనార్దను మెచ్చుగాదు.

క. [2]మనకడకు నేమికార్యం,బునకై యాతండు వచ్చెఁ బూనికిమెయి నా
[3]పని వంచింపక చేయుట, విను మతనికిఁ బ్రియము తక్క వేయును నేలా. 161

వ. అనిన విని దుర్యోధనుండు తండ్రి కి ట్లనియె. 162

క. అది విదురుచెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వే ఱగునే
పద నెఱుఁగ కీఁగి యిచ్చిన, బెదరి రనరె యొచ్చెమైనఁ బిమ్మట నగరే. 163

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నే నెఱుంగుదు, నైన ధనము లీఁగ ననవతనము
వచ్చుఁ బెచ్చుపెరిఁగి వైరులు గర్వింతు, రేల పగ యడంగు నిట్టు లైన. 164

క. అనవుఁడు భీష్ముఁడు ధృతరాష్ట్రున కి ట్లను [4]నీవునుం గొడుకు నేమే ని
చ్చిన నొకటి యీఁగి లేకున్నను వేఱొక్కటి దలంచునా కేశవుఁడున్. 165

క. విను మతఁడు చేయఁబూనిన, పని దప్పింపంగ రాదు పాండవులం దే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొచ్చిన మే లాపురుషుపనుపు చేయుము పుత్రా. 166

క. నారాయణుండు ధర్మార్థారూఢము కాఁగఁ బలుకు నది నీవును నీ
వారును నైకొని యెంతయు, గారవమునఁ జేయ నెల్ల కార్యంబు నగున్. 167

క. అనుటయు సుయోధనుఁడు భీష్మున కి ట్లనుఁ బాండురాజసుతులకు నిమ్మే
దిని హరి సగపా లీఁ దగు, [5]ననుఁ బో యే నీను గాని యది య ట్లుండెన్. 168

వ. వే ఱొకకార్యంబు చేయం దలంచితి నది వినుము పాండవులకు నేడుగడయు
జనార్దనుం డతనిం బట్టి బంధించిన ఱెక్కలు విఱిగిన పులుఁగులుంబోలె వారు
నాకు విధేయు లగుదురు పాంచాలయాదవాదు లైన తదీయబంధుమిత్రులు
నావశంబున వర్తిల్లుదురు సమస్తదేశంబులు నేన యేలుదు దీనికిం దగినయుపాయ
సహాయంబు లనువు చేసెద నీ వింక నేమి చెప్పెదవు చెప్పు మనిన విని యతి
ఘోరం బగు నవ్విచారంబునకు నమాత్యసహితంబుగా సంతప్తచిత్తుం డై వైచిత్ర
వీర్యుండు కొడుకున కి ట్లనియె. 169

---

1. కొప్ప కున్న యు. 2. మన దెసకు. 3. పని పంజరంబు (వేగిరంబు) చేయుంట. 4. నీవుఁ గొడుకుఁజొప్పున నేమే. 5. ననఁ బోయిన నీను.

క. ఓహో యి ట్లనుట జగ,ద్ద్రోహం బిమ్మాట మఱవు దూతత్వంబు౯
మాహాత్మ్యంబును ధర్మో,త్సాహంబును విను మబాధ్యతకుఁ గారణముల్. 170

క. ఈకారణములు గల వను, నాకొలఁదియె వాసుదేవుఁ డది గాకయుఁ గీ
డే కురు[1]వంశమున కతని, రాక యతం డేమి సేసె రా పాపాత్మా. 171

వ. అని యదల్చె నప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను నీకొడుకు ప్రాణ
గొడ్డం బైన కార్యంబు చేయం దలంచె దామోదరు నిట్లు చేయం జూచెనేనిం
దానును బ్రధానులును వినాశంబుఁ బొందుదు రింతియ యిది చేసిరేమి చేయ
రేమి యమ్మహాత్మునెడ నీయపకారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ముల కాక
యని పలికి యే నిట్టిదాని వినంజాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన
లేచిపోయె ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటి కొఱగాములు మనం
బునం దలంచినప్పుడు చేయం గలవాఁడవు కావున దీనం జేటు వచ్చు నుడుగు
మయ్య యని చెప్పి యతనిం దక్కినవారినిం బోవం బనిచి తగినవర్తనంబున నుండె
మఱునాఁడు. 172

సీ. కాలోచితము లగుకరణీయములు దీర్చి, కమలనాభుఁడు రేపకడయ కదలి
తనుఁ గుశస్థలవాసు లనుప రా నందఱ, నాదరంబున నిల్పి మరుగునపుడు
కజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్రసుతుఁడు పుత్తేరఁ బ్రీతి
నెడ నెడఁ గొని వచ్చి యిచ్చినవాని నెల్లను వేడ్కననుభవించినవిధంబు

తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ నెదురు, బాహ్లీక ద్రోణభీష్మాది[2]బంధుమిత్ర
గణము సర్వభూపాలలోకంబుఁ గురుకుమారవర్గంబుఁ బుత్తెంచె మనుజవిభుఁడు.

### శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు తక్క నెల్లవారిం దూర్యాదిశోభనపదార్థంబులు
సమకట్టి ధృతరాష్ట్రుండు పనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారలనందఱ
నయ్యైతెఱంగుల సంభావించి కృతవర్మ తమవాఁడు కావున నతనికి సవిశేష
స్నేహంబు చేసి యతండు [3]చేరువ రా సమస్తజనంబులుం బరివేష్టింపం జని తన
రాకకు నలంకృతంబును [4]ప్రమోదచాపలసుభగజనంబును నైన పురంబు చొచ్చి
రాజమార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధలుళితంబులు
నగునక్షతప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ
జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొను నంగనా
జనంబులు తమలోన. 174

సీ. ప్రాణంబుతోఁ గూడ [5]రక్కసిచన్నుల,పాలు ద్రావినప్రౌఢబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించినయాజగజెట్టి యితఁడె

1. వంశమునకుఁ దన, రాక. 2. బంధువిప్ర. 3. చేరువఁ దాను. 4. ప్రమోదభాషల
శుభకరంబును నైన. 5. పఱఁతిరక్కసచన్నుఁబాలు గ్రోలిన.

దుర్వృత్తుఁ డగుకంసుఁ దునిమి యాతనితండ్రిఁ, బట్టంబుఁ గట్టినప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గలకోర్కి దీర్చినరసికుం డితండె

తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును
నరసి మ్రుచ్చిల నేర్చినహరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దనసుభగచరణ
సరసిజామోదమును గూర్చుచతురుఁ డితఁడె. 175

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగు పౌరలోకం బాలో
కనకౌతుకంబునఁ దన రథంబు గదిసిన సందడి జడియు వేత్రహస్తుల వారించుచు
నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని మణితోరణసుందరం బగు
రాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగ
సాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మ
ద్రోణప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బొదువ నతండుఁ బ్రత్యుత్థానంబు
చేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనం జేరి. 176

ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చటఁ గలవిదు,రాదిశిష్టజనుల నాదరార్ద్ర
[1]బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ,నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ. 177

వ. వార లందఱకును సాత్యకికి దగిన సమాచారంబులు నడపం బనిచె నట మున్న
ధృతరాష్ట్రుననుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్న యున్నతకనకాసనంబున
నతం డునుప నాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణు
లగు నగరిపురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచా
రంబు లాచరించి యతని తమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి నరనాథుం
డును దొరలును నిజోచితాసనంబుల నుండిరి కొలు వెల్లను సూర్యోదయ
సమయంబునఁ గమలాకరంబు విధంబున [2]వికసించి యుండె నయ్యవసరంబునఁ
గృష్ణుండు ధర్మనందనువచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామ
పరిరంభణప్రముఖసముచిత సంభావనంబులు పలికి సంభాషణంబులకుం జొచ్చి.

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ [3]జే
రోజమెయి బంధుమిత్ర స,మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్. 179

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురు సదనంబు
నకుం జనియెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద నని పలికి
యాంబికేయు ననుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి
చని [4]మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయభక్తివినయస్నేహ

1. భావదృష్టిఁ జూచి. 2. విలసిల్లి యుండె. 3. జే, నోజనయి. 4. మంగళాచారసహి.

[1]నందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారం
బుల నర్చన లిచ్చి కౌంతేయుల కుశలం బడిగిన నతనికి వారల వృత్తాంతంబు
సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 180

క. ముదమునఁ గృష్ణుఁడు కుంతీ, సదనమునకుఁ జనియె [1]నప్పుడు సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరించెద నని తన్నడుగ నట్ల చేయుం డనుచున్. 181

వ. చని కాంచిన నద్దేవియు నతని తోడునీడయుంబోని తన కొడుకులం దలంచి
యడలు పుట్టిన నమ్మాధవుమెడ పట్టికొని యెలుం గెత్తి యేడ్చిన నతండును
సంబోధించి యూఱార్ప నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసపాద్యోపచారం
బులు చేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో
ని ట్లనియె. 182

సీ. నీశిశుఁ బెరుఁగుట నీతిమంతులుఁ బుణ్యపరులు శూరులు గదా పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రుసూరెలఁ గొలువ నుండెడువార లిసుమలఁ బడుచు నిర్జ
నం బైనకానలోనన యెట్లు నిలిచిరి, ననుఁ బెట్టి [2]నాయెడఁ గొనుచుఁ జనిరి
యేను వర్ధింపంగ నింపారఁ గుడిచి మెత్తనిశయ్య నిద్రించి వినుతభద్ర

తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము
లఱవ మేల్కను చుండిరే యక్కటకట. 183

ఆ. తండ్రి లేనిప్రజలు తల్లిని బాసి పెద్దయును గాల మివ్విధమునఁ బడిరి
భంగపాటు దుఃఖపాటును సంకటపాటుఁ గలిగె విరటుపాలఁ బిదప. 184

వ. అని వెండియు. 185

ఉ. దానదయాపరుం డయినధర్మతనూభవు నేమ మెట్లు పం
చాననవిక్రముం డగుబకారికి భద్రమె యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా వినయాభరణుల్ కవల్ సమా
ధానసమేతులే యకట ద్రౌపది సాధ్వి [3]సుఖంబె దానికిన్. 186

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ[4]గోడలి నెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు చేయుభక్తి కట కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట చూచి పొక్కితిన్. 187

తే. నాఁడు ద్రౌపది పడినబన్నముల చూడ
[5]నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ

---

1. నందకందళితహృదయుం డగుచు. 2. నాయందఁ గొనుచుఁ. 3. శుభంబె దానికిన్.
4. గోడలు నెక్కుడు గూర్తుఁ. 5. నోర్చునప్పుడె యెంతకు.

యంతగడచినదుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ గమలనాభ. 188

వ. అట్టియెడ. 189

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మసంశయ మిది కూ
డదు నార యతనిశీలము,కుదు రీలోకమున కింతకుం దలఁపంగన్. 190

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దన యుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ గొండొకదిగం బాఱెడుచిత్తంబుతో మఱియు ని ట్లనియె.

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట, యదియొకతల యయ్యె నేమి[1]యనఁగల దనఘా.

క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకలట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామదిలేమికి, వెన్నుఁడ దైవంబు సాక్షి వినుము పలికెదన్. 193

క. ఇది నిక్కం బగునేనియుఁ, దుది నీవుం బాండవులును దురితరహితు లై
ముద మందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్యో యంబుజనాభా. 194

సీ. బావ యొప్పం డనుపలుకుల నే మగు, నాతనికొడుకుఁ గీడాడ నేల
కురువృద్ధుఁ డగుబాహ్లికుని దూఱ నేటికి, భీష్మునిపైఁ బ్రబు వెట్ట నగునె
యిట్టికృూరులయింటి కిచ్చినమనవారి, నఁదుఁ గా కట్లు దా ననుట మేలె
యర్జునుపుట్టిన యప్పుడు వీఁడు లో,కము లెల్ల గెల్చు పొగడ్త మొగులు

తే. ముట్టునట్టిద యగు రణమున జయించుఁ, గౌరవుల సోదరులుఁ దాను భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశరీరవాణి, పలికె నది తిట్టువడుఁగాక వలయు నేని.

వ. ధర్మంబు కలుగునే నది నిక్కం బయ్యెడు దాని కెల్లను నిర్వాహకుండవు నీవు కలవు గాదె నీమన్నించు నెచ్చెలులకుం జెప్పెడు మాటలు కలవు విను మయ్యుధిష్ఠిరునితో ని ట్లనుము. 196

క. వేఁడికొని కృపణు లై కను,పోఁడిమి యది యేల రాజపుత్రులు తమమై
నాఁడిమి తప్పిన నిప్పులు, వేఁడిమి చెడినట్లు జనులు విని యులుకుదురే. 197

వ. భీమార్జునుల కి ట్లని చెప్పుము. 198

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచిత మైనసమయ
మొదవెఁ దడయు టింక నొప్పదు జనములు, నట్లుగాని పురుషు లనరు మిమ్ము.

క. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదాత్మజఁ గార్యం[2]బడుగు మనుము తగ నందఱతోన్.

చ. అలిగినభీమఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు [3]దంతలం
తలు వడి వాని నీఁగ వలదా విను మాపని కెల్లఁ బాండుపు

1. యనఁ గల దనఘా; దానన్. 2. బడుపు. 3. దెంతలెం, తలు.

త్రులె కలవారు నీ కెటులు తోఁచిన నట్టులు చేయువారు గా
కలఘువిచార నాయలఁత యార్పుము నన్ గడ తేర్చు మెమ్మెయిన్. 201

వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె. 202

శ్రీకృష్ణుఁడు కుంతీదేవి నూఱడించుట

చ. సుగుణవు పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచుధన్యవు ధీరవు దేవి నీ వెడ
న్వగ లడఁగింప కున్న భువనంబుల నింకిట నెవ్వ రోర్చువా
రు గలఁక దక్కుమీ హృదయరోగము లన్నియుఁ బుచ్చి వైచెదన్. 203

క. తనయులుఁ గోడలు సేమం,బున నున్నా రధికభక్తిపూర్వముగా దం
డనమస్కారంబులు నీ, కొనరించిరి కౌఁగిలించి [1]రుల్లములఁ దగన్. 204

క. నీకొడుకు లొందుసుఖములు, చేకొన రవ్వీరసుఖము చిత్తములఁ గగం
బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లల్పబుద్ధులె వారల్. 205

క. ఉత్సాహంబున శత్రుకు,లోత్సాదనవిధి యొనర్చి యున్నతసామ్రా
[2]జ్యోత్సవము నొందుపుత్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్. 206

చ. అన విని మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి [3]విధించినట్ల చే
సి నెగడువారు గాక నినుఁ [4]జేరిన నాపద లొంద నేర్చునే. 207

క. వారలక యేల మాధవ, కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ నీపలు, కారయ వేదంబ కాదె యఖిలంబునకున్. 203

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు చేసి తదా
వాసంబు వెలువడి తనరాకకు నలంకృతంబైన దుర్యోధనుమందిరంబునకుఁ గృత
వర్మసాత్యకిసమేతుం డయి పోవు గోవిందునిం గని తదీయద్వారపాలకులు సంభ్ర
మంబునం బఱచి యతని కెఱిఁగించి తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని
కక్ష్యాంతరంబుల సందడి నెడ గలుగ జడియుచు వినయంబునం దోడ్కొని చన
నమ్మనుజవిభుండు కైలాసశిఖరాకారం బగుసౌధంబున బాహ్లికభీష్మద్రోణప్రభృతు
లును గర్ణశకునిసైంధవాదులును దుశ్శాసనవికర్ణదుర్ముఖప్రముఖులును మఱియు
ననేకదేశాధీశులునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుం డై యున్న
యెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు
చేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారంబులు తానుం
దమ్ముండును నాచరించి. 209

---

1. రుల్లము చెలఁగన్. 2. జ్యోత్స్నవముఁ బొందుపుత్రుల. 3. విధించినట్ల చేసి 4. జేరిన వారికిఁ గీడు గల్గునే.

క. అతఁ డనుపఁగఁ గనకమయోన్నతపర్యంకంబు నందు నారాయణుఁ డూ
ర్జితమహిమ [1]నుండి యభ్యర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్. 210

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యెఁ దదనంతరంబ నిజా
సనాసీను లయి తన మొగంబునం జూడ్కి నిలిపి యున్న దుర్యోధనాదులతో
మాధవుండు మధురసంభాషణంబులు చేయుచుండె నట్టియెడ. 211

తె. సముచితంబుగఁ గూరలచంద మగ్గ,డించి కుడుపు తెఱంగుపుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁడచటఁదాను,గుడువనొల్లకయునికియేర్పడఁగఁ జెప్పె.

వ. చెప్పినవిని దుర్యోధనుండు సూర్యసూనువదనం[2]బవలోకించి యల్లన యి ట్లనియె.

క. హరి పలికినవిధ మెంతయు, నెర వై యున్న యదివింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత నీ పెను, పరిచఁ దం బెల్ల [3]నెఱుక పడియెడుఁ బిదపన్. 214

వ. అని యచ్యుతున కి ట్లనియె. 215

తే. వలయునన్నపానంబులు పలుదెఱఁగుల, నేర్చువిధముల నేమొదఁగూర్చి వేడ్క
నున్న నీ వుపయోగింప నొల్లకునికి, బాంధ[4]వమునకు నీతికి బాహిరంబు. 216

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్కరూప యసదృశధర్మా
చారుండవు రాజునకుం, గూరుతు కత మేమి యిట్లగుటకుం జెపుమా. 217

క. అనుచు నుపేంద్రుఁడు మనుజేంద్రుని కి ట్లను దూత లెందుఁ దొలిదొలిగుడువం
గొనఁ గట్టఁ [5]దొడఁగుదు రె వచ్చిన కార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. 218

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కి ట్లనియె. 219

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము తీఱుఁ, దీఱ కుండు దానితెఱఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుంద్రాటఁ, గాలు గ్రువ్వ నేల కమలనాభ.

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట
యొప్పుఁగాక కుడువ నొల్ల ననం దగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది
లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు [6]మందస్మితంబుతో నందఱం
గలయం గనుంగొని ధార్తరాష్ట్రకరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం
గేల నమర్చి యిట్టిమాటలు తేటపఱుప వలయునేని విను మని యతని కి ట్లనియె.

చ. ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడుకూ డది లెస్సకూడు త
క్కియ నయహీనతం దమకు నాపద యైనెడ నిట్టు నట్టు నే
మియు నన [7]లేనికూ డెడిరి మేవడి యై చను నీవు మాదెసం
బ్రియుఁడవు కావు మాకు ధృతిపెం పఱ నాపద లే దొకింతయున్. 222

వ. అట్లుం గాక. 223

---

1. నెనసి యభ్య. 2. బునం జూడ్కి నిలిపి యి ట్లనియె. 3. నేరుపడియెడుఁ. 4. వంబున నీతికి; వంబున కిది నీతి. 5. గణఁగుదురె. 6. మందస్మితవదనంబుతో. 7. లేమికూ డదియుం; డు దిన.

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగ [1]దొడఁగుల కెప్పు డెవ్విధము పాటిలునో. 225

వ. నేను బగతుండనె యంతేని.

క. అలుగుదు పాండవులకు వా,రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమప్రాణములకు, నలుగుజనులు పగతు రగుట యనుమానంబే. 226

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు తోడఁ బుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారితోడ. 227

వ. ఇట్లున్న మీయందఱ యన్నంబులు దుష్టాన్నంబులు విదురుం డొక్కని యన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞపతి యనుమతి సేయఁ జనునప్పుడు తోడన బాహ్లికభీష్మాదికౌరవులును గుంభసంభవప్రముఖు లైన మాన్యులును జని మాధవుతోడ మాయిండ్ల నెల్లను గానిక లాయితంబులు చేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్లు చూచుచున్నవార మని పల్కి ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁ డన యందఱ యర్చనలుం గైకొంటిన మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృహంబునకుం బోయిన. 228

సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ బవిత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్లవంటకమును నేర్పడ బోనాలు, [2]వేర్పంప నెంతయుఁ బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి, సపరివారముగ విశాలరమ్య
పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు, తమ్ముండుఁ దాను [3]నుత్సవ మెలర్ప

తే. సరసరంజకమహనీయసంప్రయోగ, మగుచతుర్విధహృద్యాన్న మారగించె
లలితసంభావనామంజులంబు లైన, పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ. 230

వ. అతండును.

క. [4]గోవింద సంభ్రమము సం,భావింపుము మాకు నిదియ పరమధనం బొం
డేవిధమున నీ కర్చన, గావింపం జాలువాఁడు కలఁడే యెందున్. 231

వ. అని మఱియు [5]నత్యంతవినయవాక్యమ్ముల నారాధించుచుండె నిట్లు కృతాహారుం డైన హరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుం డై యుండఁ గవిగణికప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాంశికవైణికాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు పుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి రాత్రి యగుటయుం దగిన యభ్యంతరమందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి. 232

---

1. దొడ్లకు నెప్పు. 2. పెట్టింప. 3. నుత్సవ మొనర్ప. 4. గోవింద (సంభ్రమమె) నన్ను నొగి సం. 5. నత్యంతవిమల.

ఆ. విదురుఁ డిట్టులనియె నిదియొకకార్యంబు, గాఁగఁ బూని [1]యిందు రాఁగఁ దగునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ, మాట వినునె దురభిమానఘనుఁడు. 233

క. వచ్చినసైన్యంబులఁ గని, పెచ్చుపెరిఁగినాఁడు ద్రోణభీష్ములలావుల్
[2]నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ, యిచ్చుఁ దనకు [3]విజయమనియు నెంతయుఁ బొంగున్.

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బాఱి తమలో నిశ్చయించినతెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు నీకుం దుడుకువారు తార యీధాత్రి యంతయు బీఱు వోవ కుండ నేలువారు వారిం గూడిన రాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు కావునఁ గర్ణుతో నేకార్థుల మై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లే దని నిశ్చయించికొని యున్నవా రట్లగుటం జేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు సంధి కానేరదు వారల కంపఱకు నిది ప్రాప్తకాలం బై యున్నయది యెట్లును నుడుగ నేర్చినవారు గా రిట్లు తమ్మెఱుంగని దుష్టాత్ములనడుమం గూర్చుండుటయు నవ్వెంగలిపిత్తు లఱచు వీఱిఁడియఱపులకు వంక లొత్తి మాఱు సెప్పుటయు నొప్పక యుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారల తలంపులు కీడు నీమహనీయప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు నయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁదిభక్తినిం జెప్పెద నందుఁ బోవలవ దనిన వాసుదేవుం డతని కిట్లనియె. 235

తే. నీవివేకంబు నాప్తియు నెఱపి తీవు, తల్లిదండ్రులమాడ్కి హితంబు చెప్పి
తేను నారాకతెఱఁ గెల్ల [4]నేర్పడంగఁ, జెప్ప విని యేమి చెప్పినఁ జేయువాఁడ. 236

## శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁ గూడిననృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని, యఱుముటయును సంధి పొసఁగ దనియు మహాత్మా.

ఆ. పుడమి యెల్ల [5]నొడ్డగెడ వయి గజవాజి, యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము చొరఁగ దివురు మూర్ఖత మాన్చుట, యధిక మైనపుణ్య మనఘచరిత.

వ. మానుపవచ్చునే యంటేని. 239

క. దొరఁకొని పుణ్యముఁ బాపము, నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకట న
వ్వెర వెడలి తప్పినను దత్పరిణతిఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 240

వ. అట్లుం గాక. 241

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు

---

1. యిట్లు రాఁగ. 2. నచ్చినఁ. 3. విజయ మనుచు. 4. నేర్పరించి చెప్ప. 5. యొడ్డ గజవాజియుతముగాఁ, గడఁగి యుగ్రమృత్యుగతము గాఁగ, మృగము పొరఁగ.

[1]డడ్డపడి వారితోడ కొట్లాడి రైనఁ
దాని నుడుపంగఁ జోర కున్న వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు. 242

వ. కావున నీ రెండు తెఱంగులవారికి [2]శాంతి కావింపం బ్రయత్నంబు సేసెద ధర్మార్థసహితం బైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుం డైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితం బగునవిధంబు వంచన లేక చెప్పెడు నన్ను పాండవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యె నేనియు మేల కాక యిట్లు చొచ్చి చెప్ప కున్న నన్నదమ్ములు తమలోనం బోరఁ గృష్ణుఁడు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞు లైన జను లాడుదు రెల్లభంగులం గార్యం బాప్తు లియ్యకోనం జెప్పుదు ధార్తరాష్ట్రులుం దమకు బ్రదుకుతెరు వైన నాపలుకులు పట్టుదురు పట్టక నీతలంచినచందమునం దులువ లై కలఁగం బాఱిన వారు నాముందర నిలువం జాలుదురే యని పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు చేసి నిజశయనస్థానంబునకుం జనియె నంతరంబ. 243

ఆ. అతనివచనరచన యాత్మలోఁ దలపోసి, యిట్టివాఁడు కలఁడె యెందు ననుచుఁ
బాలికడలికడల పాటి [3]యై యొప్పున,ప్పాన్పునందు శౌరి పవ్వళించె. 244

వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి సమయకర్తవ్యంబులు సలిపె నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గల యిష్టజనంబులు పరివేష్టింప నుచితప్రదేశంబున నున్నంత. 245

క. ఇనతనయశకునిదుశ్శాసనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా,రును దానును వారిజోదరుం గొనియాడెన్. 246

వ. అతండును మధురసంభాషణంబులు చేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱిఁగించినఁ బ్రియంబునఁ గట్టాయితం బైన తే రెక్కి భేరీశంఖచామరప్రముఖభద్రచిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్క రథంబునను దుర్యోధనాదిదుష్టచతుష్టయం బొక్క రథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబు చేర నరుగునప్పటి యులివునకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు [4]నవతరించి యరవిందనాభుండు. 247

తే. ఎదురువచ్చినవిదురునియిచ్చుకరముఁ, దమ్ముచేయును రెండు హస్తములఁ బట్టి

---

1. డడ్డవడి తాను వీరితో నాటలాడి, యైన నుడుపంగఁ. 2. సంధిఁ గావింపం. 3. కదలి పాన్పు (కడరఁబాటి) పాటియై యొప్పగు, పాన్పుమీఁద శౌరి. 4. నుత్తరించి.

నడచె ముందటఁ [1]గదియుసందడిఁగడంగి, కర్ణదుర్యోధనులు తొలఁగంగ జడియ.

వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁగలయభ్యంతరు లైన బలుమానిసులు పొదివి కొని పోవఁ దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధి తారాగ్రహంబులచందం బగు చుండం దేజో[2]రాశి యగు రాజీవాక్షుండు చని తనకుఁ బ్రత్యుత్థానంబు చేసిన కురురాజును దొరలను నభినందించుచు. 249

క. తన కనిపెట్టినమణిమయ, కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలు లై. 250

వ. ఇవ్విధంబున సన్నిహితు లయిన యమ్మహామునులం గురుపితామహునకుం జూపి నారాయణుం డి ట్లనియె. 251

ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మహాత్ము లైననారదాదిమునులు
వీరి కర్ఘ్యపాద్యవిధు లొన[3]రింపు మాసనము లిడఁగఁ బనుపు సత్వరముగ. 252

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట తగవు గా దనినం గొలువువా రెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన చూచుచుండ భీష్ముండు పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు తెప్పింప వార లరుగు దెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు చేయించి కృష్ణుఁడు కూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండును దక్కటి వారును నుచిత ప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు చేసి నిజాసనాసీను లైరి దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి కర్ణదుర్యోధనులుం జేరువ నొక్క గద్దియ నుండిరి విదురుండును మణిపీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె గాంధారరాజు నిజపుత్త్రపరివృతుం డై యొక్కదిక్కున [4]నుచితపీఠాసీనుం డయ్యె నట్టిసమయంబున. 253

క. అంబుదశుభగాత్రుం బీతాంబరధరుఁ గమలదళనిభాక్షుఁ డా హరిఁ జూ
డం బడసి లోచనము లమృతం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలెన్. 254

క. ఆకొలువువారు కర మచలాకృతి నొకపలుకు లేక యందఱు వింజం
బ్రాఁ కిడిన[5]కరణి నవశము, దాకారితచిత్తవృత్తు లై యుండంగన్. 255

### శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట

క. జలదస్వనగంభీరత, నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల సకలజనంబులు విన ధృతరాష్ట్రభూవిభున కి ట్లనియెన్. 256

క. జననాథ నీయెఱుంగని, పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు, నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్. 257

1. గదియు (దగియు) సందడిఁ. 2. రాజి యగు వారిజాక్షుండు. 3. రింప నా, సనము.
4. నుచి(తపీఠస్థుం డయ్యె.) తాసనాసీనుం డయ్యె. 5. యట్లు పరవశ, శాకారితచిత్త.

క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి [1]మనికి కార్యం బది నీ
[2]వారసి నడపుము వా రన, వీ రనఁ [3]గురుముఖ్య నీకు వేఱుం గలదే. 258

చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ [4]బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్. 259

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం దెవ్వారి[5]చందంబు లె
ట్లైన వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ. 260

చ. వినుము సుయోధనాదు లగువీరు [6]సధర్ములు గాక కార్యము
ల్గానక మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబువ
ర్తన మిది కాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికిన్
మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోడ రేమియున్. 261

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్వికిం
బోరిత మైన నింతకును బుట్టు మహాపద కాపురన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యముఁ [7]బొం దొనర్పవే. 262

తే. నీకు వలసినఁ దీర్పంగ నేర వచ్చు, నధిప తెఱఁగు నీవశమునయదియు కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱయ కాదె, సిద్ధ మెవ్వారిఁ దెలివొందఁ జేయ నేర్తు. 263

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని నిల్గుటకంటె [8]భవద్బలంబు లై
యందఱుఁ [9]గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్పు మెమ్మెయిన్. 264

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లిప్రజల, యెడ విరోధంబు పాటించు టెంత మేలు. 265

క. నరనాథ నీ వుపేక్షా, పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక కా
దరయఁగ భూప్రజ కెల్లను, దురితం బొన[10]రించినట్లు తుదిఁ గీడు సుమీ. 266

క. కౌరవపాండవులం దె,వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మేలు
ర్వీరమణ చిత్తమున నె, ట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లయినన్. 267

---

1. యునికి. 2. వారిని నడపుము. 3. కులముఖ్య. 4. బెంపుఁ దాల్మియుంన్. 5. చిత్తంబు. 6. సమర్థులు గాక; (న) ధర్ములు గాక. 7. బొందు సేయవే. 8. భవద్విధేయు లై. 9. గూడు టొప్పు హృదయంబున శాంతి. 10. రించు టదియె తుదిఁ.

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరిత్తబవరంబున నాఱడిఁ జావఁ బోవ నె
ట్లూరక యుండ [1]వచ్చుఁ గడు నొప్పెడు మేనులు వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వ వచ్చునే. 268

ఆ. ఇట్లు గాక యుండ నీ రెండుతెఱఁగుల, వారిఁ గాచికొనుము వసుమతీశ
నీదు ప్రాభవంబు నీతియు శాంతియు, నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ. 269

వ. అని చెప్పి వెండియు. 270

శ్రీకృష్ణుఁడు పాండవులు చెప్పిన మాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట

తే. పాండవులు తండ్రి చచ్చిన ప్రజలు వారి, నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁ [2]దగునె, పార మొందంగ రక్షింపు గారవమున.

వ. పాండుకుమారులు నీకుం [3]బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము తన పంపునం బండ్రెండు వత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జలిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుదు మని [4]కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు కా దట్లని చక్కంబెట్టునది తనగల పదివేలేండ్లకుం దన్న కాని మఱియొకుంగ మెట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు తన యందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు కొఱ గాకున్నను గులంబుపాడి చెడక చెల్లు నని రని పలికి మఱియు నిట్లనియె. 272

ఉ. సారపుధర్మముగా విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ [5]బాఱిన దైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష చేసి రది వారలచేటగుఁ గాని ధర్మ ని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్. 273

వ. అని యీసభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదు లైన రాజులు నే మనియెదరనుం దేను ధర్మంబును నీతియును మున్నిడుకొని మనోవాక్ప్రకారంబు లేక రూపం బైన సత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు చేయుండు. 274

ఆ. పాండవులకుఁ దగినపాలు మేదినిఁ బంచి, యిచ్చుకంటెఁ గార్య [6]మెద్ది కలదు
ధర్మ మెద్ది సముచితం బగువిధ మెద్ది, శక్య మెద్ది చెపుఁడ వాక్యవిదులు. 275

క. అని పలికి మహారాజా, విను మని ధృతరాష్ట్రుతోడ వెండియుఁ దా ని

---

1. బోలు. 2. నేల. 3. బ్రణయభక్తిఁ. 4. కృతనిశ్చయుల మైతిమి. 5. బాలిది; బాటిలి; బాలిసి. 6. మేమి గలదు.

ట్లని చెప్పె వాసుదేవుఁడు, తనమది నఱ లేక కార్యదశ తెలియంగన్. 276

ఆ. వారితండ్రిపాలు వారికి నిచ్చి నీ, పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁ డిది బంధు,మిత్రసుజనకోటి మెచ్చు తెఱఁగు. 277

క. ఎఱుఁగవె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె
త్తెఱఁగున ననువర్తించెనొ,యెఱుఁగవె [1]తగుచేవ కలుగు టెఱుఁగవె యధిపా.

వ. నీ [2]వెఱుంగు దైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబుననుండి పాండవాగ్ర
జుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి. 279

చ. మన మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ మున్నతిఁ జేసి మహావిభూతితో
మదిమది నుండ [3]నీసుతుఁడు మంత్రులు సౌబలు జూద మార్చి సం
పదఁ గొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే. 280

ఉ. దానికి నీ వొడంబడితి ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్ను నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁ డై
దీనత నుండి పూన్కి దగఁ దీర్చియుఁ గూడి మనంగఁ [4]గోరెడిన్. 281

క. తనుఁ దాన పోలుఁ గాకే, మన వచ్చు నజాతశత్రు నతిశాంతతయున్
వినయము [5]గౌరవమును నే,జనపతులకుఁ గలవు చెపుమ సౌజన్యనిధీ. 282

క. ఏ నింతాడితి నీసం,తానం బిరుదెఱఁగునకు హితము గోరి భవ
త్సూనునిమతియతిలోభము, మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా. 283

ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నా రటు గాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండుతెఱఁగులందు నీ
కారయఁ బథ్య మేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 234

చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె
ల్లను బ్రియ మంది నెమ్మనములం బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కునె మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం
దనువరి యెవ్వఁ డంచు నచలాకృతు లై నెఱి నూరకుండఁగన్. 285

వ. జామదగ్న్యమహాముని సుయోధనునితో ని ట్లనియె. 286

సీ. వినుము దంభోద్భవుం డనురాజు తన కెదు,రెవ్వరు లే రంచుఁ గ్రొవ్వి నరుఁడు
నారాయణుం డనువారలు గంధమా,దన మనునగమునఁ దపము చేయ
వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన, నమ్మునీంద్రులు వల దని యనేక

---

1. తగుచావు. 2. వెఱుంగవేనియుఁ దెలియం జెప్పెద. 3. నీసుతుల మంత్రులు జూద మొనర్పఁ జేసి. 4. గోరెదన్. 5. సత్యము ము న్నే.

విధములఁ జెప్పంగ వెండియుఁ బో కున్నఁ, గుశముష్టి నుజ్జ్వలవిశిఖవృష్టిఁ
ఆ. గురిసి నరుఁడు సేనఁ గూల్చి యాతని భంగ, పెట్టి పట్టి విడిచె నట్టియమ్మ
హాత్ము లిపుడు పార్థుఁ డనఁ గృష్ణుఁ డనఁగ లీలార్థకలితజన్ము లైరి సూవె. 237

వ. కావున నాదంభోద్భవుచందంబున నుద్ధతి పాటించుటయు నరనారాయణుల తోడఁ దొడరుటయు మీఁద మే లయి యుండదు పాండవులతోడిపొందు మే లనిన యనంతరంబ కణ్వుండు దుర్యోధనున కి ట్లనియె. 288

కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతునివృత్తాంతంబుచెప్పుట

క. అది పోలుఁ దన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్రహించి మద మెత్తుట [1]యొ
ప్ప దహంకారం బొనరింపదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్. 289

వ. అది యె ట్లనిన. 290

సీ. అమరేంద్రరథసూతుఁ డైనమాతలి తనసుత గుణకేశిఁ బతిఁ దగంగ
నారసి యార్యకుం డనుభుజంగాధిపు, మనుమనిఁ జికురునితనయు సుముఖు
నర్థిమైఁ గోరిన నార్యకుం డుమ్మలికంబుతో ని ట్లను గరుడుఁ డితని
[2]తండ్రి వధించి యొంతయు నల్కమై వీని, నిం కిట నెల సమయించువాఁడు
ఆ. కాఁగఁ బూని పోయెఁ గావున నే మియ్యకొనఁగ నేర మనిన విని బలారి
నడిగి పడసి యిత్తు నాయువు రం డని, వారిఁ గొనుచు నరిగె సారథియును. 291

వ. వారలభాగ్యంబున నప్పు డింద్రుండును నుపేంద్రుండును నొక్కచో నుండం గని మాతలి యక్కార్యంబు విన్నవించినం గరుణించి జిష్ణుండు విష్ణునకుం జెప్పి చేయించువాఁ డై వైనతేయుదెసకుం దాన చాలి సుముఖుం జిరాయురుపేతుం జేసిన. 292

క. మాతలి పాణిగ్రహణం, బాతనిఁ జేయించి యున్న నంతయు విని తా
నేతెంచి గరుడుఁ డలిగో, పాతురుఁ డై రేఁగి పెలుచ నమరాధిపుతోన్. 293

వ. వాసుదేవునిసన్నిధి ని ట్లనియె. 294

క. విను నీ వదితిసుతుండవు, వినతకొడుక నేను విజ్ఞ వీఁగెడుమనకుఁ
జనకుఁడు కశ్యపుఁ డొక్కఁడ, దనుజుల శోధించి చంపుదమ యిరువురమున్. 295

క. ఏమిట నీ కేఁ దక్కువ, నా మేరకు నడ్డపడితి నావుడు నింద్రుం
డీమహనీయమహిమకును, [3]ధామము విష్ణుండు కాక తక్కొరుఁ డగునే. 296

వ. అనినఁ గటకటంబడి గరుత్మంతుండు. 297

ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది తథ్య మెఱుంగక నాకు నీచభా
వ మ్మగుభంగిఁ జేసితివి వాసవ యయ్యదితిప్రసూతవం

---

1. శశ్వదహం. 2. తండ్రిని వధియించి తడయక వీని నిం కిట నెల సమయించువాఁడు గాఁగఁ, బూని పోయెఁ గాన నే నియ్యకొన నేర, ననిన విని బలారి నడిగి యిత్తు, నరయఁ జాలఁ గలుగు నాయువు. 3. దా మును.

శస్త్రఖిలమ్ము దాల్తు నొకసన్నపుటీకన యిట్టి నన్ను నీ
విస్మయిఁ దూలపుత్తె యని యీక్షణరోచులఁ గెం పెలర్పఁగన్. 298

వ. ఉన్నం గనుంగొని కోపించి వాసుదేవుండు వెడనవ్వు నవ్వుచు. 299

క. నీవేటిమోపు కాఁడవు, నా వెరపున నిన్ను నడిపినను గర్వం బే
లా వెడఁగ యంచుఁ దనమం, జే వీఁపున నిడ సురేంద్రజిత్తు వికలుఁ డై. 300

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు వ్రేఁ గడరి సొగసి త్రెళ్లి వివశుఁడై
యఱచిన నోడకు మని హరి, నెఱి సక్కఁగఁ ద్రోచియెత్తె[1]నెగయంగఁ గృపన్.

వ. ఇవ్విధంబునం గేశవుండు కరుణించి గరుడుని ననునయించి యింక నపుదానికి నుద్ధతి మాని బుద్ధి గలిగి యుండు మని వీడ్కొలిపి పుచ్చినం బోయెం గావున గర్వంబు కొఱ గాదింతయు నీమహానుభావుం డెఱుంగు నని నారదుం జూపి యితండు మాతలికన్యాకార్యంబునకుఁ దోడై నడచె ననుగు మదియు కాదు సర్వేశ్వరుం డగుమాధవుమాహాత్మ్యం బితనికిం గరతలామలకం బయియుండుఁ బ్రభవిష్ణుం డగునాదివిష్ణుండు గదా యీకృష్ణుం డీతనిసహాయత్వంబు గల కౌంతేయులతోడం గూడి మనికి కార్యం బనిన నారదుండు ధార్తరాష్ట్రునాలోకించి. 302

క. బలవంతులబలములు న,గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 303

వ. అని వెండియు నిట్లనియె. 304

ఆ. ఇదియ కాని చేయ నేద్దియే ననుచు ని,ర్బంధవృత్తిఁ దలఁపు పట్టికొనిన
నట్టివాని కెందు నలజడి వాటిల్లు, గాలవుండు గుఱియ కాఁడె[2]మనకు. 305

వ. వినుము విశ్వామిత్రుపాల విద్యాభ్యాసంబు చేసి గాలవుం డనుమునికుమారుండు గురుదక్షిణ యేమి సమర్పింతు నని యడిగిన నతం డేమియు [3]నేల యని యుడిపిన నుడుగక యెన్ని చెప్పిన నన్నింటికి నన్ని చెప్పి నిర్బంధించినఁ గటకటంబడి యత్తపోధనవర్యుం డతని శుద్ధధవళవర్ణంబు లై యొక్కకర్ణంబు నీలం బైనయుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యి మ్మని పలికినం బోయె.

తే. గాలవుం డవ్విధము ఘోటకముల నెందుఁ
బడయ లేక చింతాభరభ్రాంతుఁ డగుచు
వెడలి[2]యాహారనిద్రలు విడిచి తామ
హాపథముఁ బోదుఁ గా కని యరిగి యరిగి. 307

వ. ఒక్కచో గరుడునిం గని బాలసఖుండు కావున నతనికిం దనవృత్తాంతంబు చెప్పిన నతండు కరుణాభరితుం డై. 308

క. దేవతలు గాని యిట్టివి, కావింపం జాల రీసకలదిక్కులలో

---

1. నెనయఁగఁ గృపతోన్. 2. తలఁప. 3 లేమి.

దేవేంద్రుదిక్కు బహుదివి, జావాసం బందుఁ బోద మని మునిపుత్త్రున్. 309

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁ డై, పఱచి జలధిలోనఁ జదలఁ [1]బాఱెడునెడఁ జె
య్యాఱి దప్పి నిలువఁ జాలక, యొఱిగినగాలవుని డించె నొకగిరిమీఁదన్. 310

వ. ఇట్లు డించి డప్పి దేర్చి యందుఁ గశ్యపనందనుండు శాంతిలి యను నొక్క తపస్విశాపంబునఁ బక్షంబులు డుల్లి యనుగ్రహంబునం గ్రమ్మఱ వచ్చిన విషాద మోదంబు లనుభవించి యట చనుట చాలించి మగుడ మహీతలంబునకు మునికుమారుం దెచ్చి యయాతి తన నెచ్చెలి యని ప్రతిష్ఠానపురనాథుం డగు నతనికడకు నాతనిం దోడ్కొని చని యగ్గాలవు తెఱం గెఱింగించిన నతఁడు. 311

క. తన కట్టిగుఱ్ఱములు లే, కునికిని మాధవి యనంగ నొప్పెడుపుత్త్రిక
ముని కొసఁగె దీనికై యే, [2]మనుజేశుఁడు నీఁడె హయసమాజము ననుచున్.

వ. ఇట్లొసంగినం దోడుకొని, 313

తే. ఇట్టిహయములు గలరాజు లెవ్వరొక్కొ
యనుచుఁ దిరిగి యయోధ్యకుఁ జని తదీయ
నాథు నిక్ష్వాకుఁ గనిన నన్నరవరుండు
తనకు నిన్నూఱ కాని లే వనియె హయులు 314

క. అన విని మాధవి ఋషి కి, ట్లను నొక్కమహానుభావునతులవరమునం
దన[3]యువతి నయ్యె నేఁ గన్యన యగుదుం గాన నిమ్ము న న్నీతనికిన్. 315

వ. ఒక్కసమయంబు చేసికొని యిచ్చి గుఱ్ఱంబులు వచ్చినవి యెల్లఁ దాఁ బుచ్చికొమ్మనిన గాలవుండు నవ్విధంబునకు సమ్మతించె నపత్యార్థి యై యిక్ష్వాకుండును నయ్యంకువునకు భార్య యగుట పుత్త్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి దానియందు వసుమనస్సుం డను కొడుకుం బడసి గాలవునకు నమ్మగువను మగుడ సమర్పించినఁ జూచి యబ్భంగిం గలచోట్ల నెల్ల నరసి తురంగంబులం గావించికొమ్మని యతనికిం జెప్పి సుపర్ణుండు చనియె మఱియు మహీతలంబునం గ్రుమ్మరి యమ్మునికుమారుండు కందువ లెఱింగి పోవం బోవ. 316

క. ఆసమయంబునను దివోదాసుఁడు నౌశీనరుండుఁ దరుణికి నిన్నూ
ఱేసిహయంబుల నిచ్చి మహాసత్త్వుల సుతులఁ బడసి రధికప్రీతిన్. 317

వ. ఇట్లు క్రమంబునఁ గాశీశ్వరునకుఁ బ్రవర్ధనుని భోజపురనాథునకు శిబిం గనిన యక్కన్యకఁ గొని వెండియు వసుంధరం దిరుగుచుండ గరుత్మంతుండు క్రమ్మఱి వచ్చి యమ్మునితో నీ వింక జాలింబడ వలవ దొక్క కారణంబున నీరాజులు మువ్వురకు నివ్వాజులు గలిగె నింతియ కాని యొండెడ నీచందంబున మొత్తంబు లై

1. బాఱునెడం జె, య్యాఱి. 2. మనుజేశ్వరుఁ డీఁడు. 3. యువతి.

దొరక నేర వియ్యాలునూఱు గుఱ్ఱంబులను గురునకు సమర్పింపు [1]మొక్కటి
చెప్పెద విను మని యిట్లనియె. 318

క. ఈమువ్వురతెఱఁగునఁ దగ, నామునియుం గోడవకుఁ బడయునట్లుగ నిమ్మా
కోమలిని గొఱంతకు విశ్వామిత్రున కెట్టులైన సంప్రార్థనతోన్. 319

వ. అని తానును దోడు చని యత్తపస్విపాలికిం బోయి యత్తెఱం గెఱింగించి
గాలవుం గానిపించి యీతండు బాలుండు నీవు దయాళుండవు వితనిం గృతార్థుం
జేయ వలయు నని ప్రార్థించి పక్షిరా జక్కార్యంబు చక్కంజేసి పోయిన 320

క. మునివరుఁ డష్టకుఁ డనియెడు, తనయుఁ బడసి శిష్యునకు సుదతి నొప్పించెఁ గా
వనితయుఁ దపంబు చేయం, జనియెను గాలవున కిట్టి[2]చరితము గలిగెన్. 321

వ. కావున నెట్టివారికి నిర్బంధము తగదు దుర్మానంబు దుర్దశ నాపాదించు నయ్య
యాతి దుర్మానంబునం గాదె పుణ్యలోకపరిభ్రష్టుం డై మాధవీపుత్త్రు లగునన్న
లువురు దౌహిత్త్రులకతంబున నూర్ధ్వగతిం గనియె నట్లగుటం జేసి. 322

క. నిర్బంధము దుర్మానము, దుర్బుద్ధికిఁ గాక తగునె దుర్యోధన నీ
మార్బలమె పాండవులకుఁ, దౌర్బల్యము మాపు శుభము తలఁకొను సంధిన్.

వ. కృష్ణునిమాట విని నీ విక్కౌరవాన్వయంబు రక్షింపు మనియె నివ్విధంబున నమ్మ
వ్వురు మునీంద్రులు చెప్పిన హితోపదేశంబులదెస నాదరంబుసేసి గాంధా
రేయుండు రాధేయుం గనుంగొని చేయప్పళించి నవ్వి వీర లింతవెఱ్ఱు లగుదురే
యని పలికి వారల నవలోకించి. 324

దుర్యోధనుఁడు నారదాదిమునులమాటలు వినక నిరాకరించుట

క. మునులార నన్ను విధి యే, [3]మని మును పుట్టించె నట్టు లయ్యెడుఁ గాకీ
వినఁ జవి గానిపలుకులకుఁ, బని గలదే యుడుగుఁ డింక బహుభాషణముల్. 325

వ. అనిన విని ధృతరాష్ట్రుం డమ్మహామునులతో ని ట్లనియె. 326

తే. మీరు చెప్పినబుద్ధులు గౌరవమునఁ, జేయఁ గాంచినఁ బుణ్యంబు చేయు నెట్లు
నాముఖంబునఁ గార్యంబు [4]నడవ దేమి, చేయువాఁడ నొండెద్దియుఁ జెప్ప లేదు.

క. అని యతఁడు శౌరితో ని, ట్లను నిహముం బరముఁ గలుగునట్టివిధము నీ
వనఘా చెప్పితి నాకుం, [5]జన వేదియు లేదు దీని సన్మతి నడపన్. 328

ఆ. మందబుద్ధి నాదునందనుఁ డీవు పో, రాని చుట్టమవు మహానుభావుఁ
డవు దయార్ద్రచిత్తుఁడవు వీని దేర్పవే, యనునయించి యెట్టులైనఁ గృష్ణ. 329

క. అనిన ముకుందుఁడు దుర్యోధనుతో ని ట్లనియె విమలతరవంశమునకుఁ
జనియించి తెల్లగుణముల, ననూనుఁడవు నీకు నీదురాగ్రహ మగునే. 330

చ. తులువలు గాక యిట్టిదొర దుర్జనవృత్తికిఁ జొత్తురయ్యపు

1. మే నొక్క తెఱంగు చెప్పెద విను మని. 2. చందము గలిగెన్. 3. మని పుట్టించెఁ దగ నట్టు లయ్యెడుఁ. 4. నడపఁ డేమి. 5. జనవు మనవు.

త్రులు ననుజన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవ కుండఁ జు
ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొడంబడఁ జేయుము కార్య మల్పబు
ద్ధుల వెడమాట లూఁకొనకు దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. 331

క. [1]పాండిత్యశౌర్యనిత్యులు, పాండుసుతులు వారిఁ గూడి బ్రదుకుట ధృతరా
ష్ట్రుండును బాహ్లికుఁడును భీష్ముండు గురుఁడు గోరు తెఱఁగుసూవె నరేంద్రా. 332

ఆ. విను మసత్యలోభమున నిది యగునె యాఁకొనిముసిండిదినినఁ గ్రొవ్వులావుఁ
గలుగునయ్య శకునికర్ణదుశ్శాసన, మంత్రితంబు కార్యతంత్ర మగునె. 333

శా. తోడం బుట్టినభీమపార్థులమహోదోర్దర్పముల్ లోఁతులై
తో డంచుం [2]బెఱవారి దుర్బలుల [3]నెందుం జొచ్చి దైన్యంబునం
గూడం బెట్టెదు నీవ పాండుసుతులం గుందింపఁగా సత్యముం
బాడిం దప్ప రొకప్పుడుం గినియు రాబంధుత్వ మే లొల్లవో. 334

ఉ. వారును మీరుఁ [4]బొంది జనవల్లభ యెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులుఁ జేకుఱఁగా బ్రదు కొప్పుఁ గాక నీ
కీరస మెత్తికోల్ గఱపి యిప్పుడు కార్యము తప్పఁ జూచు నీ
వారలు ముట్ట వచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ. 335

ఆ. వీర కారు పాండవేయులఁ బోర మార్కొన సురాసురులకుఁ గొలఁది గాదు
కాన వారితోడికయ్యంబునకు నిర్ణయింప వలదు సంధి పెంపుఁ జేయు. 336

క. ఈయున్న రాజు లందఱు, [5]వాయుసుతున కొక్కయెత్తు వాఁ డలిగిన శూ
లాయుధుఁడు వడఁకు నాకౌం,తేయులతోఁ బోడుచు టుడుగు ధీరవిచారా. 337

క. ఒకకార్యము చెప్పెద విూ, సకలబలమునందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు కలిగినఁ గయ్యము,నకుఁ బూనుఁడు రిత్త బహుజనక్షయ మేలా. 338

క. పెక్కండ్రు గోవులం గొని, యుక్కు మిగిలి నడవ వెనుక నుద్ధవిడిం దా
నొక్కఁడ నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధము కాదే. 339

క. తోడు[6]దోన లేనియప్పటి, క్రీడికొలఁది యట్టి దధిప కినియక విను మేఁ
దోడై రా నెదురుట కడు,గీడు వలవ దుడుగవయ్య గెలు పరిది సుమీ. 340

తే. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడుగు
మాలి పోదురు నీకుఁ గా మనుజనాథ
దొరకుఁ గులనాశనుం డనుదూఱు మేలె
పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య. 341

ఉ. రాజ్యముభార మెల్ల ధృతరాష్ట్రునియంద నెలుంగుచుండఁ ద
త్ప్రాజ్యకుమారపట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు పాండవుల్

---

1. పాండిత్యసత్యశౌర్యులు; శౌర్యసత్వులు. 2. బెడఁబాపి. 3. నెందుం దెచ్చి. 4. గూడి జన. 5. వాయుజు నని నోర్వఁగలరె వాఁ. 6. కొన లేని.

సజ్యతఁ దండ్రిచిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రనురక్తమతిం దమకుం ధరాధిపా. 342

క. కౌరవనాయక పాండుకుమారులు నీతోటిపొత్తు మనికియొద మనఁగా
శ్రీ రామోఁకా లొడ్డిన, వారివిధము కాదె నీవు వలకను కెల్లన్. 343

భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు చెప్పుట

చ. అన విని భీష్ముఁ డిట్లనియె నాధృతరాష్ట్రతనూజుతోడ నీ
జనకునిమాట పట్టుము ప్రసన్నమతిన్ మనవంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీహరి యిట్లు చెప్పఁగా
వినమిఁ గడుం జెడుం దెరువు వీరలపం [1]పొనరింపు పెంపుగన్. 344

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రాణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామయ్య [2]శోకనాశముఁ జేయ నే చూచెదు చెపుమా. 345

వ. కృష్ణార్జునులతోడివిరోధం బీబంధుశోకంబునకు కాదు లోకంబున నెవ్వరికినిం జూడం బోలదు లోకంబులు రెంటికిని హాని జేయక కూడి బ్రదుకుట మే లనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు దుర్యోధనున కి ట్లనియె. 346

తే. పితృపితామహగురులపై ప్రీతిఁ గోరు, చున్న [3]యట్టిమాపరమహితోపదేశ
వాక్యములు విని దుర్జనవచనరచనఁ, గొనక బంధులతో నొడఁగూడి మనుము. 347

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పినసవిస్తరవాక్ప్రచయంబు త్రోవఁ బో
వన్న కుమార య ట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా
కన్నులు చల్లగా నకట [4]కన్గొను చుండుదు మేము నట్లుఁ గా
కున్నను నీవ నేర్తు నిను నొం డన నేరము నిందుకొల్వనన్. 348

చ. అనవుడు నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబు చేసి యి
ట్టను హరి నాశ్రయించి భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గను మట వోయి దీన మనకార్యము లన్నియు సిద్ధిఁ బొందు నీ
తనిపలు కాదరింపమిఁ బదంపడి పాటిలు నెల్ల చేటులున్. 349

వ. అనియె నట్టియెడ గురుభీష్ము లార్తి చెప్పం దలంచి గాంధారేయున కి ట్లనిరి. 350

క. ఈకృష్ణునిసారథ్యము, నాకృష్ణునిగాండివంబు నై తోడ్పక ము
న్నీకొలఁదిఁ జక్కఁబడి నీ, వీకురువంశంబుఁ గావు మిభపురనాథా. 351

వ. అని పలికి మఱియును. 352

సీ. ధర్మపుత్రునిపదద్వయమున కతిభక్తి, నెఱఁగిన నతఁడు ని న్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలింపఁగ భీముఁడును నీవుఁ బరమహర్ష
మునఁ జారుతరవచనములు సంగతములుగాఁ, బరిరంభణం బొనర్పంగ నరుఁడుఁ

1. పొనరింపఁ బెంపగున్. 2. శోకనాశన మేల నీవు పలికెదు చెపుమా. 3. మాయట్టివారి హితోప. 4. కన్గొన నే మును గందు మట్లు ?

గవలును మ్రొక్కినఁ గర మర్థిఁ దిగిచి నీ, వాలింగనంబు చేయంగ నిట్లు
తే. వారు మీరును దగ బాంధవమునఁ బొదలి
యింపు తళుకొత్తఁ దామరతంపరైనఁ
జెలులుఁ జుట్టలుఁ గలిసి పేరెలమిఁ బొంది
యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ. 353

క. సమరమునకు వచ్చినభూ, రమణు లుభయకటకములను బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బోవ మహీజను లెట్టియుత్సవముఁ బొందుదురో. 354

వ. అని వెండియు ననేకవిధంబులం జెప్పి యీ రెండుతెఱంగులవారును బంచి కుడిచి సుఖం బున్న నఖిలభూప్రజకును బ్రమోదం బగుం గావున నట్లు చేసి యందఱ చేత దీవనలు పడయవయ్య నీ వనిన విని దుర్యోధనుం డప్పుండరీకాక్షు వీక్షించి యి ట్లనియె. 355

క. గురుఁడును బితామహుండు నీ, నరనాథుఁడు నెల్లప్రొద్దు నను దూఱుదు రి
ప్పురుసున నీవును దామో, దర దూఱెదు గాని తగవుఁ దలఁపవు కంటే. 356

క. వనితం బఱచి రరణ్యం, బున నిడుమలఁ బడితి మనుచుఁ బోటరులై చం
పను [1]జెఱుపఁ దలఁచి మాదెసఁ, గనలుదు రప్పాండుసుతు లకారణమ కడున్. 357

మ. అరయం దప్పొకయింత నావలన లే దాధర్మపుత్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచేతన్ భూమిఁ గోల్పోయి ము
ష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు నత్యప్రౌఢిమై గెల్చె నే
తెరు వైనం దనయిచ్చ [2]తోఁ బడియె నింతే కాక యేఁబోఁటయె. 358

తే. మాత్స్యపాంచాల[3]పాండ్యాదిమనుజపతులఁ
గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి
విడిసి రింతియ కాక యివ్విధము నుగ్ర
కర్మమున కేము దొడఁగుట గలదె చెపుము. 359

క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృపధర్మ మాఁది మొనతలఁ బడినన్
మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా. 360

చ. చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక ముం
దఱ యటు వోవ నిచ్చితిఁ బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర
చ్చఱ నిలఁ బంచి చక్కసగ మక్కడ నెవ్వరికేని మద్బలం
బెఱుఁగక యీఁ దలంచినను [4]నే నది యేటికి సమ్మతించెదన్. 361

తే. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండు
సుతులు రాజ్యంబు చేయంగఁ [5]జూచుకలుచ

---

1. జెఱుపను మాదెసఁ గడుఁ. 2. లోమెలఁగి రింతే. 3. యాదవమనుజ. 4. నే నట.
5. జూచు టరయ.

నాకు నీఁ దీఱునే యింక నాఁటిచూఱ
లెక్కఁడివి ద్రోణభీష్ము లీదిక్కు సుమ్ము 362

ఉ. ఏమును వారిఁ బంచికొని యేలుట కల్గదు పల్కకుండుము మిం
కేమియు వాఁడిసూది మొన యింతక మోఁపినయంతమాత్రగుఱ్ఱ
భూమి యొసర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుఁ గొని రాజ్యము చేయుట నిశ్చయించితిన్. 363

తే. అనిన విని కిన్కఁ బూనినయలఁతినగవు
చెలువు మొగమున కొక క్రొత్త[1]పోలు పొనర్పఁ
బుండరీకాక్షుఁ [2]డగు పెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు. 364

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్న తండు చేసిన దుర్నయంబు చెప్పుట

క. మొనతలఁ బడియెదు నీచెప్పినయట్టుల తప్పు లేదు బిఱుదుల రై నీ
వును వీరు నిలువుఁ డిదె భండన మెల్లియ వచ్చె నూఱటలు కనుఁ డింకన్. 365

సీ. అరయంగఁ దప్పు లే దంటి నీవలన నీ, డొకనాఁడు చేసితివొక్కనాఁడు
చేయవె నీజనించినయది యాదిగా, నుడుగక పాండవేయులకుఁ జాల
నెగ్గు చేసితి విష మిడి పెనుఁబాములఁ, గఱపించి నీరిలోఁ గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁ, దలఁచినఁ గావక ధర్మరక్షఁ

ఆ. జేసి నెగడి రాచసిరి నొంది యున్నఁ జూ, పోఁక కీవు తీవ్రపాపబుద్ధిఁ
గనమి జూద మొకటి కల్పించి కపటంబు, సేయ దాననెల్ల చేటుఃబుట్టె. 366

తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి సతుల, తలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి
చిర లొలిపింతురే యిట్టి[3]వారి నెందుఁ, దడవుమా నీ వొకండవు తక్క నధిప. 367

ఉ అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు కొల్వులోపలం
జెప్పెడునట్టివే కులము శీలముఁ గల్గినపుణ్యకాంత [4]క
ట్లొప్పమి చేయు పెల్లఁ [5]గని యున్నజనంబులు వించునుండఁగాఁ
ద ప్పొకయింత లే దనువిధం బది నీక చనుం గుమారకా. 368

తే. ఎత్తి విడిసినవా రని యెల్ల తప్పఁ, బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకుఁ గలదె
ద్రోణభీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ, జెప్పతగుమాట[6] లేమియుఁ జెవులుసొరవు

క. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్త్రులకు మే లగుఁ దానిక యే
నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింప కునికి యెఱిఁగి యెఱిఁగియున్. 370

వ. అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం బడియెడు
దుర్యోధనునకు దుశ్శాసనుం డి ట్లనియె. 371

---

1. చెలు వొనర్పఁ. 2. డును డిల్లఁ బోయి. 3. క్రూరు నెందుఁ. 4. న, ట్లొప్పమి. 5. గని ప్రోలిజనంబులు. 6. లింకేమి చెవులు.

మ. జనకుండున్ గురుభీష్ములుం దగినకర్జం బొప్పు లై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగుఁ గాదు తమబుద్ధిం బోయి [1]సంధాన మి
ట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు నిచ్చో క్షేపించువా రెంతవ
ట్టు నిజం బిప్పుట నింక నీయునికి నెట్లుం గీడు పుట్టుం జుమీ. 372

ఆ. అనిన బాహ్లికాదు లగుకురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచి పోయె సంచలించెఁ గొలువు 373

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము, శకునియును వారిపాంగైనజనపతులును
బోయి రమ్మెయిఁ జని యొక్క ప్రోవు గట్టి, వేఱ యంతంత నుండిరి కోఁటడమున.

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు. 375

చ. ఇతఁ డిది యేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి చెడి లోభమోహమదమత్సరముల్ తనుఁ ద్రిప్ప నిట్లసం
గతమునఁ బోయె వీనివెనుకం జని రేమి తలంచియో మహీ
[2]పతులును వీరు కొంద[3]అతిఘోరపుమానుసు లేమి చేయుదున్. 376

తే. అని జనార్దనుఁ గనుఁగొని యకట కాల
పక్వ మయ్యె నీనరపతి [4]ప్రతతి యెల్ల
ననుడుఁ దగువారి దెసఁ గలయంగఁ జూచి
తగవు మెయి నిట్టు లనియె నన్నగధరుండు. 377

శా. ఈదుర్యోధనుఁ డింతగర్వి యగు నే యీయున్న వా రెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్ప దని చర్చింపండ యీభంగికిన్
లేదే యొండు తెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరుని [5]బోఁచే భేద మీజాతికిన్.* 378

ఉ. కంసుఁడు నిట్ల తండ్రి మది కందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము చేసినం గులమువారలు నా కెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయువైద్యునిక్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్. 379

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు, వంశ మధికగౌరవంబు నొందుఁ
గూడి మనుట కలుగుఁ గురుపాండవులకు ని, త్తెఱఁగుచూడ మీకు సుఱవ కాదె.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డదరిపడి విదురున కి ట్లనియె. 381

ఆ. బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగ, నేర్చు వచ్చి కొడుకుఁ దేర్చి పోవుఁ
గాన వేగ నీవు గాంధారిఁ దోడి తె, మ్మనుడు నరిగి యతఁడు నట్ల చేసె. 382

---

1. సంధాన మిం, పొనరం. 2. భృతులును. 3. అతిబీరపుమానుసు. 4. ప్రచయమునకు; ప్రకరమునకు. 5. బొందే నీతి యీజాతికిన్; బొందే నీచుఁ డేజాతికిన్. * వ. అని మఱియుఁ గృష్ణుం డి ట్లనియె.' అను నొక వచనము గలదు.

వ. అద్దేవియు, 383

క. చనుదెంచి యుచితపీఠం, బున నున్నం గురువిభుం డపొలఁతుకతో ని
ట్లను నీతనూభవుఁడు దు, ర్వినయంబునఁ జనియె నిట్టివెంగలి కలఁడే. 384

క. నీ వైనఁ జెప్పి శాంతుం, [1]గావింపఁగ నోపుదేనిఁ గౌరవకుల మీ
గోవిందుశాసనము సం, భావింపం గాంచి చెడక బ్రదుకుం జుమ్మీ. 385

తే. అనుడు నీపుత్త్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి, యెఱిఁగి వానివశంబున నేలపోయె
దీవు పాండవులకు నేమి యిచ్చితేని, నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప చెపుమ. 386

క. అని గాంధారి పతియుఁ దా, నును విదురుం బనిచె నందనుం బిలువ నతం
డును మొగము జేవుఱింపఁగఁ, [2]జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁ డై.

వ. మున్ను తనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుం డై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబుకొలందియుఁ గులజనచిత్తప్రకారంబును బాండుపుత్త్రులబలపరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెఱంగుపడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల నాడిన నమ్మాటలదెస ననాదరంబు చేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి వారును దానును దుర్మంత్రంబునకుం జొచ్చె.

**దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట**

క. హరితలఁ [3]బొప్పదు భీష్ముని, గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ, డరయ నతనివచనరచన నంతయుఁ దెలిసెన్. 389

క. మును దాఁ గంసునిఁ బరిమా, ర్చినచందము వారి కెల్లఁ జెప్పెడుఁ దనకున్
మును మనము కడఁగి [4]వెసఁ బ, ట్టినఁ గార్యం బగుఁ జలంబు డింపకుఁ డింకన్.

తే. పట్టి యీతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి
వచ్చి రేనియు నిర్జింపవచ్చుఁ గోఱ, లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి చేయు. 391

వ. అని విచారించె నిట్లు దుష్కార్యాలోచనంబు చేసి దుర్యోధనదుశ్శాసనశకునికర్ణు లగుదుష్టచతుష్టయంబు మొదలుగాఁ గలయవినీతులు దై తేయమర్దను మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున. 392

చ. అడఁకువ లేమి నల్క యురియాడుట నొండొరుఁ గూడ కుండుటన్
బుడిబుడి మాటలాడుటను బోవుచు వచ్చుచుఁ [5]గ్రందు గ్రమ్మఱం
బడుటను దెల్ల మైన మును పన్నుగఁ దాఁ బరికించి యున్కి న
ప్పుడు వారిఁ బట్టుసంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. 393

---

1. గావింపఁగఁ జాలితేని. 2. జనుదెంచెన్ మగుడ. 3. పొప్పెడు. 4. తనుఁ. 5. గ్రందఁ గ్రమ్మఱన్, బడుటకుఁ దెల్ల.

తే. బఱటి కొనిపోయి కృతవర్మఁ [1]బన్నఁ బనిచె, నీవు బలమును వాకిట నిలుపు మేను
లోపలికి నెల్ల జాలుదుఁ బాపబుద్ధు, లన్న దెసఁ దప్పి రని నిర్భయమునఁ జెప్పె.

వ. ఇట్లు పరమాప్తుం డగుహార్దిక్యు నటు పుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకు [2]నత్తెఱం గెల్ల నెఱింగించి తదనుమతిం గౌరవేశ్వరబాహ్లికభీష్మ విదురులతో ని ట్లనియె. 395

మ. అదె కౌరవ్య [3]లశక్తదుర్జనత చేసం బూని పైఁ [4]బాఱఁ జూ
చెద రప్తై దమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకుం
బొదువం దారు తలంచు టెల్ల ననలంబుం జీర బంధింపఁగా
మది నూహించినయట్లు కాక తమదుర్మంత్రంబులం బోవునే. 396

వ. అనిన విదురుం డదరిపడి వైచిత్రవీర్యున కి ట్లనియె. 397

ఉ. భూవర నీతనూభవులు పుణ్యు నగణ్యపరాక్రము న్హరిం
గేవలమర్త్యుఁ గాఁ దలఁచి కిట్టినఁ బట్టనె దారు మంటపై
వావిరిఁ గ్రమ్మునాశలభవర్గముచాడ్పున మ్రంది పోరె కా
లావధి [5]యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్. 398

వ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కి ట్లనియె. 399

తే. రోషము నాపయిం గలిగి [6]క్రూరతఁ గౌరవు లింత సేఁత సం
తోషమ నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర [7]యింతక పోయి వచ్చెదన్. 400

క. [8]అనుడు ససంభ్రమముగ నజ్జనపతి దుశ్శాసనాదిసకలపరిజనం
బును నాదుర్జనునిం దోడ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం జని యతఁడున్. 401

వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డి ట్లనియె 402

చ. అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీ డొనరింప నీవు నీ
తులువలు నుత్సహించితిరి దుర్మతులార సమీరు మీకుఁ [9]జోఁ
కలవడి పట్టవచ్చునె మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా
నలుఁ జమరంగ శక్యమె వినాశముఁ బొందెద రేమి చేయుదున్. 403

ఆ. అనిన విదురుఁ డిట్టు లను సుయోధనుతోడ, బాలకేళిఁ బోడంగి లీలఁ గృష్ణుఁ
డెచట నెచట నెవ్వ రెవ్వరి నేమేమి, చేసె వినవె యేల చెడియె దిట్లు. 404

---

1. బనిచె నీవు, బలములును గూడి వాకిట. 2. నక్కార్యంబు నల్లన నెఱింగించి. 3. లశక్తి 4. బాఱుతెం. 5. యయ్యె నిప్పుడు దలంపఁగ వారికి. 6. క్రూరత మూర్ఖుల కింత. 7. యింతటఁ బోయి. 8. అన విని సంభ్రమముగ. 9. జోఁ, కలవడ; జే, నలవడ.

వ. అనియె నట్టియెడఁ గట్టెదుర నున్న యక్కురుపతితనూజుం జక్కం జూచి యే
నొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు చేసె
దనుచు దరహాసంబు చేయు వాసుదేవుని ఫాలప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున
విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ
కుబేరులు నాదిత్యవసురుద్రవిశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి హలగాండీవమండిత
బాహు లగుబలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబులను నిజాయుధహస్తు లగు
యుధిష్ఠిరభీమనకులసహదేవులు వీఁపునను వివిధప్రహరణపాణులగు యదువృష్ణి
భోజాంధకవీరు లూరులను బ్రభవించిరి జనితనానాహస్తవిన్యస్తంబులయి శంఖ
చక్రగదాఖడ్గశక్తిశార్ఙ్గప్రముఖనిఖిలసాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసా
వివరంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపం
బులం దరణికిరణనిభప్రభలు వెడలె నిట్లు దుర్నిరీక్ష్యం బగు నత్తేజోరూపంబుఁ
గనుంగొనం గొలఁదిగాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయా
నకరసంబుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ నప్పుండరీకాక్షుండు నార
దాది మహామునులవలనను భీష్మవిదురద్రోణసంజయులయందును గరుణాంతరం
గితంబగు కటాక్షవీక్షణం బొలయ వారలకు దివ్యదృష్టి యొసంగిన నాపుణ్య
పురుషులు సాంద్రానందంబునం దేలుచుండి రయ్యవసరంబున. 405

తే. దేవదుందుభివ్రాతంబు తివిరెఁ గల్పవృక్షపుష్పధారామయవృష్టి కురిసె
సిద్ధసాధ్యవిద్యాధరశ్రేణి భక్తి, నిచ్చు జయజయశబ్దంబు లెసఁగెఁ జదల. 406

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు [1]విష్ణుని దివ్యవిజృంభణంబు కావ
లయు నని యూహించి. 407

క. కరుణింపుము సంశ్రితభయ, హారణధురీణ సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేఁడెద భవ, చ్చరణంబులు కనుఁగొనం బ్రసాదింపఁగదే. 408

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగునప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి కద్భుతం బడర సమ్మదపూరము క్రమ్మ నాతఁడుం
గనుఁగొని భక్తి మ్రొక్కి నినుఁ గంటిఁ గృతార్థుఁడ నైతి నింక నొ
ల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే. 409

క. అనిన పలుకులకు నచ్చటి, జను లెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం
గొను చుండి రపుడు తమనెమ్మనమ్ము [2]లాశ్చర్యరసనిమగ్నంబులు గాన్. 410

వ. తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతనికన్ను
లెప్పటియట్ల కావించి నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీంద్రుల
నామంత్రణంబు చేయ నమ్మహాత్ము లంతర్ధానంబు చేసిరి తానును సముత్థానంబు

1. కృష్ణుని దివ్యనిరామయంవిజృం; విశ్వరూపదివ్యవిజృం. 2. లాశ్చర్యమానమగ్నం.

చేసి యంతకు మున్న సన్నిహితు లై యున్న కృతవర్మ కరంబును సాత్యకిహస్తం
బును నవలంబించి యూరక వెడలె నని చెప్పిన. 411

ఆ. ఇవ్విధమునఁ గృష్ణుఁ [1]డేఁగినపిదపటి, కథ వినంగ నాకుఁ గౌతుకంబు
మనము నిండి కడలుకొనుచున్న యది వివరించి చెప్పు ముని[2]వరేణ్య యనుఁడు.

ఉ. [3]భక్తమనఃప్రమోదకరపాదసరోజవికాస చేతనా
శక్తిమయప్రభావ మునిసంస్తుత సాత్వవతేయభారతీ
ప్రోక్తనిగూఢసంప్రకట[4]భూమసమాశ్రయ వత్సలత్వసు
వ్యక్తకృపాభిరామ గుణవర్జన నిష్కల నిత్య పుష్కలా. 413

క. అవ్యయ [5]నిర్మలవిభవా, దివ్యప్రభవా సుఖైకదీప్తానుభవా
నవ్యత్వనిత్య యతిసం, సేవ్యసుసాంగత్య లోకజీవనకృత్యా. 414

మాలిని.—

రవిశశిమయనేత్రా ప్రస్ఫురత్కాంతిహృద్యా
నవజరఠవికారన్యాస లీలానవద్యా
వివృతనిగమశాఖావిశ్రుతాగ్ర్యకవేద్యా
వివిధ[6]నియతచర్యావిత్తచిత్తప్రసాద్యా. 415

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందుఁ
దృతీయాశ్వాసము

1. డేఁగిన పిమ్మటి. 2. వరేణ్య యిపుడు. 3. భక్తజన. 4. భూరిసమాశ్రయ. 5. నిర్మలభావా, సువ్యక్తసుఖైకదీప సుఖదానుభవా. 6. నియమచర్యావృత్తచిత్త.

శ్రీ ర స్తు

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఉద్యోగపర్వము - చతుర్థాశ్వాసము

మత్తులసీ[1]పల్లవ
దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమత్వో
ద్దామప్రభాస్థిమాలా
శ్యామాయితవిపులవక్ష హరిహరనాథా. 1

కృష్ణుండు కుంతియింటికిం జని యాయమతో మాటలాడుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియెం గృష్ణుం డత్తెఱంగున వెడలిన విస్మితయై గాంధారి యభ్యంతరమందిరంబున కరుగం గౌరవు లెల్లను బంధుమిత్రసహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగంబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు కడచినప్పుడు దారుకుండు తేరుతోఁగలపై నుండి పొడసూపి కేలు మొగిడ్చి ఫాలభాగంబునం గదియించినం బత్ప్రదేశంబున నిలిచి వారల దెస మరలి చూచి మీ రింక నిలువుం డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి. 2

ఉ. వీరును [2]పాండుపుత్రులును వేరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యేనటులు బుద్ధులు చెప్పినభంగియుం గులా
చారము నిర్వహింపఁ బలుచందములుం దగ దుగ్ఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర నీదుసన్నిధిన్. 3

వ. అని వెండియు. 4

తే. నీకు శుద్ధుండ నగుటయ నిఖిలబంధు, మిత్రగురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష నిర్దోషుండ [3]నగుట గాన, నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు.

వ. అనిన విని యచ్యుతుండు బాహ్లికభీష్మద్రోణకృపప్రముఖనిఖిలవిశిష్టజనంబుల నాలోకించి. 6

---

1. వల్లభ. 2. పాండునందనులు. 3. నట్లు గాన.

తే. ఇప్పు డీసభఁ బుట్టినయంతవట్టు, మీకుఁ దెల్లంబు గాదె యీ మేదినీవి
భుండు [1]తా నేమిటికిని ముఖ్యుండఁ గాను,[2]దప్పు తనదెస లే దని చెప్పి విడిచె. 7

వ. కావున నాకు నియ్యెడం దడయం బని లేదు పోయి వచ్చెద ధర్మపుత్త్రునకు నింతవృత్తాంతం బెఱింగింప వలయు నని పలికి వారల నామంత్రణంబు చేసిన వాఁడై రథారోహణంబు చేసి ధృతరాష్ట్రుండును నచటి జనంబులును వెనుకం జనఁ జని కుంతీగృహద్వారంబున నరదంబు డిగ్గి. 8

క. వారందఱుఁ దనతోడన, గారవమున నరుగుదేరఁ గాఁ జొచ్చి మహో
దారుఁడు కుంతీచరణాం,భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్. 9

క. కౌరవసభఁ దా నాడిన, గౌరవవాక్యములుఁ గార్యఖడ్గక్రమవా
క్పారములు సుయోధను [3]దు,ష్ప్రారంభము నల్పవచనపద్ధతిఁ జెప్పెన్. 10

వ. ఇట్లు ధృతరాష్ట్రుకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును. 11

తే. కురుకుమారులు తమ యంతఁ గుడిచి క్రొవ్వి, మీఁదెఱుంగరు [4]మా కేమి మేలకాక
నాలుకలు గ్రోయు నర్జునానలము తగిన,యొరగొనంగని సంతృప్తి యొసఁగ మెసఁగు. 12

వ. పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద వారికిం దగినబుద్ధు లానతిమ్మనిన నద్దేవి విక్రమోపజీవిత లయినముచుకుందుండును సృంజయుండును ననుతొంటి నరపతుల చరిత్రంబులు యుధిష్ఠిరుండు వీరిని వినండో కాక యని పలికి యెల్లవారును వినుచుండ వెండియు ని ట్లనియె. 13

ఉ. [5]రాజుల కింపు నారయఁ బరాక్రమజీవనవృత్తి తక్క నొం
డోజ నిషిద్ధ మండ్రు మును లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా. 14

క. నీవియ్యంబులు సంధియ, కావింపం బడిరి వీరిఁ గలయుట కష్టం
బా వెరవు తప్పుటయ మేల్లై వచ్చెం బొమ్ము విడువు మనుమానంబున్. 15

మ. నిజవంశోచిత [6]వీరవృత్తమున కున్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహము చేయ కున్న నకటా దైన్యంబు పాటిల్లదే
భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీపాం దొప్పునే నీవు స
ర్వజగన్మాన్యుఁడ విందు రాఁ దగునె దైవం బిట్లు తప్పించునే. 16

వ. అని యంత నిలువక కొంతి యి ట్లనియె. 17

క. మఱచిరె కొలువున ద్రౌపదిఁ, బఱచినబన్నంబు ధర్మపథము దొఱంగన్

---

1. నేనేమిటికిని. 2. దప్పు (నా) తనమీఁద లే దని చెప్పికొనియె. 3. దు, ష్టారంభము నల్పవచనగతితోఁ జెప్పెన్. 4. నెట్టైన మేలు. 5. రాజులకుం బరాక్రమము రాజసజీవనవృత్తి దక్క నొం. 6. మైనవృత్తమున.

వెఱచుట [1]కప్పటి కది దగుఁ, జెఱచినచో వెదక వలదె చిరతరకీర్తిన్. 18

శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్ని రహస్యోక్తులు పలుకుట

వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని [2]యచ్యుతుండు మ్రొక్కిన దీవించి యేను సుఖం బున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతులలావునం గనిన జీవనంబున బ్రదుకుం డనుము పోయి రమ్మని వీడుకొల్పిన సింహాగమనసుందరం బుగా వెడలి తనతోడన కదలి వచ్చినధృతరాష్ట్రాదుల నిలువం బనిచి రథారోహ ణంబు చేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్నునిచి వత్తుగాని రమ్మని కరంబు సాఁచి చెయి వట్టి తనయరదం బెక్కించికొని సాత్యకి వేసరి నెక్కి కెలనం జను దేరం గదలి చని యనుపవచ్చినకృతవర్మ నుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగునవసరంబునఁ బౌరలోకంబు. 19

ఉ. అక్కట వాసుదేవుకోపను పాదరణంబునఁ జేయ రైరి వీ
రెక్కడిబుద్ధిమంతు లని నిందును నందును లోక మెల్ల బే
రుక్కున మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము చేసి రక్టి యీ
యుక్కివు లెందునుం గలరె యొప్పరు వో ధృతరాష్ట్రనందనుల్. 20

వ. అని మఱియు ననేకు లనేకప్రకారంబులం బలుకుచు నికుగెలంకులం [4]జూచు చుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నట ధృతరాష్ట్రుండును మగిడి కొలువుకూటంబునకు వచ్చి యొప్పటివారలు పరివేష్టింప నుండి కృష్ణునివలని మాటలాడుచున్న సమయంబున సుయోధనుతో భీష్మద్రోణు లిట్లనిరి. 21

చ. పలుకునె యిట్లు గొంతి విని బమ్మెరపోయితి మింతబెట్టిదం
బు లగునె మాట లయ్యమయుఁ బుణ్యుఁడు కృష్ణుఁడు కార్యవాదముల్
[5]పలికెడువార లిట్లు తెగఁ బాఱెరి ధర్మజవారిరాశికిం
జెలియలికట్ట పాసె మనచే నగుకర్జముచంద మెట్టిదో. 22

వ. అని పలికి వెండియు. 23

శా. మాకుం జూడఁగఁ బోలు [6]కార్య మిది ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుండై నయుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతిమై
నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యే పొప్ప దెందుం దుదిఁ
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా. 24

వ. అనిన విని దుర్యోధనుండు మొగంబు రాఁజ చుండ నూర కుండె గాంగేయుం డును గురుండును దిగ్గన లేచి యతని నవలోకించి. 25

క. కురునృప విను సంసారము, దరి ద్రొక్కిన[7]వార మింకఁ దలఁకెడమే సం
గరమునకు నేము నీకై, పొరలితి మెల్లిన నగును బోయెద మనుచున్. 26

1. కవ్వరి కిందఱు, చెఱ. 2. యతండు మ్రొక్కిన. 3. పలు కా. 4. జనుచుండఁ. 5. వలి కెడు నట్టివారు దెగఁ బాఱిరి. 6. వాక్య మిది. 7. వార మేముఁ.

క. అరిగిరి రాజును సభ్యం,తరమునకుం జనియె రాజతనయుండు బహిర్గ
పరివారముఁ బో మ్మని మిత్ర,పరిజనుఁ డై యేఁగె నాత్మభవనంబునకున్. 27

తే. అంత నక్కడ నచ్యుతుఁ డరిగి యరిగి, యధికసంప్రీతి తలకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యి ట్లనియె [1]నెమ్మి, నన్యు లెవ్వరు విన కుండ నతనితోడ.

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం,వేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమునఁ, గన్నియతఱి గొంతి కన్న వాఁడ
వగుటఁ బాండునృపాలున గ్రసుతుండవు, ధర్మమార్గం బిది ధర్మతనయుఁ
డాదిగాఁ గలతమ్ములందఱు నాచేత, నెఱిఁగి నీయడుగుల కెఱఁగి సకల

ఆ. పుత్రమిత్రబంధుభూరిసేనాసమ,న్వితము గాఁగఁ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబు గట్టు నుజ్జ్వలుఁడ [2]వగుదు రమ్ము వారికడకు. 29

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు తొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీరథంబున నుండి నీకు ధవళ చామరంబులు వైచు వాయుపుత్రుండు సితచ్ఛత్రంబు పట్టు సవ్యసాచి సారథ్యంబు చేయు మఱియుఁ బాంచాలయాదవపాండ్యమాత్స్యులు లోనుగాఁ గలరాజలోకంబుతోడఁ గవలు నభిమన్యుప్రభృతికుమారులు బెరయ నేమెల్లం బలసి పరివేష్టించి వత్తు మిట్టిమహేంద్రవిభవంబున మహనీయుండ [3]వగుచు మహీచక్రం బేలు మని మఱియును. 30

క. పాంచాలరాజపుత్రియు, నంచితముగ నిన్నుఁ బొందు [4]నార్వ్యరవరుసన్
సంచితపుణ్యుఁడ వీ వొక, యించుకయును వేఱు చేయ కేతె మ్మెలమిన్. 31

వ. ఇ ట్లనఁ గుంతికి సమస్తబంధుమిత్రులకుఁ బ్రియం బగు ననిన విని రహస్యంబుగా రాధేయుండు మాధవున కి ట్లనియె. 32

## కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగినయుత్తరం బిచ్చుట

చ. వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి ననుం గనికుంతి యెంతయుం
జెడ నది వైచి పోయెఁ గృపఁ జేకొని సూతుఁడు తెచ్చి తాను మున్
గొడుకులఁ గాన కున్కిఁ బ్రియకుం దగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను ల
ప్పడఁతియు నప్పు డావిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీల యై. 33

క. మూత్రపురీషాదులు తమ, గాత్రములం [6]దింక వారు గారవ మెసఁగం
బుత్త్రుం [7]డని సంవర్ధిత, గాత్రునిఁ గాఁ జేసి రింత[8]కాలముఁ గూర్మిన్. 34

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల, [9]వాఁడఁ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం
బోఁడిమి సెడదే మదిఁ గడు, వాఁడి కలదె నాకు నకట వారిజనాభా. 35

---

1. నచట, నన్యు. 2. వగుమ. 3. వగుమ 4. నాఱవవరుసన్. 5. కుంతి నిర్దయన్, జెడ నటు వైచి. 6. దింకఁ బరమకారుణ్యమునన్. 7. డని నను వర్ధిత. 8. ఁగాలము నెమ్మిన్. 9. వాఁడఁ జుమీ..

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడ వని నన్ను నీవ చెప్పితివి రాధయు *నధిరథుండును నాకు జాతకర్మాదిసమస్తసంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించి రట్టితల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక వారలం బాసి యేను వచ్చుట ధర్మం బగునే యని పలికి వెండియు. 36

క. సోదరులుఁ [1]బ్రియులు ననుజులు, నాదెసఁ బెక్కండ్రు వారి నందఱ విడువం
గా దని యూహింపక దా,మోదర న న్నిట్లు పిలుచు టుచితమె చెప్పుమా. 37

వ. అదియునుం గాక. 38

ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటిమానిసిఁ జేసి యుండ నే
నే తగ [2]వ్రాఁది యాకురుకులేశ్వరుఁ బాయుదు ముట్ట వచ్చినన్. 39

క. నను నయ్యర్జునునకు నెదు, రని పెద్దయు నమ్మి యుండు నక్కట దుర్యో
ధనుఁ డా[3]నమ్మిగ వమ్ముగఁ, జను నే పాండవులఁ గలయఁ జన నా కనఘా. 40

ఆ. ఏను నర్జునుండు నెక్క టెక్కటిఁ దల,పడక యున్న నగరె పుడమిజనము
లందు [4]నాదువచ్చు టతనికి నపకీర్తి, యనిన నాకు వేఱె యడుగ నేల. 41

క. హిత ముపదేశించితి నీ, వతినిర్మలబుద్ధి వగుట నైనను నిది నా
మతి సొరదు రహస్యము ర,క్షితముగఁ బాటింపు మయ్య చిత్తములోనన్. 42

వ. అది యేమిటి కంటేని. 43

తే. ధర్మతనయుండు తానునాతమ్ముఁడగుట, యెఱిఁగెనేనియు సామ్రాజ్య మేలపూను
నట్టిధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయు, వలవదే శాశ్వతంబుగ [5]వసుధ కెల్ల. 44

క. అనుజులు ఋత్విజులుగ నీ, వని యిటు సేయు మని నీ వుపద్రష్టవు గా
విను కురుకుమారపశువిశ,సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. 45

వ. దానం బుణ్యభూమి యగుకురుక్షేత్రంబున మముబోంట్లెల్లను సద్గతి [6]వడయు దురుగాక యనిన విని వసుదేవనందనుండు సూతనందనున కిట్లనియె. 46

మ. [7]దయ నాయాడినమాటఁ [8]గైకొనవు సంతాపంబుఁ [9]దెచ్చుం జుమీ
స్మయ మెట్లుం దుది నీకు నర్జునునితో మాత్సర్య మైనం బరా
జయ మొండేఁ మృతి యొండెఁ గాక గెలువన్ శక్యంబె పెక్కండ్ర కిం
తియకాలం బగునట్టె నీమనము శాంతిం బొందఁగా నేర్చునే. 47

క. గాండీవముఁ గవదొనలు న,ఖండితదివ్యాస్త్రములు నొగలపై నేనుం
జండ [10]భుజబలము నై యు,ద్దండత నఁ డడర [11]నెదురఁ దరమే నీకున్. 48

* అతిరథుండు. 1. ప్రియులు తనయులు. 2. వేది. 3. నమ్మిక వమ్ముగ. 4. నేను వచ్చు 5. వసుధయెల్ల. 6. వడయుదుము గాక. 7. దయచే నాడిన; నే నాడిన. 8. గైకొనక; గైకొనమి 9. వచ్చుం జుమీ; జేయుం జుమీ. 10. భుజబలము పై. 11. గెలువఁ దరమే.

వ. ఎల్లభంగులం బాండవుల గెల్తు రని యట్లుండె నీవు పొమ్మిప్పుడ పోయి సుయోధనునకును గురుభీష్ములకును మీకుం దోడు వచ్చినరాజుల కందఱకుం జెప్పు మిమ్మాసంబు సౌమ్యంబై శీతోష్ణంబులు లేక పుష్పఫలోపేతంబును సమగ్రధాన్యంబును సులభయవ*సైంధవంబును నగుచు నొప్పి యున్నయది యేడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చు నది పుణ్యదినంబు నాఁడు భండనంబు గావలయు ననినఁ గానీనుండు కమలనాభున కిట్లనియె. 49

క. కలవు నిమిత్తస్వప్నంబులు కౌరవపాండవులకుఁ [1]బో టగు దానఁ
గెలు పయ్యుధిష్ఠిరునకును, గల దెఱుఁగుదు నీవు చెప్పఁగా నేమిటికిన్. 50

వ. అట్లు గాన కదా యే నందు రా నని పలికి మఱియును. 51

క. దీనికి మూలము శకునియు, నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ
[2]సూనుల వారలు కలసిన, రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా. 52

వ. ఈసమరసముద్రంబు [3]దఱియ నీఁది నిన్నుం గనియెదఁ గాదేని నూర్ధ్వలోకంబునం గాంచెద నీ వింక [4]నేమియుం బలుకకుము పనివినియెద నని కౌఁగిలించుకొనిన నట్లు కాక పొమ్మని విష్ణుండు వీడుకోలుప రాధేయుండు రథావతరణంబు చేసి కనకరత్నమయం బగుతనయరదం బెక్కి కరిపురంబున కరిగె నచ్యుతుండును సాత్యకిం దనరథం బెక్కించుకొని దారుకుం జూచి పద పద పోనిమ్ము పోనిమ్మని పలికి లలితాటోపకలితుం డగుచుఁ జనియె నట్టియెడ విదురుండు విషాదంబుతోఁ బాండురాజమహిషిపాలికిం జని యి ట్లనియె. 53

ఉ. అక్కట కౌరవాన్వయమహార్ణవ మింకెడునట్లు [5]పుట్టె నిం
దొక్కరుఁ డైనఁ గేశవుహితోక్తికి మేకొనఁ డయ్యె నర్జునుం
డెక్కటి తాన చాలుఁ దము నింపఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం
పెక్కినపాండునందనులయేడ్తెఱఁ దొల్లియుఁ దా రెఱుంగరే. 54

తే. [6]అన్ని పడియును బంధుక్షయంబు చేసి, యొల్ల కెల్లవిధంబుల నుపశమంబ
కోరి రప్పాండవేయులు వారి కిట్టి, దోసఁగు వచ్చునె తులువలతోడఁ బుట్టి. 55

వ. అని వెండియు నివ్విధంబుమాటలఁ బాండవులకుఁ గయ్యంపుటలజడిమైన వగపు తోఁప నాడుచుం గొండొకప్రొద్దు నిలిచి నిజనివాసంబునకుం బోయినయనంతరంబ కుంతి యి ట్లని వితర్కించె. 56

మ. తమవారిఁ సిరికై వధించు టిది సద్ధర్మంబె యక్లేశకృ
త్యమె తాఁ గయ్యము ద్రోణభీష్మకృపకర్ణాటోపముల్ మాన్పు ట
ల్పములం దీఱునె యందు నర్జునియుల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము [7]భీమాదులమీఁదఁ దక్కొరుల కుత్సాహంబు లేదాజికిన్. 57

---

* సేంధనంబును. 1. బో రగు. 2. సూనులు వారలఁ గలయక, రా నాకెటు సంభవించు. 3. గడవ నీఁది. 4. నేమియు నానతీయకు. 5. తోఁచె. 6. ఆహవంబున బంధు. 7. భీమాదులయందుఁ.

వ. అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదరస్నేహం బావహింపఁజేద నట్లయిన నాహవంబువలని కడంక యుడుగ కుండునె యని విచారించి యతనిపాలికిం [1]బోవ నిశ్చయించి యుచితప్రకారంబున వెడలి యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబున కరిగి యతనికి జపకాలం బయి యునికిం జూచి వెనుకవలనఁ గూర్చుండఁ గొండొకసేపునకు జపంబు దీఱె కలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి కానీనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాదనంబుచేసి నీవు విజయంచేసిన కార్యం బేమి నాకుం జేయం గలపని యెయ్యది యానతి మ్మనినఁ గుంతి యేకాంతంబుగా ని ట్లనియె 58

కుంతీదేవి కర్ణునకు నతండు తనపుత్త్రుం డగుటఁ దెలుపుట

సీ. వినుము సూతాన్వయంబున నీవు పుట్టుట, బొంకు మాకుంతిభోజునింటఁ
గన్నియనాఁడు భాస్కరుని [2]రావించితి, వరమంత్రబలమున వచ్చి యతఁడు
సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు, నాకుఁ గావునఁ బాండునందనుండ
వగుదు ధర్మస్థితి నట్టినీ పితరులఁ, గొలువ నేటికిఁ గురుకులవరేణ్య
తే. ధర్మతనయాదు లైననీతమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ
[3]వేలు మీలోక మెల్ల నీ కేల రాధ, కొడు కితం డనుతక్కువ కొడుకుఁగుఱ్ఱ. 59

క. అని పలికినయవసరమున, నినబింబములోన నుండి యిది నిజ మిబ్భం
గిన నెగడ వన్న మే లగు, నను వాక్యము వెడలెఁ గర్ణుఁ డాకర్ణింపన్. 60

తే. దాని వినియును నప్పుడు రాధాసుతుండు, తిరుగఁబడనిమనంబుతో ధీరవృత్తిఁ
దల్లి కి ట్లను [4]నీమాట తథ్య మగున, యైన నొక్కటి చెప్పెద నవధరింపు. 61

క. క్షత్రియసంస్కారమునకుఁ, బాత్రముగా నీవు నన్నుఁ బాటింప విహా
ముత్రఫలములకు నీ కేఁ, బుత్త్రుఁడ నని వచ్చు [5]టెంకఁ బొసఁగునె చెప్పుమా. 62

వ. సూర్యానుగ్రహంబునఁ జేసి నింద్యంబు గాక తక్కె నేనియు నాజన్మంబు పరమ రహస్యంబునై యున్నయది దీనిఁ బ్రకాశంబు [6]చేయుట మన కెంతమేలట్లుం గాక.

ఆ. విజయువిక్రమంబు విఖ్యాతమై యుండ, నేను గుంతికొడుకు భానుజుండ
ననుచు నతనిఁ జేర [7]నరిగిన నతనికి, వెఱచి పోయె ననరె వేయు నేల. 64

క. కడిఁదిపగఱ నేఁ డెప్పఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు కౌరవనాథుం
జెడుఁ గాక యంచు నిత్తఱి, విడువఁ దగునె [8]యతనివలన వెలసినవాఁడన్. 65

క. కౌరవులచేతఁ [9]గుడిచిన, వారికి నిది సమయ మెట్టివారును సంగ్రా
మారంభంబునఁ బాయుదు, రే రాజులు మనలఁ దిట్టరే యట్లయినన్. 66

1. బో నిశ్చయించి. 2. నారాధించ నంతర్బలంబున నతఁడు వచ్చి. 3. వేలు భూలోక మెల్లను నేల రాధ. 4. తనమాట తథ్య మరయ. 5. టెంకఁ బోలునె. 6. చేయ కుండుట. 7. నరిగిన నన్నుఁ దా. 8. యతనిచేత పెల. 9. వెలసిన, వారికి,

వ. ఏ నవశ్యంబును దుర్యోధనునకై నీ కొడుకులతోడం బెనంగుదు. 67

ఉ. నీపలు కెంత [1]పాటించను నిర్ణయ మిట్టిద కాని యొండు లే
దీ పనిమీఁది భారమున నీ విట వచ్చితి కాన పాండవుల్
చేపడి రేనిఁ జంప నఱ సేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుం జుమీ. 68

ఆ. సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి, కరమ యతఁడు లోనుగాఁగ నేవు
రేను లోనుగాఁగ నేవురు గాని నీ, కొడుకు లార్వు రనుట విడువు మింక. 69

చ. అనుటయు నప్డు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను నిది దైవ సంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే
యనుపమసత్యవిస్ఫురణ నాడినమాట మఱవకు మన్న నీ
యనుజుల నల్వురం గడపు మర్జునుఁ జేతకు సమ్మతించితిన్. 70

ఆ. అనుచుఁ గౌఁగిలింప నక్కజం డట్లకా, కని ప్రియంబు మెఱయ వినతుఁ డైన
నరిగె సదనమునకు నద్దేవి యతఁడును, జనియె నిజనివాసమునకుఁ బ్రీతి. 71

వ. అక్కడ వాసుదేవుం [2]డుచిత ప్రయాణంబుల నుపప్లావ్యంబునకుం జని ధర్మ
తనయు చేతం బూజితుం డయి భీమసేనాదులు విరాటద్రుపదముఖ్యు లగు తగు
వారలుఁ దన్నుం గాంచిన వారి నెల్ల నభినందించి కొలువున నుండి యుధి
ష్ఠిరుతో ని ట్లనియె. 72

తే. ధార్తరాష్ట్రు లున్మత్తులు తగిన పలుకు, లేల విని సంధి చేయుట కిచ్చగింతు
రెదిరిఁ దమ్మును [3]నెఱిఁగిర యేని వా, లంత లంతలు చేయుదు రయ్య నాఁడు.

వ. అని యెల్లవారును వినఁ దన పోయివచ్చిన కార్యంబు తెఱం గెఱింగించి పథిశ్ర
మంబు పుచ్చువాఁ డయి పుండరీకాక్షుండు నిజమందిరంబున కరిగె నాఁటి
రాత్రి ధర్మనందనుం డనుజ సహితంబుగా నుచిత ప్రదేశంబున నుండి గోవిం
దుని రావించి నీవు సుయోధనుతోఁ బలికిన [4] చందం బెట్టు లతండు విని యెవ్వి
ధంబున నుత్తరం బిచ్చె నని యడిగిన నచ్యుతుఁ డి ట్లనియె. 74

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టిన విశేషంబులు తెలుపుట

క. కయ్యము కాని తెఱంగున, నెయ్యం బగునట్లు గాఁగ నెఱిఁ బలికితి నే
నెయ్యది [5]సుఖంబు పథ్యం, బెయ్యది యెఱుఁగంగఁ దథ్య మెయ్యది దానిన్. 75

తే. బహువిధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ, [6]జీఁదక న్నిడి తన పెడచెవులఁ బెట్టి
యీఱతొఱలు మఱుమాటలిచ్చి యపహ,సించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్ప నేల.

క. అనిన విని ధర్మజుం డి,ట్లను నప్పుడు తండ్రి యుచిత మాడఁడె భీష్మం
డును గురుఁడు విదురుఁడుం ద,క్కిన పెద్దలుఁ బలుకరే తగిన చందమునన్. 77

1. పోషినను. 2. డుచితప్రకారం. 3. నెఱిఁగినయేని. 4. చందం బెయ్యది యతం డేమి విధంబున. 5. శుభంబు పథ్యం. 6. జీఁదకను వెట్టి; జిఱుతకను పెట్టి.

క. నావుడు హరి యి ట్లను స,ద్భావమున విచిత్రవీర్య తనయుఁడుఁ దగ నా
నా విధములఁ జెప్పిన సం,భావన వినఁ డతఁడు పలుకుఁ [1]బ్రతికూలంబుల్. 78

సీ. శంతను పుణ్యవంశం బంకురించిన, చందంబు నంబికానందనుండు
జాత్యంధుఁ డై యుండ సామ్రాజ్యమంతయుఁ, బాలించి పాండునృపాలుఁ డతనిఁ
గొలిచి యుండుటయును గురుకులంబున కెల్లఁ, దేజంబుగా మీరు దిగ్విజయము
చేసి కావించినసిరి వారు వంచనఁ, గొనుటయు సత్య మకుంఠితముగ

తే. నీవు సమయంబు నడపిన నెఱియుఁ దండ్రి,పాలు మీకునీఁ దగుటయుఁ బాడిలేమి
[2]నడరఁ జెడుదురు కౌరవు లనియుఁ బెద్ద, లెల్లఁ జెప్పిరి మొగమోట యింత లేక.

క. అలయక యందఱుఁ జెప్పం, గల యంతయుఁ జెప్పి రతఁడు కటకటఁబడి య
క్కొలువు వెడలి పోయెం ద,మ్ములుఁ గర్ణుఁడు రాజలోకముం దో నరుగన్. 80

వ. ఇట్లు కొడుకు ముష్కరుం డై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి రావించి. 81

క. తగ [3]విదురుఁ బంచి యాతని, మగుడఁగఁ బిలిపించె నాయమయుఁ దనయునకుఁ గా
వగయును గూర్మియు వెరవును, మిగిలిన వచనముల సంధి మెయికొనఁ జెప్పన్. 82

వ. ఎవ్వ రెంత చెప్పినను గైకొనక కడంగి దుర్యోధనుండు తనకుం గలవారల
నెల్లను గురుక్షేత్రంబునకు నడవుం డని చెప్పం బనిచె భీష్ముని సేనాముఖంబు
చేసికొని యెత్తి పడియం గలవాఁ డిది ధార్తరాష్ట్రుల నిశ్చయం బేసును నా
యొపినంత సామవాదంబు లాడితి నారదాది మహామునులను సుయోధనునకు
బుద్ధులు చెప్పునట్లు చేసితి నేమి చెప్పినను నెంతటం బో కున్నం గినుక దెచ్చి
కొని జంకించియు భంగించియు ధిక్కరించియుఁ దృణీకరించియుం జూచితిఁ
గార్యంబు భగ్నం బగుట కొల్లక వెండియు శాంత వచనంబులు పలికితి నతం డశక్త
దుర్జనత చేయం జూచిన నమానుషంబు లగువానిం గొన్ని వెడమాయలం బన్ని
పెక్కుపోకలం బోయితి నెన్నిభంగుల సంధియ కావలయు నని పోరలం గల
యంతయుం బొరలితి నప్పాపాత్ముం డెట్లునుం జక్కంబడక తన చలంబుతోన
పొట్టుపోర లయ్యెఁ గయ్యంబు వోడచుం గాని యవశ్యంబును రాజ్యంబు
పాలిచ్చువాఁడు కాఁడు కౌరవులయెడ దండంబు దక్క నొం డుపాయంబు లేదు
మీకుం బోలిన తెఱంగు చేయుం డనిన ధర్మతనయుండు తమ్ములం గనుంగొని
యి ట్లనియె 83

క. కురుసభఁ బుట్టిన చందము, హరి యంతయుఁ జెప్పె నింక ననుమానము లే
దరి మర్దనమున కయ్యెడు, వెరవుం జేవయును [4]మెఱయ వెడలుఁడు కడఁకన్. 84

వ. అని పలికి యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుం డై యచ్యుతు నాలోకించి. 85

క. కురువంశము ద్రుంచుటకుం, జొరఁ జాలక నా మనంబు సుడివడియెడు నే

---

1. బ్రతివచనంబుల్. 2. నరయఁ జెడుదురు. 3. విదురుఁ బుచ్చి; బిలిచి (బెట్టి) యాతని, మగుడఁగ రావించి యాయమయుఁ. 4. మిగుల.

[1]వెరవును దొరకొనదు గదే, సరసీరుహనాభ పొందు సంపాదింపన్. 86

వ. నా మనంబును దమ్ముల తలంపును నీ వెఱుంగుదు ధార్తరాష్ట్రుల చందంబును భీష్మ ద్రోణ విదురాదుల చిత్తంబులును నెఱింగి వచ్చితి మాకు ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యంబు నిశ్చయింపు మనిన నారాయణుం డిట్లనియె. 87

ఉ. యుద్ధము కాక [2]కార్యమును నొండొక [3]బుద్ధియుఁ గల్గనేర్చునే
బుద్ధులు చెప్పు వాక్యముల పోల వినం డన నేల యట్టిచో
బద్ధునిఁ [4]జేయఁ జూచె ననుఁ బట్టి సుయోధనుఁ డింక నయ్యసం
బద్ధునితోడి సంధికి నుపాయము నా మతిఁ [5]దోఁప దెమ్మెయిన్. 88

వ. అని చెప్పి విదురుం డేకాంతంబున నాడినమాటలును భీష్మ ద్రోణ బాహ్లీకాదు లగు పెద్దలకు ధార్తరాష్ట్రులదెసం బుట్టిన మనఃక్షోభంబును గుంతి కౌరవులు వినం బలికిన పలుకులుం బ్రకటించి ధర్మపుత్త్రుపైఁ బాపంబు లేకునికిఁ దెలిపి సమరం బవశ్యకర్తవ్యంబుగా నిశ్చయించె నట్టియెడఁ దమ్ము లన్న మొగంబునం జూడ్కి నిలిపి యూరకుండి రతండు [6]వారలం గలయం గనుంగొని యి ట్లనియె. 89

ఉ. కౌరవకోటిచేత ఘనకష్టపుఁబాటు తలంపు వచ్చినం
గ్రూర విచేష్టితంబునకు గొంతి యొడంబడె బంధువర్గముం
ఘోరముగా వధించుటకుఁ [7]గోల్కొన కున్నది బుద్ధి మీరు ని
ర్ధారణ చేయుఁడా హితము ధర్మము నయ్యెడువృత్త మెట్టిదో. 90

వ. అనిన విని యర్జునుం డతని కి ట్లనియె. 91

చ. హితమును [8]ధర్మముం దగవు నిట్టిది నా మన మేమి నేర్తు మ
చ్యుతుఁడు సమస్త ధర్మపరిశోధకుఁ డా విదురుండుఁ బాండుభూ
పతిసతియుం దగం బలుకుపల్కుల సందియ మెల్లఁ బాసె ని
ట్లితఁడు రణంబు చేయుఁ డన నింక విచారము లెల్ల నేటికిన్. 92

ఆ. అనిన నట్ల కాక యఖిల ధర్మజ్ఞాన, ఘనుఁడు మనకు నేడుగడయుఁ దాన
శౌరి నిశ్చయింప సంశయం బేటికి, సంఘటింపుఁ డుగ్ర [9]సమరవిధము. 93

వ. అని యుధిష్ఠిరుండు [10]తమ్ములతో నెట్టకేలకుం దెగువ చెప్పి. 94

క. బాహాగర్వము విశదధ, [11]వ్యూహవిధిజ్ఞతయుఁ గలిగి యొకరుం డే డ
క్షోహిణులు నడపి భీష్మోత్సాహంబున కోర్చుచాపధరుఁ డెవ్వఁ డొకో. 95

వ. అట్టివానికి వాహినీనాయకత్వం బిచ్చి యభిషేకంబు చేయవలయు. 96

తే. అనిన సహదేవుఁ డి ట్లను [12]నధిప పుత్త్ర, పౌత్త్రసోదరవంతుండు బాహువీర్య

1. వెరవున దొరకొనఁ దగదే. 2. కార్యమను. 3. బెయ్యది గల్గుఁ జెప్పుమా. 4. జేయఁ జూపెదను. 5. దోఁచ దేమియున్. 6. వారల వలనను. 7. నూల్కొన; గూర్కొన; గోరకయు. 8. ధర్మమున్ మనకు. 9. సమరమునకు. 10. తమ్ములకుం గొడుకులకుఁ దేటపడం జెప్పి. 11. వ్యూహవిదగ్ధతయుం. 12. నధిక.

ఘనుఁడు మన కాశ్రయం బయి పనిచె మత్స్య
దేశపతి కాఁడె సేనాపతిత్వమునకు. 97

వ. అనవుడు నకులుండు. 98

చ. [1]బలఁగముఁ బెంపుఁ దేజమును బాహుబలంబును నగ్గలంబు పె
క్కు లెఱుఁగుఁ గార్యఖడ్గముఁ గుం దగు త్రోవలు ద్రోణులందు భీ
ష్ములదెసఁ గోపముం గలఁ డమోఘ పరాక్రమశాలి నీ బలం
బుల కధినాథుఁ గా ద్రుపదభూపతిఁ బట్టముఁ గట్టు టెట్లొకో. 99

వ. అనుటయుం దదనంతరంబ ధనంజయుండు. 100

### ధృష్టద్యుమ్నాదులకు సేనానాయకత్వంబు నిర్ణయించుట

సీ. అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశ, మొనరించు దానికై యుద్భవించె
రథరథ్యములు ధనుర్బాణంబులును దను,స్త్రాణఖడ్గములు నుద్దామలీలఁ
దనతోన జన్మించె దహనశిఖామూర్తి, భుజవీర్యపరాక్రమస్ఫూర్తి వాలి
సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగు నని, తలఁచెద నాతఁడు తక్క నొరులు

తే. [2]భీష్ముతోఁ గోర్వ రుగ్రంపుబిరుదు ధైర్య,ధనఘనుండు శిఖండి భీష్మునకు మృత్యు
వై జనించినవాఁడు మహాబలుండు, [3]దండనాయకుఁ జేయ నతండు దగును. 101

వ. అనవుడు ధర్మనందనుండు గోవిందుం జూచి యితండు సకలచరాచర తారతమ్య
సంవేది విశేషించి మనకు నితని మాటలు విజయమూలంబు కావున నిమ్మహాత్ముండు
నిరూపించినవాఁడు వరూథినీముఖ్యుండు. 102

క. అనుటయు దామోదరుఁ డి,ట్లను ధృష్టద్యుమ్నుఁ డర్హుఁ డగు నభిషేకం
బొనరింపుము పేరోలగ,మున నక్షోహిణుల కెల్ల [4]ముఖ్యుఁడు కాఁగన్. 103

క. సురగంధర్వ ఖచరకిం,పురుషాది సమస్త దివ్యభూతంబుల బం
ధుర భూరివ్యూహంబుల, విరచనముల నెఱుఁగు నతఁడు వీరోత్తముఁడున్. 104

క. [5]నీయొద్ది రాజు లందఱు, ధీయుక్తులు [6]విక్రమప్రదీప్తుల యైనన్
వే యేటికి ధృష్టద్యు,మ్నాయత్తము చేయు సైన్య మంతయు నధిపా. 105

వ. అనిన విని యుధిష్ఠిరుం డక్షోహిణులకుం బ్రత్యేక నాయకులను నీవ నిర్దేశింపు
మనుటయు నతండు. 106

తే. సేన తమకును గలవారు లేనివారు, ననక తగువారిఁ జెప్పెద నఖిలసమర
పండితుల నేరి వారి నీ బలము లేఁడు, నడపఁ జాలించి యభిషేచనం బొనర్పు. 107

వ. అనిన నట్ల చేయుదు వా రెవ్వ రెవ్వరు నిరూపింపు మని యడిగినఁ గుంతీనంద
నునకు దేవకీనందనుం డిట్లనియె. 108

సీ. పటు [7]పరాక్రమనిధి పాంచాలపతియు న,మానుషతేజుండు మత్స్యవిభుఁడు

1. బలమునుఁ. 2. భీష్మునోర్వరు (నుత్కృష్ట) సంగ్రంపు. 3. బాహుబలుండు......దగఁడె.
4. ముఖ్యుఁ డగుటకున్. 5. నీయోధవీరు లందఱు. 6. విక్రమైకదీప్తుల. 7. పరాక్రమశాలి.

శత్రుభీకరమూర్తి సాత్యకియును జరాసంధాగ్రతనయుండు శౌర్యఘనుఁడు
సహదేవుఁడును ధైర్యశాలి యాదవశిరోమణి చేకితానుండు మహితవిభవ
ఖని యగుశిశుపాలతనయుండు దోర్దర్పధుర్యుండు ధృష్టకేతుండు సమర
తే. లంపటుండు శిఖండియు లావు వెరవుఁ, గలుగు నీయెడ నమరశక్తి కలదు చాలఁ
బెంపు కలరుక్కు ముట్టిన తెంపు గలరు, కోరి పతులుగఁ జేయుము నక్షోహిణులకు.

వ. అని దండనాథుల నిశ్చయించి వెండియు. 110

క. కురుసైన్యము నిస్సారం, బరయఁగ మనబలము లెల్ల నతిదృఢములు నీ
వరవాయి గొనక నడపుము, ధరణీశ్వర సేన మొగము దైవమ నీకున్. 111

క. నీయనుజులు దివిజులకు న, జేయులు ధృతరాష్ట్రసుతులఁ జెఱుచుట ప్రేఁగే
తోయజనాశము గజలీలాయత్తము కాదె యెత్తు మాహవమునకున్. 112

వ. అని నిర్ణయించి నారాయణుండు నిజనివాసంబునకుం జనియె ధర్మతనయుండుఁ దమ్ములుం బ్రియం బంది యారాత్రి సుఖనిద్ర సేసిరి రేపకడయ పాండవాగ్రజుం డనుజతనుజదనుజాంతకసామంతమంత్రిపురోహితసహితంబుగాఁ బేరోలగంబున నుండి సమస్తపరివారంబును వినఁ గార్యంబు నిశ్చయంబుఁ దెలియం బలికి తగువారలతో సముచితసంభాషణంబులు చేసి మహనీయమహిమ వెలయం బుండరీకాక్షుండు పనిచినట్లు పాంచాలనాథప్రముఖుల నక్షోహిణులకు నధిపతులుగా వేఱువేఱ యభిషేకించి శ్వేతవంశజాతుం డగుటం జేసి శ్వేతుం డనం బ్రఖ్యాతుం డగు ధృష్టద్యుమ్నునకు నుత్కృష్టప్రకారంబున నభిషేకం బొనర్చి సర్వసేనాధిపత్యంబునకుం బట్టంబు గట్టి యయ్యెనమండ్రను దక్కటికొరలను గనుంగొని మధురవాక్యంబుల నగ్గించి కౌరవులతోడికయ్యంబునకుం గురుక్షేత్రంబునకు విడియం బోద మని చెప్పి వారి నెల్ల ధనంజయునకుం జూపి. 113

ఉ. ఎప్పుడు నెయ్యెడం బొదవి యుండఱకుం దగ నీవు కంటికిం
ఱెప్పయుఁ బోలె మా టయి నెఱిం బను లారసి యొజ్జచాడ్పునం
జెప్పుచు [1]వీరిబుద్ధిఁ గొని చేయుము కార్యము నీకు రక్ష తా
నిప్పరమేశ్వరుండు కలఁ డిచ్చు శుభం బని చూపెఁ గృష్ణునిన్. 114

వ. ఇట్లు గాంభీర్యమాధుర్యధుర్యుం డైనయుధిష్ఠిరుండు వరిష్ఠప్రభువులచిత్తంబు [2]లారాధించి సర్వజనసమ్మతంబుగా సమరోత్సాహంబు చేసి మహోల్లాసంబునం బ్రస్థానభేరి పఱవం బంచిన. 115

సీ. [3]బీఁతెండతాఁకున బీటలు [4]పాఱిన, పచ్చిగోడలమాడ్కిఁ బగిలె దిశలు
కాఁగినయెసరులకరణిఁ బొరింబొరి, శరనిధు లుప్పొంగి పొరలఁ బడియెఁ
గలముపైఁ గిలించి గాలి కెత్తినచాడ్పు, వోలె మిన్నంతయు బూరటిల్లెఁ
గులపర్వతావళి కులిశభయంబున, బెదరి వాపోవున ట్లెదురు చెలఁగె

1. వీరిఁ బట్టుకొని. 2. లారసి. 3. బిట్టెండతాఁకున. 4. వాసిన.

తే. ధాత్రి కుమ్మరిసారెవిధమునఁ దిరిగెఁ, జిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు
లయ్యె సర్వభూతములుఁ బ్రయాణభేరి, భూరినిష్ఠురఘోరభాంకార మడరి. 116

పాండవులు కౌరవులతోడియుద్ధంబునకు వెడలుట

వ. ఇట్లు ప్రస్థానభేరి చెలంగిన సకలసైన్యంబులు దండనాథసహితంబుగా సన్నద్ధంబు
లయ్యె నయ్యెడ. 117

ఉ. భూరివిభూతిఁ బెండ్లికిని బోవుతెఱంగునఁ బాండునందనుల్
తారును బుత్త్రులుం బొరియుఁ దమ్ముఁడు నుజ్జ్వలచారులీల శృం
గారము చేసి [1]సమ్మదవికాస మెలర్పఁగ వీరసంభ్రమో
దార[2]సముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కందఱుం దగన్. 118

వ ఇట్లు చని యమ్మహాదేవి నామంత్రణంబుచేసి తత్ప్రభృతిపుణ్యస్త్రీకరకలితలలితాక్ష
తంబులు గైకొని విప్రాశీర్వాదంబు లాదరించుచు భద్రపాఠకశ్లోకంబు లాకర్ణించుచు
శోభనపదార్థంబులు కనుంగొనుచు నాంగికమాంగల్యసూచకంబులు చేకొనుచు
వెడలునప్పుడు. 119

క. [3]తగుశంఖకాహళాదిక, మగుమంగళతూర్యసంచయము గంభీరం
బుగ మ్రోసె జయముఁ దెలుపుచు, జగతీశ్వరుమ్రోల నాకసము దీటుకొనన్. 120

క. మనుమవిజయప్రయాణం, [4]బనుమోదింపంగ నాసుధాంశుఁడు చనుదెం
చినకరణి గొడుగు కుంతీ, తనయాగ్రజుమ్రోల నతిసితప్రభ నొప్పెన్. 121

వ. అట్టియెడ నమ్మహీవల్లభుండు. 122

క. [5]ఉచితగతిఁ జేరి వంది, ప్రచయము కీర్తింప నెక్కె రథమం దొనరన్
ఖచియించినవజ్రంబుల, రుచులను బొలుపారు సీవిరులు బెరయంగన్. 123

వ. తదనంతరంబ. 124

సీ. వక్షస్థలంబున వనమాల గ్రాలంగ, వెలిమావు గెడలవాగెలు ధరించి
నొగలపై హరి యొప్ప నగచరకేతువు, మెఱయంగ నరదంబు మెఱుఁగు లడర
దివ్యకిరీటంబు దీప్తులు భూనభోంతర మెల్లఁ గలయంగఁ బరఁగుచుండ
గాండీవతూణయుగ్మములు పూర్వాపర,భాగంబులకు నవాభరణములుగఁ

తే. దెలిమొగంబుతో నల్ల నేతెంచి యొక్క
పార్శ్వమునఁ బొడసూపి భూపతికి మ్రొక్కి
దేవదత్తంబు పూరించె దేవదేవు
పాంచజన్యంబు మున్నుగా ఫల్గునుండు. 125

శా. భీముండుం గవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో
ద్దామస్ఫీతరుచుల్ వెలుంగ రథసంతానంబు రమ్యోజ్జ్వల

1. సంతసవికాస మెలర్పఁగ. 2. సమున్నతిం. 3. తగ. 4. బనుఘోషింపంగ. 5. ఉచిత గతి
నేఁగి.

[1]శ్రీమీఱం దగ వచ్చి శంఖములు గర్జిల్లంగఁ బూరించుచున్
భూమీశుం గని యగ్రభాగమున కొప్పం బెంపునుం జేయుచున్. 126

క. నిలిచిరి తక్కటిదొరలును, బలుమానిసులును మహోగ్రభంగి సవరణల్
చెలు వొంద నధిపుచుట్టుల, నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్. 127

వ. అప్పుడు పాండవాగ్రజున కభిముఖంబుగాఁ జనుదెంచి. 128

క. సాష్టాంగ మెఱఁగి సమరా, [2]వష్టంభం బొప్ప దివ్యవాహనలీలో
త్కృష్టగతిన్ ముంగలియై, ధృష్టద్యుమ్నుండు పోలిచెఁ దేజోమహిమన్. 129

వ. ఇవ్విధంబునం జారుభీషణంబుగా సన్నద్ధుం డై యుధిష్ఠిరుండు కదలి శుభసూచకంబులు గైకొనుచు నడచె నట్టిసమయంబున నెల్లవారిపరిచారకులును శకటాది సకలసాధనంబులును బటగృహంబులును మొదలుగా వలయు సమస్తవస్తువు లోడఁ గూర్చి వెడలినదండు పఱ పై సముద్రంబు కాఁపువోవుచందం బయ్యె నిట్లరిగి ధర్మపుత్త్రుండు కురుక్షేత్రంబు దఱియం జొచ్చి ఋష్యాశ్రమంబులకు దేవతాయతనంబులకు నలజడిగా కుండం బరిహారంబు చేయుచుం జని తృణకాష్ఠజలసమృద్ధం బై తగియెడు సమస్థలంబున హిరణ్వతి యనుపుణ్యనదిపొంత విడిదలగా నిరూపించి యచ్చో నిలిచెఁ దదనంతరంబ. 130

తే. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ, బాంచజన్యంబు ధర్మజ పార్థు లాది
గాఁగఁ దమతమనీరశంఖంబు లెల్ల, దొరలు నొత్తిరి దివిమ్రోఁతఁ [3]దూఁటుకట్ట.

వ. తదనంతరంబ యొక్కరమ్యప్రదేశంబున రాజమందిరంబును సుచితస్థానంబుల సమస్తజననివాసంబులు నై రమణీయబంధురంబును సింధురాశ్వశాలామాలికామనోహరంబునుం గా వీ డెల్ల విడిసె వీటిచుట్టునుం దిరిగి ధృష్టద్యుమ్నుండు సురక్షితంబు [4]చేసి వచ్చె రాజును దొరలును దమ్ములును సకలపరివారంబును దగినతెఱంగున నుండిరి నానావస్తుబహుళసంభారంబుల మహోదారం బగుచుఁ బాండవస్కంధావారంబు మహనీయాకారంబున నొప్పె నంత నక్కడ. 132

క. చారులచే నంతయు విని, కౌరవపతి విననియట్ల కర్ణాదులతోఁ
బేరోలగమున విగతవికారుం డై యిట్టు లనియె గర్వ మెలర్పన్. 133

క. తనవచ్చినకార్యము మన, మనుకూలతఁ జేయ కున్న హరి యలుక మెయిన్
జని యప్పాండుతనూజులు, మనములఁ [5]గిను కూనునట్టిమాటలు చెప్పన్. 134

చ. మును మనచేత భంగపడి మ్రుచ్చిరి యుండుటఁ జేసి పాండునం
దనులును నెత్తి వత్తు రుచితంబుగ సంగర మెట్లు గల్గఁ బే
ర్చినబహుసైన్యముల్ బయలఁ జేరఁ దగన్ విడియింత మెల్లి దం

---

1. శ్రీమైఁ లీలఁగ. 2. వష్టవ్యం బొప్ప దివ్యబాణసలీలో. 3. దూఁదుకట్ట. 4. చేయించు. 5. గిను పూనునట్టి.

డని పురిఁ జాటఁ బంచి దొర లందఱుఁ గ్రాఁ బడి సేయుఁ [1]డెత్తఱిన్. 135

వ. మనకు విడిదల కురుక్షేత్రం బని పలికి దుశ్శాసనుం జూచి నీవును గర్ణుండును గాంధారపతియును సమస్తంబును సమకట్టుం డనుటయు వారలు ప్రియంబునం బని పూని వెడలి [2]దండు చాటించి తగువారల కెల్ల నెఱింగించి పుచ్చిన సకల పరివారంబును బ్రమోదంబు నొందె భూవల్లభుండును గొలిచి యున్న వారలం బోవం బంచి వలయునెడకుం జని తగినవర్తనంబున నుండె నట్టి సమయంబునఁ బ్రయాణోచితంబు లగుబహుప్రకారవ్యాపారంబులయందుఁ దత్పరు లయిన దొరల నానాచేష్టితంబులను గరితురగరథంబులకు సవరణలు సమకూర్చు చతుర పరిచారకులసంభ్రమంబునను వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబులు సేయఁ బ్రవర్తించుపదాతివర్గంబుల సంరంభంబునను నగ్ర్యైసరకులు పయనంబున కనువు చేయుబలుమానుసుల తిరుగుపువడుటనుం బురంబు సమరోత్సాహచంద్రోదయంబునకు మహార్ణవం బై ఘూర్ణిల్లుచుండె నపరదినముఖంబున. 136

క. త్వరితగతి సమయసముచిత, కరణీయము లాచరించి కమనీయాలం
కరణోజ్జ్వలుఁడై యెలమిం, గురురా జేతెంచెఁ గొలువుకూటంబునకున్. 137

వ. వచ్చి దుశ్శాసనప్రముఖనిఖిలసహోదరపరివృతుం డై యుండి. 138

### దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట

సీ. అరిభయంకరుఁడు ద్రోణాచార్యుఁడును రణో,త్సాహలంపటుఁ డగు రాధాసుతుండు
శరతత్త్వవేది యశ్వత్థామయును భూరి,బాహావిలాసుండు బాహ్లికుండు
శౌర్యవైభవశాలి శల్యుండు ధైర్యసం,పన్నిధి కృపుఁడును బ్రకటశక్తి
సారదుర్జయమూర్తి భూరిశ్రవుండును, దర్పోజ్జ్వలుండు గాంధారపతియు

తే. సుగ్రతేజుండు కృతవర్మయును బ్రతాప
ఘనుఁడు కాంభోజుఁడును బరాక్రమధనుండు
సింధురాజును బతులుగాఁ జేయఁ [3]గోరి
కొనఁగఁ దగువార లగుదు రక్షోహిణులకు. 139

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిపని మాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి మీర లీ
యొనరినసైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకముఁ గైకొనుఁ [4]డుత్సవంబుగన్. 140

క. అనవుడు నందఱు నౌఁ గా, కని సంతస మంద నధిపుఁ డభిషేకించెన్
జను లెల్ల సంప్రమోదం,బునఁ బొందఁగ నప్పు డతి [5]విభూతిం బ్రభులన్. 141

వ. ఇట్లు మహామహిమ వెలయ నక్షౌహిణీనాయకుల సమకట్టి రారాజు పితామహు పాలికి వారిం దోడ్కొని చని సవినయంబుగా నతనికిఁ బ్రణామంబు చేసి

1. డిత్తఱిక. 2. దండు సాగించి. 3. గోరఁ,గాఁదగెడువారలగుదు రక్షౌహిణులకు.
4. డుత్సవంబునన్. 5. విభూతిప్రభలన్.

వారలం జూపి వీరల మనయక్షౌహిణులు పదునొకొండింటికిం బతులం గావించితి నిన్ని సైన్యంబులు నొక్కలావున వర్తించు చందంబు చూచికొన వలయు నని చెప్పుచుం జేతులు మొగిచి యి ట్లనియె. 142

చ. నెఱేఁ బడి యాజి నీ మొనలు నేరవు కూడి తగం జరింప నిం
దఱమన నొక్కఁ డై చనక తప్పఁ గదా బహుదేశవాసు లం
[1]దఱొకటి చేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లుఁ గల్గు ని
త్తెఱఁ గొకచాలువానిబలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే. 143

ఆ. అమరసేనలును దకుంతన వర్తింప, నేర కునికి నా కుమారుమొగము
గా నొనర్ప వలసెఁ గాదె సమస్త సేనలను నీవ యరసి నడపవలయు. 144

క. తారలకుం జంద్రునిగతిఁ, గౌరవులకు మేటి వీవ [2]కావున నీ వీ
భారంబు పూని మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. 145

తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప, నీవు తక్క నిం దొక్కరు నీవ యరసి
చెప్పుమా కలఁడేని రక్షింపు మమ్ముఁ, బూని పట్టంబుఁ దాల్పుము పొడిచి గెలుము.

వ. అనిన విని గాంగేయుండు గాంధారేయున కి ట్లనియె. 147

ఆ. మీరుఁ బాండుసుతులు నారయ నా కొక్క,రూప కార్యమున్న రూపు పలుక
వలయుఁ గయ్య మైన వత్తు మీలోన నా,యునికిచందమునకు నుచిత మిదియ.

క. సేనాధిపత్యమును దగఁ, బూనెద నను మార్కొనంగఁ బురుషుల నుర్విం
గానఁ గిరీటికి నొక్కని, కె నోర్వ నతండు శరము [3]లెక్కు డెఱుంగున్. 149

క. పెఱవారి నెల్లఁ దర మిడి, నఱకుదుఁ బాండుక్షితీశనందనులను రూ
పఱ సేయం జేయాడదు, తఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. 150

వ అప్పటికిఁ దగినభంగి యయ్యెడు నది యట్లుండె నని పలికి మఱియు ని ట్లనియె.

ఆ. మున్ను కర్ణుఁడొండె నన్నొండెఁ గయ్యంబు, చేయఁ బనుపు మిట్లు చేయువాఁడ
వైనఁ గాని సకల సేనాధిపత్యంబుఁ, బూన నేరఁ జుమ్ము [4]భూపతనయ. 152

వ. అనినం గర్ణుండు కౌరవపతితో ని ట్లనియె. 153

క. ఇప్పుడు క్రొత్తగ దీనిం, జెప్పంగా నేల మున్న చెప్పితిఁ గాదే
యెప్పుడు భీష్ముఁడు పడు నే, నప్పు డనికి వచ్చువాఁడ నని సభలోనన్. 154

ఆ. అనిన నట్ల కాక యని సర్వసేనాధి
పత్యభార పట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గొని
యాఁడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. 155

క. భేరీమృదంగ[5]శంఖకు, లారవములు చెలఁగఁ జేయుఁ డని [6]పనిచి మహో

---

1. దఱ కని సేయుచో. 2. కావున ననికిఁ. 3. లెక్కు డెఱుఁగుటన్. 4. భూవరేణ్య.
5. శంఖము, హారవములు. 6. పనిచె.

దారపతాకాద్యుత్సవ, గౌరవములు నడపె నెల్లకడలం బురిలోన్. 156

వ. అట్లు పట్టణాలంకారంబు సంఘటించి రత్నకాంచనకలధౌతమయంబు లగు కలశంబులఁ దీర్థజలంబులు తెప్పించి మణిప్రకరంబునఁ గుసుమ నికరంబున [1]మంగళ తరుత్వక్ప్రచయంబున మహౌషధినిచయంబున విహిత మంత్రంబుల నుచిత తంత్రంబుల ఋత్విక్పురోహిత సహితుం డై తత్సంస్కార ప్రకారం బాచరించి.

క. గురుఁడును గృపుఁడును[2]లోనగు, గురు లను మోదింప బాహ్లికుండు మొదలుగాఁ
గురుజాతి యెలర్పఁగ నన్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. 158

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి, పరమభక్తి నక్షోహిణీపతులఁ జూపి
వీరికిని సైన్యములకును మీర యొడయఁ డనుచుఁ బట్టంబుఁ గట్టె [3]శంతనుతనూజు.

క. అత్తఱిఁ బాషాణంబులు, నెత్తురు నెమ్ములను గురిసె నిష్ఠురనినదా
యత్తమయి నభము పిడుగుల, మొత్తంబులు పడియె నగరమున నెల్లెడలన్.

క. దానికి జను లుత్సాహవిహీనతఁ బొందంగఁ గౌరవేంద్రుఁడు నానా
దానాదు లయిన శాంతివిధానము లొనరించి యానతత్పరమతి యై. 161

క. తల్లియుఁ దండ్రియు [4]వెఱఁగునఁ, బుల్లవడఁగ వారికడకుఁ బోయి తడయఁగా
నొల్లక పయనపు వీడ్కో, లెల్లను దనయిచ్చ నడపి యేడ్తెఱ వెడలెన్. 162

తే. వెడలి తమ్ములుఁ దగువారు వివిధభృత్య
గణముఁ దానును నేల గ్రక్కదలఁ గదలి
రాజరాజు గాంగేయుఁ బురస్కరించి
కొని సముద్ధతి నడచె దిక్కులు వడంక. 163

వ. నడచి కురుక్షేత్రంబు దఱియం జొచ్చి యం దొక్క రమణీయ ప్రదేశంబు విడిదలగా నిరూపించి నిలిచి భానుసూనుండునుం దానును మెలంగి యెల్లవారిని విడియించి నడుమ నిజనివాసంబు కావించినఁ గౌరవేశ్వరు స్కంధావారంబు వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచందంబున నందం బై యొప్పె నిట్లు రెండువీళ్లును సన్నద్ధంబు లైన సమయంబున. 164

ఉ. సంధికి నేఁగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయుఁ సుహృ
ద్బాంధవ సంఘయుక్తముగఁ బాండవ కౌరవవీరు లష్టది
క్సింధురకంధరంబు లడఁగించు బలంబుల పెల్లుతోడ గ
ర్వాంధత [5]నాజి కెత్తుటయు నా బలభద్రు[6]ఁడు విన్కి నార్తుఁ డై. 165

బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర పోవుట

వ. కతిపయ పరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి సముచిత ప్రకారంబున ధర్మనందనుం బేరోలగంబునం గని సంభ్రమాలింగనా సనార్ఘ్యపాద్యంబుల నతని

1. మంగళతరుత్వక్పల్లవప్రచయంబున. 2. లోనుగ. 3. శంతన. 4. మనమునఁ. 5. నాజి కెక్కుటయు. 6. (డెఱింగి యార్తుఁ డై.

చేత సంభావితుం డయి దామోదరభీమార్జుననకులసహదేవుల యభివాదనంబు
లాదరించి పాంచాలవిరాటప్రముఖు లగు తగువారల వినయంబుల నభినందించి
యావోరలతోడ దత్కాలయోగ్యమితసంభాషణంబులు చేసి యనంతరంబ
వారల కిట్లనియె. 166

క. కౌరవపాండవు లెంతయుఁ, గ్రూరత పాటించి బంధుకోటికి నిఖిలో
ర్వీరమణులకుం జేటుగఁ, బోరికిఁ దెగి రిట్టిఘోరపుంబని [1]యగునే. 167

తే. ఇట్టిదానికి నోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ గినిసి యిరుదె
ఱంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు, చేయు మని యెంతచెప్పినఁ జేయఁడయ్యె.

క. పలుకులపొం దెఱుఁగనివా, రలఁ బూజావాక్యములఁ దిరంబై తనకుం
[2]దెలువం దగదే యే మని, యలుకమెయిఁ సంధి చెఱచి హరి యేతెంచెన్. 169

తే. వీరు వారును సంబంధవిషయబంధు, లగుట సరి గాదె హరికిఁ దా నర్జునునకుఁ
బక్షపాతంబు చేయుటఁ బాండవులును, [3]బెట్టుచోటులు గానక పట్టి క్రాలు. 170

ఉ. కావున వీరికిన్ జయము గల్గుట నిశ్చయ మెల్లభంగులం
జావు నిజంబు వారికి నసంశయ మై యిటు లుండ దీని నె
ళ్లే వినఁ జూడ [4]నేర్తుఁ దగ నింతప్రవీణుల నేన చేసితిం
జావె సుయోధనుం బవనసూనుని నొండొరుఁ జంపఁ జూతునే. 171

క. హరి యెఱుఁగనిచక్కటియుం, బురపార్థము నా కెఱుంగఁ బోలునె యాని
ష్ఠురత వినఁ జూడఁ జాలక, సరస్వతీతీర్థమునకుఁ జనియెడు బుద్ధిన్. 172

వ. మీకుం జెప్పి పో వచ్చితిఁ బోయి వచ్చెద నని పలికి బలదేవుండు వాసుదేవ
ధర్మపుత్రు లొడంబడి యనుపఁ దీర్థయాత్ర వోయెఁ దదనంతరంబ 173

రుక్మివృత్తాంతము

సీ. కృష్ణునిదేవి రుక్మిణిసోదరుఁడు రుక్మి, [5]యనువాఁడు బలవిక్రమాన్వితుండు
శార్ఙ్గ గాండీవవిజయములు నాఁ గల, దివ్యచాపములఁ దృతీయ మైన
చాపంబు గలవాఁడు సైన్యసమేతుఁ డై, చనుదెంచి ధర్మజుఁ గని తదీయ
సత్కారములు గాంచి సముచితాసనమున, నుండి యక్కొలువున నున్నవీరు

ఆ. లెల్ల వినఁ గిరీటి కిట్లను సమరంబు, చేయ వెఱచితేనిఁ జెప్పు నాకు
నెదురు లేరు జగతి నెవ్వరు నీకుఁ దోడ్పడి జయింతు నెట్టిపగఱ నైన. 174

వ. అని తన్ను నాక్రమించి తన తోఁబుట్టువు రుక్మిణిం గొని వచ్చిన యాకృష్ణునన్ని
ధిన సిగ్గు లేక యాడిన మాటలు విని చిఱునవ్వు నవ్వుచుం గవ్వడి యతని
యాననం బాలోకించి. 175

తే. చెనసి గంధర్వసేన నిర్జించునపుడు, మత్స్యనాథుగోవర్గంబు మరలఁ దెచ్చు

1. గలదే. 2. దెలుపంగఁ దగదె. 3. బెట్టుపాటులు గానక. 4. నేర్తు గద నెంత. 5. యను
రాజు.

[1]నెడను దప్పె నీకందువ [2]యెఱుఁగనైతి, నింక నొరుఁ గాని తోడు గన్మెచటికైన.

వ. అని [3]యతని యుత్తరమునకుఁ దగినయట్లు పలికి మఱియును. 177

క. మున్నే నసహాయుఁడనై, [4]చన్నకడం జనఁగ నైనచందం బయ్యెన్
వెన్నుఁడు తోడు కలఁడు వెఱ, పెన్నండును వలవ దింక నేమిటికైనన్. 178

చ. వెఱచితి రాఁ గదే యనిన వెండికదా పగఁ దీర్తు నీవు నా
వెఱ పెటు లున్న నీరధికవీరులు [5]పాపెద రొల్ల నిన్ను నీ
యుఱుకడ కేఁగి తోడుపడు మొల్లకు నెవ్వరికేని నన్న నే
డ్తెఱ నతఁ డేఁగి కౌరవపతిం గని యట్టుల బెట్టు పల్కినన్. 179

క. ఆతఁ డివి యేటిమాటలు, నీతో డగు టొల్లఁ బొమ్మనిన రుక్మి వృథా
[6]యాతాయాసవిషణ్ణుం, డై తనపురమునకు మగుడ నరిగెం బెలుచన్. 180

తే. ఇట్లు బలదేవరుక్ముల కిద్దఱకును, గయ్యమునకు సన్నాహంబు కలుగదయ్యెఁ
గాని తక్కలోకమ్మునఁ గలుగునృపతి, కోటి యిరువాఁగునందును గూడె ననికి.

వ. అట్టియెడ నిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించి యి ట్లనియె. 182

క. బవరము గీ డని యెఱుఁగుదు, నవినీతుం డైనకొడుకు నదలిచి యుడుపం
దివిరియు నోరాడమి దైవవశం బప్పనికి మనకు వగ పిం కేలా. 183

క. ఎయ్యదిగా నున్నది యది, యయ్యెడఁ జేయునది గలదె యవనీశులకుం
గయ్యానఁ జచ్చుటయు మే, లయ్యెప్పుడు లెస్స గాక యది యట్లుండెన్. 184

వ. రెండువీళ్లును గురుక్షేత్రంబున విడిసినపిదపం బుట్టినవిశేషంబులు కల వేని నెఱిం
గింపుము. 185

సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుఁడు పాండవుల నాడిన మాటలు చెప్పుట

తే. అనిన సంజయుఁ డిట్లను నకట కొడుకు, మీఁదఁ దప్పు వెట్టెదవు నీమీఁదికొఱంత
నీకుఁ గానంగ వచ్చునె నీ వెఱుంగ, కుండఁ బఱచెనె యాతండు పాండుసుతుల.

వ. ఆపని గడవంబడియె వార్తలు వినియెద వేని వినుము దుర్యోధనుండు దుశ్శాసన
శకునికర్ణులతో విచారించి యులూకుం బిలిచి నీవు పోయి పాండవులం గని
వాసుదేవుసన్నిధిని బాంచాలవిరాటప్రముఖులు వినఁ బలుకు మని పరుసని
మాటలు కఱపి పుచ్చిన నతండును. 187

క. చని కొలువున ధర్మసుతుం, గని దుర్యోధనుఁడు చెప్పఁ గా నను నియమిం
చిన మాటలు కొన్ని గలవు, విను మలుగక యనిన నతఁడు విని యి ట్లనియెన్.

ఆ. నీకు వెఱవ నేల [7]నిన్ను నాబుద్ధిమం,తుండు చెప్పు మనినతులువమాట
లెన్ని కలవు వాని నన్నింటి ననుమాన, మింత లేక యాడు మెల్ల వినఁగ. 189

వ. అనిన నులూకుం డి ట్లనియె. 190

---

1. నపుడు దప్పె. 2. యరయనైతి. 3. యతని తరమునకు. 4. చన్నకరణిఁ. 5. దీర్చెద.
6. యాతాయాతవిష. 7. నాకార్యవంతుండు, నిన్నుఁ జెప్పుమనిన నీతిమాట.

సీ. కయ్యంబునకుఁ బెద్దకాల మేమియుఁ బూఁచి, పట్టి వచ్చితి కడుబరవసమున
సంజయుతో మీరు శంక లే కాడిన, యొక్కడుమాటలు పెక్కగలవు
భూమిభాగము గోలుపోయినయలుకకు, ద్రౌపదిఁ [1]బఱచినదైన్యమునకుఁ
దగ మంచిబంట వై తఱి యిది బాహుబ,లాస్త్రవిద్యలు చూప నని తలంచి
ఆ. నిలువవలయు నీకుఁ గలవారి నెల్లను, గూర్చి మోహరించికొని కడంగి
నడవు సమరమునకు [2]వెడ జంకెఁబో దింకఁ,దప్పఁ గ్రుంక లేదు తఱికిఁ జోరుము.
క. ఆతతబలుఁ డగుభీష్ముని, చేతి[3]బలువు ద్రోణునంపసెల లవియుటయుఁం
జూతు రటు రండు కృష్ణుని, చేతన సకలంబుఁ జక్కఁ జేసికొనుండీ. 192
క. వారిద్దఱవాలమ్ముల, బారిం బడి యర్జునునకు బ్రదు[4]క వశమె మీ
వా రెల్ల నెఱుంగరె య, వ్వీరులదివ్యాస్త్రశస్త్రవిభవసమృద్ధుల్. 193
వ. అని భీమసేనుం జూచి. 194
క. ఈవాయుపుత్త్రుఁ డాజిం, ద్రావుదు నే దుస్ససేనురక్తం బనియెం
ద్రావఁగ శక్యం బెనిం, ద్రావు మనన్ [5]రాదె యింకఁ దడ వేమిటికిన్. 195
క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుంగు దెఱుఁగ నేరవు గర్వం
బున [6]నావలికొలఁది రణం, బున నొకమరి పెట్టు పడక పో నేర్చెదవే. 196
వ. అని పలికి సవ్యసాచిం జూచి. 197
తే. వినుము గాండీవ మనునొకవిల్లు తాటి
పొడవు గలిగియుఁ గృష్ణుండు పూని తోడు
గూడుకొని వచ్చుటయు నెఱుంగుదుము వీని
కెల్ల శంకించి భూమి పా లీము కాని. 198
క. పవనజుగదయును నీగాం,డివమును నెట పోయె నంగడికిఁ బాంచాలిం
దివిచికొని వచ్చునెడఁ బరి,భవ మెఱుఁగవె బీర మేల పలు[7]కుదు తోడ్తోన్. 199
చ. వలలుఁ [8]డనన్ విరాటుకడ వంటలవాఁ డయి భీముఁడున్ బృహ
న్నల యన నాఁడుపేడి వయి నాన యొకింతయు లేక నీవు న
గ్గల మగుదైన్య మొంది కడుఁ గాఱియ పొందితి రుర్వియేలునా
సలఁ బడి సవ్యసాచి యిది శౌర్యమొ బాహుబలంబొ చెప్పుమా. 200
ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని పన్నినన్
వాయువుర జ్జులెప్పుడు నవారణ నీ వెటు లాడి తేనియున్
వేయును నేల పార్థులును విష్ణులు [9]నేఁ బదివేలు వచ్చినం
[10]జేయుదు మేము కయ్య మొకచీరియు సంపదఁ బంచి [11]యిత్తుమే. 201

1. బన్నంబు దైన్య. 2. వెడఁ జంకెఁ బోటెంక. 3. బరువు. 4. కఁగ వశమే, మీ రెల్ల. 5. గాదె. 6. నాగద. 7. కం డోడ్తోన్. 8. డ నా విరాటునకు వంటకుఁ డా నయి. 9. వే పది వేలు. 10. జేయుదు నేను గయ్య. 11. యిత్తునే.

వ. *అనిన భీమార్జుననకులసహదేవు లొండొరులం జూచుచు నాసనంబులు చలింప మొగంబులు జేవుఱింపఁ గ్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె నీవు పోయి సుయోధనుతో నెల్లవారును విన ని ట్లనుము. 202

తే. బవర మెల్లియ బిసద పై బరవసంబు, గలిగి [1]చావుము చావక తొలఁగ రాదు
కృష్ణసారథికం బగుజిష్ణురథము, తొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు. 203

క. రిత్తలు [2]రజ్జెడువాఁడే, మత్తగజా[3]యుతబలుండు మారుతి యని సు
ద్వృత్తుఁ డగుదుస్ససేనుని, నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. 204

వ. అని యిట్లు హరి పలికినయనంతరంబ యర్జునుం డులూకున కిట్లనియెను. 205

క. వారు కలరు వీరు కలరు, పోరికి నని చెప్ప దీవు పొంగాడుచు మీ
వారిని మిమ్మును రేపు గదా రూ పేర్పడఁగఁ [4]జూచెదం గితవసుతా. 206

చ. తనభుజశక్తి లేక యొరుదర్పము యూఁది పరాక్రమింప వ
చ్చిన నది చెల్లునే కులవిశిష్టుని సువ్రతు వృద్ధు [5]నాస్య భీ
ష్ముని [6]నెసకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీ వని యుబ్బఁ జేసి యీ
సునఁ దల పెట్టి చంపికొనఁ జూచె సుయోధనుఁ డింత నేమనున్. 207

చ. తనతలఁ [7]పెట్లు భీష్మభుజదర్పము లోకముకంటె నెక్కుడీ
తని నొకభంగి నండ గొని తప్పదుఁ జావున కంచు నున్నవాఁ
డనిఁ దొలుముద్ద గొందుము రయంబున నాతని వెండి ద్రోణులం
దునుముదు మప్డు సూతసుతుఁ దోలుదు మంతట నాస మాలెడున్. 208

క. అనుజులతనుజులచావులు, కనుఁగొని మఱి తాను భీముగదచే నిలఁ గూ
లినయప్పుడైన దుర్యోధనుఁడు మదిం దలఁచుఁ గాక తనదుష్కృతముల్. 209

వ. అది యట్లుండె నీవు వేగపోయి రేపకడయ మారాజుం గలనికి నడపింపు మనియె నప్పుడు ధర్మనందనుం డులూకునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి ధృష్టద్యుమ్ను నవలోకించి యెల్లి కయ్యం బని మనసైన్యంబుల కెఱింగించి సర్వసన్నాహంబులు సమకట్టు మని పనిచి కొలువు పిరిసి చనియె ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరం బడసితి నని యుబ్బుచు వెడలి భీష్ముం దలపడఁ గంటి

* ఈ వచనమునకు 201 వ పద్యమునకును నడుమ "వ. అని నకులుం జూచి.

క. దామగ్రంథి యనంగా, మో మిడికొని విరటుగుఱ్ఱములఁ బట్టుచు నీ
వామెయి నుండితి రాజ్యము, పై మమతను గాక నీకుఁ బౌరుష మేదీ.

వ. అని సహదేవుం జూచి.

క. వెడ తంత్రీపాలుం డనఁ, గడుహీనత విరటుపసులఁ గాచితి వౌ నీ
పుడమి గల దేమొ యను మా, నడి కోర్చితి గాక నీకు శౌర్యము గలదే" అని కొన్ని ప్రతులఁ [గానిపించెడి.

1. పొడువుము. 2. బలికెడువాఁడే. 3. యత్తబలుఁడు. 4. జూచెదవు. 5. నాజి. 6. దెస. 7. పిట్లు.

నని పాంగుశిఖండి తోడు గా రాజశాసనంబు నిర్వర్తించె నిట యులూకుండు వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునులపలుకు లున్న రూపు విన్నవించిన నతండు కర్ణుదెసఁ గనుంగొని సమస్తసేనలకు రేపు బవరం బని చెప్పి పుచ్చుము సకలసాధనంబులు నాయితంబులు చేయు మని పనిచిన నతండు నట్ల చేసె ని ట్లుభయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లె ననిన ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 210

క. వినుము హరితోడు గలయర్జును గెలువ [1]నదీసుతునకుఁ జొప్పడునే యా
పని నిలుపు ములూకుని చెప్పినమాటల కేమి యని[2]పిదపఁ గొలువునన్. 211

వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డి ట్లనియె. 212

ఆ. అయ్యులూకుపలుకు లన్నియు విని భవ త్తనయుతోడ నిట్లు లనియె భీష్ముఁ
డేను గలుగ [3]వెఱవ నేటికి[4]సేనలఁ, గాతు నీవు మెచ్చఁ గౌరవేంద్ర. 213

క. నడిపింపఁగఁ బోడిపింపఁగ, నెడమకు వై కలఁగినప్డు దేర్పఁ ఉపఁగ నేఁ
గడు నేర్తుఁ బేర్చునాదగు, కడిమియు నీసైన్యమునకు [5]గాసెన కాదే. 214

క. అనినం గురురా జి ట్లను, వినుము పితామహ మహాస్త్రవిత్తము లనఁగాఁ
జనునీవును నాచార్యుండును గలుగఁగ నాకు నెన్నఁడును వెఱ వేలా. 215

తే. ఏను గంధర్వకిన్నరదానవాది
దివ్యభూతంబులకును భీతిల్ల ననినఁ
బాండుపుత్త్రులమాత్రకు భయము నాకు
నెక్కడిది [6]ప్రేల్మిడిన వారియుక్కు మడఁతు. 216

భీష్ముఁడు కౌరవసేనలో నతిరథమహారథాదుల నిరూపణంబు చేయుట

వ. అని పలికి మఱియు ని ట్లనియె 217

క. నీయందు వారియందుం, జేయం గలమానుసులవిశేషంబులఁ జి
త్తాయత్తంబుగఁ జెప్పుము, నీయెఱుఁగనియవియు లేవు నిక్కపుఁదరముల్. 218

క. అనవుడు నీ వి ట్లడిగిన, విని [7]యూరక యుండఁ దగదు వినుమేర్పడ నె
ల్లను నున్న[8]రూపు చెప్పెద, మనవారల వారివారిమానము లధిపా. 219

వ. అని గాంగేయుం డి ట్లనియె. 220

సీ. నీ వతిరథుఁడవు నీతమ్ము లందఱు, సమరథశ్రేష్ఠులు సమరమునకుఁ
బరుసనివీరులు పాంచాలసేన నిర్జింతురు నను నేన చెప్పికొనఁగ
నేర నాయెత్తెఱ మీఱెఱుంగుదురు భోజాగ్రణి కృతవర్మ యతిరథుండు
దృఢవేధి యాతండు తీర్చు నెంతటిపని, యైనఁ గైకొని శల్యుఁ డతిరథుండు

ఆ. వాసుదేవుతోడియీసువాఁ డల్లుర, విడిచె నిన్నుఁ గూడి విక్రమమునఁ

---

1. పితామహు. 2. పెద్దకొలువునన్. 3. నీకు. 4. నీసేన. 5. గవిసెన. 6. వారిప్రేల్మిడి నుక్కడంతు. 7. నొయ్యన. 8. రూప.

చేసుకొనఁగఁ జాలు భూరిశ్రవుం డతి,రథుల మొదలి యనికి రక్కసుండు. 221

క. విను సైంధవుఁడు మహారథుఁ, డనిఁ బోక పెనంగు నతని నా ద్రౌపదికై
వెను పఱుఁ బఱచిరి కుంతీ, తనయులు వారల కెదుర్పఁ దపముం జేసెన్. 222

వ. కాంభోజరాజగు సుదక్షిణుండు సమరథుం డితనిపాల రథబృందంబులు మేలు గలుగుఁ బాండవబలంబులం గలంచు మాహిష్మతీపతి యగునీలుం డర్ధరథుం డితనికి సహదేవునకుఁ దెగనిపగయై యుండు దానం జేసి యాలంబున నోలమాస గొనం డవంతిదేశాధీశు లగువిందానువిందు లర్ధరథులు పరస్పరస్నేహంబున సాహసికులై యొకళ్లొకళ్లం బెట్టిపోవక పోరుదురు త్రిగర్తపతులు తోడం బుట్టువు లేవురును మహారథులు గోగ్రహణంబునం బడినబన్నంబుఁ బాపికొనం గడంగుదురు వీరికి భుజబలం బగ్గలం బై యుండు. 223

క. సమరథుఁడు బిరుదు లక్ష్మణ, కుమారకుం డేచి మొనలఁగోల్తల [1]సేయుఁగ
మిము నెల్ల మిగులుభుజగ,ర్వము మదముం గలఁడు కొనఁ డరాతుల నధిపా. 224

వ. బృహద్బలుండు సమరథుండు కోసలబలంబులతోడం గడంగి చిచ్చునుం [2]గరువలియునుం గొని తాఁకు [3]దండధారుఁడు సమరథుండు సేనపఱపు గలండు బెట్టిదంబు గాఁ గయ్యంబు చేయు. 225

తే. అతిరథోత్తముఁ డిప్పాటియందు మేటి. కృపుఁడు తన పెంపు వాటించి గెలుచుఁ జచ్చుఁ
గాని నాలుగు దెఱఁగుల సేనలకును, దనియఁ డించుకయును నరదేవముఖ్య. 226

క. శకుని విను సమరథుఁడు పాం,డుకుమారులతోడ నెప్పుడుం బగఁ గొని వా
రికిఁ గీడ రోయు భృత్యులు, ప్రకటబలులు కలరు నేర్చు బవరంబునకున్. 227

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ
బురుడింపం దగువాఁడు వీని కెన యీభూలోకసంచారు లె
వ్వరు లే రీతఁడు బ్రాహ్మణుం [4]డ ననిభావం బూనఁగా నోర్వమిం
దర మూహింపఁగ లేద కాని జముచందం బయ్యెడుం బోరులన్. 228

సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందలి,యిందలివిలుకాండ్ర కెల్ల గురుఁడు
హితుఁడు నీకెంతయు [5]నేర్చిన మొన లితం, డడరినఁ జమరినయట్ల మ్రందు
వృద్ధని యితని భావింప రా దనిలోన, నంగవిస్ఫురణంబుభంగి చూడ
నర్జునుపైఁ గూర్మి నతని నో నేయఁడు, సచరాచరం బైనజగము లెల్ల

తే. నొక్కమొగ మై కడంగినఁ జిక్కుపఱుచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి
ప్రాణములు డాపఁ(డీతనిపాటివారలఁ, గాన మేరాజ్యములయందుఁ గౌరవేంద్ర.

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులితబలుఁ డితనియట్ల యాత్మజుఁడును వి
శ్రుతకీర్తి సోమదత్తుం, డితనికి నీతనికి సమర మెన [6]పెండిలికిన్. 230

---

2. సేయఁగ. 2. గొనక. 3. దండధారుం డర్ధరథుండు. 4. దనినభావం. 5. సేచిన. 6. (బెండిలితోఁగ.

క. అసురవరుఁ డీహాలాయుధుఁ, డసమానబలుండు సమరథాగ్రణి విను పాం
డుసుతులయెడ రోషము గలఁ, డసంఖ్యమాయాబలమున[1]నరులఁ గలంచున్. 231

తే. వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన, శక్తియీభగదత్తుండు సమరథుండు
గజము నెక్కి తా నేనికకయ్య మైన, నేర్చు నైరావణముమీఁది యింద్రుఁబోలె.

### భీష్ముఁడు కర్ణుని నర్ధరథుం డని చెప్పుట

వ. గాంధారరాజు లగు[2]వృషకుండును నచలుండును సమరథులు మానిసితనంబును
మానుసులుం గలవారు వీరిసమరోపాయం బజేయం బై యుండు. 233

సీ. నీకుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁజెలియు నై, కయ్యంబునకు నెప్డుఁ గాలుద్రవ్వఁ
బాండుపుత్త్రులతోడిపగకు ని[3]న్నెసకొల్పుఁ, గొలువున రజ్జులు పలుకు నట్టి
రాధాసుతుం డర్ధరథుఁడు కుండలములుఁ, గవచంబుఁ బోవుట కారణముగ
బిలువాఱినవాఁడు వీఁడెఁడి కృపఁ బెద్ద, పరశురాముండు శాపమున వీని

తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె న ట్లగుట వీఁడు
పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును
దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి
యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప. 234

క. అనవుడు గురుఁ డి ట్లనుఁ గర్ణునిచందము మున్ను కడఁగు రోయఁడు[4]పాఱన్
విను మేమఱి యుండుం గావున నీతం డర్ధరథుఁ డవుం దలపోయన్. 235

వ. అనిన విని రాధేయుండు క్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున కి ట్లనియె. 236

క. [5]బంటమిని లేనియొంటర, మింటరములు పల్కు టుచితమే యర్ధరథుం
డంటి నను నేమితక్కువ, గంటి చెప్పుము దీన నీవు కన్నది కలదే. 237

తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల, కేను గురుపతిఁ జూచి సహించి పోదు
సురనదీపుత్త్ర విను నాకుఁ జూడ నర్ధరథుఁడ వగు దీవు లావు బీరంబు నరయ. 238

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని. 239

చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె యీతనిఁ గార్యపుమాట లిట్టివే
పతిదెసకూర్మి పాపుటకుఁ బట్టుట నెక్కువ తక్కువంచు ను
న్నతు లగుమేదినీశులకు నానగఁ బల్కుట కాక యిట్టివా
రితవులు తండ్రికిన్ సుతుల కే మన నేర్తుము పెద్దరాజులన్. 240

వ. అనిన దుర్యోధనుం జూచి యి ట్లనియె. 241

ఉ. కర్ణము తప్పె నీయెదురఁ గష్టపుమాటల కేల యోర్తు రీ
దుర్జనుఁ డైనశాంతనవుదోర్బల మేటిది యీతఁ డొక్కఁడున్
వర్జితుఁ డైన నేమి నృపవర్గము కుందుట యొంటఁ బాయునే

1. నడరుచు నుండున్; నమరులఁ గలఁచున్. 2. వృషుండును. 3. న్నెసకొల్పికొలు.
4. పోరన్. 5. బంటికి లే వెవి యొంటర.

యర్జునపక్షపాతి యితఁ డాలము మేకొని చేయఁడుం జుమీ. 242

తే. చాలఁ గాలంబు పోవక చతురు లైన, వృద్ధజనములబుద్ధులు విండ్రు కాక
[1]ముదియ మతి దప్పి నోరికి నోదవినట్లు, పలుకు వెఱఁగుల మాటలు పాటి యగునె.

క. సేనమొగ మీతఁ డైనం, బూని మహీశ్వరులు నీకుఁ బోడిచెద రే దు
ర్మాని యని కాదె యీతని,తో నడచుట కొల్ల నైతి దురమున కధిపా. 244

వ. అనిన భీష్ముండు సూతసూనున కి ట్లనియె, 245

చ. ముదుకఁడ నైననాదుబలముం జలముఁ వివిధాస్త్రశస్త్రసం
పదయును బోయి నీగురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా
కెదిరినవారు పెక్కడల నే మయిరో యెఱుఁగుఁ జగంబు నా
[2]ముదిమియు నీకుమారతనముఁ వరుసఁ విజయుం డెఱింగెడున్. 246

క. అనుమానింపక సభలో, నను నేఁ జెప్పికొనవలసె నా కిమ్మెయి దు
ర్జనితుఁడ వగునీయెడ నీ,సున [3]నా కిటు పలుకవలసె సూతతనూజా. 247

తే. కార్యమును ఖడ్గమును నింత గలుగునీవు, కలుగఁ జేటువాటిల్లె నిక్కౌరవులకు
దీని మముబోఁటు లెల్లను దీర్ప నెట్లు, చాలెదము మఱిబంటవు చక్కనగుము.

చ. నెపమిడి యోహటించి యిటు నీవు తొలంగినఁ బోవ వచ్చునే
కుపితమనస్కుఁ డై నరుఁడు కూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ జ
న్న పిదప నెట్లుఁ [4]జొచ్చెదు రణంబున నప్పుడు చావ కున్న దై
న్యపుఁబరివారముం బటియు నైన నెఱింగెద రెల్లచంగముల్. 249

వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు. 250

ఆ. సూతపుత్త్ర యితఁడు నాతలఁ బెద్దమో, పెత్తి నమ్మి యున్న యట్టిచోటఁ
గ్రందు సేయ నాకుఁ గా దని సైరించి, యున్న బ్రదికి తింక నూరకుండు. 251

వ. అని యాడి మొగంబు గంటు వెట్టికొని యున్న సురనదీసూనుదిక్కు మొగం బై సుయోధనుండు నీకుం గోపింప నగునె నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వంబును సహింపవలయు నని తేర్చి యంగరాజుం గనుంగొని మీరిద్దఱు నొక్కటి యై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి యొరపుమాట లేల యని పొదివి పలికి తదనంతరంబ పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁ డై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముం డి ట్లనియె. 252

తే. పాండుపుత్త్రుల [5]నద్దెస దండిమగలఁ, గలనిజం బేను జెప్పినఁ గర్ణుమనసు
నొచ్చు నీచిత్త మె ట్లగునో యెఱుంగ, నాకు నిది యేమి పని రిత్తనడుమనుండి.

వ. అనిన మఱియు దుర్యోధనుండు [6]తఱిమి యడుగుటయు ని ట్లనియె. 254

---

1. ముదిత. 2. ముదియును నీకుమారతయు మువ్వురుసఁ. 3. నినుఁ జెడనాడ నేల. 4. జచ్చెదు. 5. యద్దెస. 6. దఱిమితఱిమి.

భీష్ముండు పాండవవీరులం దతిరథ మహారథాదుల నిరూపించి చెప్పుట

తే. అతిరథుండు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ, డాహవంబున నప్రతిహతుఁడు భీముఁ
డతిరథశ్రేష్ఠుఁడతని మహాబలం బమానుషము విక్రమం బసమాన మధిప. 255

క. సమరథులు కవలు భుజగర్వము పటువిక్రమము దుర్నివారంబులు వా
రి మనంబులు నిర్భయములు, తమ మొనలకు మించి [1]బెట్టు దాఁకుదు రధిపా. 256

సీ. వా రందఱును ధర్మవైభవంబునఁ దపస్సంపద నెక్కుడు జనుల కెల్ల
ధనువునాఱంగంబులను బరిణతులు, దాఁ కోర్తురు పగలకు నోర్వరాని
కోల్తల గలరు పెక్కులు పరాక్రమములు, వేర్వేఱ చేసిన వీరు లొక్క
మొగ మయి తాఁకిన వెగ డంద కుండునే, మనసేన ము న్నవమానపాటు

ఆ. దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన, వారు కాన యలఁతిఁ బోరు ప్రాణ
మాసపడక యొపినంతయుఁ బెనఁగుదు, రది సహించి నిలుచు టరిది మనకు. 257

మ. నరుఁ డీ మానము వాఁ డనంగ వశమే నా కంతవా రెందు నె
వ్వరు లే రింకను [2]బుట్ట రాపులికి దుర్వారోద్యముం డైన యా
హరియుం దోడగు నెమి చెప్పుదు నతం డా సేనలం గాచు నొ
క్కరుఁడుం గీటడఁగించు నీ బలములన్ గాండివదుర్దాంతుఁ డై. 258

వ. అనిన విని యక్కొలువున నున్న రాజుల మనంబు లెల్లను జేవ చెడియె భీష్ముండు
వెండియు ని ట్లనియె. 259

సీ. ద్రౌపదేయులు మహారథు లేవురును నారి, తరమ యుత్తరుఁడును ధరణినాథ
యతిరథవర్యుఁ డయ్యభిమన్యుఁ డర్జున, వాసుదేవుల కెన వచ్చువాఁడు
లఘుచిత్రములు నేర్పులావును దాల్మియుఁ,గలఁడు తండ్రులపాటు తలఁచుచుండుఁ
గావున బెడిదంబుగాఁ బోరు సాత్యకి, యతి రథోత్తముఁడు శౌర్యాన్వితుండు

తే. పాండవస్నేహసక్తుఁడై యుండుఁ గాన,నలుక మనమీఁదఁ బెద్దయుఁ గలిగి వెనఁగు
వీర లిరువురుఁ బరుసనివారు [3]సమర, పరుల నొప్పింతు రీ యోధవరుల నెల్ల. 260

మ. అలతిం బోరు మహారథుల్ ద్రుపద మత్స్యాధీశు లుద్యద్భుజా
బలశౌర్యాఢ్యులు పాండురాజసుతసంబంధప్రియస్నేహముల్
కలిమిం జేసి తదీయ [4]సైన్యమునకుం గా వొచ్చియుం జచ్చియున్
గెలిపింపం దమకించి చొత్తు రని కేకీభూతచేతస్కులై. 261

ఆ. వీరగుణము బలము వీకయుఁ గలఁడు మహారథుఁడు శిఖండి యతని తమ్ముఁ
డతిరథుండు దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ, డుగ్రతేజుఁ డనికి నుగ్రు నట్లు. 262

క. అతని సుతుఁ డర్ధరథుఁ డా, ధృతవర్ముఁడు పిన్నవాఁడు త్రిమ్మటకాఁడై
మతిహీనత శస్త్రాస్త్ర, ప్రతతిపరిశ్రమము లేక పాలసుఁ డగుటన్. 263

ఆ. చేదిభూవిభుండు శిశుపాలతనయుండు, ధృష్టకేతుఁ డధికధీరమతి మ

1. బిట్టు. 2. జూప శాతనికి. 3. సమద. 4. సైన్యములకుం.

హారథుండు భోజుఁ [1]డజుఁ డను రాజులు, నట్టివార తెంపు నలవుఁ గలరు. 264

వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్త్రదేవుండును జయంతుండును నమితౌజుండును విరాటుండును సత్యజితుండును ననం బరఁగు పాంచాలకుల ప్రదీపకులు మహారథులు మత్తమాతంగ బృందంబు చందంబునం బ్రతిబలంబుపయిం గవిసి కోలాహల బహుళంబుగాఁ గలఁపం జాలుదురు కేకయపతు లేవురు సహోదరులు మహారథులు కడిందిమగలు కెంపురథంబుల మొత్తంబులతోఁ గార్చిచ్చు పగిదిం బొదువుదురు కాశీశుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాశ్వుండు శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు వివిధాయుధ విద్యావిశారదులు వారి పోరు భరంబై యుండు. 265

సీ. చిత్రాయుధుండును జేకితానుండు మహారథు లిద్దఱు నర్జునునకుఁ
గూర్తురు కయ్యాన కోర్తురు నేర్తు రాయుధముల కెల్ల నత్యుగ్రు లవ్వి
ధమువార చంద్రదత్త వ్యాఘ్రదత్తులు, వినుము సేనాబిందుఁ డను నృపాలుఁ
డతి రథోత్తముఁడు మారుతపుత్త్రు నెనయతం, [2]డొక్కరుండును వారి యుఁకిదిలావు

ఆ. పాండ్యుఁ డతిరథుండు బలఁగంబుఁ గలవాఁడు, సమరథుండు కాశ్యుఁ డమితబలుఁడు
కుంతిభోజుఁ డాజికోవిదుఁ డతిరథుం, డతని యొద్దిజోదు రధికబలులు. 266

వ. రోచమానుండు మహారథుండు దేవసమానుండు. 267

తే. అతిరథుల కెల్లఁ [3]దల తండ్రి యట్టివాఁడు
నసురవిభుఁడు ఘటోత్కచుం డా హిడింబ
కొడుకు మాయాబలంబున నొడుచుఁ బగఱ
నతనికడ దానవానీక మగ్గలంబు. 268

వ. తోఁచినవారిం బేరుకొంటి నింతియ కాని రెండువీళ్లను మంచిమగలు పెక్కండ్రు కల రని చెప్పి గాంగేయుండు. 269

క. పాండవుల[4]దిక్కు వీరు లఖండితబలు లైన నా మొగంబునఁ బడి యు
ద్దండత చూపఁగ లేరు శిఖండిని నొక్కరునిఁ జంపఁ గాని కుమారా. 270

క. అనవుడు దుర్యోధనుఁ డాతని మీఁద వధింపమికిఁ గతం బేమి యొకో
వినఁ దగునేనిం జెప్పుఁడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. 271

వ. ఏ నాశిఖండిని జంపమికి మూలంబు చాలం గలదు తత్ప్రపంచం బంతయు వివరించెద నాకర్ణింపుము. 272

### భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు చెప్పుట

సీ. శంతనుపిమ్మట సత్యవతీదేవి, యనుమతితోడఁ జిత్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి, నల్పకాలంబున నతఁడు తీఱెఁ

---

1. దనుజులుఁ దనుజులు. 2. డొక్కరుండు వారియందుం గలండు; డొక్కరుండును సేన యుక్కు మడఁచు. 3. దలిదండ్రు లట్టివాఁడు; దండ్రి యైనట్టి. 4. దిక్కురథికుల.

దత్పరోక్షావస్థఁ దదనుసంభవుని విచిత్రవీర్యుని రాజుఁ జేసి పెండ్లి
చేయంగఁ దివిరి కాశీపతికూఁతులు, కన్యలు ముగ్వురు కలుగుటయును

తే. నాతఁ డర్థిఁ దదీయస్వయంవరమున, కఖిలనృపతులఁ బిలిపించె[1]ననియు నెఱిఁగి
తల్లి కెఱిఁగించి యొంటిమైఁ దత్పురమున, కాయితం బయి పోయితి నరదమెక్కి.

వ. ఇవ్విధంబునం జని యమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబి
కయు నంబాలికయు ననుముద్దియల ముగ్వురం బట్టి రథంబుపయిఁ బెట్టికొని రా
నచ్చటిరాజు లెల్లను జతురంగబలంబులతో వచ్చి నన్నుం బొదివినఁ బటువిశిఖా
నలశిఖా[2]కలాపంబున వేఁడిమి చూపి వారి నిలువరించి యరుఁగుదెంచి సత్యవతికి
నప్పొలంతుల నొప్పించిన నద్దేవి విచిత్రవీర్యునకు వారలవివాహంబు చేయ నుద్యో
గించె నట్టియెడ నమ్ముగ్వురయందుం బెద్దయది యైనయంబ యను కన్యక నాతో
ని ట్లనియె. 274

తే. సౌంభపురవల్లభుం డైనసాళ్వమీఁదఁ, దలఁపు కలదు నాకతఁడును దగులు కలిగి
యుండు నాదెస నీవు ధర్మోత్తరుండ, వతనిపాలికిఁ దగ నన్ను ననుపవయ్య. 275

క. అన విని సత్యవతికిఁ జెప్పిన నాయమ పనుప నంబఁ బెంపుగ వృద్ధాం
[3]గనలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి చేయన్. 276

వ. ఇట్లు పనిచి తక్కిన కన్నెల నిపువురం బాణిగ్రహణంబు చేయించితి. 277

క. అంబయు నట సాళ్వునికడకుం బోయిన నతఁడు భీష్ముకొనిపోయినదా
[4]నిం బరచుం గైకొన ధర్మంబె కన్యాత్వ మెడలె మగువా నీకున్. 278

వ. ఇంక నిన్ను భార్యఁగా వరియింపం దగునే యనినఁ గామశరపీడిత యగుచు
నక్కామిని యతని కి ట్లనియె. 279

తే. తమ్మునికిఁగాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ, గన్నియలఁ గొనిపోయెఁ గాన బలిమి
నన్నుఁ గొనిపోయె నాచేత నిన్ను వినిన, యపుడె పుత్తెంచె దూషింపననఘతగునె.

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించినకతంబున నింత
పుట్టె భీష్ముండు నాచెలియండ్రం దనతమ్మున కిచ్చి నన్ను నీకడకుం దగ ననిచె దీన
నేమిత ప్పని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక తన్నుం జేకొనక
సాళ్వుండు. 281

క. కరుణంబుగ నేడ్చుచు తలోదరిఁ బో పొమ్మిచట నింకఁ దడయకు మని మం
దిరము వెడలంగ [5]నడిచిన, నరిగె నదియు నార్తచిత్త యై వికలగతిన్. 282

వ. చని చని యవ్వెలంది యి ట్లని వితర్కించు. 283

తే. సాళ్వునకుఁ గానియపుడ సంసారమునకుఁ, బాసితిన యింక భీష్మునిపాలి కేల
యరుగ నాతండు మూల మీహానికెల్లఁ, గాన నాతని సాధింతుఁగాక యేను.

---

1. నదె యెఱింగి. 2. కలాపంబుల. 3. గనలఁ దగుదోడు. 4. నిం బరచఁ గైకొనుట యుంచి, తంబే... తరుణీ కికన్; బరగఁ గైకొనుట ధర్మంబే. 5. ననిచిన.

క. [1]గాంగేయు గెల్వ నెవ్వరి,కిం గోలఁదియె తపము పేర్మి గెలిచెదఁ గా కం
చుం గాంత చనియె సంయమి, పుంగవు లాకర్ణింప నున్న పుణ్యస్థలికిన్. 285

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించిన వా రిది రాజులు చేసినపని సాధుల చేతఁ జక్కంబడునే యనిన నవ్వనిత తపశ్చరణంబునకు వచ్చితి ననుటయు నీవు సుకుమారవు నీ కిది చొప్పడునే తండ్రి పాలికిం బొమ్మనియె పరమధర్మం బని పలికిన వారి కన్నారీరత్నం బి ట్లనియె. 286

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమునఁ దపము చేసె దిది నిర్ణయ మే నెవ్వారికడకు నే మని, [2]యెవ్విధిఁ బో నేర్తు దాన నేటికి [3]బంధుల్. 287

వ. అని చెప్పునవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుండను రాజర్షి వచ్చిన నమ్మును లభ్యాగతపూజలు చేసినయనంతరంబ యంబం గనుంగొని యిక్కన్నియ యెక్కడిది దీనివిషాదంబునకుం గారణం బే మని యడిగి వారివలన దాని జన్మ ప్రకారంబును దద్వృత్తాంతంబును విని తనకూఁతుకూఁతు రగుట యెఱింగి యయ్యంగన వినం దపస్విజనంబులకుఁ జెప్పి యప్పొలంతిం దనయంకతలంబున నునిచికొని వెండియు నడుగ సవిస్తరంబుగా నచ్చేడియ చెప్పిన విని శోకించి యవ్విషమప్రకారంబునకు [4]నిస్తారంబుఁ జింతించి. 288

ఉ. నీ కిది యేటికిం దప మనింద్యచరిత్రవు నీవు నన్నుఁ జే
కొని కాతు నొక్కగతిఁ జెప్పెద భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాన్పు మాపదలు చెందఁగ నీ దతఁ డాశ్రయించినన్
శోకము [5]తక్కు మన్న విని సుందరి [6]యల్లన యత్తపస్వితోన్. 289

ఆ. పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ, గలుగు నాతఁ డెట్లు కరుణ చేయు
[7]ననఁ దపస్వి యిట్టు లను మహేంద్రం బను,పర్వతమునఁ జేయుఁ బరమతపము.

వ. నన్ను మన్నించుం గావున మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు నందుఁ బొమ్మనుసమయంబునం బరశురామశిష్యుం డగునకృతవ్రణుం డను ముని వచ్చి యతిథిసత్కారంబులం బూజితుం డై యున్నఁ బ్రియపూర్వకంబుగా నాహోత్రవాహనుండు భార్గవుం డెయ్యెడ నున్నవాఁ డని యడిగిన నతం డి ట్లనియె: 291

క. తనప్రియసఖుఁడవు నీ వని, మునిజనులకుఁ జెప్పు చుండు ముదమున నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ, జనుదెంచు ననేకశిష్యసంఘముతోడన్. 292

తే. అనిన విని యెల్లవారును నధికహర్ష
మెసఁగ నున్నంత మఱునాఁడ యేఁగుదెంచె

---

1. గాంగేయుఁ జెనయ. 2. యెవ్విధమునఁ బోవు దాన. 3. బుద్ధుల్. 4. విస్తారంబు చింతించి. 5. దక్కు మీ వనిన. 6. యి ట్లను న. 7. ననినఁ దపసి యిట్టు లనియె మహేంద్ర మృన్పర్వ.

భార్గవుం డమ్మునీంద్రులు పరమభక్తి
నర్చ లిచ్చిరి హోత్రవాహనుఁడుఁ గనియె. 293

వ. కని పరశురామునిసంభావనంబును సంభాషణంబును బడసి కాశిరాజకన్యకం జూపి యిది నాదౌహిత్రి దీనివృత్తాంతం బెఱింగియు విను మని యమ్మానినిం గానిపించిన నదియును. 294

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం [1]జరణానత యైన రాముఁ డి
ట్లను విను హోత్ర[2]వాహనుని చెట్టుల యేనును నీకు నీమనం
బునఁ గలచింత యంతయును బుచ్చెద నాకడఁ జెప్పి తెంక నీ
వనటఁ దొఱంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీనిమూలమున్. 295

వ. అనిన విని యమ్మహాత్మునకు నంబ తనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పి నీ వార్తశరణ్యుండవు [3]నాపరిభవంబు దీర్చి నన్ను రక్షింపు మనవుడు నతం డి ట్లనియె. 296

క. పరిభవము రెండు తెఱఁగులఁ, దరుణీ తోఁచినది సాళ్వుఁ దగఁ [4]దేర్తునొ యు
ద్ధురుఁ డగు [5]భీష్మునిఁ దేర్తునొ, కరము ప్రియం బెద్ది హృదయగతముం జెపుమా.

చ. అనవుడు నింతి యి ట్లను మహాపురుషా నను సాళ్వుఁ డింకఁ గై
కొనఁ డది చాలు భీష్ముదెసఁ గోపము నామదిఁ గల్గి యుండు నా
తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్
నినుఁ గని యీపరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్. 298

తే. అనిన నాచెప్పినట్ల గంగాత్మజుండు, చేయుఁ జేయక తక్కిన శితశరముల
నతనిఁ బడవైతు నూఱడు మబల నీకుఁ,దపము చేయంగ నేటికిఁ దనువు డయ్య.

— పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట —

క. అని పలికి పరశురాముఁడు, చనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ దోఁ
జనుదేరఁ గురుక్షేత్రంబున కుద్ధతిఁ గాశిరాజపుత్రిం గొనుచున్. 300

వ. వచ్చి సరస్వతీతీరంబున విడిసి తనరాక నా కెఱింగించిన నేను ఋత్విక్పురోహిత ప్రభృతివిశిష్టబ్రాహ్మణసమేతంబుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున కరిగిన నమ్మహాత్ముండును మదీయభక్తివినయసంభ్రమంబులు సంప్రీతి నభినందించి యర్చనలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో ని ట్లనియె. 301

తే. బలిమి మున్నీల తెచ్చి తిప్పుడతి మగుడఁ
ద్రోచి పుచ్చుంగఁ దగునయ్య నీచవృత్తి
వచ్చె దీనిఁ దమ్మునికి వివాహ మింక
నైనఁ జేయుము చెఱుచుట యనుచితంబు. 302

---

1. శరణాగత. 2. వాహనుని య ట్లను నేను. 3. నాపరిరంభంబు. 4. గూర్తునొ; దీర్తునొ.
5. భీష్మునిఁ దీర్తునొ; దీర్తునొ

క. అనుటయు ననఘా తెలియఁగ, విను మిది నాతోడ సాల్వవిభునకు నేఁ గూ
ర్చినదాన నతనిపాలికి, ననుపుము నన్ననినఁ గాదె యనిచితి మగుడన్. 303

తే. ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి, చేయ [1]నేరుతు నను మీఁదు నా చెప్పినట్లు
చేయవైతేని నిన్ను నీచెలులఁ జుట్టములను జంపుదు ననియె నమ్మునివరుండు. 304

వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుప నంతకంతకు
నతనికి గోపం బగ్గలం బైన వెండియు. 305

ఆ. గురుఁడ వై సమగ్రకోదండవిద్యామహత్త్వ మిచ్చినాఁడ వలుగఁ దగునె
కారణంబు లేక యీరస[2]మెత్తి యిట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున. 306

చ. గురుఁ డని నన్నెఱుంగు దనఘుండవు నావచనంబునం దనా
దరణము చేసి తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ నీ
వెరవులు తక్కు మీయబల వేగమ పెండిలి చేయు మంతతో
మరలు మదీయకోపశిఖి మానదు [3]వేఱొకవేయుఁ జేసినన్. 307

వ. అనిన విని [4]ధర్మాచరణంబున కింత పట్టి పెనంగ నగునె పరానురక్తచిత్త యగు
మగువ నిల్లాలిం జేయువారుం గలరె యిట్టియకృత్యం బాచరించుటకంటె నీచేత
నెట్లయినను లెస్స తొల్లి పెద్దలు చెప్పినచొప్పవధరింపు మని యిట్లంటి. 308

తే. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి, దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ [5]కున్మదవృత్తి వర్తించునట్టి, వాని గురునైన దండింప వలయు నండ్రు. 309

క. అనుమాటకుఁ గాలానలమును బోలెను మండి కయ్యమున కాయితమై
మొన[6]లేర్చి వేగ యిచటికిఁ, జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. 310

వ. పలికిన నేనును. 311

క. అలుకఁదనంబున విప్రుఁడ, కలుగంగాఁ [7]దగదు గురుఁడవు నై యున్నాఁ డం
చలమక తలఁచితిఁ గాకిటు, నిలుమీ నీరణము చేఁత నిజ మగునేనిన్. 312

క. క్షత్త్రియులఁ దొల్లి యలుకకుఁ, బాత్రము నేసితటె నాఁడు బలియుఁడు గంగా
పుత్త్రుఁడు పుట్టమిఁ గాకిది, యీత్త్రయి [8]నింకేల చెల్లు నెఱుఁగవె నన్నున్. 313

క. ఏ నొకరుండన వచ్చెదఁ, గాని బలము దేను నీవు కఱపినశస్త్రా
స్త్రానేకవిధవిలాసము, [9]తాన వలయునేన గాదె తథ్యం బరయన్. 314

వ. అని పలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి సత్యవతి కింతయు విన్నవించి యద్దేవి
యనుమతి వడసి సర్వసన్నాహసమేతం బగురథం బెక్కి విప్రాశీర్వాదంబులు
చెలంగ వెడలి వచ్చి కురుక్షేత్రంబు దఱియం జనునెడ భాగీరథి భామినీరూపం
బున నరుగుదెంచి తన్నెఱింగించి మదీయభక్తి నభినందించి యే నాయితంబై

1. నేర్తునె యనుఁడు. 2. మెత్తితీ, రనిన. 3. వేఱొకటెన్ని చేసి. 4. యధర్మా. 5. కున్మత్త.
6. లేర్చి. 7. దగునె. 8. నీకేల చెల్లు. 9. గానఁగవలె.

పోవుటకుఁ గారణం బడిగి నాచేత నత్తెఱం గెఱింగినదియై నన్నుం గినిసి భార్గవు పాలికిం జని నీశిష్యుండు నిరపరాధుండు నాకొడుకున కలుగం దగునే యని చెప్పి యతనియందుఁ [1]బిక్కగానక మగుడ నేతెంచి నావలనను మెత్తంబాటు లేకున్నం జనియె నప్పుడు సిద్ధవిద్యాధరమునిగణంబులు కౌతుకంబునం గనుంగొను చుండ నేను జమదగ్ని తనయున కనతిదూరంబునం దేరు డిగి వినతుండనై నిలిచి నీవు భూచారివై యున్నవాఁడవు రథికుండనైననాకు నీతోడ సమరంబు చేయ నగునే యనిన యనంతరంబ యతండు దివ్యంబు లగురథరథ్యంబులు శస్త్రాస్త్రంబులునుం గలిగి యకృతవ్రణుండు సారథిగా సమరసన్నద్ధుం డై తోఁచినం జూచి రథారోహణంబు చేసి శంఖంబు పూరించి గుణంబు సారించి సూతు నగ్గించి తనకు నమస్కరించి కడంగిన నప్పరశురామదేవుండు. 315

భీష్ముఁడు పరశురామునితో యుద్ధంబు చేయుట

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే [2]నాకసమునఁ గుదియించితి నా
యరదంబుపొంతకును న,చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరక యుండన్. 316

క. ఒకమొగి నలువదియమ్ములఁ, బ్రకటబలుం డైనపరశురాముఁడు నాయం
గకములు తాఁకఁగ నశ్వ, ప్రకరము నొ నాట సూతుపైఁ బడ నేసెన్. 317

క. దానికి నవ్వుచు వేగం, బే నొకభల్లంబు దొడిగి యేసితి సాంద్ర
జ్యానాదభరితరోదసి, యైనతదీయోగ్రచాప మఱిముఱిఁ దునియన్. 318

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలరోషమహానలార్చు లొం
డొండ మొగంబుపై నెగయ [3]నుర్విఁ చలింప గుణధ్వనిక్షి సము
ద్దండతఁ దీవ్రమార్గణశతంబున నాయరదంబు ముంచె రా
ముండు వియచ్చరప్రకరముల్ వెఱఁ గందుచుఁ [4]బ్రస్తుతింపఁగన్. 319

క. ఉఱక మదీయాంగంబులు, గిఱిగొన నశ్లేయుటయును గినుక కదిరినక్షి
మెఱుఁ గారునారసమ్ములు, తఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్. 320

తే. ఉచ్చి పోయిన [5]యేటుల నొలుకుశోణి,తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ
జిగురుఁదఱుచునఁ గెంజాయమిగిలిచెలువు,వడయుక్రొమ్మావిచాడ్పున భార్గవుండు.

క. నెత్తురు వడిసిన మూర్ఛా,యత్తుం డై సొగయుటయును నాతనిఁ గని యు
ద్వృత్తక్షత్రియధర్మో, పాత్తం బగుతేజ మొల్లఁబాఱై తోఁచెన్. 322

వ. అప్పుడు మనంబున నన్ను నేన గర్హించుకొను చుండితి. 323

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁ డై, యేఱు పాఱుతెంచు నెసకమెసఁగ
నప్రమేయశరము లడరించె నవి సత్వ,రముగ నేను బ్రతిహతములు చేసి. 324

క. మరుదస్త్రమేయ గుహ్యక,శరమున వారించె నతఁడు సరభసముగ ను

1. బిక్కు; పక్కు (బలుకు). 2. నారసమున. 3. నుర్వి సలింప. 4. విచ్చలింపఁగన్.
5. గంట్లను నొలుకు; నట్లను.

ద్ధురశిఖిబాణం జేసిన, గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. 325

క. ఇమ్మెయి నతఁడును దివ్యా, స్త్రమ్ములు నామీఁద నేయ రయమునఁ బ్రతిఘా
త మ్మొనరించితి దివిజగ,ణ మ్మంబరవీథిఁ గీర్తన మ్మొనరింపన్. 326

తే. రాముఁ డంత్యకాలానలోద్దామలీల
మండి నాయురస్థ్సలి యొక్కమార్గణమున
నేసె నంతంత నున్నమునీశ్వరులును
కాశిరాజకన్యయును గడఁగి యార్వ. 327

క. అనిశితాస్త్రం బెయ్యది, యో నాకుం దెలియ దది మహోగ్రత నాటం
గా నొచ్చి పడితి నరదము, పై నప్పుడు సూతుఁ డచటు పాపె రథంబున్. 328

తే. చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి, రాముఁ డున్నెడ కప్పుడు క్రమ్మఱంగ
రథముఁ దోలించి బాణపరంపరాని,మగ్నుఁ జేసితి నంబనెమ్మనము తలఁక. 329

వ. ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం బుపసంహరిం
చుచు రేపకడ తొడంగుచుం బెనంగ నిరువది రెండుదివసంబులు చెల్లిన మఱు
నాఁటికయ్యంబున నేనునుం గడంగి. 330

క. కడు బెట్టిదముగఁ గదియం, బడి హయములు నొవ్వ ధనువు భగ్నంబుగఁ జే
డ్పడి సారథి తెరలఁగఁ దన, యొడలు [1]సిరుఁగ నేసినను మహోద్ధతి గురుఁడున్.

క. ఒకశక్తి వైవ నఱికితి, [2]నకుటిలముగ శక్తిదశక మడరించిన స్రు
క్కక త్రుంచితి బహుశక్తుల, నికరము పరఁగించినం దునిమితిం బెలుచన్. 332

క. విస్మయము నొందుభార్గవు, నస్మత్కర మపుడు లాఘువారూఢముగా
సస్మితుఁ డగుచుం బటుదీ, ప్తిస్మేరాస్త్రముల [3]నేసితిం బరవశుఁగాన్. 333

వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకులత్వంబు
నొంది హాహాకారంబులు చెలంగఁ బొదివి రంత. 334

ఆ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రనారాచ, పంక్తిఁ గురిసి నన్నుఁ బారవశ్య
మంది నేల కొఱగునట్లుగాఁ జేసి మత్సూతుమస్తకంబుఁ దునియ నేసె. 335

వ. అట్టియెడ నెనమండ్రువిప్రులు సమానవయోరూపంబుల నొప్పువారలు
నన్నెత్తి సేదదేర్చి రథంబుపయిం బెట్టి గగనగమనంబునం బోయి రంతకుమున్న
మందాకిని మున్ను నాకన్నచందంబున నొగలపయినుండి మదీయరథ్యంబు
పగ్గంబులు ధరియించి యున్నయది యేనునుం గనుంగొని నమస్కరించిన దీవించి
చనియె వెండియు. 336

క. సారథ్యంబును జేయుచు, ధీరత పాటించి రామదేవునితోడం
గ్రూరాస్త్రంబులఁ జతురవి,హారం బొనరించితిని సురావలి పొగడన్. 337

1. సిరుగ. 2. నకుటిలమతి. 3. ఁజేసితిం బర.

## భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట

వ. ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్ల చని యే నా రాత్రి యేకాంతంబున దర్భశయనంబున నుండి సురభూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు చేసి పరశురాముని జయింప రాదయ్యెడు దినంబులు పెక్కులు చనియె నతని నాజి జయించుటం గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱడింపవలయు నని ప్రార్థించి నిద్రించుచుండం బవలు నన్నెత్తి రథంబు పయిం బెట్టిన యెనమండ్రును బ్రభాతసమయంబునం గలలోన వచ్చి. 338

తే. నీవు నేమును నొక్కటి నీకు వెఱవ, నేల గాంగేయ రాము జయించునట్టి
శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు, నిచ్చి పోయిరి క్రమ్మఱ [1]నెక్కడేని

వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్రస్వరూపంబును బ్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుం గాలోచితకృత్యంబు లాచరించి యొక్క సారథి నంగీకరించి యరదంబు పూన్పించి సన్నద్ధుండ నై సత్వరంబుగా సమరంబున కరిగినం బరశురామదేవుండు. 340

క. నిన్న నఱచచ్చి పోయితి, వున్న యఱయు నేఁడు దీర్చియుడిపెద నీగ
ర్వోన్నతి యిం కెట [2]పోయెదు, నన్ను నెఱుఁగ వెట్టు లనుచు నాపైఁ గవిసెన్.

క. కవిసినఁ గడంగి [3]యేనును, గవియించితి నంప వెల్లిఁ గడుఁ గ్రూరత భా
ర్గవుఁడును మద్గాత్రంబున, వివిధాస్త్రప్రతతి [4]నించి వెగడొందించెన్. 342

వ. ఏనుం గోపించి. 343

తే. రయము మెఱయంగ నొక్క నారసము ఫాల
దేశమునయందు నాటించి తీవ్రశక్తి
నురము వైచినఁ దూగాడి [5]యొఱగ మూఁది
పట్టియక్కృతవ్రణుఁడు తేర్చెఁ బరశురాము. 344

క. అప్పుడు తెప్పిఱి కన్నుల, నిప్పులు రాలంగ నన్ను నిశ్చలదృష్టిం
దప్పక చూచి యలఁతిన, వ్వొప్పఁగ బ్రహ్మాస్త్ర మాతఁ డుగ్రత నేసెన్. 345

క. తెగఁ గొని బ్రహ్మాస్త్రమ యేఁ, దగ నేసిన నొకటి నొకటి దార్కొన రెండుం
గగనం బంతయుఁ [6]దేజ, స్థగితముగాఁ జేసె సురలు [7]దైత్యులుఁ దలఁకన్. 346

తే. సకలభూత [8]సంక్షోభసంజన మైన, యట్టియెడఁ గని యిది తఱి యని తలంచి
మోహనాస్త్రంబు నంచితావాహనంబు, చేయుటయును జరాచరశ్రేణి మ్రాఁ సె.

వ. తదవసరంబున. 348

క. ఉడు గుడుగు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ వేగంబున న

---

1. నెచటికేని. 2. పోనగు, నన్నెఱుఁగవె యనుచు వచ్చి. 3. వెల్లుగ. 4. గురిసి, (గ్రుచ్చి.) 5. నొగల. 6. దేజస, మగణితముగఁ జేసి. 7. మునులుఁ దలంకన్. 8. విక్షోభ.

య్యెడ కేఁగుదెంచి నారదుఁ, [1]డెడపడు టించుకయు లేక యిట్లను నాతోన్.

క. గురునకు నవమానము ని,ష్ఠురవృత్తిం జేసె దీవు చూచితిమే యి
ప్పురుసునఁ బరుసపునడవడిఁ, గురువంశప్రవర యిట్లుఁ గూడునె చేయన్. 350

వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి. 351

క. వీరె సుర లాకసంబున, గారవమున బుద్ధి చెప్పఁగా నీకడకుం
దా రేఁగుదెంచి రని క, న్నారంగాఁ జూపె నాకు నయ్యేనమండ్రన్. 352

వ. ఇవ్విధంబున నెప్పటివిప్రవరులు సన్నిధి చేసి నన్నుం జూచి నగుమొగంబులతో
నెఱుఁగనివారపోలె నిట్లనిరి. 353

క. నారదముని త్రైలోక్యస,మారాధ్యుం డితనిపలుకు లాగమవాక్యో
దారములు వినుము వీనిం, గ్రూరత పాటింప దగదు గురువిషయమునన్. 354

వ. అనిన విని యేను సమ్మోహనాస్త్రం బేయుట యుడిగి బ్రహ్మాస్త్రంబు దీపింపఁ
జేసితి నప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి యోటమి యొక్కించుకొని
చలంబు మిగిలి యున్నం దజ్జనకుండు జమదగ్నియుఁ దదీయపితృవర్గంబును
నతనికి సన్నిధిచేసి వేఁడికొని [2]శాంతవచనంబులం దేర్చి యి ట్లనిరి. 355

క. వినుము వసుమూర్తి యీతం, [3]డనన్యసామాన్యతేజుఁ డాహవభూమిన్
మనకు జయింప వశమె భీ,ష్ముని విప్రున కగునె రోషమును మత్సరమున్. 356

తే. సమర ముదుగు నారాయణసఖుఁడు నరుఁడు
సవ్యసాచి నా నింకొకజన్మ మొంది
యితని వధియించుఁ గాని త క్కితరజనము
లకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన. 357

వ. అనిన నతండు శోక పెనంగిన వెండియు ననేకప్రకారంబులం జెప్పి యమ్మునులు
నాకడకుం జనుదెంచి యుపశమనవాక్యంబులు పలికి జామదగ్న్యుతోడం
దమయాడినమాటలు తేటపఱిచి యప్పుడు ఘాడసూపినజాహ్నవియుం దారు
బహువిధంబుల నన్ను ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని
యరిగియుం గ్రమ్మఱ మత్సమీపంబునకు వచ్చియు నెట్టకేలకుం జలం బుడిపిన
నేమిరువురమును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరం బుడిగితి మట్టియెడ న
య్యేనమండ్రు విప్రులుం జేరి నాతో ని ట్లనిరి. 358

తే. గురుఁడు బ్రహ్మవిదుఁ డకుంఠితతేజుండు, పరశురాముఁ డతనిపాలి కీవు
భక్తి మెఱయ నేఁగి ప్రణమిల్లి తదనుగ్ర,హంబు వడయవలయు ననఘ యిప్పుడు.

వ. అని చెప్పి యతనికడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్నిప్రముఖు
లును భాగీరథియును జని నీశిష్యుండు దేవవ్రతుండు వానియెడ నలుగం దగునె
వాఁడు తగవు మాలినపనిఁ జేయంజాలక పెనంగె నింతియ కాని విరోధి కాఁడు

---

1. డెడఁబడు; డెడమడు. 2. సాంత్వ (సాత్విక). 3. డనూన

[1]వానిం గరుణింపు మని తెలిపి నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగదండప్రణామంబు చేసిన నతండు దీవనతోఁ గ్రుచ్చి యెత్తి కౌఁగిలించికొని గాంగేయా నీశక్తికి భక్తికిం బ్రీతుండ నైతి నని సస్నేహంబుగా సంభావించి యంబ నవలోకించి నన్ను భీష్ముండు గెలిచె నావలన నయ్యెడుపని యింతియ నీ వింక నీకుం జూడం బోలినగతిం జొ మ్మనిన నమ్మానిని దేవా యిది యిట్టిద నీయోపినంతయుం జేసితి నీచేతం బోకున్న నేమి చేయుదు నేను దపంబు పెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబున నైననుం జలంబు సాధ్యంబు చేయుదు నటు సూడు [2]మని పలికి పోయెఁ దదనంతరంబ యమ్మునిజనపితృదేవతా సమూహంబును భృగునందను నన్ను నామంత్రణంబు చేసి యంతర్ధానంబు చేసె భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్నుఁ దనతో వచ్చినతపోధనవర్గముం దానును మహేంద్రశైలంబునకుం జనియె నేను మగిడి యెడ నెడ నుర్వీసురుల యాశీర్వాదంబులు సంభావనవచనంబులుఁ బ్రస్తుతివాక్యంబులుఁ గర్ణంబుల కింపు చేయ నిట వచ్చి సత్యవతికి నమస్కారపూర్వకంబుగా నంతయు నెఱింగించిన నద్దేవి యభినందించి 360

—నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయుఁ జెప్పుట—

తే. అంబవృత్తాంత మరయంగ ననుదినంబుఁ
దగినవారలఁ బుచ్చుచుఁ దలఁకు చుండు
నేను నది యాదిగాఁ జింత నేపు దక్కి
స్రుక్కి యుండియు రాజుల నుక్కు మడఁతు. 361

వ. ఒక్కనాఁడు పారాశర్యనారదులం గని యక్కార్యంబు భయంబు తోఁప సన్నవించిన వారలు దైవాధీనం బగుదాని మానుషంబున మానిపింప వశంబుగా దాచింత విడువు మని రందు నారదుం డక్కాశీశ్వరకన్యకతెఱంగు విను మని యి ట్లనియె. 362

సీ. ఆతన్వి యమునానదీతీరమున కేఁగి, యత్యుగ్ర మగుతప మాచరించి
యందుండి కౌశికునావాస మాదిగాఁ, గలుగుసిద్ధాశ్ర[3]మంబులకు నెల్లఁ
జని చని తత్ప్రదేశంబుల నిష్ఠుర,వ్రతములు సలుపంగ వచ్చి నీదు
జనని జాహ్నవి [4]యిట్లు వనితల కతిదుష్కరము లగుబహునియమములు నీకు
తే. నడపఁ గత మేమి యనుఁడు నన్నాతి పలుకుఁ
దద్ద యవమాన పడితి శాంతనవుచేత
నపరజన్మంబునం దైన నతనిఁ జంప
నేను జాలుట కై యిట్టిదాన నైతి. 363

వ. అనిన విని భాగీరథి కుటిలప్రచార వగుట నీ వీతనువు విడిచి యేఱయిపాఱంగల

1. వానికిం. 2. మని తేర్చి. 3. మములకుఁ జేర్చిఁ. 4. చూచి వనితల.

దాన వింతియ కాని యొండు గానేర వనిన నవ్వేలంది నవ్వుచు సరకు చేయక
తిరిగి తొంటికంటెను దీవ్రం బగుతపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు [1]మత్స్యదేశ
వాసి యై యుండి యొక్కనాఁడు నిజవ్రతఫలంబులో సగంబున నంబ యను
పేర నది యై యమ్మండలంబునం బరఁగి యున్న సగంబునను దనరూపు చెడకుండ
వహించికొని జాహ్నవీప్రభావంబు నాత్మీయప్రభావంబున గెలిచి వెండియు. 364

క. పుణ్యాశ్రమదేశముల న,గణ్యం బగుతపము చేయఁ గా రుద్రుఁడు కా
రుణ్యము వాత్సల్యము దా,క్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్. 365

క. మును లచ్చెరు వంది కనుం,గొన శంభుఁడు నిల్చి వరముఁ గోరు మనుడు భీ
ష్ముని నాకుఁ జంపఁగా దొర,కొనునట్లుగ నొసఁగు మనియెఁ గోమలి యెలమిన్.

వ. అనవుడు నద్దేవుం డట్ల [2]కాక యని యనుగ్రహించిన నంబ యెత్తెఱంగున నది
యయ్యెడు నని యడిగిన. 367

సీ. ఈమేను విడిచి నీ వేఁగినయప్పుడు, ద్రుపదభూవిభునకుఁ దొల్త పుత్రి
వై పుట్టి పిదపఁ బుత్త్రాకృతిఁ [3]గాంచి శి,ఖండినామమున నుద్దండబాహు
బలమునఁ గోదండపాండిత్యమును బటు,శౌర్యంబు నొప్పఁ బ్రశస్తి కెక్కి
యనిఁ జంపఁ గలదాన వాతని నామాట, తప్ప దూఱడు మని చెప్పి హరుఁడు

తే. చనియె నాప్రొద్దు సమిధలు చాలఁ గూడఁ,బెట్టి యనలంబుఁ గూర్చి యవ్వనితక్రోధ
దీప్తమూర్తి యై భీష్మ వధించుదాన,ననుచు సొచ్చెఁ జొచ్చె మును లెఱు నద్భుతముగ.

వ. అట్టియెడ ద్రుపదుం డనపత్య యగుతనమహిషి విషాదంబు దీర్పం దివురుటను
గాంగేయుతోడిరోషంబునను శివుని నుద్దేశించి తపంబు చేసిన నద్దేవుండును
ప్రత్యక్షం బయి వరంబు వేఁడు మనిన భీష్మ వధియించునట్టివాని నొక్కపుత్త్రుని
నొసంగవలయు ననుడు. 369

తే. కూఁతు రై పుట్టి [4]పదపడి కొడుకుఁదనముఁ,గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు
నట్టియుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్ప దిది యని రుద్రుండు చెప్పి చనియె.

వ. ద్రుపదుండును బ్రీతుం డయి నిజప్రియకు నవ్విధం బెఱింగించె దనంతరంబ
కాశీశ్వరకన్యకచైతన్యం బుదరంబు ప్రవేశించిన. 371

క. పాంచాల[5]రాజభార్య స,మంచితగర్భంబుఁ దాల్చి మఱువడఁ గూఁతుం
గాంచి నిజపతియుఁ దానును, వంచనఁ గొడు కనిరి యెల్లవారును వినఁగన్. 372

వ. ఇట్లు పుట్టినబిడ్డకుఁ బుత్త్రప్రకారంబున జాతకర్మాదికృత్యంబులు నిర్వర్తించి శిఖండి
యనుపేరు పెట్టి [6]యతిప్రచ్ఛన్నంబుగాఁ బెనిచి రహస్యంబు తెఱంగా కన్నియకుం
జెప్పి యక్షరశిక్షాదు లాచరించి ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్రపరిశ్రమంబు
చేయించుచుండ జవ్వనంబు చొరవకుం దఱి యగుటయు నమ్మగువం జూచి

1. వత్సదేశ (తత్సమీపదేశ) నివాసిని యై. 2. యగుంగాక. 3. దాల్చి. 4. యది మీఁతి కొడుకుఁ. 5. రాజపత్ని. 6. యతిప్రయత్నంబుగాఁ బెంచి.

వగచి తల్లిదండ్రులు తమలో విచారించి వేగంబ వివాహంబు చేయవలయుఁ బరమేశ్వరువరంబుకొలంత తన నెఱిసినప్పుడు నెఱయుం గాక యని నిశ్చయించి దశార్ణదేశాధీశుం డగుహేమవర్మ యనురాజుకన్యకం దగినతెఱంగునఁ బాణిగ్రహణంబు చేయించి తెచ్చి యున్నంత. 373

ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండివ, ర్తనము నెడఁ బ్రమాదమున నెఱింగి యగ్గడింప నొల్లకూరక యెఱుఁగని, యదియుపోలె నుండె నాత్మ [1]నొచ్చి. 374

వ. ఇట్లు దశార్ణవిభుపుత్త్రి యెఱింగి శిఖండి పురుషుండు కామి తనదాసికిం జెప్పిన నదియు నప్పు డన్నరనాథున కెఱింగించి పుచ్చిన నతండు విషాదరోషంబులనొంది దూతం బుత్తెంచిన వాఁడు వచ్చి పాంచాలపతిం గాంచి యి ట్లనియె. 375

చ. కొడు కని [2]తెచ్చి యి ట్లగునె కూఁతు వివాహము చేయ దీన నీ పడసినలాభ మేమి నగుఁబా టగు[3]నింతియ కాక యెల్ల నే ర్పడ నెఱుఁగంగ వచ్చితి నరాతిభయంకరు హేమవర్మ నా గడమున గాసిచేసితి మగంటిమి నీదెస నైనఁ జూపుమా. 376

ఆ. [4]అనిన నగుచు వాని కను ద్రుపదుం డివి, యేటిమాట లిట్టు లేల చేయ వచ్చు నింత వెట్టివారును గలరె యి, త్తెఱఁగు పొసఁగ కునికి యెఱుఁగరాదె. 377

వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబు లాడి నిక్కం బరయం జూచిన వానికిం జొరవ యీక త్రోపుచేసి వీడ్కొలిపి పుచ్చినం బోయి వాఁడును నిజ నాథున కవ్విధంబు విన్నవించిన. 378

క. కోపోద్రేకంబున నతఁ, డాపాంచాలపతిమీఁద నతులితసైన్యా టోపమున వచ్చి పురిపరి,ఖాపరిసరతలముచుట్టుఁ గైకొని విడిసెన్. 379

వ. ఇట్లు విడిసిన. 380

ఆ. పట్టు [5]వడ్డమృగముచ్చుపగిదిఁ బాంచాలభూ,నాయకుండు తనకు నానచేటు రాక కుమ్మలించి యేకాంతమునఁ బల్కి, యొక్కఁతియును గొల్వ నూరకుండె. 381

వ. తదీయదండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లి రంత సూర్యాస్తమయ సమయం బగుటయు రెండువీళ్లను భండనంబుతోడి వేడుకం జేసి వేగుటయ వేచియుండె. 382

క. అప్పుడు శిఖండి మరణము, [6]తప్పఁగ నడి కొండుప్రతివిధానము చేయం జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ, జెప్పక వెస నరిగెఁ బురముచెంతయడవికిన్. 383

శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబు నొందినవృత్తాంతము

వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డనునొక్కయక్షునికి నివాసం బై యునికిం జేసి నిర్జనం

---

1. నోర్చి. 2. చెప్పి కూఁతునకుఁ గూఁతు. 3. టింతియ. 4. అనిన నగుచు ద్రుపదుఁ డది యేటిమాట లి, ట్లేల చేయవచ్చు నింత వెట్టి, వారు గలరె యెట్టివారికి బుద్ధి యి, త్తెఱఁగు. 5. పడ్డ మృగము. 6. దప్పెను దన కొండు.

బై యుండు శిఖండియు న త్తెఱం గెఱుంగుం గావున నతని నుద్దేశించి యంపఁ
జొచ్చి తత్ప్రదేశంబున మహనీయసుందరం బగుతదీయమందిరంబున కరిగి
యచ్చటఁ బ్రాణవియోగం బగు విధం బాచరింపం బూనిన 384

ఉ. [1]యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగ నేల చెప్పు మ
బ్జాక్షీ భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు నన్న ఫా
లాక్షుఁడు తక్క నొర్లకును నాపని[2]చేయఁగ రాదు నాదువి
[3]త్తక్షతి పుంస్త్వ మేను దగఁ దాల్పక మానను గుహ్యకోత్తమా. 385

క. అని తనవృత్తాంతం బా,తని కెఱిఁగించుటయు నతఁడుఁ దన దగుచిత్తం
బునఁ గరుణ పుట్టి యెంతయుఁ, బని యిడి యే నిత్తు నను నుపరిపాలనతోన్. 386

క. నాపురుషత్వము గైకొని, వే పోయి దశార్ణపతికి వెలయించిన నీ
యాపదలు తొలఁగి చనఁ బొడ, సూపుదు పదినాళ్ల యంతనూనవ్రత మొప్పన్. 387

క. అం తవునంతకు నీ దగు, కాంతారూపంబు నేను గైకొనియెద ని
శ్చింతమున మగుడఁ జను మని, యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్.

తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ [4]దాల్చె
వీడుకొల్ప శిఖండియు వీటి కేఁగు
దెంచి నిజమందిరంబు చొత్తెంచి తల్లి
దండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప. 389

క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం,చిన నద్భుతహర్ష మగ్నచేతస్కులై త
జ్జననీజనకులు బహువిధ, వినుతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్. 390

వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి పాంచాలవిభుండు సంబంధితో వలయుమాట లాడం దగువారలం బనిచి రావించి సంభ్రమంబు లేక వేగిరపడక నాగరికప్రకారంబున శిఖండి పురుషత్వంబు తేటపఱిచి యతనిమాట కీడ్పఱిచి సపరివారంబుగా నద్దశార్ణపతికి విందు పెట్టి [5]కట్నంబు లిచ్చి యతని యనునయాలాపంబులు గైకొని యనిచి పుచ్చిన నతండు తన్నుం దాన నిందించుకొనుచు నిజపురంబునకుం బోయె నట్టియెడ నయ్యక్షువరు మందిరంబు చక్కటికిం గ్రీడార్థంబు కిన్నరవిభుండు విమానారూఢుం డయి చని దానియొప్పుఁ గనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింతసేపునకుం జుట్లు నున్న గుహ్యకులతో ని ట్లనియె. 391

క. మన మిచట నిలిచి యుండఁగ, మనమున శంకింప కిట్లు మసలినవాఁ డీ
తనిగర్వ మేల యిక్కడఁ [6]జనుదేరఁగ నిచ్చు నెట్లు సైఁపఁగ వచ్చున్. 392

వ. అని పలికి యలుక[7]మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లాగుహ్యకు నరసి

---

1. యక్షుఁడు వేగ. 2. సేయఁగఁ గాదు. 3. త్తక్షుభి. 4. దాల్చె, వేడ్కతోడ. 5. కట విచ్చి. 6. జనుదేరక నిల్చు టెట్లు. 7. మనంబున.

తద్వృత్తాంతం బంతయు నెఱింగించి దేవా సీఘ్రం బెంపున నీ గా నేర కున్నవాఁ
డని విన్నవించిన. 393

ఆ. అయిన నేమి పిలువుఁ డని పిలిపించిన, వచ్చి మ్రొక్కుచున్న వనిత గాని
యతనిఁ జూచి [1]యింక నవ్వుదాని కిట్టుల, యుండెం గాక యని విభుండు పలికె. 394

స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము కలుగుట

వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబు చేసి యుండె నప్పుడు కొలిచియున్న
[2]దొరలు ధనదునకుం గృప పుట్టి నల్లన తెలిపిన నట్లని వీఁడు శిఖండి యాయువు
గలంతకాలంబును గాంతాకృతి నై యుండెడు పదంపడి నిజరూపంబు దాల్చుం గాక
యని యనుగ్రహించి. 395

తే. గుహ్యా[3]కుండు విషాదం[4]బు గూరి యుండ
నచ్చటికిఁ గొన్ని దినముల కరుగుదెంచెఁ
దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱసు
సమయనిష్ఠ పాటించి పాంచాలసుతుఁడు. 396

క. వచ్చినఁ గనుఁగొని నీదెసఁ, బొచ్చెము లే దిట్లు మగిడి పో మ్మిది విధి నీ
కిచ్చినరూ పని గుహ్యకుఁ, డచ్చపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్. 397

వ. చెప్పి వీడుకొలిపిన శిఖండి యత్యంతప్రమోదంబునం దండ్రికడకు వచ్చి యత్తెఱం
గెఱింగించిన నాతండు ప్రీతుం డయి దేవగురుద్విజపూజనంబు లాచరించి ద్రోణా
చార్యపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె 398

క. అని చెప్పి నారదుఁడుఁ దానును సత్యవతీసుతుండునుం దమయిచ్చం
జనిరి శిఖండిచరిత్రము, జనకర్ణపరం[5]పరం బ్రశస్తం బయ్యెన్. 399

వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తి యయి నెగడె నేను నంగనల నంగనా
పూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింప కుండ వ్రతంబు పూనిన
వాఁడం గావున నంగనాపూర్వుం డగుశిఖండి నాకు భండనంబునం గోదండ
పాండిత్యంబు మెఱసినను జంపను నొంపను గడంగితినయేని నింతకంటె దుర్యశంబు
కలదె యి ట్లయిన నగుదుం[6]గాని భగ్నవ్రతుండ నగుట కోర్వ నిది నాతెఱంగు.

క. అని చెప్పిన దేవవ్రతు, వినుతవచనములు విభుండు విని తనచిత్తం
బున నొక్కింత వగచి యీ,తనికి మగతనంబుపూన్కి తగు నని పలికెన్. 401

వ. తదనంతరంబ కొలువునం గల(య) సమరవిషయంబు లయిన సల్లాపంబులు చెల్లు
చుండఁ గొండొకసేపు వినుచుండి సుయోధనుండు సురనదీసూనున కిట్లనియె. 402

1. యింక నాదాని కే నిట్లు; నాదాని కీ విట్ల యుండు గాక. 2. వారలు. 3. కుఁడు.
4. బునఁ గూలి యుండ. 5. పరాప్రశస్తం. 6. గా దని భగ్నవ్రతుండ.

ఆ. పాండవులకుఁ గలుగుబలము లన్నియు సమయింప [1]నీకు దినము లెన్ని పట్టు
గురుఁడుఁ గృపుఁడు గురునికొడుకుఁ [2]గర్ణుండు నెం, తెంతమానమున వధింతురనఘ.

వ. అనిన విని గాంగేయుం డతని కిట్లనియె. 404

క. అనిఁ బాండవసేనలఁ జంపను [3]జెఱుపను నేను [4]చాలుభంగుల నీ కి
ట్లనుమానము పాయఁగ నడు, గన తగుఁ గడు లెస్స వింపు గాక నరేంద్రా. 405

వ. ఏను [5]నాసాలెడుకొలంది చెప్పెదఁ దక్కటివారుఁ దమతమచాలుటలు తార చెప్పెద రది గొల్లను బిదప విందు గాని మున్ను నీకొక్కబాస యిచ్చెద నాకర్ణింపుము. 406

క. [6]మీఁటు గలరాజరథికుల, నాఁటికి వేవుర వధింతు నరుశగములు నో
నాటి పడ వైచునంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబుపీనుల నెల్లన్. 407

వ. అట్లుగా నాకయ్యంబు చేయుదివసంబులోన. 408

క. పదివేలఁ జంపఁగా నో,పుదు నే ననువెత్తికోలు పుట్టిన యది నీ
పదునొకఁడక్షోహిణులను, జదురున నడపింతు [7]నదిరసైన్యము గలఁతున్. 409

వ. అని పలికి వెండియు. 410

క. నీ వడిగినపని యేర్పడఁ,గా విను మే నొక్క నెలఁ దెగం జేయుదు నా
నావిధదివ్యాస్త్రంబుల, లావున నప్పాండవులబలంబుల నెల్లన్. 411

వ. అనవుడు గురుకృపాశ్వత్థామకర్ణులం గనుంగొని గాంధారీనందనుండు మీ మీ చందంబు లెట్లనిన నాచార్యుండు మందస్మితాననుం డగుచు ని ట్లనియె. 412

తే. ఏను ముదిసినవాఁడ మహీశ యెట్టు, లయిన నోపినభంగి నీయనుఁగుఁదాత
సాటి నన్నిదినంబులఁ [8]జాల వచ్చు, నబ్బలంబుల నని సమయంగఁ జేయ. 413

క. అనినఁ గృపాచార్యుం డీ, యినుమడిదివసములఁ దీర్ప నే నోపుదు నా
విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడతేర్తు ననియె ధీరవిచారా. 414

వ. అందఱి పలుకు లాకర్ణించి కర్ణుండు. 415

క. నానాస్త్రశస్త్రచయబడ, బానలముం గవియఁ జేసి యత్యుగ్రత నే
నేనాళ్లన యప్పాండవ, సేనాసాగరము [9]నివురఁ జేయుదు నధిపా. 416

వ. అని ప్రతినచేసినఁ గలకల నవ్వి గాంగేయుండు. 417

చ. పలికిన నేమి యన్నియును బల్కఁ దగున్ మనరాజునొద్ద మా
ర్పలికెడువారు లేరు విను పాండవమధ్యము గాండివంబు దీ
ప్తుల మిఱుమిట్లుఁ గొన్న కనుదోయి గుణధ్వని వ్రయ్య లైనవీ
నుల [10]నయినన్ బలే పలుకు నూల్కొన [11]కుండుదు సూతనందనా. 418

---

1. నీడు దినము. 2. గర్ణుండు నెం, తెంతమాత్రమున. 3. నొంపను. 4. సాట. 5. నాచేతం జాలెడు. 6. నీటుఁ గల; మేటు లగు. 7. నెదురు...గాంతున్. 8. జాలనోర్తు, నరిబలంబుల పని. 9. నీఱు చేయుదు; నింకఁ జేయుదు. 10. నయనంబు లై పలుకు. 11. కుందుట.

వ. అనియె నివ్విధంబున నీకొడుకు కడం బుట్టిన విశేషంబులు ధర్మతనయుండు చారుల వలన విని తమ్ముల రాఁ బనిచి వారలతో ని ట్లనియె. 419

సీ. మనచారు లిప్పుడు చనుదెంచి రా వీట, నుండి దుర్బుద్ధి సుయోధనుండు
కొలువున గాంగేయకుంభసంభవకృపా,శ్వత్థామకర్ణులవలను చూచి
యనిఁ బాండవులబల మంతయు సమయింపఁ, జాలుదు రెంతేసి కాలమాన
మున నన్న భీష్ముండు తన కొక్కనెల పట్టు, నని యాడె ద్రోణుండు నట్ల పలికెఁ

ఆ. గృపుఁడు రెట్టి చెప్పెఁ గృపికొడుకోపుదుఁ, బదిదినముల ననియె బాహువీర్య
ఘనుఁడు కాని సూతతనయుఁ డేనాళ్లన, [1]తీర్ప నేర్తు నని ప్రతిజ్ఞ చేసె. 420

వ. అని చెప్పి యర్జునుం గనుంగొని వారు తమతమ యోపినచందంబులు చెప్పిరి నీ చేతం గౌరవబలంబు నెంతదడవునకుం [2]దెగు నాకుం జెప్పుమనిన నతం డి ట్లనియె.

తే. వారలంతకుఁ జాలనివారె నీబలముల సమయింపఁ జాలెదులావు వెరవుఁ
గలర కాక యా రాజుతోఁ బలికి బాస, తప్ప వచ్చునె వారికి ధరణినాథ. 422

వ. అని దరహాసోల్లాసభాసితవదనుం డై. 423

మ. అనుమానం బది యేల నీమది మదీయసాఖరబాహాబలం
బు నిరూపింపఁ దలంచితేని విను మేపుం జేవయుం జూపి కృ
ష్ణునితోడ్పాటునఁ జేర్చి యేఁ గడఁగినం జూర్ణంబు గావింతు నొ
[3]క్కనిమేషంబున దేవదానవులతోఁ [4]గూడం ద్రిలోకంబునన్. 424

వ. అది యెట్లంటేనిఁ గృత్రిమకిరాతుం డైనపశుపతి మెచ్చి జగత్సంహారసమయంబునం దాను బ్రయోగించునట్టి పాశుపతమహాస్త్రంబు నాకిచ్చె నది నాయందు సన్నిహితం బయియున్నయది కావున శత్రునిరాసం బనాయాసం బై యుండు నప్పాశుపతంబు మహనీయప్రభావంబు [5]భీష్ముం డున్నరూ పెఱుంగఁడు ద్రోణకృపాశ్వత్థాములు నెఱుంగరు కర్ణున కెఱుంగ నెంతద వ్వట్టిఘోరసాధనంబున సమస్తంబును సమయించుట యుక్తంబు కాదు తక్కినయాయుధంబులం బోరి వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద నప్పటికి వలయు విధం బయ్యెడు నది యట్లుండె నీవా రక్కడివారికిం దక్కువవారె భీమసేనుండు కవ లభిమన్యుండు ద్రౌపదేయులు సాత్యకి విరాటద్రుపదులు ధృష్టద్యుమ్నుండు శిఖండి యుత్తమౌజుండు యుధామన్యుండు ఘటోత్కచుండు [6]జెట్టాన జెట్లున్నవారు మఱియు ననేకులు వీరలయట్టివార యందఱం జెప్ప నేల యేనుంగువోలె నీలావు నీ వెఱుంగవు దివిజులకు నజేయుండవు నీయొక్కనికిఁ

1. దీర్ప వచ్చుటకుఁ బ్రతిజ్ఞ. 2. దెగు మఱి చూతము నాకుం. 3: క్కనిమేష. 4. గానీ త్రిలో. 5. భీష్ముం డెఱుంగఁడు. 6. జగజెట్లు .

ద్రిభువనంబు నెదురె నీవు నిక్కం బలుగవు గాక నీ వలిగిన నెవ్వా రె ట్లయ్యె దరో యటు చూచుము నీసైన్యంబుల నెవ్వరికి నేమి చేయ వచ్చు మనకు విజయానందంబు సులభంబ యని పలికె నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱిం గించె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయును. 425

చ. కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశ స్తవా
గమృతరస[1]ప్రసారకలితాంచితసేకవిధిప్రకర్ష[2]సం
గమసముదీరితోల్లసనకంపలితప్రహసద్దయాలతా
సుమహాదుపాశ్రయప్రమదశోభితవిశ్వజగన్మధువ్రతా. 426

క. సమయబహుళాత్మారణ్య, భ్రమణపరిశ్రామ్యదంతరంగనితాంతో
[3]త్తమసరళమార్గదర్శన, సమర్థపుణ్యాభిధానసకృదుచ్చరణా. 427

మాలిని.—
అవగమితరహస్యాష్టాంగసమ్యక్ప్రకారో
త్సవగురుకరుణావిస్తార గాఢప్రశాంతి
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా
వ్యవహితపరమానందానుభూత్యేకరూపా. 428

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము
ఉద్యోగపర్వము సమాప్తము
ఆదిపంచకము సంపూర్ణము.

1. ప్రపూరకవిధాంచిత. 2. సం, గమవితతోల్లసన్నయవ; ముదితోల్లసన్నయన. 3. త్తమ వరమార్గాదర్శన.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1968—కాపీలు 4000.